(వ్యాస-పోతనల భాగవతములతో తులనాత్మక పరిశీలనము)

రచయిత:- డా॥ శనగవరపు రవి శంకర హృషీకేశ శర్మ.

ప్రథమ ముద్రణము : భావ - పుష్యమి 1995.

ప్రతులు : 1000.

వెల : రూ. 150-00.



This book is published with financial assistance of Tirumala - Tirupati Devasthanams, under their scheme "Aid to publish Religious Books".





ప్రతులకు :-

డా. శనగవరపు రవిశంకర హృషీకేశ శర్మ.
3-2-21, టవరుస్ట్రీట్, నరసాపురం-534 275
పశ్చిమగోదావరి జిల్లా.

ముద్రణ :

శ్రీ వెంకటరమణ ముద్రణాలయము.
ధాన్యం బజార్, నరసాపురం.



పితృపాదులు
వేంకటసూర్యనారాయణప్రసాదరావు.

మాతృమూర్తి
వేంకట సుబ్బలక్ష్మి.

ఏమి యిచ్చిన పితరుల ఋణము దీరు ?
తనువు నిచ్చిరి తీర్చిరి తత్త్వమ్ అంచు
హరి పదమ్ముల సత్యమ్మటంచు; సుతుఁడ
వారి కర్పణ మిదియు కర్పూర కళిక.



ఒకటే యున్నది రెండు లేదు మదిలో నూహింపగాదోచు నీ
సకలోపాధుల దాల్చు నెద్దియదియే సర్వాత్మ రూపమ్ముగా
ప్రకటింపఁబడు సత్యమారయగ నద్వైతమ్మెయాబ్రహ్మమున్
సకలాత్మున్ శివకేశవాకృతిని విశ్వప్రార్థ్యు భావించెదన్.



మ. ఒనరన్ జిన్మయ కృష్ణమూర్తి మొదలౌ యుద్దండులౌ పండితు
మన శ్రీపాద పురాణముల్ ప్రతిభ సంభ్రాజిల్ల శోధింపుచు
వనజాతాక్షుని దెల్పు భాగవతమున్వర్ణించిరీ యుర్వి నా
పని కాబోలునదృష్టమబ్బె హరినే భావించెదన్ముక్తికై.

అలనాడు, "తెలుగుల పుణ్యపేటి" యని కీర్తింపబడిన పోత
"భాగవతాంధ్రీకరణము తన శుభాధిక్యమని భావించుకొనినాడు.
పురాకృత శుభాధిక్యము వలన కవిసార్వభౌములు శ్రీపాద కృ
మూర్తిశాస్త్రివారి "శ్రీకృష్ణభాగవతము" పై పరిశోధనము చే
భాగ్యము నాకు లభించినది. ఇది యపార వాత్సల్య సాగరులయి
గురుదేవుల కృపా ప్రసాదము.

శాస్త్రివారి "శ్రీకృష్ణభారతము" పై డాక్టర్ చేబోలు చిన్మ
బ్రహ్మకవి పరిశోధనము కావించిరి. "శ్రీకృష్ణరామాయణము"
మద్గురువర్యులు డాక్టర్ శ్రీపాదకృష్ణమూర్తిగారు పరిశోధనమొనర్చి
ఇక మిగిలిన "శ్రీకృష్ణభాగవతము" నా భాగ్యవశమున పరిశోధనా
ముగ లభించినది.

ఆవిధముగ నాభాగ్యవశమున వ్యాస, పోతనల భాగవతద్వ
ముతో శాస్త్రివర్యుల "శ్రీకృష్ణభాగవతము"ను తులనాత్మకముగ
శీలించుటకు పథనిర్దేశము జరిగినది. నా యభిలాషమును నెరవేరి

పూజ్యుల యాశీర్వచన బలమున నా నేర్చిన భంగిని వె
గ్రంథమని ప్రసిద్ధిపడసిన భాగవతమును శాస్త్రివర్యుల "శ్రీకృష్ణ
వత" రూపమున పరిశీలనము చేయుటకు కడంగితిని.

ఈ రచనము నందలి గుణములన్నియును మా గురువుల కృ
ప్రసాద లబ్ధములు. ఎడనెడ దోసగులున్నచో అవిమాత్రము నావి
సహృదయులవధరింతురుగాక! — రచయిత

# ప్రవేశిక

ఆంధ్ర సాహిత్య చరిత్ర పరిశోధనలకందినంత వరకు సుమారు వేయి సంవత్సరముల ప్రాభవమును కలిగియున్నది. ప్రథమముగ ప్రముఖ పురాణేతిహాసములయిన మహాభారత, రామాయణ, భాగవతములు క్రమముగ కవిత్రయము, భాస్కర చతుష్టయము మఱియు పోతన చతుష్టయములచే సంస్కృతము నుండి తెలుగులోనికి సమర్థవంతముగ అనువదింపబడినవి. కాని యీ శతాబ్దపు తొలి కాలమున కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు పై మూటిని ఒకే చేతి పై సమర్థ నిర్వహణముతో తెలుగుభాషలోనికి అనువదించి విజయ ధ్వజమునెత్తిరి. సుమారు 200 గ్రంథములు బహుప్రక్రియలలో శాస్త్రి వారి కర్తృత్వముతో అలరారుచున్నవి.

నేను శాస్త్రివారి "శ్రీకృష్ణభాగవతము" ను వ్యాస, పోతనల భాగవతములతో తులనాత్మకముగ పరిశీలనము చేయుటకు నిశ్చయించితిని. శ్రీకృష్ణభాగవతమును అనువదించుటలో శాస్త్రి వారిదృష్టి సాధ్యమైనంత వరకును నిష్పాక్షికముగ నా యీ పరిశోధనా వ్యాసమున పరిశీలింపబడినది.

ఈ బృహత్పుథకము సౌకర్యము కొఱకు ఈ క్రింది కళికలుగ విభజింపబడినవి.

ప్రథమ కళికయందు కవి జీవిత సంగ్రహము చూపబడినది. ఇందు కవి వైయక్తిక, సాహిత్య జీవనములు వివరింపబడినవి. ఇందు కవి బాల్య విద్యాభ్యాసములు, సాహిత్యభిలాష, కృషి, సన్మానపరంపరలు, స్వభావాదికములు చూపబడినవి. పిదప శాస్త్రివారి లభ్యగ్రంథములు చూపబడి రచనా శైలి పరిచయము కావింపబడినది.

ద్వితీయకళికయందుపురాణవాఙ్మయము, భాగవతముఎవిశిష్టత నిరూపణము కావింపబడినవి. ఇందు పురాణముల యొక్కయు, భాగవతముయొక్కయు వ్యాసకర్తృత్వము చర్చింపబడినది. పిదప పోతన

శ్రీకృష్ణభాగవతాంధ్రీకరణ పరిస్థితులు చూపబడి వాని ప్రత్యేకతలు పరిచయమొనర్పబడినవి. అనంతరము భాగవతమునందలి భక్తి, వేదాంతములు పరిశీలింపబడినవి.

తృతీయ కళిక మరియు చతుర్థ కళికలయందు ఈ పరిశోధనా వ్యాసముఖ్యోద్దేశము చూపబడినది.

తృతీయ కళికయందు భాగవతానువాద విధానము సాధ్యమైనంత విపులముగ వ్యక్తీకరింపబడినది. ఇందు పోతన యనువాద దృష్టియు శాస్త్రివర్యుల యనువాద విధానములు ప్రత్యేకముగా చూపబడినవి. మఱియు నీ రెండును మూల భాగవతముతో తులనాత్మకముగ సోదాహరణములతో పరిశీలింపబడినవి. ఇందు పోతన స్వతంత్రానువాద విధానము, శాస్త్రివారి మూల విధేయానువాదములు రెండును నిరూపింపబడినవి. తదుపరి శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్యము పరిశీలింపబడినది. ఇందు మూలము కంటెను పోతన యనువాదము కంటెను శ్రీకృష్ణభాగవతమున సొగసుగదోచు సందర్భములు కొన్ని ఘట్టములనుండి చూపబడినవి.

చతుర్థ కళిక యందు శ్రీకృష్ణభాగవతశైలీ సమీక్ష కావింపబడినది. ప్రథమమున శ్రీకృష్ణభాగవతశైలీవిన్యాసము సమీక్షింపబడినది. తదుపరి ఇతివృత్త నిర్వహణము, రసపోషణము, వర్ణనా వైదుష్యము, అలంకార వైచిత్రి, ఛందోవిన్యాసములు ప్రదర్శింపబడినవి. ఛందోవిన్యాసమున పద్యశిల్పము, రసాభ్యుచితబంధము, పద్య పునరుక్తి, ఛందోవైవిధ్యముల రామణీయకములు వివరింపబడినవి.

పంచమ కళికయందు శాస్త్రివర్యుల శాస్త్రజ్ఞత, లోకజ్ఞతలు, విశదీకరింపబడినవి. ఇందు ప్రసక్తానుప్రసక్తముగ గోచరించిన వేద శాస్త్రాది విషయములు చూపబడినవి. మఱియు సంస్కృతాంధ్ర

వ్యాకరణ పాండితి సోదాహరణముగ వివరింపబడినది. పిదప వారి లోకజ్ఞత సమాజ పరిశీలనాది పూర్వకముగ ప్రదర్శింపబడినది. పిమ్మట కవి ఆలంకారిక పదప్రయోగనైపుణి పరిశీలింపబడినది. ఇందు సందర్భానుగుణముగ కానవచ్చిన జాతీయములు, లోకోక్తులు. ఆమెతలిచ్చిన సామెతలు, సూక్తులు, పలుకుబడులు ప్రదర్శింపబడినవి,

షష్ఠ కళికయందు శ్రీకృష్ణభాగవత రచనముపై గోచరించు పూర్వకవిప్రభావము సోదాహరింపబడినది. ఇందటనట నన్నయాది కవుల ప్రభావమున్నట్లుగ దోచిన రచనములు చూపబడినవి.

సప్తమ కళికయందు శాస్త్రివారి వ్యక్తిత్వము సముచిత స్థానములు వివరింపబడినవి. ఇందు వ్యక్తిగత జీవితము, శ్రీకృష్ణభాగవతము లాధారముగ వారి వ్యక్తిత్వము చూపబడి తెలుగుసాహిత్యమున వారికి తగిన స్థానము ప్రదర్శింపబడినది. పిదప శ్రీకృష్ణభాగవతానర్ఘ పంక్తులనుపేర వారి చక్కని వాక్యవిన్యాసములు కొన్ని వాచవిగా ప్రదర్శింపబడినవి.

అష్టమ కళికయందు సింహావలోకనము చేయబడి ఉపసంహారము కావింపబడినది. పిమ్మట, అనుబంధములలో శాస్త్రివారి జీవితమున ప్రధానఘట్టములు, "శాస్త్రి వారి గ్రంథసూచి" కూర్చబడినవి.

అంతమున నీ పరిశోధనకుపయుక్తమయిన గ్రంథములపట్టిక సూచింపబడినది.

ఈపరిశోధనా వ్యాస రచనము గ్రాంథికమునకు దగ్గరగ సాగినది. అరసున్నలు మొదట పాటింపబడినను ముద్రణాసౌలభ్యమునకు వీలులేమివిడువబడినవి. సారళ్యమునకు విసంధియు పాటింపబడినది. సాధుశకట రేఫముల భేదమటునటు పాటింపబడలేదు.

-[]-

# ABSTRACT

Telugu literature has a span of nearly one thousand years. The three epics namely Maha Bharata, Ramayana and Bhagavata are translated into Telugu by Kavitrayam, Bhaskara Chatushtayam and Potana Chatushtayam respectively. But in the first half of this century Kavi Sarvabhouma Sripada Krishna Murty Sastry strove to translate the above three epics single-handed and succeded in doing so. Nearly two hundred works (greater and smaller) are mentioned to the credit of his authorship.

I have chosen to study the Bhagavatam of his in comparision with that of Potanamatya and the original one in Sanskrit by Vyasa. I aimed to shed light on the merits and the de-merits of Sastry's works as judicially as possible.

The work is conveniently arranged in the following chapters.

CHAPTER I : In this the Chapter a brief life-sketch of the poet is given Both the personal life and the literary life are touched Poet's early life and education, aptitude and efforts in literary field, prizes, awards and titles won by him are vividly shown with illustrations of his individuality.

CHAPTER II: In this the Chronology of the Purana branch of literature is givcn. The importance and speciality of the Bhagavata (in Sanskrit) is attempted. The authorship of the puranas in in general, and that of Bhagavata in particular is discussed. Similarly the circumstances that led to the translation of Potana's and SriKrishna Bhagavata are dealt with and their specialities are explained. Next the devotion (Bhakti) and philosophy as advocated in the Bhagavata are reviewed.

III & IV Chapters form the core of the Thesis.

In III Chapter the mode of translation is critically anali-

sed. Potana's mode of translation and Sastry's method of translation are separately shown and then the both are compared with the original work of Vyasa, with suitable illustrations. The contrast between Potana's swatantranuvada and Sasary's Mulavidheyanuvada are shown giving stress on the beauty of Sri Krishna Bhagavata. A few illustrations of Sri Krishna Bhagavata are shown where it surpasses both Potana's and Vyasa's work.

In IV Chapter Sastry's style is critically analised touching the main aspects like spreading the plot, rasaposhana (expression of sentiments), patraposhana (characterisation) are observed, his genius indiscriptions and casting figures of speech are shown, regarding metrical compositon Padya silpa, Rasabhyuchitabandha and Padyapunarukti etc., are shown.

CHAPTER V: In this, Sastry's Sastrajnata and Lokajnata are brought in. His expertness in the grammars of both Telugu and Sanskrit and his wide knowledge of idioms and proverbs are explained with illustrations.

CHAPTER VI: In this the influence of the former famous poets, right from Nannaya, on the style adopted by Sastry garu is demonstrated.

CHAPTER VII: In this the personality of, and the prominent place given to Sastry garu in the field of Telugu literature are properly estimated. It is appended with a list of "jems" from Sastry's Bhagavata.

CHAPTER VIII: In this last chapter the entire work re-capitulated and suitable conclusion is given.

Appendix is then added in which (1) the important stages and mile-stones of Sastry's life (2) the list of Sastry's works (type-wise) are given.

At the end, the Bibliography is also given

—[o]—

# సహృదయ భూమిక

పర్యవేక్షకులు

**ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావుగారు**

ఎమ్.ఏ., తెలుగు, సంస్కృతం, హిందీ మరియు పిహెచ్.డి.
యు.జి.సి. జాతీయోపన్యాసకులు.
ప్రొఫెసర్ - తెలుగు శాఖ కాశీ హిందూ విశ్వవిద్యాలయము,
వారణాసి.

"స్థానేషు శిష్య నివహైర్వినియుజ్యమానా విద్యా గురుంహి గుణవత్తరమాతనోతి" అను సూక్తికి లక్ష్యభూతుడు చి॥ డా॥ హృషీకేశ శర్మ. సమర్థులగు గురువుల సమక్షమున గురుకుల క్లిష్టుడై సంస్కృతాంధ్రము లందు సమ్యక్ జ్ఞానమును సంపాదించినట్టివాడు. ఉభయ కవి మిత్రుడు. పరిశోధనాంశవిషయసేకరణమున పట్టువదలని విక్రమార్కుడు. డా॥ శ్రీపాద కృష్ణమూర్తిగారి ద్వారా ప్రశిష్యుడైనా ఈ పరిశోధన వ్యాజమున మా యిరువురకు శైష్యోపాధ్యాయిక కూడ కలిగినది.

కళాప్రపూర్ణ, కవిసార్వభౌమాది బిరుద విభ్రాజితులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రివర్యులు (సాహిత్య) జగమెటిగిన బ్రాహ్మణులు. శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారికిని గురుస్థానీయులు. ద్విశతాధిక గ్రంథకర్తలుగ లోకమున వారికి పేరున్నను "పుణ్యైర్యశో లభ్యతే" అన్నట్లు వారి సాహిత్యమునకు రావలసినంత పేరుప్రఖ్యాతులు రాలేదనుట పండితైకవేద్యము.

కవిత్రియము వారి శ్రీమదాంధ్రమహాభారతము, భాస్కర చతుష్టయ కృతచంపూరామాయణము, పోతన చతుష్టయకృత భాగవతమును బహుకర్తృకములు. కాని శ్రీపాదవారు ఒక్కచేతిమీదుగా వానినన్నిటిని తెనిగించి యనన్యసాధ్యమగు కీర్తిని గడించినవారు. వారి మహాభారతముపై డా॥ చిన్మయబ్రహ్మంగారు ఆచార్య యస్వీ జోగారావుగారి వద్దను డా॥ శ్రీపాద కృష్ణమూర్తిగారును చి॥ డా॥

హృషీకేశ శర్మయు శ్రీపాదవారి రామాయణ భాగవతములపై నా పర్యవేక్షణము నందును సమగ్ర పరిశోధనమొనర్చి యందలి కావ్య సౌందర్య దీధితులను ఆంధ్రపాఠకలోకమునకు వెలార్చిరి.

ప్రస్తుతాంశము చి॥ డా॥ హృషీకేశ శర్మ గావించిన శ్రీకృష్ణ భాగవత పరిశీలనమును గూర్చిన వివేచనము. శీర్షికనుబట్టి అతని కృషి శ్రీపాదవారి గ్రంథమునకు మాత్రమే పరిమితము చేసుకొన వచ్చును. "విద్యావతాం భాగవతే పరీక్షా" యనికదా! కావున చి॥ డా॥ శర్మ వ్యయప్రయాసల కోర్చి శ్రీపాదవారి భాగవతమును వ్యాస పోతనల భాగవత కృతులతో తులనాత్మక పరిశీలనము గావించినాడు దాన కార్యభారము హెచ్చినది. పరిశోధనకాలమును దీర్ఘీకృతమైనది. అయినను జంకలేదు. గ్రంథము విపులముగనే తయారైనది. కాని నా నిర్బంధము వలననే కొంచెము కుదించి ప్రస్తుత రూపము సంతరించుకొన్నది. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమ" మన్నట్లు చి॥ శర్మ స్వయముగ కవి, భావుకుడు నగుటచే నితరులకు దర్శనీయము కాని పెక్కు ఘట్టములందలి శ్రీ శాస్త్రిగారి పద్యములందలి సొబగులను లక్ష్య లక్షణ ప్రదర్శన పూర్వకముగ వివరించి పఠితల కానందకారకుడైనాడు.

ప్రథమ కళిక యందు కవిగారి నిజసాహిత్య జీవనములు నిష్పాక్షికముగ సత్యకథనముతో వివరించబడినవి. వాచవిగా వారి శైలీ విన్యాసము ప్రదర్శింపబడినది. ద్వితీయ కళిక యందు సంస్కృత భాగవత కర్తృత్వము, భాగవతాంధ్రీకరణమునకు దారితీసిన పరిస్థితులు వివరింపబడినవి. తృతీయ, చతుర్థ కళికలు ఈ గ్రంథమునకు జీవాతువైన విషయము సహృదయైకవేద్యము, మూల భాగవతము, పోతన, శ్రీపాద భాగవతములందుగల సౌందర్యస్థానములు సాపేక్షకముగ, పక్షపాతరహితముగ చూపబడినవి. చతుర్థ కళిక శ్రీకృష్ణభాగవతమున సాహిత్యపరమైన విషయముల సమన్వయము సమ్యగ్రీతిని గావింపబడినది. పంచమ కళిక శాస్త్రివర్యుల శాస్త్ర వైదుష్యము, లోక కావ్యాద్యవేక్షణముల కద్దము పట్టును.

పూర్వ కవీశ్వర వాక్ప్రయోగ దక్షత మహాకవుల లక్షణము లలో నొకటిగ యప్పకవి పేర్కొనినాడు. షష్ఠ కళిక యందు శాస్త్రి గారి కవనములో గాన్పించు పూర్వ కవి ప్రభావము దిఙ్మాత్రముగ ప్రదర్శింపబడినది. సప్తమ కళిక యందు శాస్త్రిగారి వ్యక్తిత్వము చూపబడి తెలుగు సాహిత్యమున వారికి న్యాయముగ సంక్రమింప వలసిన సముచిత స్థానము నిర్ణయింపబడినది. అష్టమ కళిక సింహావ లోకన ప్రాయము. అనుబంధములర్థ్వముగను, నుపయుక్తముగను నున్నవనుట సత్యదూరము కాదు.

ఈతని గ్రంథ రచనము మఱికొందఱు భావి పరిశోధకులకు ప్రోద్బలకమై శాస్త్రివారి యితర రచనలపై పరిశోధన జరిగినద నుట ప్రమోదకారణము. "నహిసర్వః సర్వం జానాతి" యనికదా! సర్వజ్ఞత్వ భావనచే కాకున్నను ప్రామాదికముగ కొన్ని తావులందు దొరలిన దోషములు చిన్నవియైనను తద్జ్ఞులెత్తిచూపినపుడు వానిని సవరించుకొని కృతజ్ఞతమెఱుకనుచూపు వినయశీలి యితడు. చిన్నప్పటి గురువుల యందు మిక్కిలి ప్రేమాభావము కలవాడు.

"ముందున్న కంకణమునకు ముకురమేల?" యన్నట్లు తను చేతనున్న గ్రంథమును పరిశీలించి యందలి బాగోగులను గ్రహిం చుటకు సహృదయ హృదయులే సాక్షి. "హంసో యథా క్షీరమి వాంబురాశేః" యని కదా!

చి॥ డా॥ శర్మ కృతపరిశ్రముడై యిప్పటికే శతకాది బహు గ్రంథ ప్రబంధగా లబ్ధ ప్రతిష్ఠుడు. ఈతని లేఖిని నుండి వఱిన్ని యమూల్య కృతులు వెలుగు చూడగలవని నా యాకాంక్ష. అచిరం భావిని సీతనిని ద్వితీయ పురుషార్థపూర్ణునిగ జేసి యాయురారోగ్యై శ్వర్యాది విభవయుతునిగ జేయుమని ఆ యన్నపూర్ణా విశాలాక్షీసమేత విశ్వేశ్వరునకు నా వేడికోలు. చి॥ డా॥ శర్మకు వేదోక్తమంగళా శాసనములు.

వారణాసి | ఇతి శమ్.
యువ ఉగాది
1-4-1995

శ్రీ :

# శ్రీ గురుభ్యో నమః

ఏ పాదమ్ముల ధూళి నన్ను దయతో వీక్షించి జ్ఞానాకృతిన్
ఈ పృథ్విన్ సతతమ్ము రక్షకమునై జృంభించుచున్ బ్రోచునో
యా పాండిత్య పరాగమున్ జిలుకు విద్యావార్ధి వాత్సల్యునిన్
శ్రీపాదాన్వయు గృష్ణమూర్తి గురునిన్ శీర్షమ్ముతో గొల్చెదన్.



శ్రీ గురుభ్యోనమః

# సంగ్రహ సమీక్ష

ఆచార్య శ్రీపాద కృష్ణమూర్తిగారు
రిటైర్డు ప్రిన్సిపాల్,
శ్రీ క్షీరారామలింగేశ్వరస్వామి ప్రాచ్య కళాశాల,
పాలకొల్లు.

శ్రీమద్రామాయణ భారత భాగవతములు భారతీయులకు పరమ ప్రమాణ గ్రంథములు. భారతీయ సంస్కృతికవి పట్టుగొమ్మలు. ఈ మూడు గ్రంథరాజములును మనకు వేదత్రయమువలెను, మూర్తిత్రయమువలెను ఆరాధనీయములు.

ఆంధ్రభాషలో భారతేతిహాసమును నన్నయాదులును రామాయణ మహాకావ్యమును భాస్కరాదులును భాగవతపురాణమును పోతనాదులును పరివర్తనము కావించిన విషయము విజ్ఞులకు విదితచరమే. ఈ యుద్గ్రంథములు తెలుగులకు నిత్యపారాయణ గ్రంథములు. ఆంధ్రమున ఈ మూడును బహుకర్తృకములగుట విధి విలాసము. అట్టి మహాగ్రంథములకు నేటిదాక మనము సుపరిష్కృత ముద్రణములను వెలువరించుకొనకుండుట ఆంధ్రజాతి అలసతకు ఉదాసీనతా జాడ్యమునకు నిదర్శనము.

శ్రీమద్భాగవతము మోక్ష శాస్త్రమనియు హయగ్రీవ బ్రహ్మవిద్య అనియు ప్రశస్తి పొందినది. భాగవతము సర్వ వేదాంతసారము. ఇందు అద్వైత తత్త్వము ప్రతిపాదింపబడినదని విద్వాంసులమతము. అది అష్టాదశ పురాణములలో ఒకటి. వ్యాస మహర్షి ప్రోక్తము. ఈ భాగవత మాహాత్మ్యమును పద్మపురాణము ఆఱధ్యాయములందు

అట్టి మహాభాగవత పురాణమును పోతనామాత్యులు తెలుగు చేయుట ఆ మహాకవి పురాకృత శుభాధిక్యమే కాదు. ఆంధ్రుల పురాకృత పుణ్య విశేషము కూడ. పోతనామాత్యులు పరమ భాగవతోత్తములు. "సహజ పాండిత్య" శోభితులు. సహజ పాండిత్యమనగా మన మందఱము చెప్పుకొను కతిపయ పద పదార్థ పరిజ్ఞానము, సాహిత్య శాస్త్ర పాండిత్యము మాత్రము కాదని పూజ్యులు, వేదాంతుల మాట' పరతత్త్వమును తెలిసికొను శక్తి కలవాడే పండితుడనియు, అట్టి పండితుని కర్మ పాండిత్య మనియు – ఆ పాండిత్యము చతుర్విధములనియు అట్టి చతుర్విధ పాండిత్యము పోతనామాత్యులదనియు బృహదారణ్యకోపనిషత్తు భాష్యమును, ఆనందగిరీయటీకను ఎఱింగిన మహానుభావులు వాకొందురు. కావున పోతనామాత్యుల వారు ప్రస్థానత్రియమును చుళుకింపకుండ భాగవతాంధ్రీకరణకు సాహసించినారనుకొనుట మన అవివేకమును బయలుపఱచుకొనుట అగును. భాగవత మహాపురాణమును చేర్చి "ప్రస్థాన చతుష్టయము" అనుట మనము గమనింపవలసి యున్నది. ఉపరి అమాత్యుల వారికి అనితరసాధ్యమగు కవితాకళ జన్మతోభవము. ఆ మహానుభావునకు "మహత్వ కవిత్వ పటుత్వ సంపద" వశంవద అయినది. బాలమురళీకృష్ణుని ముగ్ధమోహన గానకళయందలి అనిర్వచనీయమైన మాధుర్యము అమహాకవి కవితకలవడినది. కావుననే ఆంధ్రమహా భాగవతమందలి పలుపద్యములను తెలుగుతల్లులు పెరుగు చిలుకుచునో అరుగులలుకుచునో చదువుకొనుట పరిపాటి అయినది. మాటలు పెక్కులెందుకు? భాగవతమందలి పద్యమొక్కటయినను కంఠస్థము కాని తెలుగువాడుండడనుట అతిశయోక్తి కాదు. పోతనామాత్యుల భాగవతమమృత భాండమే. దానివలె బహుళప్రచారప్రాచుర్యములు పొందిన గ్రంథము మరొకటి తెలుగునాటకనరాదు. వినరాదు. అట్టి భాగవతమునకు కూడ భారతరామాయణములకు వలెనే సుపరిష్కృత

ముద్రణ మింతవఱకు వెలువడకుండుట నిక్కముగ శోచనీయము. అప్రకృతమైనను మచ్చునకు ఉదాహరణము లిత్తును.

1. ప్రారంభంబున వేటవచ్చి ధరణీపాలుండు మా తండ్రిపై
నేరంబేమియులేదు సర్పశవము న్మెడగుగ్రిడె వైచినా
డీరీతిన్, ఫణికృమ్మఱన్ బ్రతుకు నోహింసించునో కోఱలన్
రారే, తాపసులార! దీనిఁ దివరే, రక్షింపరే మ్రొక్కెదన్.
(1 స్కం - 473 ప. అకాడమిప్రతి)

ఇందు "అలంకారశాస్త్రముననుసరించి దీనియందు వాక్యగర్భితమను నొక దోషము కలదు. ఒక వాక్యమధ్యమున వాక్యాంతరము దీని లక్షణము...." ఇత్యాదిగ ఆక్షేపించి, సమర్థించుటకు ఒకానొక పండితులు ప్రయత్నించిరి. కాని వావిళ్ళ, కల్లూరివారల వ్రాతప్రతుల యందు "నేరంబేమియు లేదు" అను పాఠము కాక "నేరంబేమియులేక" ఇత్యాది పాఠము కలదు. అప్పుడు పై ఆక్షేపణకాస్కారమే ఉండదు. ఇప్పట్టున అకాడమీ వారి భాగవతపీఠికాకర్తలు "అచ్చు తప్పులు - అపపాఠములు" అను శీర్షిక క్రింద ప్రస్తుతము లభ్యములగు ముద్రిత ప్రతుల పాఠములకు బదులుగా ఉండదగిన సాధుపాఠములను సూచించి మేలిపని చేసిరి. కాని వారు అపపాఠములు ముద్రితములని పేర్కొన్న ముద్రిత ప్రతులలో "కల్లూరి" వారి ప్రతిని చేర్చుటలో పొరపడిన తావులు పెక్కులున్నవి. పీఠికాకర్తలు సూచించిన సాధుపాఠములే "కల్లూరి" వారి ముద్రణ ప్రతిలో కూడ కానవచ్చును. (ప్రథమ స్కంధము మొదలు తృతీయస్కంధము దాక నేను పరిశీలించితిని). ఇది ఎట్లు జరిగినదో కాని - అట్లు చూపుట మాత్రము క్షంతవ్యము కాదు.

2. "వచ్చు నష్టమ వసువు సావర్ణివాడు
తపము సేయుచు నున్నాఁడు ధరణినాథ!" [8స్కం- 413 ప.]

అచ్చుప్రతులందు పై రీతిగా "…. అష్టమవసువు సావర్ణి …." అనుపాఠమున్నది. అకాడమీవారి ప్రతియందును "వసువు" అను పాఠమే కలదు. కాని సావర్ణి మనువు కాని వసువుకాదు. "వచ్చు నష్టమ మనువు సావర్ణి…." అను పాఠము సాధువు. మూలమందు "అష్టమేఽన్తర ఆయాతే సావర్ణిర్భవితా మనుః" అని మనుః' అని సరిగానేయున్నది. అంతియ కాదు. క్రింది 415 గద్యమందు "సూర్యసావర్ణి మన్వంతరంబున…." అని సావర్ణి మనువనియే చెప్పబడినది.

3. "చంపె రక్కసి బట్టి చక్రవాకునిఁ గూల్చెఁ
బడద్రొబ్బె ముద్దుల బకునిఁ జీరె"
అని ముద్రిత ప్రతుల పాఠము - (10స్కం. పూర్వ. 1328)

పయిసీసపాదమందలి "చక్రవాకుని", "ముద్దుల" రెండును అపముద్రితములే. "చక్రవాతునిఁగూల్చెఁ బడద్రొబ్బెమద్దుల" అని యుండవలెను. దశమస్కంధమందలి "తృణావర్తసంహారఘట్ట మందలి 265 గద్యమున "అవ్వలయ పవనదనుజుండు" అనియు "ఆలోఁజక్రసమీర దైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్" అనియు ఆ దనుజుడు పేర్కొనబడినాడు. కావున "చక్రవాతుని" పాఠము ఒప్పు. అట్లే "ముద్దుల" పాఠము కాక మద్దుల పాఠముండదగును.

"పూతనానేనసీతానాం చక్రవాతశ్చదానవః,
అర్జునౌ గుహ్యకః కేశీధేనుకోఽన్యేచతద్విధాః"
అని మూలశ్లోకము.

"ఈ కృష్ణ భగవానుడే చంపెఁ బూతనఁ జక్రవాతాసురుఁ జక్కడం మద్ది చెట్లను గూల్చె మఱిశంఖచూడాది రాక్షసవీరుల రాసి చంపె అని శ్రీకృష్ణభాగవతము. (దశమ. 3అ.230ప.)

4. గజేంద్రమోక్షణ కథాఘట్టమందలి "ఎవ్వనిచేజనించు జగమెవ్వనిలోపల నుండు లీనమై; యెవ్వనియందుఁడిందు…

అను పద్యము నోటికిరాని తెలుగువాడుండడు. ఇందు "ఎవ్వనిలోపల నుండులీనమై" అనువాక్యమందలి 'లీనమై' అనుపాఠము విచారణీయము. నా చిననాట మా అమ్మగారు 'ఎవ్వనిలోపల నుండు లీలమై' అని నాకు నేర్పిన పాఠము. అచ్చుప్రతిని బట్టి నేను "లీనమై" అని చదివినపుడెల్ల "లీనమై కాదురా అబ్బాయి! లీలమై" అని సవరించెడిది. మఱి సృష్టిస్థితిలయములు మూడును తెల్పబడినవి. కనుక 'లీలమై' అను పాఠమే సక్రమమని తోచును. ఇట్టి దోషములను పల్వురు పెద్దలు చూపి సవరించుటకు యత్నించినను మనము పట్టించుకొనకుండుట దౌర్భాగ్యము. మన ప్రాచీన కావ్యము లందలి సదసత్పాఠనిర్ణయము కావించుటకు కేవల పాండిత్యమే చాలదు. భాషాతత్త్వము, బహుకావ్యపరిశీలన పాటవము, కవి హృదయమును గ్రహించగల సహృదయత, వ్యుత్పత్తి సౌరభము ఆవశ్యకములు. కోవిదకవి శిరశ్చింతామణులు వేటూరి, వేలూరి, రాళ్ళపల్లి, వెంపరాల, దీపాల, తిమ్మావఝ్ఝల వంటి వారు గతించిన వెనుక ఈ కావ్యపరిష్కరణ విషయమే మఱుగువడినట్లున్నది. ఇది మిగుల చింతింపవలసిన విషయము.

అది అట్లుంతము. ఈ ఇరువదవశతాబ్దిలో మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రివర్యులు భారత రామాయణములనే కాక భాగవతమును కూడ తమ ఒక్క చేతిమీదుగానే ఆంధ్రీకరించి ఆంధ్రులను ఆశ్చర్య చకితులను చేసి నతులకు నుతులకు పాత్రులగుట వారి భాగ్యవిశేషము. శ్రీపాదవారి సారస్వతసేవను విశ్వవిద్యాలయములు పెక్కేండ్లు సముచితముగ గుఱుతించలేదు. కాని ఇటీవల శాస్త్రివరేణ్యుల భారతరామాయణానువాదములపై ఆంధ్రవిశ్వకళా పరిషత్తు పరిశోధనలు జరిపించి తన ఉచితజ్ఞతను ప్రదర్శించుకొనుట ప్రశంసనీయము.

ప్రకృతమిా "శ్రీకృష్ణ భాగవతము" (వ్యాస-పోతనల భాగవతములతో తులనాత్మక పరిశీలనము) పరిశోధన నిబంధనవ్యాసమును సంతరించిన చిరంజీవి శనగవరపు రవి శంకర హృషీకేశ శర్మ మా ప్రియశిష్యులలో ఒకడు. మా పాలకొల్లునందలి శ్రీ క్షీరారామలింగేశ్వరస్వామి ప్రాచ్యకళాశాలలో శ్రద్ధాసక్తులతో విద్యనభ్యసించిన చిన్నవాడు. బుద్ధిమంతుడు. సంస్కృతాంధ్ర భాషలలో ఎం. ఏ. పట్టములు పొందిన విద్యాధికుడు. వినయము, విధేయత, సత్ప్రవర్తన, జిజ్ఞాసుత్వము ఈతనికి జనుస్సంభవములు. తన మాతృసంస్థపట్లను, గురువుల యెడను అచంచల భక్తి ప్రపత్తులు కలవాడు.

చి॥ శర్మ తన పరిశోధనా వ్యాసమును అచ్చు వేయించి, నన్ను సమీక్షించవలసినదిగ కోరినాడు. అత్యంత సన్నిహిత అంతేవాసులలో ఒకడగుటచే సహజమగు శిష్యవాత్సల్యమున అతిశయోక్తులు, అనుక్తులు, దురుక్తులు, ప్రశంసలు దొరలవచ్చునని శంక జనించినది. 'సమీక్ష' కావించు భారమును పూజ్యులు, విద్వద్వతంసుల భుజస్కంధములపై మోపుట సమంజసముగా నుండునని చెప్పి చూచితిని కాని ఈతడు తాను పట్టిన పట్టు విడనాడలేదు. అతని గురుభక్తిని, అతనికిని నాకునుగల శైష్యోపాధ్యాయికను, మా ఇర్వుర నడుమ తీవసాగిన అనురాగలతను కాదని తప్పించుకొని తిరిగి, ధన్యుడనగు త్రోవ నాకు గోచరించలేదు. తుదకు "సంగ్రహ సమీక్ష" చేయుటకు సమ్మతింపకను తప్పలేదు. అదియునుగాక "శాస్త్రి" అని లేకున్నను శ్రీపాదవారి పేరింటివాడను, తనకు గురువును కావున సర్వజనీనమైన యీ కైంకర్యమున నా పేరును కూడ చేర్చుట తన కనీయః కర్తవ్యముగా, ధన్యతగా తలంచి యుండునని తోచినది. కనుక ఈసంగ్రహ సమీక్ష కెట్టకేలకు సాహసించితిని. అంతియకాని విజ్ఞుడనన్న అహంతతో మాత్రము కాదని విద్వాంసులకు సప్రశ్రయముగ విన్నవించుకొనుచున్నాను.

ఈ "శ్రీకృష్ణభాగవతము" పరిశోధన నిబంధనను శ్రద్ధధాను డనై మున్ముందు ఉపలించితిని. ఈనిబంధనము బహుభాషావేత్తలు, అంత ర్వాణి శిరోమణులు, "లోక మిత్రులు" అగు సోదరులు ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరాయ మహోదయుల పర్యవేక్షణమున, సార థ్యమున చి॥ శర్మ కూలంకష కృషికి పండిన పంటగా రూపుదిద్దుకొ న్నది. ఇది బహుధా విషయపరిపుష్టము. శతధాసంప్రదాయబద్ధము. పరిశోధనాసమగ్రము, నిర్దుష్ట ప్రణాళికము, సరళరచనాకామ నీయకము.

ఈ నిబంధవ్యాస భాగములకు "కళిక"లని పేరుపెట్టుట సర సముగనున్నది. ఇది అష్టకళికలుగ వింగడింపబడినది. 'ప్రథమకళిక' యందు కవిసార్వభౌములు శ్రీపాదవారి జీవిత సంగ్రహమును చిత్రించుటయే కాక వారు ఎనిమిది దశకములపాటు కావించిన ఆం ధ్రసాహిత్య సరస్వతీ వరివస్య. పొందిన సమ్మానములు - బహుమా నములువేయేల? శాస్త్రిగారు కలము పట్టినది మొదలు కడశ్వాస విడు చువఱకుగల విశేషములను, వారివ్యక్తిత్వమును వివరించినాడు. శాస్త్రి పాదులనెఱుంగని నేటి యువతరము సాహితీపరులకీ ప్రకరణము వలన వారి జీవితవిశేషములు పెక్కులు తెలియగలవు.

"ద్వితీయకళిక" యందు పురాణములు, పురాణ నిర్వచనలక్షణ ములు, భాగవతపురాణ వైశిష్ట్యము, భాగవతవేదాంతము మున్నగు వానిని సముచితముగ పొందుపరచినాడు. ఆంధ్రభాగవతములు రెం డిట అద్వైత వేదాంతమే ప్రతిపాదింపబడినదని నిరూపించుటకై చి॥ శర్మ ఆయా గ్రంథములనుండియు మూలభాగవతము నుండియు పెక్కు ఉదాహరణములొసగి నిర్ణయించిన విధము ప్రశంసాపాత్ర ము ఉన్నది.

ఇక "తృతీయ కళిక" ఈనిబంధనకు "కన్నాకు" అని శ్లాఘిం పదగినది. ఈ నిబంధవ్యాసమున ఈ ప్రకరణము విశిష్టమైనది

ప్రముఖమైనది. ప్రధానమైనది. ఇందు పోతనామాత్యుల యొక్కయు
శాస్త్రివరేణ్యుల యొక్కయు అనువాదవిధానముల తీరుతెన్నులను
కదీకరించుటయే కాక ఆ భాగవతద్వితయము యొక్క తులనాత్మక
రిశీలనము ఊచముట్టుగ, సర్వసమర్థముగ ప్రదర్శింపబడినది.
ూలభాగవతము నుండియు, ఆంధ్రభాగవత గ్రంథద్వయము నుం
యు సోదాహరణముగ పండ్రెండు ఘట్టములు పరామృష్టములైనవి.
ంతియకాదు. శ్రీకృష్ణభాగవతానువాదసౌందర్యము ఉదాహరణ
ార్వకముగ, ఉపపత్తి పురస్సరముగా నిరూపింపబడినది. ఆంధ్రీకరణ
భాగమందు ఉరమరిక 200 పుటలలో "చాలనీన్యాయము"గ
ిధించి, ఈతడు తన బహుముఖ ప్రజ్ఞను, విమర్శనకౌశలమును
ప్రదర్శించుకొనినాడు. పోతానామాత్యుల అనువాదమందు కాన
చ్చు అమూలక విషయములు వ్యత్యయ వినిమయాదులు సముచిత
ుగా సరసముగా ఎత్తిచూపుటయే కాక శాస్త్రివర్యుల మూలవిధేయ
ను ప్రశంసనీయముగ నిరూపించినాడు. వానియందలి సామ్య వైష
మ్యులను చతురతతో సుస్పష్టము కావించినాడు. ఇట్టి కార్యమును
ర్వహించుటకు ఓరిమియు నేరిమియు, దీక్షయు దక్షతయు, శక్తియు
యుక్తియు మిక్కిలి అవసరములు. చి॥ శర్మ కావించిన ఈ తారతమ్య
వేచన అతని కుశాగ్రబుద్ధిని, బహుముఖ ప్రజ్ఞను వేనోళ్ళ చాటు
లిగియున్నది. శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్య సౌష్ఠవములను
ప్రకటించిన రీతి, అందలి ఉత్కృష్ట గుణములను విశదీకరించినవిధము
సహృదయులు శిరఃకంపము కావించి ప్రశంసించుటకు తగియున్న
వని నా నమ్మిక. ఈ తృతీయ కళిక ఈ పరిశోధన నిబంధ కావ్య
శరీరమునకు ఆత్మగా, జీవముగా వెలయుగలదు. అనపేక్షిత విస్తర
ముగా ఉదాహరణ లొసగి సమీక్షను విస్తరము, వికృతము కావించు
దోషమునకు పాల్పడను. అచ్చుపడి గ్రంథము మీ ముందున్నది.
సావధానముగ సాంతముగ చదివి చూచుకొండని పాఠకులను

చతుర్థకళికయందు శ్రీకృష్ణభాగవతమందలి కవితాశైలి, ఇతివృత్త నిర్వహణము, రసపోషణము, పాత్రచిత్రణపాటవము ఇత్యాదులు విమృష్టములు. నవరసములు శ్రీకృష్ణభాగవతమందేయే ఘట్టములలో పోషింపబడినదియు ఉదాహరణపూర్వకముగ చూపబడినది. అక్షైశాస్త్రిగారి ఛందశ్శిల్పము, వారు భాగవతమున వాడిన విశేష వృత్తములు సంగ్రహింపబడినవి. శాస్త్రిగారు తమ భాగవతమందు "ద్విపద" ఛందము కూడ వాడుట వారి చొరవకు తారకాణగా పేర్కొనుట జరిగినది. కాని వారు శ్రీకృష్ణభాగవతానువాదమునకు మున్నె రచించిన శ్రీకృష్ణరామాయణమునందే ద్విపదఛందమును వాడి ముందడుగు వేయు చొరవను చూపినట్లీతడు గమనించినట్లులేదు.

"పంచమకళిక" శాస్త్రివర్యుల వైదుష్యము, లోకజ్ఞత, సంస్కృతాంధ్ర పదప్రయోగదక్షత ఆలంకారిక వైచిత్రి - ఇత్యాది శీర్షికలతో ఈనిబంధవ్యాసపరిపుష్టతకు దోహదము కావించునట్లున్నది.

"షష్ఠకళిక" యందు శాస్త్రిగారిపై ప్రాచీనకవుల పలుకబడి చెల్లుబడియైన చందము సోదాహరణముగ నిరూపింపబడినది. అంతియ కాక ఆంధ్రభాగవతములందు శ్రీకృష్ణభాగవతమునకీయదగు స్థానమును గుఱించియు చర్చింపబడినది. ఈ ప్రకరణమున ఆంధ్రమందలి వివిధ భాగవతములను, భాగవతభాగములను, తత్తత్కర్తలను గుఱించియు వివరించి యుండిన ఈ ప్రకరణమునకు సర్వసమగ్రత సిద్ధించియుండెడిది. పోతనామాత్యులే కాక బొప్పరాజు గంగన (5వ స్కంధము), మలయమారుతకవులు (6వ స్కంధము); మలయమారుతము సర్వన్న (6వ స్కంధము - అలభ్యము), హరిభట్టు (7,11, 12 స్కంధములు), కోపూరి పట్టాభిరామశర్మ (11, 12 స్కంధములు), ముడుంబి సింగరాచార్యులు (1, 2, 5, 11, 12 స్కంధములు), సంజీవ రాయకవి (7,8,10 స్కంధములు) చంపూకావ్యములుగా వెల

యించిరి. దోనూరి కోనేరునాథకవి (16వ శతాబ్ది) - సంగ్రహభాగవతము సుప్రసిద్ధము. అల్లమరాజురామకృష్ణకవి (19వ. శతాబ్ది) అచ్చతెనుగులో సంగ్రహ భాగవతమును రచించుట విశేషము. ఇటు శ్రీమిన్నికంటి గురునాథశర్మగారి గర్గభాగవతము ప్రత్యేకముగ పేర్కొనదగినది. మఱి ద్విపదఛందస్సునందు మడికి సింగన(10వస్కంధము), రత్నాకరం గోపాలకవి (10వ స్కంధము), దోనేరు కోనేరు నాథకవి, తరిగొండ వేంగమాంబ, ఉేకుమళ్ళ రంగశాయి (1నుండి 4వ స్కంధము వరకు) వన్నెకెక్కినవారు. ఇవి కాక వచనముగా యక్షగానములుగా, నాటకములుగా భాగవతము, అందలి ఏకదేశములు రూపొందినవియు కలవు. ఆధునికకాలమున శ్రీపాద వారి వెనుక "శ్రీరామనృసింహమూర్తి కవులు"పేర జంటగా కూడిన కవి యుగళము భాగవతమును సమగ్రముగ ఆంధ్రీకరించిరి. వీరేకాక తణుకు ఉన్నత పాఠశాలయందు ఆంధ్రపండితపదవియందుండిన ప్రౌఢకవి అమ్మిసెట్టి లక్ష్మయ్యగారును భాగవతమును తెలుగు చేయుటకు పూనుకొని కొన్ని స్కంధములను పూర్తి కావించుటయు, ఆ ప్రాంతమునకు చెందిన విద్వాంసులకు వినిపించుచుండుటయు చిననాటనాయెఱింగిన విషయము. వారు అకస్మికముగ పరమపదించిరి. అనువాదము సమగ్రము కాలేదని వినుకలి. ఇట్టి విషయములు భావిపరిశోధకులకుపకరింపగలవని యిట మనాక్సూచన చేయనైనది.

"సప్తమకళిక"లో శాస్త్రిపాదులవ్యక్తిత్వము, ఆంధ్రసాహిత్యమున వారి స్థానములను గూర్చి విమర్శింపబడి నిర్ణయింపబడినది. ఇది ఈతని ఉచితజ్ఞతకు నిదర్శనము.

మఱి తుట్టతుది ప్రకరణమగు "అష్టమకళిక" యందు సింహావలోకనము కావింపబడి ఉపసంహారముతో ఈనిబంధమునకు స్వస్తి పలుకుట జరిగినది. ఇందు చివఱ శ్రీకృష్ణభాగవతముపై తన పరి

శోధన సర్వసమగ్రము కాదని విన్నవించుచు "శ్రీకృష్ణభాగవత పద్మము వికసించుటకిది తొలిసూర్యకిరణము మాత్రమే. దీనితో సంపూర్ణవికసనము కాదు. ఇంకను ఎన్నియో కిరణరాజములు కావలసియున్నది. అందులకీ తొలి రవికిరణము సహకరింపగలదని మనవి...." అని పలుకుట చి॥ శర్మ వినయమును చాటును.

మొత్తము మీద ఈ "శ్రీకృష్ణభాగవతము" చి॥ శర్మ ప్రజ్ఞకును, బహుగ్రంథపరిశీలనకును, పాండిత్యమునకును నికషోపలమై అలరారుచున్నది. జాగరూకతతో చదివి మాశిష్యుని శక్తియుక్తులకు, దీక్షాదక్షతలకు, శ్లాఘనీయమైన కృషికి మురిసితిని. ఇంతకంటె గురువులు శిష్యులను పెద్ద చేయుట వారికి శ్రేయోదాయకము కాబోదు.

కాని చివటి పలుకులుగా ఒండు రెండు విషయములను సూచింపక తప్పదు.

శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్యమును సోదాహరణముగ వివరించు భాగమున పోతనామాత్య శాస్త్రిగారల అనువాద విధానములను పరిశీలించుచు (భీష్మస్తుతి - పుటలు 138 - 140)

"త్రిభువన కమనం తమాలవర్ణమ్ రవికరగౌరవరాంబరం దధానే
వపురలకకులావృతాననాబ్జే విజయసఖే రతిరస్తు మేఽనవద్యా"

అను మూలశ్లోకమునకు పోతనామాత్యుల "త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప...." ఇత్యాది అనువాద పద్యము శాస్త్రివర్యుల అనువాదపద్యముతో పోల్చిచూపబడినది. మూలశ్లోకమందలి 'విజయసఖే" అనునది పోతనామాత్యుల అనువాదమున "మా విజయుంజేరెడు వన్నెకాడు" అయినదని పేర్కొని శాస్త్రివారి అనువాదమందది "ప్రేపల్లెవిహారమున్ సలుపు బాలుని గృష్ణుని" అని కానఁగుచున్నది. దీనికి శాస్త్రివారనువాదమునకాధారముగ గొన్న ప్రతియందునట్టి పాఠముండియుండవచ్చును - అని సమర్థించుటకు యత్నించుట "కప్ప

దాటు"గా ఉన్నదని తోచినది. ప్రాచీన కవులందఱు ఔత్తరాహ దాక్షిణాత్య ప్రతులు రెండును సంప్రదించియే తమతమ యనువాదములను కావించిరనుటకు ఆధారములు కలవు. అట్లే అమాత్యులవారును రెండురకముల మూల ప్రతులను సంప్రదించియే భాగవతానువాదమును కావించియుందురు. మఱి శాస్త్రిల వారు కూడ ఔత్తరాహ దాక్షిణాత్యప్రతులాధారములుగా కొనియే తమ అనువాదమును సాగించినారు.

ఔత్తరాహప్రతులందును నాయెఱిగినంతదాక "విజయసఖే" అనుపాఠమే ప్రిహితముగా కన్పట్టుచున్నది. కావున ఈతావున శాస్త్రి వారి అనువాదమును పై కారణమును చూపి సమర్థింపనక్కఱలేదు. వారి అనువాదము కంటె పోతనామాత్యుల "మా విజయుంజేరెడు వన్నె కాడు" అను తెనుగుసేతయే మూలమునకు సన్నిహితము. శాస్త్రి గారి అనువాదము మూలభిన్నమని తెల్పియుండిన సముచితముగ నుండెడిది.

కాని "రవికరగౌరవరాంబరమ్"అను మూలశ్లోక వాక్యమునకు పోతనామాత్యులు "ప్రాభాతనీరజబంధుప్రభమైనచేలము" అని చేసిన పరివర్తనము అపార్థమునకు తావొసగునట్లున్నది. శ్రీకృష్ణుడు పీతాంబరధారి - అనగా పచ్చనిపసిమి పట్టుచేలము దాల్చినవాడని అర్థము. మఱి "ప్రాభాతనీరజబంధుప్రభమైనచేలము" అనుట వలన రక్తాంబరధారి అను అర్థము స్ఫురింపవచ్చును. ఉదయసంధ్యా సూర్యుని కాంతి ఎఱ్ఱని ఎఱుపు రంగు కదా! కావున శాస్త్రివారు ఈ లోపమును గమనించి "సంపల్లలితోత్తరీయము సువర్ణసువర్ణము మేలమాడ"అని పరివర్తించుట మూలశ్లోకభావమును సుస్పష్టముచేసి, సందేహ నివృత్తి కావించినట్లున్నదని పల్కుట మాత్రము మెచ్చదగియున్నది.

2. "స్వనిగమమపహాయమత్ప్రతిజ్ఞామృతమధికర్తుమవప్లుతోరథస్థః
ధృతరథచరణోభ్యయాచ్చలద్గుఃహరిరివహన్తుమిభంగతోత్తరీయః"
అను మూల శ్లోకమునకు పోతనామాత్యుల "కుప్పించి
యెగసిన కుండలంబులకాంతి, గగనభాగంబెల్ల కప్పికొనగ...."

అను అనువాదసీసపద్యము రసవంతమైనదని చెప్పుట చి॥ శర్మ రస జ్ఞతకు తారకాణ. పైసీసపద్యమందలి "నమ్మితి నాలావు నగుబాటు సేయక, మన్నింపుమనిక్రిడి మఱలఁ దిగువ" అనుపాదమునకు మూలమందు ఆధారము కానరాదనియు, మూలశ్లోకమందలి "స్వనిగ మమపహాయమత్ప్రతిజ్ఞామ్ ఋతమధికర్తుమ్ అవప్లుతోరథస్థః" అను దాని భావము తెనుగున రాలేదనియు, ఆలోపమునుగుఱుతించి శాస్త్రిలవారు—

"చక్రంబు చేఁబూన సమరంబునందను
తననియమంబెల్ల వెనుకఁద్రోచి
చక్రిబు పట్టింతు శౌరిచే నను నాడు
బాస చెల్లించెడు వాడ యగుచు...."

అని అంధీకరించి మూల భావమును సరిగ విశదీకరించిరనియు చెప్పుట ప్రశంసనీయము.

ఇక ఈతులనాత్మక పరిశీలనము కావించు తావుల మాశిష్యుడు విద్వదగ్రణులు వెంపరాలవారి త్రోవను నడచినట్లున్నది. అట్లే శ్రీ యుతులు ఖండవల్లి సూర్యనారాయణ శాస్త్రి, ప్రసాదరాయకుల పతిమున్నగాగల పెద్దల అభిప్రాయములను అందందుట్టంకించినటు లున్నది. ఆయాయి ఆధారములు అధోజ్ఞాపికలందు కన్పట్టుచున్నవి. అందులకు కారణము శూద్రక మహాకవి చారుదత్తునినోట పల్కించి నట్లు"యౌవనమతాప్రపరాధ్యతిన చారిత్ర్యమ్."మఱియిందలిభాషగ్రాం థిక మైనను సరళము. జటిలముకాదు. మృదులమృదులము, మధుర

మధురము. లలితలలితము అగు వచనరచనా వైశారద్యము ఒకమహా విద్య. అవిద్య, అకళ తపస్సుగా, దీక్షగా, సాధనగా వ్యాసంగము చేసినకాని పట్టువడునది కాదు.

ఇక అన్ని విషయముల ప్రస్తుతి పాత్రమైన ఈరచన యందు మధ్య మధ్య—

"తిక్కన్నను మఱపింతురనుట సమంజసము" (పుట 241) "ఇదియు మూలమును మించియున్నదికదా! మూలమునే యేమిటి? పోతన్నను గూడ మించియున్నది" (పుట 244) వంటి వాక్యములును, "రామణీయకత", 'ప్రాధాన్యత', 'ఎలా', 'సరియే', 'నిర్మోహమాటుము', 'బ్రతిమలాడుచున్నను', 'స్వాంతము', '[వేళ్ళు' (చెట్టు వేరు అను అర్థమున) వంటి పద ప్రయోగములును పానకమందలి పుడకలవలె అడ్డుతగిలి మనస్సును చివుక్కుమనిపించుచున్నవి. మఱి ముద్రారాక్షసములు కుప్పలుతెప్పలుగా పడినవి. అచ్చుపనితో అనుభవము చాలక అట్టి దొసగులను సవరించుకొనలేక పోయినట్లున్నది.

ఏతావతా - ఈఉత్తము పరిశోధనా నిబంధమును పరికించిన పిమ్మట "స్థానేషు శిష్యనివహైర్వినియుజ్యమానా విద్యా గురుంహి గుణవత్తరమాతనోతి" అను సూక్తి జ్ఞప్తికి తగిలి, ఆనందించి, మా శిష్యుని చి॥ శర్మను ఇతోధికముగా "సమస్తసన్మంగళాని భవంతు" అని ఆశీర్వదించుచున్నాను.

సాహిత్యారాధకుడు,
**శ్రీపాద కృష్ణమూర్తి.**

గుమ్మలూరు,
మాఘబహుళత్రయోదశి.
(మహాశివరాత్రి).
(27-2-1995).

# వాచవి

ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు
తెలుగు విశ్వవిద్యాలయము
రాజమండ్రి.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్యక్తిగానూ కవిగానూ మహా సాహసి. కవిత్రయ భారతం ఉండగా వ్యాసభారతాన్ని తాము ఆంధ్రీకరించారు. పోతన భాగవతం ఉండగా వ్యాసభాగవతాన్ని మళ్ళీ తెలుగు చేసారు. రామాయణమూ అలాగే చేసారు. వీటిలో భాగవతాంధ్రీకరణం మరీవిడ్డూరం. కేవలం నాలుగునెలల సమయంలో చేసేసారు.

రామాయణం తప్ప సాధారణంగా వీరివన్నీ మూలవిధేయమైన అనువాదాలు. అయినా అక్కడక్కడ కొన్ని కుదింపులు, మదింపులు కనపడుతూ ఉంటాయి. "ఔచిత్యంబాదరించియు అనౌచిత్యంబు పరిహరించియు" అనువదిస్తున్నానని శాస్త్రిగారే చెప్పుకున్నారు. కాలం మారినప్పుడు ఒకప్పటి ఔచిత్యాలు అనౌచిత్యాలుగా భాసించవచ్చు. ఈ జాగ్రత్త ఎప్పటికప్పుడు కవులు తీసుకోవలసిందే.

అదీకాక పోతన్న రసలోలుడై ఒకటిరెండు ఘట్టాల్లో ఔచిత్యపు మేర మీరిన తావులు లేకపోలేదు. గోపికావస్త్రాపహరణ ఘట్టం ఒక ఉదాహరణ. కుమారికామణుల్ని యువతులుగా మార్చాడు. అనౌచిత్యమే. శాస్త్రిగారు మూలవిధేయంగా అనువదించి అనౌచిత్యం పరిహరించారు. (పుటలు: 195 - 204).

హృషీకేశ శర్మగారు మూడు మహాసముద్రాలను బుజాలకు ఎత్తుకున్నారు. వ్యాస భాగవతంతో శ్రీకృష్ణభాగవతాన్ని పోల్చడం

మాత్రమే కాకుండా మధ్యలో పోతనభాగవతంతో కూడా పోల్చిచూడటం పెట్టుకున్నారు. ఇది ముమ్మడి శ్రమ. అందుకే చాల విలువైన గ్రంథం ఆవిర్భవించింది. శ్రీధరీయ వ్యాఖ్యతోసహా సంస్కృత భాగవతంతో ఈతెలుగు భాగవతాలను రెండింటినీ అక్షరశః సరిపోల్చి చూపారు. పోతన్నలో కనిపించే పెంపుదలలకు, శ్రీధరీయం ఎలా మార్గదర్శకమయ్యిందో తెలియపరుస్తూ శ్రీపాదవారు మూలవిధేయంగా ఎలా అనువదించారో నిర్ధారించడంగా వీరిపరిశోధన సాగింది. "తులనాత్మక పరిశీలనము" అనేదే ఈసిద్ధాంతగ్రంథానికి గుండెకాయవంటి ప్రకరణం. తక్కిన ఆద్యంత ప్రకరణాలు రూపపుష్టికారకాలు పరిపూర్ణతాసంపాదకాలు.

విషయసేకరణలో ప్రకరణవిభజనలో వస్తుప్రతిపాదనలో శాస్త్రీయతతోపాటు సరళతనుకూడా సంపాదించారు శ్రీహృషీకేశశర్మ సంపాదించరామరి! గురుదేవులెవరు? శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావు గారు. ఆతడనేక యుద్ధముల నారియు తేరిన వృద్ధమూర్తి.

బరువైన గ్రంథం. ఓపికగా చదవగలిగితే అనర్ఘరత్నాలు అనేకం లభిస్తాయి. శర్మగారిని మనసారా అభినందిస్తున్నాను.

— బేతవోలు రామబ్రహ్మం
15-2-95.



# శ్రీకృష్ణభాగవత పరిశోధకాభినందనము

శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులుగారు
నరసాపురం.

భగవద్భాగవత ప్రభావములు శుంభత్సారవత్స్వాదుసా
ధుగిరాంగుంభకరంభముల్ పఠితృపాంథుల్ తృప్తిమైగొంచుమిం
చి; గరీయఃప్రతిభా ప్రభావితులుగా జేయన్ సముద్యుక్తులై
న గురూత్తంసులు వ్యాసపోతనకవీంద్రశ్రీపదాలంకృతుల్.

ఈతయి గృష్ణమూర్తికవి యెక్కటి శక్తి నిజాభిధాన సం
ధాతతిరమ్య భారత కథా రఘునాథ కథా యదూద్వహ
శ్రోత ఘనాళి భాగవత సుందర గాథలు తెల్గుబాస జం
పూతయి వ్రాసి వాసిగనె బుణ్య యశోవిశదాఖిలాశుడై.

భారతగాథ రామకథ భవ్యవచోఽన్తర దివ్యదీప్తివి
స్తార పరిశ్రమానితర సాధ్యముగా బ్రకటించి చిన్మయ
శ్రీరుచిరాభిధానుడును శ్రీపద కృష్ణమహామనీషియున్
బేరును బెంపుగాంచిరి వినిర్మల భావుకతా ప్రతీతులై.

మూడవదైన భాగవతమున్ మథియించి, తదంతరామృతా
మ్రేడన చుంచు మార్మికతమించు మహార్థములెల్ల నోర్పుమై
బ్రోడలుమెచ్చునట్లు పరిపూర్ణశుభాకృతి దీర్చ నేర్పునన్
గ్రొడలు సల్పిదాన స్వపితౄణము దీర్చిన ధన్యుడీతడే.

కాశీక్షేత్ర నిహ సపుణ్యమును, గంగాస్నానపుణ్యంబు, వి
శ్వేశశ్రీ చరణాశ్రయంబు, సకలాభీష్టప్రదాంబాఽఽదరం

బీశేముష్యధికున్ దయన్గను గురుల్ హేలాసమస్థేమ, నెం
తే శోభాఽతిశయంబు గూర్పగ హృషీకేశాహ్వయుండొప్పగా!

కాశిని గృష్ణ భాగవత కమ్రవచోఽన్తరమర్మరత్నముల్
రాశిగ బోసితే; తగు "షరాబులు" వీనికి విల్వగట్టనే
రీ? శివుపట్టణంబుననె హృద్యము పట్టము బొందితోహృషీ
కేశశుభాహ్వయా! బహు సుహృద్బుధ బంధ్వభినందితోదయా!

విద్యావతాం భాగవతే పరీక్షేత్యాహుర్బుధా ఇత్యఖిలైకవేద్యమ్
తథావిధే,భాగవతాంధ్రభాషాగ్రంథే భవాన్ గూఢమహార్థవేత్తా॥

యదబ్రవీత్ బమ్మెర పోతనార్యోనాలంశివోఽలంనవిరించనోఽపి
వ్యాఖ్యాతుమేతద్బత! గూఢరూఢానర్థాన్భవాన్ వేత్తిబహూనముష్మిన్॥

పూతా, కృతిర్భాగవతాభిధానా
పూతా కృతి శ్రీపద కృష్ణమూర్తిః।
తచ్ఛోధనే త్వం కృతకృత్య ఆసీః
ధన్యావయం త్వత్కృతి నిత్యసేవాః

నస్తోతుమేవం కృతవాన్ ప్రయత్నమ్
భవన్తమత్యుక్తిరియం నమేస్యాత్।
న చార్థవాదోఽపి,యథార్థఏవ;
నచస్తవో;వాస్తవఏవ;నాన్యః॥

ఇత్థం, గోపాలకృష్ణమా
చార్యోఽత్తిలి కాశ్యపాఖేయః,
సజ్జన సంసద్విధేయః॥

25-2-95,
నరసాపురం.

# ధైర్యే సాహసే లక్ష్మీః

శ్రీ కడిమిళ్ళ వరప్రసాద శతావధానిగారు
నరసాపురం.

"నానృషిః కురుతే కావ్యమ్" అన్నారు. కవిమాత్రమే కాదు; పరిశోధకుడు కూడా ఋషివంటివాడు కావలసిందే. ఆత్మ యొక్క లేదా దైవము యొక్క తత్త్వాన్ని ఋషి అన్వేషిస్తే, నిర్ణీతకావ్యం, లేదా విషయం యొక్క తత్త్వాన్ని పరిశోధకుడు అన్వేషిస్తాడు. ఈ అన్వేషణకు అభిమాన నిరభిమాన దురభిమాన దూరుడై, కేవల సత్యాన్వేషణ నిరతుడు కావటం చాల అవసరం. ఈ పరిశోధకులు శ్రీ హృషీకేశశర్మ నేటిదనుక బ్రహ్మచారులుగనుక, వ్యయప్రయాసలను లెక్కించకుండగా కాశీవిశ్వేశ్వరుని సన్నిధానంలో ఏండ్లతరబడి వసించి సిద్ధాంతవ్యాసాన్ని రచించే విద్యాతృష్ణ గలవారు కనుకను పరిశోధిత విషయం ప్రామాణికతను సంతరించుకోవడంలో ఆశ్చర్యంలేదు.

"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన...." అని పోతన్నయే చెప్పుకొన్న పరిస్థితుల్లో, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి విరచితమైన శ్రీకృష్ణభాగవతాన్ని వ్యాస పోతనల భాగవతములతో తులనాత్మకపరిశీలనం చేయడానికి సంకల్పించుకోవడమే పెద్దసాహసం. కేవల కథాపరిమితంగా విషయాన్ని తీసికొనకుండగాభాగవత వేదాంతాన్ని (పుటలు 96-111), శాస్త్రజ్ఞతను (పు. 426-496), సంస్కృతాంధ్ర భాషాపద ప్రయోగదక్షతను (పు. 496-500) ప్రస్తావించడమే కాకుండగా సంస్కృతాంధ్ర వ్యాకరణ సూత్రాలను కూడా ప్రస్తావించడం గొప్పధైర్యం.

ఈ ధైర్యసాహసాలు ఈగ్రంథంలోని సప్తకళికల యందునూ ప్రతిబింబించి, అష్టమ కళికయైన సింహావలోకనంలో "ఈనాపరిశోధనము సమగ్రము కాజాలదు" (పు. 535) అని చెప్పుకొన్న వినయ సంభరిత వాక్యంతో గ్రంథం లక్ష్మీమయమై (శోభామయమై) విరాజిల్లింది. ఈ సిద్ధాంత వ్యాస స్థితలక్ష్మి అనంతర పరిశోధకులకు ఆలంబనమై, భాగవత వాఙ్మయ ప్రపంచానికి వెలుగులను విరజిమ్మగలిగినదై శాశ్వతత్వాన్ని సంతరించుకొని, తనజనకుడైన శ్రీహృషీకేశ శర్మకు కూడ ఆ "లక్ష్మి" కీర్తిని సంతరించి పెడుతుందని ఆశిస్తున్నాను.

నరసాపురం,  
**9-3-95.**

కడిమిళ్ళవరప్రసాద శతావధాని  
టేలరున్నత పాఠశాల.



"ఆదరించి ఆర్థిక సహాయముగ రూ. 10,000/- ల"ను

అందించి ప్రోత్సహించిన

**తిరుమల - తిరుపతి దేవస్థానముల యాజమాన్యమువారికి**



"సమస్త సన్మఙ్గళాని భవన్తు"

అని భావించుచు

ప్రత్యేకకృతజ్ఞతా సహస్రములను కయిసేయుచున్నాను.

రచయిత.

# కృతజ్ఞతలు

సాధ్యము సాధకునిదని ప్రత్యక్షప్రమాణమే అయినను పరో
ప్రమాణము లెన్నియో సత్యసత్యములనుట జగద్విదితమే. ఈ స
కృతార్థతకు వెనుక నెన్నియో అమృత హస్తములు వెన్నుదట్టినవి
సవినయముగ స్మరించు కొనుచున్నాను.

ప్రప్రథమమున జ్ఞానరూపులైన బ్రహ్మశ్రీ సత్యానందమహ
శ్రీ సత్యానందాశ్రమము - ఇనమడుగు. నెల్లూరు మండలం వా
పాద పద్మములకు ప్రణమిల్లుచున్నాను.

మహర్షుల వారి ప్రియ శిష్యులు, భాగవత తత్త్వగ్రాహుల
తల్లీనులును అయిన బ్రహ్మశ్రీ బ్రహ్మానంద తీర్థస్వాములకు వి
మిత మస్తకుడనగుచున్నాను.

నాకు సంస్కృతాంధ్ర విద్యాభిక్షనందించి వృద్ధి చేసిన మాత
సంస్థ "శ్రీక్షీరారామలింగేశ్వరస్వామి ప్రాచ్యకళాశాల" పాలకో
నకు సదాఋణపడి యున్నాను.

మునుముందు పరిశోధనాలోచనమును కలిగించిన ప్రము
లోచన వైద్యులు, మా సర్వరక్షకులు నయిన డా. కె. వి. ఆర్
కృష్ణాజీ గారికి, ఊతమునిచ్చి "మనోరథఫలసిద్ధిరస్తు" అని ఆశీర
దించి పర్యవేక్షకులను కూడ సూచించిన పూజ్యగురుదేవులు బ్రహ్మ
లంక విశ్వేశ్వర సుబ్రహ్మణ్యమహోదయులకు;

పరిశోధనాంశమును సూచించి సాంతము అపార వాత్స
ముతో నడిపించిన వారును; శక్తినికూడ దీసికొని ఓపికతో "సంగ్ర
హగ్రాక్ష"నొసగి దీవించినవారును అయిన పూజ్యగురుదేవులు బ్రహ్మ
ద కృష్ణమూర్తి మహోదయులకు;

అర్థించినదే తడవుగ "తథాఽస్తు" అని దీవించి పరిశోధన మార్గ దర్శకులగుటయేకాక ఇప్పుడు "పీఠిక" నొసగి అనుగ్రహించిన పూజ్య గురుదేవులు బ్రహ్మశ్రీ ఆచార్య సూర్యప్రకాశరాయ మహోదయులకు;

కోరినదే తడవుగ వాత్సల్యముతో "వాచవి" నందించి ఆదరించిన బ్రహ్మశ్రీ ఆచార్య బేతవోలు రామబ్రహ్మ మహోదయులకు;

'అభినందనలొ' సగి ఆశీరక్షతలు వైచిన పూజ్యగురుదేవులు బ్రహ్మశ్రీ అత్తిలి గోపాలకృష్ణమాచార్య మహోదయులకు;

ప్రోత్సహించి నడపించిన గురుతుల్యులు శ్రీ ఆర్. వి. యస్. శాస్త్రి, కీ॥శే॥ భట్టిప్రోలు బ్రహ్మానందం గార్లకు;

గ్రంథ ముద్రణమున ముందడుగు వేయించి ప్రోత్సహించుటయే కాక "ధైర్యే సాహసే లక్ష్మీః" అని ఆదరించిన శ్రీ కడిమిళ్ళ శతావధాని గారికి, పూజ్యగురువులు బ్రహ్మశ్రీ మల్లంపల్లి వీరరామ సిద్ధుడు అయ్యవారు, గోవిందరాజన్ గార్లకును; నరసాపురాంధ్ర గీర్వాణ పండిత మిత్రమండలి- సర్వశ్రీ చిలకమర్తి, (విష్ణు) చక్రవధానుల, గోటేటి కృష్ణ-తదితరులకును;

ప్రత్యేకముగ సహకరించిన డా. (నెమళ్ళదిన్నె) అ మళ్ళదిన్నె వారికి,

ఈ యజ్ఞమున ఎందఱివో ఛందోరూపుల పవిత్రప్రమాణాభిప్రాయ ఛందములు గానము చేయబడినవి. ఇంకను ఎందఱో-అందఱకును కృతజ్ఞతా నమస్సులు.

అచ్చు పనితో అనుభవము చాలని కారణముగ చాల ముద్రారాక్షసములు దొరలినవి. ఇట్లు తెలిసియు, తెలియకయు కానవచ్చు స్ఖాలిత్యాదులను సవరించుకొనుచు పఠించి ఆదరించు సరస సహృదయ సాహితీ ప్రియంభావుకులకు ప్రత్యేక కృతజ్ఞతలు.

పెద్దల, పూజ్యుల సూచనలను తదుపరి ముద్రణమున తప్పక పాటింపగలనని సవినయముగ మనవి చేసికొనుచున్నాను.

ఇక "శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్" కనుక ఈ శరీరము నిచ్చి తీర్చుటయేకాక ఈ కృతిని స్వీకృతినంది నన్ను చరితార్థునిగ చేసిన పూజ్య పితృమూర్తి బ్రహ్మశ్రీ వేంకట సూర్యనారాయణ ప్రసాదరాయ మహోదయుల, మాతృమూర్తి వేంకట సుబ్బలక్ష్మి గార్ల పాద పద్మములకు ప్రణమిల్లుచున్నాను.

కుటుంబసభ్యులు పూజ్యులు- అక్క శ్రీమతి లక్ష్మి సూర్యకాంత మునకు, బావ శ్రీ పోచినపెద్ది గోపాలరాయలకును; అన్న శ్రీ సత్య అనంతపద్మనాభలింగమూర్తిశర్మకు, వదిన శ్రీమతి విజయలక్ష్మికిని; మేనమామయేకాక చిన్న బావయునైన శ్రీ పెండ్యాల శాంతారామ్‌నకును నమస్సుమాంజలి. చెల్లెలు శ్రీమతి చి॥సౌ॥ పురుషోత్తమ భారతి, తదితర చిరంజీవులు అందఱకును శుభాశీస్సులు.

అసలు ఈ ఉద్గ్రంథమును ముద్రణరూపమున మలచిన సహాన సహృదయులు, కార్యదక్షులునయిన శ్రీ వెంకటరమణ ముద్రణా లయము వారికి, చిత్రకారుడు 'భాస్కర్'కు ప్రత్యేక కృతజ్ఞతలు.

అర్భకుడను, అల్పజ్ఞుడను. ఆదరింపగలరని ఆశించుచున్నాను.

సర్వమ్ బ్రహ్మార్పణమస్తు.

రచయిత.



# అనుక్రమణిక


విషయము : పుటలు.

I. ప్రథమ కళిక : 1-52

1. కవి జీవిత సంగ్రహము. 1-24
2. శాస్త్రివారి గ్రంథములు - సంగ్రహ పరిచయము 25-52

II. ద్వితీయ కళిక : 53-111

1. పురాణములు - భాగవతము 53-69
2. భాగవతాంధ్రత్వము 70-81
3. భాగవత భక్తి 81-95
4. భాగవత వేదాంతము 96-111

III. తృతీయ కళిక : 112-310

1. శ్రీమద్భాగవత శ్రీకృష్ణ భాగవతానువాదపరిశీలనము 112-126
2. తులనాత్మక పరిశీలనము 127-234
3. శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్యము 235-310

IV. చతుర్థ కళిక : 311-485

1. శ్రీకృష్ణభాగవతము - శైలీవిన్యాసము 311-332
2. ఇతివృత్త నిర్వహణము 332-341
3. రసపోషణము- 341-389
4. పాత్రచిత్రణాపాటవము 389-427

5. వర్ణనా వైదుష్యము 427-458
6. అలంకార వైచిత్రి 458-466
7. ఛందోవైచిత్రి-పద్యశిల్పము 467-485

**పంచమ కళిక:** 486-506

1. శాస్త్రజ్ఞత 486-496
2. సంస్కృతాంధ్రభాషా పదప్రయోగ దక్షత 496-500
3. లోకజ్ఞత 500-503
4. ఆలంకారిక పదప్రయోగ నైపుణి 504-506

**షష్ఠ కళిక:** 507-520

1. పూర్వకవిరచనాప్రభావము 507-519
2. ఆంధ్రభాగవతములు- శ్రీకృష్ణభాగవత స్థానము 519-520

**సప్తమ కళిక:** 521-533

1. శాస్త్రివారి వ్యక్తిత్వము స్థానము 521-531
2. శ్రీకృష్ణభాగవతానర్ఘ పంక్తులు 532-533

**అష్టమ కళిక:** 534-535

సింహావలోకనము - ఉపసంహారము.

# కవి జీవిత సంగ్రహము

మహాపురుషుల జీవితచరిత్రలద్భుత రసభరితములు. వారి యాదర్శములు జాతికి ప్రాతఃస్మరణీయములు. వారి యాశయములు జాతి ప్రగతికి అనుసరణీయములు. అట్టి యాంధ్రమహాపురుషులలో కీర్తిమూర్తులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారగ్రేసరులు.

19వ శతాబ్ది యుత్తరార్ధమున జననమంది స్మార్త శ్రౌతవిద్యావిశారదులై, గీర్వాణాంధ్రోభయ భాషాకూలంకష వైదుషీభూషితులై మహామహోపాధ్యాయులై, భారత భాగవత రామాయణాంధ్రీకర్తలై కవిసార్వభౌములై, కనకాభిషిక్తులై, కళాప్రపూర్ణులై, ప్రభుత్వాస్థానకవులై, వజ్రాయుధాది పత్రికా సంపాదకులేకాక సుస్థిర యశస్సంపాదకులై, పూర్ణ పురుషాయుష జీవులై యురమరిక యెనుబదేండ్లవిచ్ఛిన్నముగ ఆంధ్రశారదా వరివస్య గావించి చరితార్థులైన వారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. వారి జీవిత చరిత్ర మడుగడుగున పఠితలడెందములందుత్కంఠ రేకెత్తించుచుండును.

శ్రీపాదవారి వంశము తెలుఁగునాఁట పేరుమోసిన వంశము. పశ్చిమ గౌతమీ మండలమందలి నరసాపురము తాలూకాకుచెందిన "గుమ్మలూరు" శ్రీపాదవారి వంశమునకు కాణయాచి. కాశీ పండితులై 'అపరగౌతముల'ని ప్రఖ్యాతి వడసిన శ్రీపాద రామశాస్త్రిగారును, వారి యనుజన్ములను 'నైయాయిక సార్వభౌములు' నగు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారును గుమ్మలూరి శ్రీపాదవారే. కృష్ణమూర్తిశాస్త్రులవారి పూర్వులును గుమ్మలూరి వారే. ఈ వం

శమువారందఱును శ్రీ విద్యోపాసకులు. శ్రీవిద్యోపాసకు లగుటచే శ్రీపాదవారను గృహనామము వీరికి కలిగినది! వీరు వెలనాటివైదిక బ్రాహ్మణులు. కౌశికసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. యజుర్వేదులు

శ్రీ శాస్త్రివారు పశ్చిమగోదావరిజిల్లా యందలి "దేవరపల్లి" గ్రామమున అక్షయ సంవత్సర ఆశ్వయుజ బహుళ షష్ఠి సోమవారం రాత్రి పునర్వసు నక్షత్ర తృతీయ చరణము (29—10—1866) న జన్మించిరి. శాస్త్రులవారి జనయిత్రి వేంకటసుబ్బసోమిదేవమ్మగారు పితృపాదులు వేంకటసోమయాజులుగారు. వీరు వేదశాస్త్రశ్రౌతము లెఱిఁగినవారు. చక్కని పౌరాణికులు. జ్యోతిష వైద్యములందభిజ్ఞులు. సాహిత్యజ్ఞాన మలవఱచికొని, కొన్ని వీధి నాటకములను రచించిన కవులు.

కృష్ణమూర్తి శాస్త్రులవారి తాత తాత సర్వేశ్వర దీక్షితుల వారు. వేద విద్య లధ్యయనముసేసి క్రతువులొనర్చిన వారయ్యు, "రఘుదేవపురము" రాజధానిగ నేలిన మందపాటిరాజుల సంస్థాన మందు నుద్యోగము నిర్వహించిన లోకజ్ఞులు. వీరి ధర్మపత్ని 'పాప సోమిదేవమ్మ'గారు. ఆమె ఘనాంతముగ యజుర్వేదమును, చయ నాంతముగ శ్రౌతమును నేర్చిన విదుషీమణి యనియు, సాక్షాత్పర దేవత యనియు విశ్వసించెడివారఁట. ఈ పుణ్య దంపతులకు కుమా రుడు వేంకటశర్మగారు. ఈ శర్మగారి సతి నరసమాంబ. ఈమెకు సుబ్రహ్మణ్యము, సర్వేశ్వరదీక్షితు లను పుత్రద్వయము కలిగినది. అందు సుబ్రహ్మణ్యముగారే శాస్త్రిగారి పితామహులు. సుబ్రహ్మ ణ్యముగారు వేదము నభ్యసించినవారు. వీరి యర్ధాంగి కామాంబ- ఈ కవిగారి పితామహి.

శాస్త్రిగారి తండ్రి కోట రామభూపతివారి సంస్థానమున దివాను పదవి నిర్వహించి పేరు ప్రతిష్ఠలార్జించిరి. వేంకటసోమయా

సేయుచు తోడి బాలురను జట్టుగా కూర్చుకొని గోళీలు, గోణీబిళ్ళలు కొక్కులు, ఉప్పు బట్టీలు, కోతికొమ్మచ్చులు మున్నగు నాటుపాటు లతో పొద్దుపుచ్చుచుండిరి. కాని తండ్రిగారి మాట కొంచెము విను చుండువారటు. వీరి చిన్ననాటి వివిధ క్రీడా విశేషములు వారి శ్రీ కృష్ణభాగవతమున బాల బలరామ కృష్ణుల బాల్య చేష్టలయందు చక్కగ వర్ణింపబడినవి.

## అక్షరాభ్యాసము:-

శ్రీ శాస్త్రివారికి యెనిమిదవయేటనే యక్షరాభ్యాస మహో త్సవము చేసిరి. కాటవరమునందలి 'కంబైండుస్కూలు'లోఁ జదువ వైచిరి. పాఠశాలయందు కుశాగ్రబుద్ధులుగావున ఆయనే బడి పెద్ద కాగల్గిరి. ఆ కాలమున 'ఇన్‌స్పెక్టింగ్ స్కూల్‌మాష్టరు'గ నున్న దేవర కొండ కృష్ణమూర్తిగారు బడినిఁ బరీక్షింప వచ్చి మన శాస్త్రిగారి భాషాజ్ఞానమున కాశ్చర్యచకితులై కొన్ని పొత్తములు బహూకరిం చిరి. అంతియేకాక "ఇన్‌స్పెక్టరు" పదవి యందున్న కోవి దక్షిణా మూర్తిశాస్త్రిగారికిఁ దెలుపగా వారును గొన్ని బహూకృతు లిచ్చి ఆయనని ప్రోత్సహించిరి. ఇట్లు ధీశాలురుగఁ బేరువడి యా పాఠశాల యందు నాంగ్లముతో కూడిన 'తెలుగు ప్రైమరీ' దాఁక జదివిరి.

కాని శాస్త్రులువారికాంగ్లముపైమోజులేదు. ఆయూరి కరణము గారింట భారతాదుల పురాణ ప్రవచనములు జరిగెడివి. వారా పురాణ ప్రవచనములనిన చెవి కోసికొనెడివారు . పురాణ శ్రవణముచే వీరికి వీధి నాటకమన్నను, తోలుబొమ్మలాట లన్నను మిక్కిలి మక్కువ గల్గినవి. కాగితపుటట్టలతో బొమ్మలు తయారుచేసి, భారతాదులందు తామంతకుమున్ను విన్న కథలను వినోదార్థము ప్రదర్శించుచుండు వారు. ఇట్లు కాలముఁబుచ్చుచున్న శాస్త్రిగారిని తలచుకొని "క్రీడా సక్తుడగు నీ బాలుడు ప్రయోజకుడు కాగలడా?" యని చింతించి తండ్రిగారుపవీతునిఁజేయ నిశ్చయించిరి.

వేంకటసోమయాజులగారు శాస్త్రిగారికి గర్భాష్టమందే ద్వారకా తిరుమల క్షేత్రమున వేంకటేశ్వరస్వామి సన్నిధిని శాస్త్రోక్తముగ నుపనయనము చేసిరి. ఉపనయనమునాఁ డుపదేశమునొందిన గాయత్రీమంత్రమునందెనలేని భక్తితాత్పర్యములుగలవారై శాస్త్రిగారనుదినము సహస్ర గాయత్రీమంత్ర జపము చేయజొచ్చిరి. "గాతారం త్రాయత ఇతి గాయత్రి" అను మర్మమును గ్రహించినవారు. ఉపనయనము జరిగిన నాటినుండియు ఆయన యల్లరి, కొంటెతనం మూర్ఖత పటాపంచలైనవి. చదువుసంధ్యలందాసక్తి మెండైనది. కాని యాంగ్లవిద్య నచ్చలేదు. అంతతోడనే బడి చదువునకు స్వస్తిచెప్పిరి తండ్రిగారి యనుమతితో సాహిత్య చక్రవర్తులని కొండాడుటకు పాత్రులైన 'ఇవటూరి నాగలింగశాస్త్రి' వారి చరణ సన్నిధి చేరిరి. ఆ గురువులతో కావ్యనాటకాలంకారములు పాఠము చేసిరి. శాబ్దాదులందు కృత పరిశ్రములైరి. నాగలింగశాస్త్రులవారి యాచార్యత్వమే కృష్ణమూర్తిశాస్త్రులవారి యుజ్జ్వల భవిష్యజ్జీవితమునకు ఘంటాపథము కల్పించినదనవచ్చును. ఆ విద్యాభ్యాసకాలమున 'మధిర సుబ్బన్న దీక్షితులుగారు' శాస్త్రిగారికి సహాధ్యాయులు. శ్రీ దీక్షితులుగారు "కాశీమజిలీ కథ"ల రచనముతో సుప్రఖ్యాతులైరను విషయము నిట వచింపనక్కఱగలుగదు.

నైషధీయ చరితము చదువుకొనునాళ్ళలో తమ మేనమామ శ్రీ కల్లూరి బ్రహ్మ సోమయాజులుగారు శిష్యులకు స్మార్తము చెప్పుచుండ షోడశ కర్మాంతము నేర్చిరి. బ్రహ్మశ్రీ వాజపేయాజుల పాపయ్యసోమయాజులుగారి యొద్ద ఆధానపంచకము, సోమ పంచకము, చయనపన్నములు ॥అధ్వర కాండము॥ వల్లించిరి. ఇట్లు స్మార్తశ్రౌతము లభ్యసించి "పితరం యాజయేత్ పుత్రః, పితా పుత్రం న యాజయేత్" అని శాస్త్రము కావున తండ్రిగారొనర్చిన

అగ్నిష్టోమమున కాధ్వర్యవము వహించిరి. అంతియకాక చౌండ్రి పాణీయ కేశవీయాది వ్యాఖ్యా గ్రంథములామూలాగ్రముగ పరిశీలించిరి. పల్వుర యజ్ఞములలో ప్రతిప్రస్థానము, అగ్ని; ధ్రిము మున్నగాగల యార్త్విజ్యములు నెఱపి వన్నెయు, వాసియుగాంచిరి అప్పటికి శాస్త్రిగారు పదునెనిమిది శరత్తుల ప్రాయము వారు మాత్రము.

## కవితా వ్యాసంగము :-

శాస్త్రిగారికి కవిత్వము పుట్టుకతోడనే యలవడినదని తోచును. కుమార సంభవము పఠించునపుడే సంస్కృతమున కవిత నల్లుట కారంభించిరి. తొట్టతొలుత కాటవరమందు వెలసిన శ్రీ రామలింగేశ్వరస్వామిపై నొక శార్దూల వృత్తాష్టకమును బిమ్మట రామాష్టకమును రచించిరి. అప్పటికి శాస్త్రిగారు ద్వాదశ వర్షప్రాయులు. పిమ్మట మేఘ సందేశము పాఠము చెప్పుకొను దినములలో గీర్వాణమున 'చంద్రియశశ్చరిత్ర' కావ్యము రచించ నారంభించి కొన్ని సర్గలు రచించిరి. కాని నేడవి యనుప లభ్యము. రెండు మూడు శ్లోకములు మాత్రము లభించినవి.

మాఘము చెప్పుకొనుచు 'పరబ్రహ్మాష్టకము'ను జెప్పిరి. ఈ పరబ్రహ్మాష్టకము మదరాసులో జ్యోతిష్మతీ ముద్రాలయము నందు మహామహోపాధ్యాయ శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారిచే పరిష్కరింపబడి యచ్చుపడినవి.

## తెలుగు కవిత్వము :-

శాస్త్రిగారు పదునేనవ యేట నుండి తెలుగు కవితనల్లసాగిరి. ఒకప్పుడు గొల్లప్రోలు గ్రామవాసులగు అల్లమరాజు సుబ్రహ్మణ్య కవిగారు కాటవరము వచ్చిరి. వారు కవులని యెఱిగి శాస్త్రిగారు--

క॥ "తొణ్ణేటి గ్రామ మందున
కుణ్ణా సంభావనిచ్చి కుదురుగ నీకున్
బజ్జల పెరుగుతొ నన్నము
జుజ్జంగా బెట్టుగలరు చక్కంబోరా।"

అను వెట్టి మొట్టి పద్యము వ్రాసి సుబ్రహ్మణ్య కవిగారికి జూపిరట. కవిగారు 'నీకు సహజ కవితా ధార కలదు. లక్షణము నేర్వు' మని సలహా నిచ్చిరి. అంత శాస్త్రివారు తమ సహాధ్యాయులు దీక్షితుల వారి సాహాయ్యమున ఛందోగ్రంథములు, వ్యాకరణ గ్రంథములు చదివి లక్షణ పరిజ్ఞానము బడసిరి. భారతాదులు, శ్రీనాధుని గ్రంథ ములు పదే పదే పఠించి తెలుగునందును పాండితినలవరచుకొనిరి.

## గ్రంథ రచనము :-

శ్రీ శాస్త్రిగారికి పిన్ననాటి నుండియు కవిగా ప్రసిద్ధివడయ కోర్కె పొడమినది. ఆ కోరిక నాడు నాటికి బలపడి శ్రీనాధకవి సార్వభౌముని తమ కవితా గురువుగా భావించుకొనెడి వారని వారి "స్వీయ చరిత్రము" వలన తెలియుచున్నది. నిరంతరాభ్యాసముచే పద్య రచన యందు చక్కని వైవు వాటము లెటిగిన జగజాణలైరి. షోడశ వర్షప్రాయమున శాస్త్రిగారు తమ తొలి తెలుగు కబ్బమును సత్యనారాయణోపాఖ్యానమను వ్రత కథ ననుసరించి 1882 న రచించి ప్రకటించిరి. అది మొదలుకొని గౌతమీ మహాత్మ్యము, ప్రద్యుమ్నోపాఖ్యానము, ఏకావళీ పరిణయము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ నిర్వచనైకాదశాక్షరి. మధుకర విజయాదిప్రబంధములును కలభాషిణీ, బొబ్బిలియుద్ధము మొదలగు నాటకములను వెలయించిరి మరియును పెక్కువిమర్శ గ్రంథములను నిర్మించుటయేగాక భారత భాగవత రామాయణములను భాషాంతరీకరించి, కవిసార్వభౌమ కళా ప్రపూర్ణాది బహు బిరుద విభ్రాజితులై, కనకాభిషేక గజారోహణ

గండపెండారాది సమ్మాన విభూషితులై యావదాంధ్రమందు నపార యశస్సును సముపార్జించుకొనిరి.

## గృహ విషయములు:-

కృష్ణమూర్తిశాస్త్రిగారికి పదునొకండవయేటనే వివాహమైనది వధువు వాడపల్లి లక్ష్మీపతి దీక్షితులుగారి కొమరిత వేంకమాంబ. ఇర్వురకును వయస్సులో దినములు మాత్రమే యంతరమగుటచే నిరుగు పొరుగు వారు శాస్త్రివారిని 'పెద్ద పెండ్లాము మగఁడు' అని హాస్యము పట్టించెడివారు. ఏకతాననో శాస్త్రిగారికామె యెడాట మున నాభిముఖ్య మేర్పడలేదు. అనతి కాలముననే వేంకమాంట జబ్బుపడి మృతి చెందినది.

కవిగారు గ్రంథరచనైక చిత్తులై కాలము గడుపుచుండిరి. ఇటు లుండ నరసాపురం తాలూకాలోని 'నడుపూడి' గ్రామ నివాసులు కళా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు తమ తృతీయ పుత్రిక వేంకట రత్నాంబను మనశాస్త్రిగారికిచ్చి మహావైభవముగ వివాహము జరిపించిరి. ఈద్వితీయ వివాహము విజయ సంవత్సర చైత్రశుద్ధ నవమినాడు జరిగినది. శాస్త్రిగారు దాంపత్య జీవితమును సాగించుచు కొంతకాల మునకు రాజమహేంద్రవరమునకు మకాము మార్చిరి. ఆ కాలమున వారి శ్రీమతి ప్రథమ పుత్రికను ప్రసవించినది. అంతకు మున్నె శాస్త్రిగారు కాశీ యాత్ర కావించి వచ్చుటచే నామెకు శాస్త్రిగారు 'విశాలాక్షి' యని నామకరణము కావించిరి. విశాలాక్షి దిన దిన ప్రవర్ధమానయై విద్యలు నేర్చి కావ్యకర్త్రియై తండ్రికి దగిన కూతు రని వాసికెక్కినది.

పిమ్మట మూడేండ్లకు జననమందిన ద్వితీయ పుత్రికకు "సావిత్రి" యని పేరుపెట్టిరి. ఈ యిర్వురు పుత్రికల యనంత రము జగద్గురు శంకరభగవత్పాదుల జన్మదినమున శాస్త్రిగారికి

(11-5-1913) న కుమార సంభవమైనది. ఆ కుమారుడు హస్తముల
హలకులిశాది రేఖలతోడను, బొడ్డున పెద్ద పుట్టుమచ్చతోడను జనించె
నట. కావున నా తనయునకు శాస్త్రిగారు 'సుదర్శన నిధి' యని
పేరిడిరి. సుదర్శన నిధి తల్లిదండ్రులకు పేరాసలు పుట్టించి, శాస్త్రి
గారు భారతమందలి అభిమన్యు వధఘట్టము ననువదించు కాలమున
తన పదునొకొండవ యేట స్వర్గతుడై వారిని దరిలేని దుఃఖసముద్ర
మున ముంచెను. శాస్త్రిగారి తండ్రి శ్రీ వేంకటసోమయాజులుగారు
రాజమహేంద్రవరమున పరలోకగతులైరి. ఆ వెనుక పదేండ్లకు
శాస్త్రిగారి 'అరణ్యపర్వాంధ్రీకరణము' సాగుచుండగా వారి తల్లి
మరణించెను.

## అవధాన ప్రదర్శనము - రాజ సందర్శనము:-

శాస్త్రిగారు శతావధానము, అష్టావధానము, చిత్రావధాన
ములు నేర్చి దేశాటనము కావించి బహు బహూకృతులు, పెక్కు
బిరుదము లొందిరి. క్రీ.శ. 1890వ సంవత్సరమున బొబ్బిలి, పర్లాకి
మిడిలోనగు ప్రాగ్దేశపు ప్రభువులను దర్శించి శతాష్టావధానములాయా
సంస్థానములలో ప్రదర్శించి సమ్మానితులైరి. అనంతరము క్రీ. శ.
1895 వ సంవత్సరమున ఛత్రపురము చేరి, యా పట్టణమున ప్రసిద్ధి
చెందిన శ్రీ ఉన్నవ వేంకటేశ్వరరావు పంతుల వారిని దర్శించిరి.
వారి సాయముతో కళ్ళికోట రాజా హరిహరమర్దరాజదేవు దొరవారి
యనుగ్రహమునకు పాత్రులై యట రెండు మాసములుండిరి. అట
నుండి రాజావారి పరిణయమునకు వారితో 'మయూరభంజి' పురము
నకేగి మహా పండితులున్న సభలో నొక శతావధానము, నొక
యష్టావధానమును కావించి 'కవిరాజ' బిరుదమును, స్వర్ణపతకమును
పసదనముగ నందిరి. మయూరభంజి ప్రభువు శ్రీరామచంద్రభంజి
దేవుగారు శాస్త్రివారి యవధాన ప్రజ్ఞకు పరమానందమునంది వేయి

నూటపదార్లు, సేలువలు, దోవతులు, ఉంగరమునిచ్చి మెచ్చిరి. (శ్రీ కృష్ణకవి జీవితము-పుట-105, 106)

శాస్త్రివారి యవధాన కళయందు పుష్పగణనము, లిఖితాక్షరి, వ్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి, దత్తాక్షరి, ఆకాశపురాణము, సహపఠనములు ప్రధానములు. సహపఠనమనగా నెవ్వరేభాషలో నేమి పఠించిన వారితో నద్దానిని వచ్చినవాడు పఠించినట్లు పఠించుట. ఇది యవ ధానులలో వీరొక్కరికే యలవడిన కళ. వారి బుద్ధి లోకోత్తరమైన దనుట కిది యొక తారకాణము.

మయూరభంజి సంస్థానమున ప్రత్యేకము ప్రశంసనీయమగ గౌరవమాంధ్ర కవులలో శ్రీశాస్త్రిగారికొక్కరికే లభించునట్లుతెలియ చున్నది. అవధాన కళా కౌశలముతో జయభేరి మ్రోగించిన శాస్త్రి గారిని సంస్థానమునకు జెందిన వెల్లయేనుగు మీద నుత్సవముగ నూరేగించిరట. ఇట్టి మహా గౌరవము నందిన మహాకవి యాంధ్ర సాహిత్య చరిత్రలో వేఱొక్కరు కనరారు, వినరారు. ("కవిసార్వ భౌములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు" శ్రీమల్లెల శ్రీరామమూర్తి గారి వ్యాసము - ఆంధ్రపత్రిక దినపత్రిక 8-1-1961)

ఇట్లే జగ్గయ్యపేటలోను, తెలంగాణమందలి పెద్దపల్లి జమీ దారులు శ్రీ రాజా పోలేపల్లి వేంకటరాజేశ్వరరావు సర్దేశముఖువ దర్శనము చేసి వారి సంస్థానమున నొక యవధాన మొనర్చి జగ్గయ్యపేట యవధానము శాస్త్రిగారికెనలేని ప్రఖ్యాతిని చేకూ నది. వాటి సమస్యా పూరణములు కొన్ని నేడును చూడగలము ఆ వెనుక మంథెన, జటప్రోలు, వేంకటగిరి సంస్థానములు తిరి మంథెనలో నవధానమున వేదము సహపాఠము చేయుట చ యొక మహమ్మదీయుడు "నేనరబిక్కు చదువుదును తాము సహ పఠనము సేయుదురా?" యని సవాలు సేయగా శాస్త్రిగారు

కుండనని అరబిక్కు పద్యాలను సహపాఠము సేసి మెప్పునందిరి. ఈ పగిది పెక్కు పట్టుల నవధానములొనర్చి గొప్ప ధనమును సంపాదించి శాస్త్రులవారు లంకల వ్యవసాయము వలన తమకు కల్గిన నష్టమును వడ్డీతోగూడఁ దీర్చి ఋణ విముక్తులైరి.

## లంక వ్యవసాయము:-

కాటవరము చెంత నినుగంటివారి పేట కలదు. ఆ పేట నంటి లంకలు పెక్కులు కలవు. శాస్త్రులవారు పదిపదునైదువేల రూప్యములకు కొన్ని లంకభూములను పాడిరి. అప్పుడు వారు స్వతంత్రులుగారు. తండ్రిచాటువారు. చేత గుడ్డిగవ్వయినలేదు. లంక భూములను పాటపాడిన సంగతి తండ్రిగారికెఱుకపఱచు ధైర్యము లేదయ్యెను. అయ్యును "ములకల్లంక" గ్రామమునకు వెడలి యందొక ధనవంతునితో సంప్రదించి వ్యవసాయము చేయుటకు తగిన సొమ్ము పెట్టుబడికయి కొని తెచ్చి లంక వ్యవసాయము మొదలు పెట్టిరి. పొగాకు నాటిరి. తోట తొలుత యేపుగనే పెరిగినది. కాని గోదావరి పొంగి పొగాకు తోటను ముంచివైచినది. శాస్త్రిగారికి దండుగ వచ్చినది. 'కవిరాజు' గారికి లంక వ్యవసాయము ముప్పదివేలు నష్టము తెచ్చిపెట్టినది. శాస్త్రిగారికి దారియు తెన్నును తోచలేదు. అపుడు కవిగారు కాకినాడ సమీపమునందుగల మల్లవరమున కేగి యందున్న నిమ్మన జియ్యన్నగారికి సమస్తము తెలుపుకొనిరి. ఆయన దయార్ద్ర హృదయుడై శాస్త్రిగారితో కాటవరము వచ్చి సోమయాజులుగారి సమ్మతి వడసి పంతము వెంకన్నగారి వద్ద దస్తావేజుపై ముప్పదివేలు ఋణమిప్పించిరి. ఆ ఋణ ధనమును - శాస్త్రిగారిచే నటనట యవధానములు చేయించి ధనము పోగుచేసియు, శాస్త్రిగారి వాటా భూములమ్మి కొన్నివేలు గూర్చియు, ఋణపత్రముపై వసూలు పెట్టించి వీరిని జియ్యన్నగారు ఋణ విముక్తులను గావించి

నట్లు స్వీయ చరిత్రి వలన తెలియ వచ్చుచున్నది. అంత శాస్త్రిగారు శ్రీ వెంకన్నగారిపై 'వేంకటేశ్వరీయము'ను కృతి రచించి వారికి తమ కృతజ్ఞతను జాటుకొనిరి.

## సమ్మానములు - బిరుదములు :-

కళ్ళికోట, మయూరభంజి, పిఠాపురము, విజయనగరము, బొబ్బిలి, జటప్రోలు, వెంకటగిరి మొదలగు సంస్థానములకు చెందిన రాజులు శాస్త్రిగారిని పెక్కు బహుమానములిచ్చి గౌరవించిరి.

'శ్రీకృష్ణభారత' కృతిపతులగు ముక్త్యాలరాజా శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదువారు శాస్త్రిగారికి నెలకు నూట పదియార్లు చొప్పున పదునైదేడులు మాసాశనమొసగి యాదరించిరి. అంతియకాక శ్రీశాస్త్రిగారి పుత్రికల వివాహములకు వేలువిలువసేయు వస్త్రములు బహుమతులిచ్చి తమ వదాన్యతను జాటుకొనిరి. అట్లే బెజవాడకు జెందిన శ్రీ చుండూరి వేంకటరెడ్డిగారును, శ్రీ ఈదర వేంకటరావుపంతులుగారు (వేంకటరామా అండ్ కో, ఏలూరు) శ్రీ శాస్త్రిగారికి మా సభృతి నియతముగ నిచ్చెడివారు. శ్రీ ఈదర వేంటరావుపంతులుగారు శాస్త్రిగారి శ్రీకృష్ణరామాయణమును గృతినంది మూడువేల రూప్యములుపదగా నిచ్చిరి. "మహా మహోపాధ్యాయ" బిరుదును బురస్కరించుకొని నాటి యాంగ్లప్రభుత్వమును, ఆస్థానకవి పట్టము సకు నేటి యాంధ్రప్రభుత్వమును శాస్త్రిగారిని గౌరవించి తమ యుచితజ్ఞతను వెల్లడించుకొనినవి.

ఇక శాస్త్రిగారికి లభించిన బిరుదములు లెక్కకు మిక్కిలిగ నుండును. మోరోభంజిలో పండితుల సమక్షమున అవధానములు సల్పి వారి ప్రశంస లందుకొనుటయేగాక 'కవిరాజ' బిరుదముతో పాటు ఒక బంగారు పతకమును గూడ సంపాదించిరి. పరరాష్ట్రము

విద్వాంసుల సమక్షమున లభించిన బిరుద మగుటచేగానోపును శ్రీ శాస్త్రిగారి కవిరాజ బిరుదమును "కవిసార్వభౌము"లయిన వెనుకం గూడ వాడుక సేసిరి.

క్రీ. శ. 1937వ సంవత్సరమున 'బ్రిటిషు' ప్రభుత్వము కృష్ణమూర్తి శాస్త్రిగారిని 'మహామహోపాధ్యాయ' బిరుదముతో భూషించినది. ఈ బిరుదప్రదానము వలన శాస్త్రిగారికి నిన్న నేటి దనుక పాలునకు నూఱు రూప్యములు బహుమతిగ లభించెడివి.

ఆ సంవత్సరము నందే "ఆంధ్ర విశ్వకళా పరిషత్తు" వారు శాస్త్రివారిని 'కళా ప్రపూర్ణ' బిరుదప్రదానముతో గౌరవించి ప్రశంసించిరి. ఈ బిరుదును తొలిసారిగ పొందిన పండితులలో శాస్త్రిగారొకరు. తక్కిన మూవురు శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు, శ్రీ జనమంచి శేషాద్రిశర్మ, శ్రీమాన్ కపిస్థలము దేశికాచార్యులువారలు.
(కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు - వ్యాసము ఆంధ్రపత్రిక దినపత్రిక 8-1-1961)

1930వ సంవత్సరమున సుప్రసిద్ధ పంచారామ క్షేత్రములలో నొక్కటిగ పేరుపెంపులు గాంచిన క్షీరారామపురము (పాలకొల్లు)న స్వర్ణాభిషేక మత్యంత వైభవముగ జరిగినది. కొన్ని కారణములచే ముక్త్యాలరాజావారికిని శ్రీపాదవారికిని వైమనస్యము లేర్పడినవి. రాజావారు మాస భృతి పంపుట మానిరి. అప్పటికి ఉద్యోగ పర్వము వఱకే 'శ్రీకృష్ణభారతము' ప్రకటితమైనది. భారతాంధ్రీకరణముతోపాటు శాస్త్రిగారికి షష్టియు 1926 నాటికి నిండినది. కాని శ్రీకృష్ణభారతము సమగ్రముగ వెలుగు చూడలేదు. శాస్త్రివారు యత్నింపగ పాలకొల్లు పురప్రముఖులగు శ్రీ రేపాక సత్యనారాయణమూర్తిగారును, చుండూరి నారాయణరావుగారును చెరియొక సంపుటమును కృతి స్వీకరించి యచ్చు వేయించిరి. అంతియకాదు, రెండువేల రూప్యముల విలువగల బంగరు విరులు సేయించి, పుణ్యనదీజలములతో సమంత్రముగ సామ్రాజ్య పట్టాభిషేక మంత్రము

లతో శాస్త్రి దంపతుల నభిషేకించిరి. శాస్త్రులవారు నాటి యభిషేకము
నకు ముందష్టోత్తర శతమృత్తికాస్నానములాడి, సర్వ ప్రాయశ్చి
త్తము చేసికొని సొంత సొమ్ముతో గోదానాది ధర్మము లొనర్చిరి
పిమ్మట కనకాభిషిక్తులైరి. ఆనాటి సభకు కాశీ పండితులు బ్రహ్మశ్రీ
వేమూరి రామగోవిందశాస్త్రులువారు అధ్యక్షత వహించిరి. పిఠాపురము
పండితులు ఆమ్నాయార్థవాచస్పతులు శ్రీ వడలి లక్ష్మీనారాయ
శాస్త్రిగారు, వైయాకరణ కేసరి శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగార
మొదలగు మహా విద్వాంసులు హాజరయినవారిలో ప్రముఖులు. ఆ
పండిత పరిషత్తులో శాస్త్రిగారికి 'కవిసార్వభౌమ' బిరుద ప్రదానము
జరిగినది. తదుపరి బెజవాడ పట్టణమున జరిగిన పదునారవ
యాంధ్ర మహాసభవారు కడప కోటిరెడ్డిగారి యధ్యక్షతను సమ
వేశమై పాలకొల్లు పురమందొసంగఁబడిన 'కవిసార్వభౌమ' బిరుద
మునే స్థిరపఱచి, స్వర్ణపేటిక సమర్పించి సత్కరించిరి.

1933 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున శాస్త్రిగారి
వేయిమంది మహాపురుషుల సంతకములతో కవిగండపెండారమ
డాకాలఁ దొడిగించిరి. తొల్లి పెద్దన మహాకవికి లభించిన ప్రశ
మరల ఈ కవిగారికే దక్కినది. గౌతమీ గ్రంథాలయమున మూడ
రోజులు మహాసభలు జరిగినవి. జయపూరు మహారాజు శ్రీ విక్రమ
దేవ వర్మగారు సభకగ్రాసనాధిపత్యము వహించుటకు సమ్మతించి
కాని వీలుచిక్కమిఁజేసి కాబోలు రాజావారు సభనాటికి రాలేకపో
యిరి. అంత శాస్త్రివారి శిష్యాగ్రగణ్యులును, ఆద్యతనాంధ్ర కవి ప్ర
పంచ నిర్మాతలును, శతావధానులు నగు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి
గారు అగ్రాసనాధిపత్యము వహించి శాస్త్రిగారి డాకాలిని గండపె
డెరము దొడిగి గురు ఋణమును తీర్చుకొన్నవారైరి.

1935 వ సంవత్సరములో బెజవాడ, సాలూరు పురములల
గజారోహణ మహోత్సవములు జరిగినవి. 1945 వ సంవత్సరము

బెజవాడయందే మణికిరీటము సమర్పింపబడినది. అపుడే శ్రీకృష్ణ భారతమునకు బ్రహ్మరథము పట్టిరి. 1950 వ సంవత్సరములో వేంకటశాస్త్రిగారు శివైక్యమొందగా అప్పటి ఉమ్మడి ప్రభుత్వము శాస్త్రిగారిని ఆంధ్రాస్థానకవిగ నియమించి గౌరవించినది. ఆ వేడుక యంతయు చలనచిత్రమునకెక్కించి దేశమున విడుదలసేసిరి. ఆంధ్ర రాష్ట్రమేర్పడిన వెనుక ఆంధ్రప్రభుత్వము శాస్త్రివారి నాస్థానకవిగా నామరణము గుఱుతించి శాస్త్రులవారిని అప్పటి రాజధాని యగు కర్నూలు నందు ఘనముగ సత్కరించినది.

1954 వ సంవత్సరమున గుడివాడ పట్టణమున ఎఱ్ఱోజు మాధవాచార్యులవారి పర్యవేక్షణములో శాస్త్రివారికి సువర్ణపుష్పపూజ మహారాజునకువలె జరిగినట్లు కవిగారి 'స్వీయ చరిత్ర' వెల్లడించు చున్నది. ఆ యేడే కాకినాడ " ఆంధ్ర సాహిత్య పరిషత్తు " నకు శాస్త్రివా రధ్యక్షులైరి.

1957 లో 'ఆంధ్ర సాహిత్య అకాడమీ' సభ్యులుగ ఏకగ్రీవముగ 'కో_అప్టు'చేసికొనబడిరి. తుట్టతుదను శాస్త్రిగారికిలభించిన గౌరవము వారి కీర్తి కిరీటమునకు "కలికితురాయి" వంటిదని యెంచ నగును.

1958 వ సంవత్సరములో భారతప్రభుత్వము శాస్త్రులవారిని యావద్భారత గైర్వాణ వాణీ ధురంధరునిగ గుఱుతించి సత్కరించినది. సరిగా శాస్త్రిగారి జన్మదినముననే (29-10-1958) ప్రమాణ పత్ర ప్రదానము సేసి యావజ్జీవితము సాలునకు పదునైదు వందల రూపాయల నిచ్చినది. ఇఁక యాంధ్ర మహాజనులు వారిని 'ఆంధ్ర వ్యాస', 'అభినవ శ్రీనాథ', 'వేద విద్యా విశారద' 'ప్రసన్న వాల్మీకి' "విశ్వకవి", "కవిబ్రహ్మ", "మహాకవి" బిరుదులతో గౌరవించి శాస్త్రివారి పట్ల తమకుగల యాదరాభిమానములను ప్రదర్శించిరి.

29-11-1941 వ తేదిన రాజమండ్రి పురపాలక సంఘము వస్తు ప్రదర్శనశాల వద్ద శాస్త్రివారి శిలా విగ్రహమును పౌరులు ప్రతిష్ఠించి శాస్త్రివారికి అఖండ గౌరవము కలిగించిరి. ఆ పురపాలక సంస్థవారు కవిగారికి స్వేచ్ఛా పౌరసత్వమొసగి (Freedom of the City) వారి గృహమునకు పన్ను లేకుండ చేసిరి.

శాస్త్రిగారికి కేంద్ర ప్రభుత్వమువారు ప్రమాణపత్ర ప్రదానమిచ్చుట తెలిసి అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ "భీమ్‌సేన్ సచార్" గారు కవిగారికి క్రిందిరీతిగఁ బ్రశంసించుచు నొక 'కమ్మ' వ్రాసిరి.

[Seal]
GOVERNER
Andhra Pradesh

Andhra Pradesh
Governer's Camp
Hyderabad
21st. August 1958

Dear Sri Krishna Murty Sastry,

I am happy to know that you are one of the distinguished and eminent scholars to whom the president has awarded for the first time the certificate of honour. I offer to you my hearty Congratulations. We are proud of the honour. You have brought to this State by virtue of your erudite scholarship and high literary attainments.

With best regards.

Yours Sincirely,
Sd xxx...xxx...xxx.
[ Bhimasen Sachar ]

Sri Sripada Krishna Murty Sastry
Poet Lawreate, Andhra Pradesh
Rajahmundry

[ True Copy ]

(శ్రీ శాస్త్రివారి దౌహిత్రులు శ్రీ కల్లూరి సూర్య సత్యనారాయణ మూర్తి (విశాలక్షి పుత్రులు)గారి "ఆల్బమ్" నుండి గృహీతము.

## ఉద్యోగనిర్వహణము - పత్రికాస్థాపనము :

శాస్త్రిగారిది చిన్ననాట నుండియు స్వతంత్ర ప్రవృత్తి. ఒకరి క్రిందనుద్యోగించుట వారి స్వభావమునకే విరుద్ధము. అయ్యును వారి మిత్రులు, ప్రసిద్ధ నాటకకర్తలునగు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి యొత్తిడివలన "పెద్దాపురం" ఉన్నత పాఠశాలలో ఖరనామ సంవత్సరమున సంస్కృతోపాధ్యాయ పదవిని నిర్వహించిరి, తరువాత రాజమహేంద్రి యందలి "మిషన్" ఉన్నత పాఠశాలలో ఆంధ్రపండిత పదవి స్వీకరించి మొత్తము రెండేండ్లపాటు ఉద్యోగించిరి. కాని తమ ప్రవృత్తికి ఆ పదవులు నచ్చకుండుటచే విరమించి క్రీ. శ. 1897-1898 ప్రాంతమున నొక ముద్రాశాలను వెలకొల్పి ఒక సంవత్సర కాలము దానిని నడిపిరి. తెలుగులో తొలి దిన పత్రిక స్థాపించిన ఘనత శ్రీ శాస్త్రివారిదే! ("నా జీవితం" - కవిసార్వభౌముని ఆత్మకథ వ్యాసము ఆంధ్రజ్యోతి దినపత్రిక 30-12-60)

1899లో మదరాసునందు "కళావతి" వార్తాపత్రికను స్థాపించి, ఒక సంవత్సరము వెనుక దానిని రాజమహేంద్రవరమునకు మార్చి పదేండ్లు దానినవిచ్ఛిన్నముగ నిర్వహించిరి. ఆ వెనుక "వందేమాతరమ్" 'పక్ష' పత్రికను కొన్ని మాసములు, 'మానవసేవ' మాస పత్రికను మూడేండ్లును, "వజ్రాయుధము" మాస పత్రికను వ్యావహారిక భాషా నిరసనముకై నాలుగేండ్లును నిర్వహించిరి. 'కళావతి' మాస పత్రిక యందు తెనాలి వారి ఘటికాచల మాహాత్మ్యమును, కూచిమంచి జగ్గకవి సుభద్రాపరిణయమును, కపిలగోసంవాదమను వేదాంత గ్రంథమును ప్రకటించి పెక్కు విమర్శలు వెలయించి ఆంధ్రశారదకు ఇంతింతనరాని సేవ చేసిరి.

## భాషా వివాదములు :

శ్రీ శాస్త్రిగారనేక భాషాయుద్ధముల నారితేరిన మహామహులు.

వ్యావహారిక వాదమును వారు కాలమునకు నెదురీది అడ్డుకొనిరి. "వజ్రాయుధమును"ను చేపట్టి వ్యావహారిక భాషోద్యమము నెదుర్కొనిన పండిత పురందరులు. ఇది శాస్త్రిగారి నిర్భీకతకునిదర్శనము పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, మన శాస్త్రిగారికిని అభియోగములు జరిగినవి. అవి యెవ్వరికిని ననుకూలముగ దీర్పులు పొందలేక పోయినవి. కొల్లాపురము పండితులు శ్రీ వనం సీతారామశాస్త్రి గారికిని, శ్రీపాదవారికిని కొంత కాలము వాద వివాదములు జరిగినవి. చిలుకూరి వీరభద్రరావుగారు తమ్ము దూషించిరని శాస్త్రిగారు వారిపై నభియోగము దెచ్చిరి. వీరభద్రరావుగారికి రెండు వందల రూప్యములు జరిమానాపడి 'అప్పీలు'లోగూడ ఖాయమైనది. ఇక తమ శిష్యులగు చెళ్ళపిళ్ళవారితోకూడ శాస్త్రిగారికి తగాదా యేర్పడినది. అది యాగ్రహముగామారి వేంకటశాస్త్రిగారొక్కరే రచించిన బొబ్బిలి పట్టాభిషేకమును మన కవిగారు విమర్శించిరి. ఆ విమర్శనమంతయు "చెళ్ళపిళ్ళ చెర్లాటము" అనుపేర 5 భాగములుగ ప్రకటితమైనది. వేంకటశాస్త్రిగారు "జయంతి"ని ప్రచురించిరి. గురుశిష్యులిద్దఱకు నెడమొగము, పెడమొగము ఐనది. తుదినీ వివాదము శుభాంతముగ ముగిసినది.

## శాస్త్రిగారి స్వభావాదికము:

కౌశికస గోత్రులగుట శ్రీపాదవారికందఱకు ముంగోపము మిక్కుటమే. ఆ ప్రథమ కోపము శాస్త్రివారికి ఆజన్మసిద్ధమని తోచును. కాని వారి హృదయము దయార్ద్రము. వారిది భల్లూకపు పట్టు. దానికి విడుపు లేదు. "నిండుమనంబు నవ్య నవనీత సమానము" ఇత్యాది మాక్తి శాస్త్రిగారిపట్ల నక్షర సత్యము. వారి మాట కటువు. మనసు వెన్నకన్న మెత్తనైనది. "మాట చూచిన మామిడల్లమును, మనసు పటిక బెల్లమును; యువకవులను ప్రోత్సహించు

టలో వారెవ్వరికిని దీసిపోరు. వేద విద్యా విశారదులగుటచే వారు పరమ ఛాందసులుగ కన్పట్టెడివారు. చెళ్ళపిళ్ళ సుకవీంద్రుడు చెప్పినట్లు శ్రీపాదవారమాయకులు. లౌక్యమెరుగరు. వారికి కప టోక్తులు, కుతంత్రములు గిట్టవు. ఉన్నదున్నట్లు ఖండితముగ ముఖముపై చెప్పుటయే వీరి స్వభావము. పూర్వాచార పరాయణుల య్యును సమయోచితముగ ప్రవర్తించు నేర్పరులు. వీరికి జాతిమత ద్వేషము లేకోశమునను లేవు. స్త్రీ విద్య వీరికిష్టమేగాని యుద్యోగ ములు వారు నిర్వహింప నసమ్మతులు. వీరికి కాలము వ్యర్థము చేయుట గిట్టదు. ఎప్పుడును నేదియో వ్రాయుట, చదువుటలు వారికి పరిపాటి.

పండిత మూర్ధన్యులయ్యును నాడంబరము లెఱుగనివారు. వినయ ధురీణులు. అశేష మేధా సంపన్నులయ్యును నిగర్వులు. శాస్త్రిగారు మానధనులు. మాట పట్టింపు వచ్చినచో మిన్నకుండక దానిని తేల్చివైచు వఱకును నిద్దురపోవని పట్టుదల వారిది. చతు రంగ ఖేలనమున వీరత్యంత ప్రవీణులు. కళ్ళికోట రాజా సంస్థానము లోనివారి నోడించి శాలువ కానుకగా బడయుట, సజ్జపుస్వారీ యందారితేఱి, మాటవినక మొరాయించిన రేచర్ల జమీందారుల యశ్వమును లొంగదీసుకుని స్వారి చేయుటయు శాస్త్రిగారి అస హాయ శూరతకు, అద్వితీయ ధైర్య సాహసములకు దృష్టాంతములు. వారికున్న సునిర్దిష్ట భావములను వెలార్చుటలో వారు కొంకు కొసరు లెరుగనివారు.

శాస్త్రిగారి యాధ్యాత్మిక జీవన మాదర్శప్రాయమైనది. వారు మంత్రశాస్త్రమందు నిధులు. ప్రత్యహము సహస్రగాయత్రి నను ష్ఠించినవారు. షడక్షరీ మంత్రమును తమ పరమ గురువులగు నాగ లింగ శాస్త్రిగారి యొద్దనే యుపదేశమునొందిరి. ఒక వృద్ధ బ్రాహ్మ

ఋని వలన బాలా త్రిపుర సుందరి మంత్రోపదేశమునొంది మరణ పర్యంతము నియతముగ జపించిన యట్టివారు. కావుననే శాస్త్రి వారి చేతితో విభూతి, తీర్థము నొసగినచో గ్రహ పీడలు తొలగు ననియు, వారన్న మాట యథావిధిగ జరిగితీరెడిదనియు ప్రతీతి కలిగినది. వీరింత భక్తులు కావుననే ధర్మనిష్ఠకల విశిష్టములైన ఇతివృత్తముల నెన్నుకొని పెక్కు కబ్బములు గూర్చిరి. స్థల పురాణములను, మాహాత్మ్యములను వర్ణించుటలో వీరికి మక్కువ మిక్కుటము. మాటలు పెక్కులేల? శాస్త్రిగారుత్తమ శ్లోకులు. కారణజన్ములు. చరితార్థ జీవులు.

## నిర్యాణము - సంతాప సభలు :

కలము పట్టినది మొదలు నిరంతరముగా నెనుబదేండ్లు సాహిత్యసేవ చేసి శతద్వితయాధికముగ గ్రంథములు కల్పించి ఘన సమ్మానములందిన శాస్త్రులవారు సహస్రమాస జీవులై సుఖముండిరి. ఎప్పటివలెనె శాస్త్రివారికి ఆశ్వయుజ బహుళ షష్ఠి తిథిని రాజమహేంద్రవరమున 91వ జన్మదినోత్సవ మత్యంత వైభవముగ జరిగినది. అప్పటికే శాస్త్రులవారు అనారోగ్యముతో బాధపడుచుండిరి. అప్పటి రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన్‌సచార్ రాజమండ్రికి వచ్చి శాస్త్రిగారి గృహమునకేగి వారి యారోగ్యమును గురించి పరామర్శించిరి. కాని విధి బలీయముగదా! నూఱేండ్లు తప్పక జీవింతురను ఆంధ్రుల యాశల నడియాసలు చేసి శాస్త్రివారు 29-12-1960వ తేదీన ముక్కోటి ఏకాదశి తెల్లవారుజామున వైకుంఠము చేరిరి. ఆంధ్ర సాహిత్యాంబరమున నుజ్జ్వల కాంతులు వెదజల్లిన యొక తార రాలిపోయినది.

శాస్త్రిగారి నిర్యాణవార్తను పత్రికలన్నియు ప్రముఖముగా ప్రచురించినవి. వారిపై సంపాదకీయములు వెలయించి దుఃఖ సము

దృమున మునిగిన వారి కుటుంబమునకు సానుభూతి తెల్పినవి. సుప్రసిద్ధ సాహిత్య వేత్తలు తమ సంతాప సందేశములను కురియించిరి. యావదాంధ్రలోకము వారి మృతికిపరితపించినది. వారి భాషాసేవను అగ్గించినది. ప్రభుత్వము వారి భౌతిక కాయమునకు రాజ లాంఛనములతో నుత్తర క్రియలు జరిపించినది. ఆస్థానకవి మృతిపట్లయాంధ్రప్రభుత్వము సంతాపము 'గెజెట్' లో ప్రకటించి గౌరవించినది.

ఇక ప్రముఖ కవులు శాస్త్రిగారి సాహిత్య సేవలను వేనోళ్ళ కొండాడిరి. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు బెజవాడలో జరిగిన సంతాప సభలో—— శాస్త్రిగారి ప్రతిభ, యుపజ్ఞ యనన్య సామాన్యమైనది. ఏ భాషలోను ఏ కవి యిన్ని సాహిత్యరీతులలో కృషి చేసిన వారు, ఇంతగ బహుళ గ్రంథరచన సాగించినవారు లేరని నమోవాకము లర్పించిరి.

మహాకవి కాటూరివారు "పూరాంధ్ర మహాకవులందఱు కలసి చేసిన పనిని వారొక్కరే చేయగలిగారు... పూర్వ మహాకవుల కోవలో వారు చిట్ట చివరివారు. వారితో ఒక శకం అంతరించి పోయింది..." అని వాపోయారు.

కవి సమ్రాట్టులు శ్రీ విశ్వనాధవారు "శ్రీపాదవారు మహాపురుషుడు...శాస్త్రిగారు దేశానికి సంబంధించిన వ్యక్తి" అని కీర్తించిరి.

ఇక గిడుగు సీతాపతి, ఆంధ్ర విశారద తాపీ ధర్మారావు, త్రిపురనేని గోపీచంద్‌వంటి వ్యావహారిక వాదులుగూడ శాస్త్రిగారి మరణము తెలుగుజాతికి తీరని నష్టమను భావమును వ్యక్తము చేసిరి.

హైదరాబాదులోని శ్రీకృష్ణరాయాంధ్ర భాషానిలయమందు

జరిగిన సంతాప సభకు శ్రీ తాపీ ధర్మారావు గారధ్యక్షత వహించుట యొక విశేషము. శ్రీ ధర్మారావుగారు తమ ప్రసంగములో "శ్రీ శాస్త్రిగారు మహా విద్వాంసులు..." అని కొనియాడి"... ప్రచారం చేసే యనుచరులు లేని కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్యతిరేకులు సయితము అంగీకరించేటట్లు చేసిన విశిష్ట వ్యక్తి"అని మెచ్చుట గమనింపదగిన విషయము.

ప్రముఖాధునిక కవి శ్రీ బోయి భీమన్నగారు శ్రీ శాస్త్రిగారికి నివాళి పట్టుచు"... శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి యీ యుగానికి మహా రచయిత యనడానికి సందేహం లేదు. కొన్ని గ్రంథాలను వ్యాసుడు వ్రాసినాడా లేదా యనే మీమాంస యున్నది. 'నేనే యన్నీ వ్రాసినాను, వ్రాయగలను' అని నిరూపించడానికి వ్యాసుడే తిరిగి గోదావరి తీరాన రాజమహేంద్రవరములో కృష్ణమూర్తి శాస్త్రిగారి రూపమున నవతరించి యిన్ని గ్రంథాలు వ్రాశారని నా యభిప్రాయము. ...ఆ ధర్మసాహిత్యం జీవించి యున్నంతకాలమా యన సజీవుడే. ముందు ముందాయన పుస్తకాలపై రీసెర్చి చేసి పిహెచ్. డి డిగ్రీలను సంపాదించుకొనే రోజులు వస్తాయి" అని జోస్యము చెప్పిరి! (కీ॥శే॥ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి హైదరాబాదులో సంతాపసభ అను శీర్షిక. ఆంధ్రప్రభ దినపత్రిక 10-1-1961.)

నార్లవారు తమ 'ఆంధ్రజ్యోతి' సంపాదకీయములో తుదిని "...అంత నిండుగా దండిగా అఖండ సారస్వత జీవితం గడపి, పండి రాలిన మహా పండితుడుగాఆయన ఆంధ్రహృదయాలలో, ఆంధ్ర చరిత్రలో, ఆంధ్రవాఙ్మయంలో సుప్రతిష్ఠిడై కలకాలం నిలువ గలడు. ("అహోధన్యజీవి" - నార్లవారి సంపాదకీయం - ఆంధ్ర జ్యోతి దినపత్రిక 30-12-1960) అని శాస్త్రిగారి సంస్మృతికి నమో వాకములు సమర్పించిరి. నార్లవారి మాట నాణెముల మూట.

ఏతాదృశ విధముగ పెక్కండ్రి యాదరాభిమానములను జూఱలాడి, యెనుబది దశాబ్దులపాటెత్తిన కలము దించక యిన్నూఱు పై చిలుకు గ్రంథరాజములను గల్పించి అనేక సమ్మానములు గ్రహించి పెక్కు బిరుదులు దాల్చి, ఆంధ్ర శారదనక్షరరూపాన నర్చించి యశశ్శరీరులైన శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి సమగ్ర జీవితమును రచించుచో నదియొక మహాపురాణమగును.

## శాస్త్రిగారి శత జయంత్యుత్సవము :

మహా మహోపాధ్యాయులై, కవిసార్వభౌములై, కళాప్రపూర్ణులై, మణికిరీట ధారులై, గండ పెండేర భూషితులై, కనకాభిషిక్తులై, ప్రప్రథమాంధ్ర దిన పత్రికా సంపాదకులై, భారత భాగవత రామాయణాంధ్రీకర్తలై, ఆస్థాన కవులై ఆంధ్ర సాహిత్యమున కెనలేని సేవ లొనర్చిన శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారికి 29-10-1966 నాటికి శత వర్షములు నిండినవి. ఆ శతవార్షికమును పురస్కరించుకొని 'ఆంధ్రసాహిత్య అకాడమీ వారుత్సవము జరుపుట యాంధ్ర భారతీ సమారాధన మనదగియున్నది. శాస్త్రిగారి శత జయంత్యుత్సవము మహా వైభవముగ జరుపుటకై డాక్టరు తోలేటి కనకరాజుగారి యధ్యక్షతను ఒక సంఘము నియమించి రాజమహేంద్రవరమున మూడు దినములు ఉత్సవములు జరిపిరి. శ్రీ శాస్త్రిగారి సాహిత్య సేవలను, జీవిత విశేషములను గూర్చి శ్రీయుతులు పైడిపాటి సుబ్బరామశాస్త్రి, టి. అంజన్, విద్వత్కవి శేఖరులు వెంపరాలవారు, పి. యస్. ఆర్. అప్పారావుగార్లచే మహోపన్యాసముల నిప్పించిరి. ఆ యుపన్యాసములను 'సాహిత్యోపన్యాసములు' 7వ సంపుటిగ అకాడమీ ప్రచురించి తెలుగుల కృతజ్ఞతకు పాత్రమైనది.

ఇంతకుమున్ను శ్రీ శాస్త్రిగారి 89వ సంవత్సర జన్మదినోత్సవము 1954వ సంవత్సరమున రాజమహేంద్రవరమున మహావైభవముగ

జరుపబడినది. ఆసందర్భమున కొవ్వూరు పురవాస్తవ్యులు శ్రీ కోడూరి అప్పారావుగారు, శ్రీ పి. వి. కృష్ణయ్యగారును నాయుత్సవమునకు సమాగతులై అగ్రపీఠమలంకరించి పలువురతోపాటు చక్కగనుపన్యసించి శాస్త్రిగారి యుత్సవమునకు 500 రూప్యములు బహుమానమొసగిరి. ఆనాటి యుత్సవ సంచిక 'ఆయుర్వేద విశారద' బులుసు రామశాస్త్రిగారు, 'సంగీత సాహిత్య తత్పర' రంప శంకరశాస్త్రిగారల సంపాదకత్వమున రాజమహేంద్రవరము - మెజెస్టిక్ ముద్రాక్షరశాలయందు దీర్చబడి వెలువడినది.

శాస్త్రిగారి గ్రంథములను సమగ్రముగ పరిశోధించి వారి శక్తి సామర్థ్యములను, కవితా కౌశలమును ప్రజలకు చాటవలసిన యవసర మెంతేని యున్నది. వారొనర్చిన యపారసేవలకు నట్టి గుర్తింపు కలుగచేయుట సహృదయ విమర్శకుల కనీయః కర్తవ్యము.

శ్రీ శాస్త్రిగారి స్మృతి చిహ్నముగా వారికి మయూరభంజిలో లభించిన స్వర్ణపతకము, కవి గండపెండారము, తలపాగ, పట్టు శాలువ, కలము, సులోచనములు మొదలగునవి శాస్త్రిగారి జయంత్యుత్సవము నందు ఆంధ్ర విశ్వ కళాపరిషత్తునకు సమర్పింపబడినవి విశ్వకళా పరిషత్తు తరఫున ప్రొఫెసర్ శ్రీ కె. వి. ఆర్. నరసింహం గారు శాస్త్రిగారి దౌహిత్రులైన సత్యనారాయణమూర్తిగా రందజేయగా స్వీకరించిరి. వానిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తు గ్రంథాలయమున నేడును చూడనగును.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి తేషాం యశః కాయే జరా మరణజంభయమ్"॥
(భర్తృహరి సుభాషిత త్రిశతి - నీతి శతకము-విద్వత్పద్ధతి 20 శ్లో.)

—(౦)—

## శాస్త్రివారి గ్రంథములు - సంగ్రహ పరిచయము :

శ్రీ శాస్త్రివారపూర్వ కావ్య హిరణ్యగర్భులనుట జగద్విదితము. అట్టి మహా పురుషుడు తెలుగు సాహిత్యమునకు జేసిన సేవయు నం దాయన చేసిన కృషియు నద్భుతము, నపురూపము. అట్టి సాహిత్య కారుడు తెలుగుననేకాదు ప్రపంచమున నుద్భవిల్లిన యే సాహిత్య చరిత్రము నందును నభూతో నభవిష్యతి.

ఈ మహా పురుషుని చేత శిల్పీకరింపబడిన గ్రంథాకృతుల నింతకు మున్ను చరిత్ర కందినంత వరకును జూపి యున్నవాడను. ఇపుడు లభించిన వానిని కృతి భర్త్రాదికముగ శైలీ పరామర్శన మును జేయుచు నించుక విదిత మొనరుచుదును.

## 1. గౌతమీ మాహాత్మ్యము :- (1888)

ఇది యయిదాశ్వాసముల పద్య కావ్యము. ఇందనేకములైన నీతులు, ధర్మములు, స్తవములు లోనగునవి నిబద్ధింపబడి యున్నవి. ఈ రచనా సమయము నాటికి శాస్త్రివారు సంస్కృత సమాస భూయిష్ఠముగను, గఠిన పద గుంఫితముగను గ్రంథమును దీర్చవలెనను నభిప్రాయముగల వారుగ శైలిని బట్టి కానుపింతురు. ఇందనేకము లైన వర్ణనములు, కల్పనములు కలవు. ఈ కావ్యము 'పార్థివ' సంవత్సరమున బ్రారంభింపబడి 'సర్వధారి' సంవత్సరము వఱకును రచింపబడినట్లు తెలియుచున్నది. ఇందలి ప్రథమాశ్వాసము పందొమ్మిది వందల సంవత్సరమున ఎఫ్. ఎ. పరీక్షకు బాఠ్యముగ నిర్ణ యింపబడినది.

మ॥ గగనోర్వీభవమృగాంక సంఖ్య శకమాగన్ సర్వధార్యబ్దనుం
దగజా జానిపదార్చనారతుడు కృష్ణాభిఖ్యుడాంధ్రావన
వ్యగమద్రాజమహేంద్ర పట్టణ సమీపగ్రామ వాస్తవ్యుడా

భగణాబ్జార్కముగా వసుంధర దలిర్పంజేసె నీ గ్రంథమున్.

ఇందు కైలాస పర్వత వర్ణన మిటుల జేయబడినది.

చ॥ నగవున లేచి వెన్నెరులణంగగదువ్వుచు మందసంబునన్
దిగిగయిసేతకైనగల దెచ్చుచువల్వలమూలలంటిచ
క్కగ సవరించుచుండి కడకందనచాయల వెల్గుగానని
య్యగమున నాగెగాని జగదాద్యున కున్నిలవీండ్లులేవొకో.

అటనట యిట్టివి బహు స్వల్పముగ రచనా విషయముగ గోచరించును.

## 2. ఏకావళీ పరిణయము :- (1891)

దేవీ భాగవతమందలి యుత్తమ కథ యిది. ఆఱాశ్వాసముల పద్య కావ్యము. నైజాములోని 'మణికొండ'యను గ్రామమున జమీందారుడై యుండిన శ్రీ తవుటిరెడ్డి గోపాలరెడ్డిగారికి నిది కృతి యొసంగబడినది. శాస్త్రివారు తమ ఇరువది యైదవ వత్సరమున దీనిని రచించినారట. ఇందలి శైలి "గౌతమీ మాహాత్మ్య శైలి కంటె నీషన్మృదులమై తోచును.

చ॥ కటకట కన్నులందెఱచి కానగజాలని లేతకూన న
క్కటికమొకింతలేక బలు కాఱడవింబడవైచి పోయిరం
చటువిని నంతనుండి మనమాఱడి నొందెడు దల్లడిల్లెడుం
దటతటు గుండెకొట్టుకొను దారసిలున్ మెయికిం బ్రకంపమున్

## 3. వేంకటేశ్వరీయము :- (1898)

ఇది తిరుపతి మాహాత్మ్యమును దెలుపు పద్యకావ్యము. ఇందలి కల్పనయును బద్యములు నతిమనోహరములు. ఇది నిమ్మన జియ్యన్న గారను లక్షాధికారికి గృతి యీయబడినది.

క॥ కలికొాకడు నైదు వేలే
డుల యీడలరంగసప్పుడు వినిర్మించెన్
విల సత్కవిరాజాఖ్యుడు
కలావతీ పత్రికాధికారి కడంకన్.

ఉ॥ అమ్మకునమ్మ పాల్కడలి యందుదయించినముద్దుగొమ్మనె
త్తమ్ములనాడుకొమ్మ ప్రమదమ్మున మారునిగన్న యమ్మలో
కమ్ముల నెమ్మి నేల నిల కన్బడునయ్యలమేలు మంగతా
యమ్మ మెలంగుగాతమన యమ్మలనిమ్మనవారి యింటిలోన్.

పోతన్న "అమ్మలగన్న యమ్మముగ్గురమ్మల మూలపుటమ్మ" ఇత్యాది పద్యము నియ్యది తలపించుచున్నది.

## 4. కనకగిరి:- (1898)

ఇది యొక స్థల పురాణము. నానావిధములైన నీతులిందుకలవు. ఇది యప్పుడు మదరాసు ప్రెసిడెన్సీ కళాశాల యందు సంస్కృతమున నాచార్యులుగ నున్న శ్రీ యం. ఎ. శేషగిరిశాస్త్రిగారి కంకితమీయబడినది.

మ॥ పరగంజేసెను రాణ్మహేంద్రనగరీ వాసుండు శ్రీ వేంకటా
ధ్వరికిన్వేంకట సుబ్బసోమిదమకున్ బాలుండు శ్రీ గౌతమీ
చిరమాహాత్మ్యముఖ ప్రబంధకృతియౌ శ్రీపాద కృష్ణాఖ్యుడం
బర నేత్రేభమ్మృగాంకసంఖ్య శక మొప్పంబొల్చునప్డీకృతిన్.

## 5. ప్రద్యుమ్నోపాఖ్యానము :- (1906)

ఇది యుత్తమ కావ్య రత్నము. భాగవతాద్యనేక గ్రంథములను బరిశీలించిన బిదప విపులముగ రచింపబడినది. ఇందు నానావిధ వర్ణనలతిమనోహరముగ నొనరింపబడినవి. ఆఱాశ్వాసములిందున్నవి.

ఈ కావ్యమనినచో శ్రీ శాస్త్రివారికి మక్కువ మిక్కిలి యని వినికిడి. పందొమ్మిది వందల యేఱువ వత్సరమున నిది వెలసినది. యిది శ్రీ శాస్త్రివారిచే బ్రిటిషు గవర్నమెంటులో డి. కలెక్టరు పదవి నధిష్టించిన శ్రీ 'కౌరళ్ళ సుబ్బారాయుడు' గారికి నంకిత మీయబడినది.

క॥ భువినిధి దివి శుచి వరుసం
దవిలిన పఱాణాబ్దమందు ధరణీసురుడా
ర్యవిధిజ్ఞుడు కవి మిత్రుడు
కవిరాజాఖ్యుండు దీని గడకరచించెన్.

సీ॥ మిసిమి నిగ్గుల దేఱు మిగుల కమ్మనితుంట
విరులు చివురులల్లి విల్లుసేసి
జోగుల బిగువూడజుంజుమ్మనుచు మోగ్రిగి
తీరు తుమ్మెదలతో నారిజేసి
గమగమ వలపించి తమి గూర్చు పూవుల
జౌవంచములకులు సంతరించి
యలుగుపజలగుండె జలదరింపగ మీను
మొసళులు సిడమున బొసగనిలిపి

తే॥ పలికిన విరాళియిడు పసిపచ్చ ఱెక్క
పులుగు మిన్నను బాబాగ నలువు పఱచి
తలచుకొనునంతనే మేను బులకరింప
జేయ గలతేజులోగల్గ జేసె నపుడు.

మ॥ సకలాంభ్రంకష నారికేళ మహీరుడ్జాలాతి ధేయుల్విలో
లకమార్గశ్రమఖిన్నుడైకుతపకాలంబందునిచ్చల్ని జాం
తికముంజేరిన భాస్కరాతిథిని నెత్తింబూని యాతిథ్యమా
ప్రికటుస్వాదుఫలోదకంబొసగి పత్రిస్పర్శ సౌఖ్యంబిడున్.
యతిథి పూజ చక్కదనము రసజ్ఞుల నలరించును.

## 6. గజానన విజయము :- (1891)

ఇది రెండాశ్వాసముల పద్యకావ్యము. ఇదియును శాస్త్రిగారి కిరువది యైదు సంవత్సరములకు బూర్వమే రచింపబడినది. శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారి కిది కృతి యొనర్ప బడినది. ఇందలి పద్యము లన్నియును మిక్కిలి హృద్యములు.

సీ॥ దారులారా। పొలుతేటులారా। మీరు
గంగోత్తమాంగుని గాంచినారె?
పశువులారా। కీరశిశువులారా। మీరు
గిత్తవజీరు వీక్షించినారె?
గట్టులారా। పుట్టచెట్టులారా। మీరు
బూచుల యెకిమీని జూచినారె?
పాములారా। పెనుగాములారా। మీరు
వరభోగిభూషణు నరసినారె?

తే॥ మబ్బులారా। విసరుగాలి యుబ్బులార।
చుక్కలారా। పువుబోదల యిక్కలార।
వేల్పులారా। పవలురేయు దాల్పులార।
నామనోహరు దిలకించినారె మీరు?

## 7. విజయలక్ష్మీ విలాసము :-

దీనికే "విక్రమాభ్యుదయమ"నియు నామాంతరము. ఆఱుల్లాసముల గ్రంథము. జయపూరు సంస్థానాధీశ్వరు లగు "విక్రమదేవ వర్మ" మహారాజు చరిత్రము వింత కల్పనములతో నిందు దెలుప బడినది. పందొమ్మిది వందల ముప్పది మూడవ సంవత్సరమున నిది విరచితము.

మ॥ సెలయేళ్ళంగనుమల్ల వేగిరులలో జెన్నారు ఱాచాళ్ళపై
గలగల్లాడుచు హాళి పండులగతిన్ గన్పట్టి పార్శ్వీ ళ్లలన్

గళముల్ వంచిజలంబులానుమృగముల్ కందోయిపై దుంపురుల్
కలయంబడ్డదిదిర్చె డిన్ మొగములంగం జెకురంగేక్షణా।

## 8. భద్రాచల రామ చరిత్రము:-

కంచెర్ల గోపన్న భక్తిజీవిత వృత్తాంతము భక్తిభరితము. సరళమైన శైలి గలిగి యున్నది. హనుమకొండపుర వాస్తవ్యులు, న్యాయవాదులు, శ్రీమంతులు నగు శ్రీ తుంగతుర్తి నరసింహారావు గారికి సమర్పితమైనది.

ఉ॥ రామయటంచునాడు మరి రామయటంచునుబాడు నేడ్చినన్
రామయటంచు నేడ్చు రఘురామయటంచునగున్ భుజించినన్
రామయటంచు నోర్దెఱచు రామయటంచు వచించునెప్పుడున్
రాముడె సర్వరక్షకుడు రాముడె సర్వమునంచు నెంచుచున్.

ఇందలి గోపన్న రామభక్తి పూరిత హృదయము కడు సహజముగ సంతరింపబడినది.

## 9. నైషధీయ చరితము ;

'శృంగారతరంగిణి' యనియు దీనికి ద్వితీయాఖ్యము. నానావిధ మహోహర వర్ణనములిందు గూర్పబడినవి. శృంగార నైషధము ను బోలియుండును. నెల్లూరు తూములూరి వెంకట శివరామయ్య గారికిది యంకితమీయబడినది.

చ॥ తరుణవయస్కుడైన నృపతల్లజుదృష్టి విదర్భరాట్సుతా
వరపదమందు బొందువడిపైన నటుల్ స్పృశియించి మీదనం
బగనున బావిలో బడిక్రమంబున బంగరుమెట్లనెక్కి భూ
షనంబడి పదంబరయం జలియించి దద్దిశెన్.

గాచురాజభూషణుల ప్రభావము కానుపించును.

## 10. కావేరీ చరిత్రము ;- (1896)

ఇది చక్కని పద్య కావ్యము. కావేరీ వృత్తాంతమును మఱి కొన్ని గాథలును నిందు సంతరింపబడినవి. శాస్త్రివారు దీనిని దమ ముప్పదియవయేట రచించినారట. పసలపూడి గ్రామ వాస్తవ్యులైన శ్రీ వాడ్రేవు సుబ్బారాయుడుగారు దీనిని గృతి నందిరి. కృతి భర్త యీ కృతికర్తకు నప్పటి కాలమున యకరమునకు నాలుగు వేల రూప్యములు చేయు భూమి పండ్రెండు యకరములను సమర్పించె ననియు దెలియనగుచున్నది.

## 11. భోగసుందర సీతారామ చరిత్రము :-

ఇది తిరుమలాపురము వాస్తవ్యులు శ్రీ కనుపర్తి లక్ష్మీనరసింహముగారికి గృతి యీయబడినది.

సీ॥ కావి గుడ్డలవారు కనిపించినంతనే
వారిచే బూడిదలారజల్లి
గడ్డాలభైరవుల్ గలరన్న గొని తెచ్చి
వారిచే తీర్థములార బోసి
దయ్యాలవదలించు దాసరుల్ వినిపింప
వారిచే మంత్రము లారజేసి
బూదెపూతలవారు పొడకట్ట జనితెచ్చి
వారిచే దాయెత్తులారగట్టి

తే॥ దేవళంబుల చుట్టును దిప్పితిప్పి
గ్రామదేవతలకు బలుల్ గలుగజేసి
పట్టరానివారల కాళ్ల పట్టి పట్టి
విసివి వేసారి రవ్వారి విందు రెల్ల.

ఈరీతిగా సాంఘిక పరిస్థితులు, నమ్మకములు మొదలగునవి యిందు మిక్కిలి సాజముగ జూపబడును.

## 12. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ నిర్వచనైకాదశాక్షరి :

ఇది యచ్చ తెలుగు పద్య కావ్యము. ప, ఫ, బ, భ, మ, వ యను నోష్ఠ్యములును శ, ష, స, హ యను నూష్మములును లేక వచనములు లేనిదై, త,న, జ,డ,క,ర,గ,ల,ద,ట,య యను బదునొకండు మాత్రమగు నక్షరములు కలుగునట్లు విలాసార్థము రచింపబడిన గ్రంథమిది. శాకుంతలేతివృత్తము.

కII త, న, జ, డ, క, ర, గ, ల, ద, ట, యా
యను నైదాఱక్కరాల నతికియునిందే
దెనుగున నొక్క గరితకత
నొనరింతున్నిదు నండనూ కొని జే జే.

యని ప్రతినబూని శాస్త్రీవర్యులు గ్రంథము నామూలాగ్రముగ దిద్ది తీర్చిరి. దీనిని 'గౌతమీ మహాత్మ్యము'ను వ్రాసిన పరిసర కాలమున రచించియుందురని యూహ. ఇది బ్రిటిషు ప్రభుత్వములో మదరాసు రాజధానియందు గొంతకాలము గవర్నరు పదవినధిష్టించి ప్రఖ్యాతిగాంచిన జస్టిస్ కె. వి. రెడ్డినాయుడుగారి కంకితము. ఇది యన్నినియమములతో నున్నను మిశ్రకావ్యమువలె నుండును. శైలి యిటులుండును.

కII కొంతనకంతటిలో దా
నంతయు దనలోన నిండనంతయు దానై
యంతకు నంతయ నింతకు
నింతయునై నెగడు నట్టి యేలిక దలతున్.

## 13. యాజ్ఞవల్క్య చరిత్రము :

ఇది యయిదాశ్వాసముల ప్రబంధము. జయపురము మహారాజావారి కంకితమొనర్పబడినది. సంస్కృత పదభూయిష్ఠమై శైలి నాతి మృదులమై యుండును.

సీ॥ బ్రహ్మరాతి సతాయ బ్రహ్మతత్త్వజ్ఞాయ
దివ్య స్వరూపాయ తే నమోస్తు
నిత్యాయ సత్యాయ నిర్వికల్పాయని
త్యానందమూర్తయే తే నమోస్తు
యోగిరాడధిపాయ యోగేశ్వరాయజ్ఞా
నానందసాంద్రాయ తే నమోస్తు
భక్తావనేష్టాయ భానుకోటి సహస్ర
దీప్తాయ గోప్త్రాయతే నమోస్తు.

తే॥ సచ్చిదానంద రూపాయ సర్వలోక
సంస్తుతాయ మహాదేవ సన్నిభాయ
వేదవేదాంగ వేద్యాయ విశ్రుతాయ
తే నమోస్తు నమోస్తుతే తే నమోస్తు.

## 14. బ్రహ్మానందము:

అమృతానంద మనియు దీనినందురు. అచ్చ తెలుగు పద్య ప్రబంధమిది. మూడాశ్వాసములను గలిగి యున్నది. అతి మృదుల శైలి మితముగా దోచును. ఇందపూర్వవర్ణనాంశము లనేకములు పొడ గట్టును. ఇది పిఠాపురము మహారాజా శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారి కంకితమీయబడినది.

తే॥ కోడెకాండ్రమదులు పట్ట గోరిమరుడు
పన్నియుంచిన వలసుమీ కన్నె కురులు
గాన బెళుకు బేడిసలననైన కన్ను
లగునుగాబోలు జానుగులాగలంటు.

## 15. మధుకర విజయము:

ఇది 'కళాపూర్ణోదయము'ను బోలిన కేవల కల్పితేతివృత్తము గల కావ్యము. అయిదాశ్వాసములున్నవి. పంహొమ్మిదివందల నలు

వది నాలుగులో రచితము. కళాపూర్ణోదయము నందువలె నారదాది సంబంధిత నామములైనను నిందు గానరావు. కళాపూర్ణోదయము కేవల కల్పిత కథయని స్పష్టమగును. కాని యిది పూర్వ మెప్పుడో జరిగియుండునని చదువరులకు దోపించును. కల్పనాధికము సహజముగ నుండును. చమత్కారములు హాయిగొల్పును.

చ॥ మన మధురాశ్రమంబున సుమంబొక డొక్కలతామతల్లికిన్
జననమునొంది కాలగతి జక్కదనంబును సౌరభంబునున్
గననయియుండె దాని పయి గోరిక జేసి మధువ్రతంబొకం
డనిశము తన్మరందమును నానదలంచెను మాధవాదృతిన్.

ఇటు మధురాశ్రమమున మధురాపురమనియు, సుమమును మాలతి యనియు, మధువ్రతమనగా కథానాయకుడైన మధుకరుడనియు సూపింపబడి "మాల మాణవము"ను స్ఫురింప జేయబడుచున్నది. ఈ విధముగ మిక్కిలి రసవంతముగ నిది రచింపబడినది.

## 16. సత్యనారాయణోపాఖ్యానము :

ఇది వ్రత కథననుసరించి వ్రాయబడిన చిన్న పద్యకావ్యము. చిత్రభాను సంవత్సరాంతమున వ్రాయబడినది. సులభశైలిని గలిగి యుండును.

ఉ॥ అక్కట విత్తహాని యగునంచు దలంచియమంచి యన్నముల్
మెక్కక నీరసాన్నములె మెక్కుచునుప్పును లేని గంజికిం
దక్కినవాని ద్రావుచు నెదంగడు డస్సియపోవుసేయునీ
మిక్కిలి రొక్కమెల్ల నిటుమిన్నక పోయెనికేమి సేయుదున్.

## 17. సావిత్రీ చరిత్రము :

ఇది 'స్వభాను' నామ సంవత్సరమున విరచింపబడినట్లు

తెలియుచున్నది. శాస్త్రివారికి సావిత్రియందుగల భక్తియే యీ గ్రంథ నిర్మితికి హేతువు. మూడాశ్వాసములు కలవు.

పంచ॥ 'సదామదిందలంతు గాన సత్యవంతుట్టియా
పదాస్పదుండునైన నాకు వానితాడిలోకమౌ
గదా! ముదంబుతోడ నన్ను కాయమంటుదాననే
పదా పదా! మఱొండుమాటపల్క బాడిగాదుగా.

## 18. భీమశంకర విజయము :

ఇది నాలుగాశ్వాసముల ప్రబంధము. శ్రీనాథకృత భీమేశ్వర పురాణమును బురుడించుచున్నదని పెద్దలసుద్ది. గుల్బర్గాలోనుండెడి శ్రీ చావలి నరసింహ శాస్త్రిగారి కంకిత మీయబడినది.

## 19. భగవద్విలాసము :

ఇది మూడాశ్వాసముల ప్రబంధము, త్రిమూర్తులలో శివ ప్రభావమధికతర వర్ణితము. నైజాములో కలెక్టరుగ నుండిన శ్రీ శ్యామాపంతుల వేంకటేశ్వరరావు పంతులుగారికి గృతియీయ బడినది.

చ॥ కలన సమస్తదేవతలగన్నె దలించెడునంత లోననే
గెలచితి ముజ్జగంబుల బ్రకీర్తినిగైకొని యేలినాడ బు
త్త్రిలగనినాడ వైభవముతో దులతూగితి నీకటాక్షముం
గలుగుతపంబొనర్చి నినుగట్టితినెందు గొఱంతనాకికన్.

## 20. అమృతరాజీయము :

ఇదియొక కల్పిత వృత్తాంతము. దీనిని మహారాష్ట్రమున హరి కథగ జెప్పుచుందురు. ఇందు రామకథ కొంతయు, కృష్ణ కథ

కొంతయు వర్ణింపబడినది. సత్యభామ పరాభవాదికము, రుక్మిణీ శ్రీకృష్ణులు సీతారాములుగ హనుమానునకు దర్శనమొసంగుట మొదలుగాగల వృత్తాంతము.

చ॥ మునుముని పారిజాతసుమముందమితో మురవైరికీయనా
ఘనకబరీభరంబునను గనట్టెతండదిగాదె దుఃఖమున్
గొనకొనజేసె నీకపుడు గొల్లుననేడిచి గెల్చితీవు గొ
బ్బున నిపుడుం బ్రతికిక్రియకు బూనగ రాదె విచారమేటికిన్.

శాస్త్రివారిందు సత్యభామ 'గొల్లున' నేడిచినట్లు చెప్పుట గమనింపదగినది.

## 21. వేదాద్రిమాహాత్మ్యము :-

గొప్పస్థలపురాణము. ముక్త్యాల రాజా శివాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దూరు వారి కంకిత మీయబడినది.

కృష్ణామండలమందు నందిగామ సీమలో విఖ్యాతి చెందియున్న వేదాద్రియందు వెలసిన శ్రీ నరసింహస్వామి వారి మాహాత్మ్యము వర్ణితము. అయిదాశ్వాసముల పద్యకావ్యము.

చ॥ కలగడు వెచ్చనూర్చడు వికారమునొందడు బీతుజెందడె
వ్వలననుగంటు నీర్విడడు వాఅడు చేరడు తండ్రిచెంతకే
యలమటయుం గొనండెడదహా పరమేశ్వర। హా రమేశ। హా
సలలితమూర్తి। హా సుగుణసాగర యంచువచించు నెంతయున్.

మ॥ ఋతువాహీభ శశాంకసంఖ్యను శకంబింపొంద నానందమం
దితహాసంబులతోడ వేదమహిభృ ద్వృత్తాంతముంగూర్చియుం
చిత రీతిన్ రచియించె దీని గవిరాట్ శ్రీపాదకృష్ణుండు సం
తతమున్ నీదు కృపారసంబునకు బాత్రంబై జగద్వల్లభా।

## 22. న్యాయపతి :-

ఇది న్యాయపతి సుబ్మారావు బి.యే.బి.యల్. గారి చరిత్రము.

## 23. వేంకటనృసింహరాయ చరిత్రము :-

ఇది నాలుగాశ్వాసములు గలిగి యున్నది. చింతలపూడికి సమీపముననున్న 'రేచర్ల'లో జమీందారుగానున్న శ్రీ రాజా వెంకట నృసింహారావు బహద్దరు వారి చరిత్రము. వారికే కృతియు నీయబడినది.

## 24. ఆనందోదయము :-

ఇది మూడాశ్వాసములు గలిగిన యచ్చ తెలుగు కృతి. శాస్త్రి వారి యచ్చతెలుగు మిశ్రకావ్యరీతితో నుండును గాని క్లిష్టముగా నుండదు.

క॥ మాటల నాడిన వడువున
దేట తెలుంగునను గైత తేలికదారిం
బాటించి కబ్బమల్లెద
దాటాదూటుములు వచ్చు తటి నవ్వకుడీ.

యని వినయ ప్రతిజ్ఞ యొనరించి తెలుగు పలుకులతో నీ కావ్య రచన చేసినారు.

చ॥ లలనొకసారిగాంచి మరలన్ మొననుండియు గాంచునిచ్చలో
గలుగగ జేయునట్లదరికాచిన యంతనతేట తెల్లమై
తెలిసెడునట్లు కబ్బమును దేలిక దారని తేట తెల్గునం
బలికెను గృష్ణమూర్తి కవి వాసిగ దుర్ముఖికార్తికంబునన్.

చ॥ తలకకుమమ్ము రేల్చెలు మదాయనుగెల్చిన వానిచుట్టలన్
మెలపితిమంటి కాల్చి మనమీరను దొల్లిటి బాముసందుమా

తలబడి నారటుంచడుగు దమ్ములనంగని మ్రొక్కవచ్చునో
వెలయగ దేంట్లనందగియె పిప్పి యీ సకిసోగ పెన్నెరుల్.

## 25. గణేశపురాణము :-

ఇది వ్యాస కృతోపపురాణములలో ద్వితీయము. శ్రీ రాజా కాండేగ్రిగుల జగన్నాథరావు బహద్దరువారి కంకితమీయబడినది. అముద్రితము.

## 26. ఆంధ్రాభ్యుదయము :-

ఇందాంధ్రదేశమునగల క్షేత్రములు, తీర్థములు, గొప్పవారు, పండితులు, కవులు లోనగు వారి చరిత్రయుదెలుపు గొప్ప గ్రంథము. ఇది యాంధ్రదేశ మహాత్మ్యమును దెలుపును.

## 27. కాళిదాస విలాసము :-

తెనాలి రామకృష్ణ చరిత్రము, జగన్నాథ మాహాత్మ్యము, ఈ మూడును వచన ప్రబంధములు. వారి 'కలావతి పత్రికయందు బ్రచురింపబడినవి.

## 28. విమర్శ గ్రంథములు :-

ఆంధ్రవేణీ సంహార విమర్శనము, ఆంధ్ర విక్రమోర్వశీయ విమర్శనము, ప్రసన్న యాదవ నాటక విమర్శనము, ఆంధ్ర శాకుంతల నాటక విమర్శనము, కురుపాండవదాయ భాగ విమర్శనము, విజయవిలాసకృతి విమర్శనము, ఆంధ్ర మేఘసందేశ విమర్శనము, నన్నభట్టారక చారిత్రిక విమర్శనము, ఆంధ్ర భాషానుశాసన విమర్శనము మొదలగునవన్నియు నాయా గ్రంథములను విమర్శించి వ్రాయబడిన వచన రూపక గ్రంథములు. కలావతీ

పత్రికా ప్రకటితములు. కాలనిర్ణయము నిదమిత్థముగ నిర్ణయింప నాధారములు మృగ్యములు.

## 29. గౌరాంగ చరిత్రము:-

ఇయ్యది వంగదేశమునందు మున్ను ప్రసిద్ధిగాంచిన 'నిమి, యను గౌరాంగుని విశిష్ట చరిత్రము చెప్పబడిన వచన కావ్యము. 'మానవసేవ' పత్రిక యందు ముద్రితమైనదనియు దెలియుచున్నది.

## 30. మంగళగిరి మాహాత్మ్యము :-

ఇది మంగళగిరి స్థలపురాణము. గుంటూరు వినపాముల లక్ష్మీ నరసింహముగారి కంకితము.

## 31. చాణక్య శతకము :-

చాణక్యుడు లోనగువారు చెప్పిననీతులు, భారతాదులలోని నీతులు సంగ్రహించి వ్రాసిన చిన్న గ్రంథము. కాలనిర్ణయమున కాధారములు మృగ్యము.

## 32. ఐరోపా మహా సంగ్రామము :-

హిట్లరు చేసిన ద్వితీయైరోపా మహా సంగ్రామమంతయు బ్రతి దినమునను బత్రికలు చదివి ప్రతి దిన చర్యగా బెద్ద పుస్తకము రచించి దాని నెంతయో భద్రముగా నుండునట్లు దాచి యుంచినారు. అముద్రితము.

## 33. జగద్గురు శంకరాచార్య చరిత్రము :-

ఇది శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారి కంకితము. ఇందు బరకాయ ప్రవేశము లోనగు నశ్లీలములు తొలగింపబడినవి.

## 34. మరుత్తరాట్చరిత్రము :-

ఇది యొక శ్రీమంతున కంకితముగా వ్రాయబడినటుల దెలియు చున్నది. ముద్రితము. కృతి మహోత్సవము కాలేదు. ఈ చరిత్రమును బూర్వము శ్రీనాథుడురచించినట్లు తెలియుచున్నది కాని యది యలభ్యము. బూర్గుల రామకృష్ణారావుగారి కంకిత మని వినికిడి.

## 35. సానంద సాయుజ్యము :-

ఇది యొంగోలు పురవాస్తవ్యులగు చిలకపాటి అనంత కృష్ణ మాచార్యులుగారికి గృతియొసంగబడినది. కల్పితేతివృత్తము గలది.

## 36. మాయావతి నాటకము :-

ఇందు రతీదేవి మాయావతియై శంబరు నింట సూదాధికారి ణియై మత్స్యమున లభించిన ప్రద్యుమ్నుని బెంచి బెద్దవానిజేసి వానిచే శంబరుని జంపించి యతని బెండ్లియాడిన కథ చిత్రముగ వర్ణితమైనది. మాయావతి తన స్థితికి వగచుచున్న సందర్భము.

చ॥ మనకిటు రాక్షసాధముని మందిరమందు మునీంద్రులంతవా
రిని చెగగోసి వంట బొనరించుచు నూడిగ ముండుమంచున
వ్వనజభవుండు నెన్నొసట వ్రాసెను దానికి జింతచేసినం
గనబడునే ఫలంబిపుడు కాగలదంతయు గాక యుండగన్.

## 37. సావిత్రి నాటకము:-

మహా పతివ్రతయగు సావిత్రి చరిత్ర మీ నాటకమందు వర్ణింపబడినది. జగన్మాతస్తుతి సందర్భము.

మ॥ భువనంబుల్ భువనాధినాథులును శంభుల్ విష్ణులున్ బ్రహ్మలున్
సవనాశుల్ సవనేశులున్ నరకముల్ స్వర్గంబులుంగోలె స

ద్వ విశేషంబుల వేదవిద్యలెకదా, వాకు్రిచ్చు నాయన్ని నీ
కవు రూపంబులు నీవు గాకెదియు లేదమ్మా త్రిలోకేశ్వరీ.

## 38. భారతసార నాటకము :-

భారత ముఖ్య కథయంతయు వచ్చు నట్లొక నాటకము వ్రాయవలయునని కవి సంకల్పించి యిది ప్రారంభించి యసంపూర్తిగ విరమించినారు. అందు మొదటి పద్యమిది.

శా॥ శ్రీవాక్పార్వతులన్ భుజాంతర ముఖక్షేత్రంబులన్ దాల్చియే
రేవేళన్ వహియింతురో జగములీరేడింటి స్త్రీపుంసయో
గావిర్భూత శుభస్థితిన్ విధువిధీశాఖ్యుల్ త్రివేదాత్మలా
దేవాధీశులు ముప్వురున్ సుఖమునస్ దేలింత్రు మిమ్మెప్పుడున్.

ఇది నన్నయగారి ప్రారంభ ప్రార్థనాశ్లోకమైన 'శ్రీ వాణీగిరిజాశ్చిరాయ దధతో....." ఇత్యాదిదానికి ననువాదమే. ఇది ప్రారంభించు నప్పటికి మూలభారతమును పరిశీలించినట్లు తోచదు. నన్నయ్యగారి భారతమును బరిశీలించియే వ్రాయ ప్రారంభించినట్లు తెలియు చున్నది. ఉదంకుడు పైల శిష్యుడని నన్నయ్యగారి భారతానువాదమునందే యున్నది. పిదప వ్రాసిన శ్రీకృష్ణభారతమున శాస్త్రివారు మూలానుసారము వేదుడనియే వ్రాసి యుండుట గమనింపదగి యున్నది.

## 39. వీరరుద్ర విజయనాటకము :-

ఇందు గాకతీయ చక్రవర్తులలో బ్రసిద్ధుడైన ప్రతాపరుద్రుని చరిత్ర మంతయు పూర్తిగ వివరింపబడినది. ఇది యయిదంకముల మహానాటకము. భక్తి సూచకములైన పద్యములు కొన్ని యిందు గాననగును.

మ॥ జడబుద్ధీ పరికృతం బెటింగియును రాజద్రోహివై మోసులె
త్తెడుసంతోషము నాగనిట్లునత మార్తింబల్కుదే? దిష్టవుం
బడి మాటేడిపుడ స్వతంత్రుడయినన్ స్వస్థాన శక్తింగడున్
గడుదీవించుటకయ్యు ప్రాణములిడంగా నుండ సందేహమా.

## 40. స్వరాజ్యోదయ నాటకము :-

1. ఇది నామమాత్రావశిష్టముగావింప బడినదని వ్రాయుటకు నా కలము సంచలించుచున్న యది' యని అనంత పంతుల రామలింగ స్వామిగారును, 2. 'స్వరాజ్యోదయమును శ్రీ అవసరాల రామారావు గారికి అంకితమిచ్చినట్లు శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారును బలికినారు. భావి పరిశోధకులు తేల్చవలసిన విషయము.

## 41. బొబ్బిలియుద్ధ నాటకము :-

ఇది పందొమ్మిదివందల యెనిమిదవ సంవత్సరమున రచింప బడినది. ఇది యేడంకముల వీర రస ప్రధాన నాటకము. సర్వదేశ వ్యాపకమై రంగస్థలముల బ్రదర్శింపబడి విశేష ప్రఖ్యాతిగాంచినది. ఇది శాస్త్రివారి కుమారుడైన కీ॥ శే॥ సుదర్శననిధి కంకితమీయబడినది.

మ॥ కడుపానీయది ఖండవల్లిమడుగా గండ్రాలనుం గంటివా
కొడుకుల్ లేరు రనీకురా కొమరునిం గోయింపగానెంతువా
జడబుద్ధీ! పరమాపకారివగు నింజర్చింపకా వంతయున్
గడిమిన్నె నిదె కండలుగనీ కాయంబు ఖండింపనే.

## 42. వేణీసంహారము (నాటకము) :-

ఇది పందొమ్మిదివందల యైదాఱులలో రచితము. భట్టనారాయణ కృత వేణీసంహారమునకిది సరియైన తెలుగు. మూల నాటక

ప్రథమ శ్లోకమును శాస్త్రివారి తెలుగు నాటక ప్రథమ పద్యమును గమనింపుడు.

శ్లో॥ నిపీడై రప్యే భిర్లలిత మకరందో మధుకరైః
కరై రిందోరంతశ్చురిత ఇవ సంభిన్న ముకులః
విధత్తాం సిద్ధిన్నో నయనసుభగామస్య వచనః
ప్రకీర్ణః పుష్పాణాం హరిచరణయో రంజలిరియం.

ఉ॥ మానక త్రోయుచుండినను మత్తిలుషట్పదముల్ గలంచువూ
దేనియలోన వెన్నెలలు దీరుచునట్లయి విచ్చు మొగ్గకై
మానిలయాంఘ్రు లందిడు సుమంబులదోయిలి పూజ్యులీ సభా
సీనుల కన్నుపండువగు సిద్ధిని మాకు నొనర్చుగావుతన్.

## 43. కలాభాషిణీ నాటకము:-

ఇది పందొమ్మిదివందల రెండవసంవత్సరమున రచింపబడినది. పింగళి సూరన్న కళాపూర్ణోదయములోని మొదటి నాల్గాశ్వాసముల లోని కథననుసరించి యేడంకముల నాటకముగా రచియింపబడినది. పాత్రోచిత భాష ప్రయుక్తమయినది. సమయోచిత వృత్తములు నూత్నములైన వానిని స్వీకరించి రాగతాళములను నిర్దేశించిరి. వారు గ్రహించిన వృత్తములలో గొన్ని - త్రిభంగి, సుగంధి, మధుర, మంజుళ, కళ్యాణి, బంధుర, అలస, మనోహర, శతపత్రి, సదాగతి, సుప్రభ, మల్లిక, సుముఖి, కలావతి, వల్లి, వసంత, కమల మొదలగు నవి. కళాపూర్ణోదయ కథకును నీ నాటక కథకును చాల వ్యత్యాసము కలదు. శృంగార రస ప్రధానముగ మనోహరముగ గథను నడిపించిరి. ఇది 1909వ సంవత్సరమున బి. ఏ. పరీక్షకు బాహ్య గ్రంథముగ నుంచబడినది. మూలమైన పింగళి కళాపూర్ణోదయ పద్యములతో నిందలివి తూగ జాలియున్నవి.

మ॥ తమిబూదిగెల దూగుటుయ్యెలలబంతాలాడుచుందూగునా
కొమరుంబాఁయపుగబ్బిగుబ్బెతలయంఘుఁల్చక్కగాజాగిమిం
టిమొగంబైచనుదెంచుతీవిగను గొంతేదివ్యమౌనీందఁ। నా
కమ్మగినేత్రలమీదగయ్యమునకుంగాల్దాచులాగొప్పెడిన్.

మ॥ అలరుందీవలనెక్కి యుయ్యెలలసయ్యాటంబుగానొండొరుల్
గెలువన్ బందెములొడ్డిపాఁయపు దమిన్ గ్రీడించుచుందూగునీ
యలరుంగొమ్మలకాళ్ళసాగు దివిమోమైచూడముల్లోక కాం
తలపై గయ్యపు గాలు ద్రవ్వునటులెన్నంజెల్లుమౌనీశ్వరా!

మఱి యొక్కటి.

మ॥ గురువుల్ దిట్టిన దిట్టునీ వినినలోకుల్ నవ్వినన్ నవ్వనీ
చిరకాలార్జితభూరి వైభవతపశ్శీఁవోయినన్ బోవనీ
వరముందప్పిన దప్పనీ తెలివి తేవల్ మాసినన్ మాయనీ
తరుణీరత్నము దీనినింగవయకే దాళంగలేనింతయున్.

## 44. రాజభక్తి నాటకము :-

ఇది యయిదవ జార్జి చక్రవర్తి పట్టాభిషేకోత్సవ సందర్భముగ బందొమ్మిది వందల పదునొకండవ సంవత్సరమున డిసెంబరు పండ్రెండవ **తేదీన** బ్రకటింపబడినది.

మ॥ సగుణుండయ్యును నిర్గుణుండయిమహాస్వత్వంబు విశ్వంబునం
దుగడుంగల్గిస్వతంత్రుడయ్యు బరతంత్రుండైమహత్త్వయ్యునిం
తగనై యెల్లెడనిండి పూర్ణుడగుచుందా నుండి లేనట్లయై
తగుసర్వేశ్వరుడీప్సితార్థములు సంధానించిమిమ్మేలుతన్.

## మనోహర నాటకము :-

షేక్స్పియర్ మహాకవి విరచితమైన 'ట్వెల్ఫ్త్‌నైట్' కను

సరణము. పందొమ్మిది వందల పదునాల్గున నీది వ్రాయబడినది. అయిదంకములు కలవు. శృంగార రస ప్రధానము. మోహిని యను రాజపుత్రి సముద్రమున బడియు బ్రదికి మనోహరుడనుదన ప్రియు నింబరిణయమగుటు యితివృత్తము. మనోహరముగ వర్ణింపబడినది.

## 46. వీరసేన విజయ నాటకము:-

ఇదియును షేక్స్పియరుచే రచింపబడిన 'పెరికిల్స్. ప్రిన్స్ ఆఫ్ టైర్' అను నాంగ్ల నాటకమున కనుసరణము లేదా ఛాయా మాత్రానువాదము. శాస్త్రివారు దీనిని బందొమ్మిది వందల పదునొకండవ సంవత్సరమున వ్రాసినను బందొమ్మిది వందల నలువది యెనిమిదవ సంవత్సరమున ముద్రణ కావింపబడినది.

మూలమునందువలె నాయకుని పేరుతోడనే యీ నాటకము రచింపబడినను బేర్లలోను సంభాషణాదికము నందును మార్పొనర్చి దేశీయతా ముద్రను హత్తించినారు.

### పేర్లలో మార్పులు:

| | | |
|---|---|---|
| పెరికిల్స్ | – | వీరసేనుడు |
| సిమోసైడ్స్ | – | శ్రీమంతుడు |
| థైజా | – | లీలావతి |
| మెరీనా | – | సరస్వతి |
| పెంటోపోలిస్ | – | విద్యానగరము |
| టైర్ | – | విజయ హాటిక |

ఇందు గతించినదని సముద్రమున బారవేయబడిన వీరసేనుని భార్య బ్రదికి మఱియొకచోట నుండుటయు, నా వెనుక వారి సమాగమంబును నత్యద్భుతముగ నుండును.

## 47. సుందోపసుంద నాటకము :-

ఇందు సుందోపసుందులను రాక్షస సోదరులు బహు ప్రేమా స్పదులై యుండి యొకానొక దేవకన్య వలన వంచితులై యొండొరులు పోరి యసువులు బాసిన కథ. వింతగా చమత్కరించి వ్రాయ బడినది. ఇది యముద్రితము.

## 48. భోజరాజ విజయము :-

ఇది యాఱంకముల నాటకము. ధారానగరము రాజధానిగా గలిగి గౌడదేశాధిపతి యయిన భోజరాజు బాల్యచరిత్రమును బట్టాభి షేకమును వర్ణించును. పందొమ్మిది వందల యిరువది యొకటవ వత్సరమున వ్రాయబడినది.

సీ॥ పినతండ్రి శాసనంబున దివి కేగెద
నమ్మ నాకై శోకమందకమ్మ
ముంజభూపతి యంపబోవుచుంటిని గురు
వరనాకుగా నీవు వగవకయ్య
రారాజు పంపున ధారుణి వేడెద
నన్న దియంత నన్నాగకయ్య
మనుజేంద్రునాజ్ఞ గైకొనిపోయెదను బుద్ధి
సాగర నీప్రేమ వీగవయ్య

తే॥ గురువు వలె నన్ను భక్తితో గూర్మితోడ
ననుసరించు నా సహపాఠులార। మిత్రు
లార। మిమ్మెడ బాసి నే నరుగుచుంటి
గరుణ విడనాడి నన్నింక మరువుడయ్య.

## 49. శ్రీరామ కుమార విజయ నాటకము :-

ఉత్తర రామ చరిత మితివృత్తము. శ్రీరాముడు కుశలవులతో

జానకింగొంపోయి సాకేతమున సుఖంబుండుట మనోహరముగా వ్రాయబడినది. వారి శ్రీకృష్ణ రామాయణమున గూడ నిటులే యున్నది. కాని సీతా భూ ప్రవేశము కానరాదు.

చ॥ ఖలుడగు పంక్తి కంధరుడు కన్గనజాలకనన్నుగొంచుచో
దెలిసియతండు శౌర్యమున దిక్కులు పిక్కటిలంగ నార్చుచున్
గలనొనరించి రావణుని గండడగించియు మించి నాకుగా
నలనిటు త్రెళ్ళనయ్యెనయొ యేమని చెప్పుదు దైవ నిర్మితిన్.

## 50. తిలక మహారాజు నాటకము :-

ఇది పందొమ్మిది వందల యిరువది యొకటవ వత్సరమున బ్రణీతము. ఇందు బాలగంగాధరతిలక్ జీవితమంతయు బ్రదర్శనోపయోగ్యముగగూర్చి రచింపబడినది. ఈ పుస్తకము ప్రథమ ముద్రణములో శాస్త్రి వర్యులకు మూడువేల రూప్యములు క్రయధనము వచ్చినదట. అప్పటికాలమున నది యెంతయో యెక్కువ.

## 51. గాంధీ విజయధ్వజ నాటకము :-

ఇదియును పందొమ్మిది వందల యిరువది యొకటవ సంవత్సరముననే వ్రాయబడినది. మహాత్ముడు దక్షిణాఫ్రికాలో నడిపిన యుద్యమములతో కథ ప్రారంభమై పందొమ్మిది వందల యిరువది డిశెంబరులో జరిగిన నాగపూరు కాంగ్రెసు మహా సభా విశేషములతో సమాప్తమగును. ఇందు మహాత్ముడు మహాత్ముడుగను నవతారపురుషుడుగను జిత్రీకరింపబడినాడు. అందు కనుగుణముగ సన్నివేశాది కల్పనము చేయబడినది. కేవలము పండిత కవులై రాజకీయములకు సుదూరముగ నుండెడి కృష్ణమూర్తిశాస్త్రిగారు కడు సాహసులై యానాడిట్టి రచనమును జక్కగ దీర్చి దిద్దుట యద్భుతావహమే.

## 52. మహా భారత యుద్ధ నాటకము :-

ఇది పందొమ్మిది వందల యాఱునేడు సంవత్సరముల రచింపబడినది. ఆఱంకముల మహా నాటకమిది. భారతగాథ యిందు సంక్షిప్తముగ గానవచ్చును.

ఉ॥ స్వార్థపరుండువోలెనయి సాహసవృత్తివహించి మిమ్మయో
వ్యర్థము గాగబోవనెటులంపగ నేరుతునయ్య। సర్వలో
కార్థ శరీర। నీవు మన కక్షులు తమ్ములు నాకు నిట్టిమి
మ్మర్థమునందు నాసమెయినక్కటవీడి మెలంగనేర్తునే.

## 53. శ్రీనాథ కవి రాజీయము:-

ఈ నాటకము పందొమ్మిది వందల యిరువది యేడవ వత్సరమున రచియింపబడినది. ప్రఖ్యాత సాహిత్య మాసపత్రిక "భారతి" యందు బ్రకటితమైనది. శ్రీనాథ కవిసార్వభౌముని చరిత్రమంతయు జక్కగ జెక్కబడినది.

మ॥ కృతులంగొన్న మహానుభావులగు పృథ్వీశుల్ పరంబందిరీ
క్షితిజీవించుట కష్టసాధ్యమగుటంజిత్తంబునందెంచి భూ
పతినొడ్డీశ్వరు వీడి గుత్తగొని సేద్యంబేను జేయింపనా
ప్రతికూలంబగు దైవమిట్లుతలంచెంబాడయ్యె సర్వంబయో.

## 54. చంద్రికా పరిణయ నాటకము :-

ఇది శ్రీమజ్జటప్రోలు సంస్థానాధీశ్వరులగు సురభిరాజా లక్ష్మారాయప్రభు పుంగవుల సంతోషార్థము నేడంకముల నాటకముగా బందొమ్మిది వందల ముప్పది యొకటి వత్సరములో రచింపబడినది.

ఇందితివృత్తము మాధవరాయ ప్రణీతమైన "చంద్రికా పరిణయ" ప్రబంధము నుండి కైకొనబడినది.

సీ॥ కీరమా। చటుల వాక్పూరమా త్రుళ్ళకు
బావురుగాడు నా పజ్జగలడు
కోకిలంబా। కలుషాకులంబా। యింక
నోరెత్తకుము వానకారు వచ్చు
భృంగమా। గీతప్రసంగమా। చాలునీ
యెగిరిపాటిందు సంపసులు గలవు
కోకమా। వంచితలోకమా। యింతలో
బోగలేల నీపాల బ్రొద్దుగుంకు

తే॥ ఎల్లరును నేమి చేసెదరింక నన్ను
మృదులతరవాణికలకంఠి కృష్ణవేణి
లికుచకుచయైన చంద్రిక సుకృత ఫలము
గా దరిసి నాకు జనవీయ గలదుగాన.

## 55. అహల్యా నాటకము :-

అహల్యాగౌతముల పరిణయ వృత్తాంతము చక్కని కల్పనలతో గూర్చబడినది.

## 56. కమలినీ పరిణయము :-

ఇది 'శింబలెన్' అను నాంగ్ల నాటక కథ ననుసరించి వ్రాయబడినది. కథయు నత్యంత మనోహరము.

## 57. రాజభక్తి నాటకము :-

ఇది పందొమ్మిది వందల పదునొకండవ సంవత్సరమున వ్రాయబడి నట్లుగ దెలియుచున్నది.

## 58. శ్రీకృష్ణ భారతము:-

పందొమ్మిది వందల పదియాఱు నుండి యిఱువది యాఱు వరకును గల పదివత్సరముల కాలములో నామూలాగ్రముగ వ్రాసిరి.

ఇందు భీష్మ ద్రోణ పర్వములను బాలకొల్లు వణిగ్వర్యులు రేపాక సత్యనారాయణమూర్తిగారికి, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ ప ములును మిగిలిన పండ్రెండు పర్వములు ముక్త్యాల సంస్థానాధీ లయిన శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరు వారికి కితము. యథామూలానువాదము.

సీ॥ కచకుచోరునితంబ కమ్ములు గుంపులు
 లఘువులు తుందావలగ్నములుగ
కాలుసేతులు నాస వ్రేళులు లఘురేఖ
 లలఘురేఖలు కన్బొమలు నుదురుగ
నగములు పాలిండ్లు నలము వేనలి నఖ
 రంబులు శ్రీభగణంబులుగను
కన్నులుత్పలమాలికలుగతి జంఘలు
 మత్తేభశాలినీ వృత్తములుగ

తే॥ ఆరు వేణియు బదములొప్పారునాగ
ఖడ్గ పద్మబంధములుగా కలిత చంప
కాది మాలికా గర్భచిత్రాగమలర
సకియ గవులెంతు లక్షణశాస్త్రమనుచు.

## 59. శ్రీకృష్ణ రామాయణము :- (పూర్తి)

ఇందు వాల్మీకి చరిత్రమును గలదు. ఉత్తరకాండమును గా నగును. ఇందు నన్ని రామకథల యందలి చిత్రములు కూర్చబ నవి. కావున యథామూలము కాదు. ఇది పందొమ్మిది వందల న వది యేడవ సంవత్సరమున రెండు నెలల పదునైదు దినమ లలో రచింపబడినది. ఈదర వెంకట్రావు పంతులుగారి కంకి మొసగబడినది.

తే॥ జానుగుల "శ్రీల్" పిఱుందుల 'దా' నడుమున
శా నుదుట గ్రార పొక్కిటిలోన బొట్టు
పూర్ణిమమున నొత్తు కేల దీర్ఘమును దోప,
రమణి బుధులెంతు రక్షర బ్రహ్మముగను.

తే॥ నడుమ "మాయ" కేదారము నాభి కుచయు
గంబు శ్రీగిరి కూర్మము కాళ్ల మీఁదు
మోవి మధురాంకమని కాంచిపువ్వుబోడి
దైర్ఘికులు తలంచెదరు క్షేత్రచయమనుచు.

## 60. శ్రీకృష్ణ భాగవతము:- (పూర్తి)

యథామూలము. ఇది పందొమ్మిది వందల నలుబది యెని మిదవ సంవత్సరమున నాలుగుమాసముల కాలమున వ్రాయబడినది శాస్త్రివారు దీనిని అప్పుడాంధ్రప్రదేశ ప్రభుత్వమున కాంగ్రెసు చీఫ్విప్‌గారి కంకితము జేసిరి.

సీ॥ పీతాంబరంబుపై బింజలు దీర్చిన
హొంబట్టు రెంటెంబుడంబు మీర
గజ్జెలందెలు కాళ్ల గలుగల్లుమనుచుండ
నెమిలి ఫించము తలనెటినెసంగ
గర్ణికారద్యుతుల్ గండభాగంబుల
దగదగ మెఱయుచు దాండవింప
నెడమకుదలవంచి కుడికాలెడమకాలి
పైనడ్డముగ నిల్పి పరగ నిల్చి

తే॥ వైజయంతి గళమున వఱలుచుండ
వేణువధరంబుపై మోపి రాణలెసగ
భువనమోహనరాగంబు పొసగజేసె
దేవదేవుడు శ్రీవాసు దేవు డపుడు.

సందర్భానుసార మిటుల శ్రీకృష్ణభాగవతమును గూడ నించుక వివరించుట యౌచిత్యవంతమే యని భావింతును. రసజ్ఞులవధరింతురుగాక.

## 61. శ్రీరాజేంద్ర ప్రసాదాభ్యుదయ కావ్యము:-

ఇది సంస్కృత గ్రంథము. అష్టసర్గ పరిమితము. ఇది పందొమ్మిది వందల యరువది జూన్ నెలయందు ముద్రితము. భారత రాష్ట్రపతి యయిన శ్రీబాబూరాజేంద్రప్రసాద్‌వారి జీవితచరిత్రము.

శ్లో॥ శ్రీమద్భారతభూతలాధిపమహాసామ్రాజ్యసింహాసనమ్
నానాశాస్త్ర విచక్షణార్ధ విలసద్వాగ్వైఖరీబోధితమ్
ధర్మార్ధ ప్రతిపాలితంఫలయుతం లక్ష్మీకటాక్షాంచితమ్
క్షేమస్థైర్యజయభయాదికలితంబాభాతిభూత్యున్నతమ్.

ఇటుల కావ్యమంతయు సరళశయ్యా విలసితముగనే యొప్పారును.

ఇంకను "భగవద్గీతామృతము"ను నాంధ్ర గ్రంథమును రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణ పండితుల కంకిత మిచ్చిరి. 'గోమాహాత్మ్యము"ను కావ్యమును రాజమహేంద్రవరములోని శ్రీ రామేన ఆదినారాయణ గారికి గృతి యొసంగబడినది.

ఈ రీతిగ ననేక గ్రంథములు శాస్త్రి వారిచేత రూపుదిద్దుకొనినవి. సందర్భమునకు నుచితరీతిని యాధారము లందినంత వరకును నిటుల చూపితిని.

ఈ వ్యాసమునకు శ్రీ అనంతవంతుల రామలింగస్వామి గారి "శ్రీ కృష్ణ కవి జీవితము", "కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి 89వ జన్మదినోత్సవ సంచిక" లు మిక్కిలి యాధారభూతములైనవి.

"అపారే కావ్యసంసారే" కవి రేవ ప్రజాపతిః, యను దానికి నూటికి నూరు శాతమును శ్రీ శాస్త్రివర్యులు గణనీయులు.

# ద్వితీయ కళిక

## పురాణములు - భాగవతము

విశ్వ చరిత్రమున బహు పురాతనము, ఉజ్జ్వల సంస్కృతిని కలిగి యుండి వెలుగందినట్టిది యీ భారతీయత యనుటలో నతిశయోక్తి అవంతయు లేదు. అందులకు ప్రముఖ తార్కాణము వేదములు.

అతి ప్రాచీన కాలము నుండియు వాఙ్మయ ప్రవాహద్వయము ప్రాదుర్భావమునంది పరస్పరోపకారకములుగ పథద్వయమున ప్రవహించుచున్నది. అందు ప్రథమము వేద వాఙ్మయ ప్రవాహము. ద్వితీయము పురాణ వాఙ్మయ ప్రవాహము. మొదటిదైన వేదవాఙ్మయము కర్మకాండ ప్రధానమైనది. రెండవది కర్తృత్వ ప్రధానమైనది. వేద వాఙ్మయమును బ్రహ్మ నుండి ఋషులు గ్రహించి వ్యాప్తి చేయగా పురాణ వాఙ్మయమును మునులు స్వీకరించి వ్యాప్త మొనర్చిరి. ఆ కారణముగా నీ రెండు వాఙ్మయములును సమాన ప్రతిపత్తి కలవియే. ఈ విషయము మార్కండేయ పురాణములో నిట్లు ప్రోక్తమయినది.

"ఉత్పన్న మాత్రస్య పురా బ్రహ్మణోఽవ్యక్త జన్మనః
పురాణమేతద్వేదాశ్చ ముఖేభ్యోను వినిస్సృతాః
వేదాన్ సప్తర్షయస్తస్మాజ్జ గృహాస్తస్య మానసాం
పురాణం జగృహుశ్చాద్యామునయస్తస్య మానసాః"

(మార్కండేయ పురాణము)

దీనిని బట్టి యనుస్యూతముగ నాగమించుచున్న పురాణమును విభజించి, గ్రంథస్థము చేయుట ద్వారా కృష్ణద్వైపాయనుడు పురాణ సంహితకు కర్తగ వెలయుట జరిగినది. వేదములను విభజించుట (వ్యసనమ్) యే కారణముగ కాక పురాణ వ్యసనముచేయుట యను హేతువును బట్టియు కృష్ణద్వైపాయనునకు వ్యాసత్వము సిద్ధించినది. ఈ విధముగ ప్రారంభము జరిగినది.

'వి' అను ఉపసర్గతో కూడిన 'అస్' ధాతువు నుండి 'వ్యాస' పదము నిష్పన్నమైనది.

"వివ్యాస వేదాన్ యస్మాత్ తస్మాత్ వ్యాస ఇతి స్మృతః" యను మహాభారత వాక్యమే పై విషయమునకు ప్రబల ప్రమాణము.

అసలు వ్యాసుని గూర్చి ఈ ప్రసిద్ధ శ్లోకము ద్వారమున విషయము తెలియును.

"వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్
పరాశరాత్మజం వన్దే శుక తాతం తపోనిధిమ్"

బ్రహ్మ పుత్రుడు శక్తి. ఆయన కుమారుడు పరాశరుడు. పరాశరాత్మజుడు వ్యాసుడు. వ్యాసోద్భవుడు శుకుడు. పరాశరునకు దాశరాజకన్యయైన సత్యవతి యందు వ్యాసుడు సూనుడుగ జనించుట జగద్విదితము. అందులకే వ్యాసునకు సాత్యవతేయుడనియు నామాంతరము కలదు. ఈ వ్యాసుడు నారాయణాంశభవుడని వివిధ పురాణములు చెప్పుచున్నవి. బ్రహ్మయే వ్యాసుడుగా అవతరించినట్లు కొన్ని పురాణముల కథనము.

ఈ పరాశరాత్మజుడైన వ్యాసుని యసలు పేరు కృష్ణద్వైపాయనుడు. శరీర వర్ణమును బట్టి కృష్ణుడు నదీ ప్రవాహ మధ్యగత

ద్వీప సంజాతుడు కనుక ద్వైపాయనుడు. ఈ రెండును కలిసి కృష్ణ ద్వైపాయనుడు అయినది.

కావున వ్యాస నామము పదవినాధారముగ నాగమించినట్టిది. వేద పురాణములను విభజించినట్టి వాడని భావము. ప్రతి ద్వాపర యుగమందును ఒక్కొక్క వ్యాసుడు వచ్చుచుండుననియు, నిట్టి వ్యాసులు 27 గురుండెడివారనియు విష్ణుపురాణ దేవీ భాగవతాదులం దుక్తమై యున్నది.

వేదములను విభజించిన మునులను పేర్కొనుచు ఇరువది నాల్గవ వేదవ్యాసుడు ఋక్షుడనియు నిరువది యెనిమిదవ వేద వ్యాసుడు ఋక్ష ద్వైపాయనుడనియు నిట్లు వాయు పురాణము పేర్కొనుచున్నది.

'పరివర్తే చతుర్వింశే ఋక్షోऽవ్యాసోऽభవిష్యతి
అష్టావింశే పునః ప్రాప్తే పరివర్తే క్రమాగతః
యథా భవిష్యతి వ్యాసః నామ్నా ద్వైపాయన ప్రభుః"
(వాయు పురాణము. పూర్వ-23.)

వ్యాసులు పెక్కుమంది కలరనుటకు వైదిక లౌకిక వాఙ్మయములో ననేకాధారము లున్నవి. వేద విభజన సంబంధమున వారికా పేర్లు వచ్చియుండును. అంతియకాని అవి కేవలము పేర్లు మాత్రమే కావని స్పష్టమగుచున్నది.

ఈవిధముగ కృతయుగమునందు బ్రహ్మ శతకోటి ప్రవిస్తరము, బ్రహ్మ సంజ్ఞమునగు పురాణ సాహితీ స్కంధమును వినిర్మించెను. తత్సారమును వేదవ్యాసుడు నాలుగు లక్షల శ్లోక పరిమితిగల అష్టాదశ పురాణ సంహితగ రచించి రోమహర్షణియైన సూతునకు చెప్పగ నతడు తన పుత్రుడగు ఉగ్రశ్రవసున కుపదేశించెను. అతడు

నైమిశారణ్యమున శౌనకాది మునులకు దెలియ చెప్పెను. అని మత్స్య, విష్ణు పురాణాదుల వలన దెలియుచున్నది.

విష్ణు పురాణమున పురాణోత్పత్తి,
'ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైః గాథాభిః కల్పశుద్ధిభిః
పురాణ సంహితాం చక్రే పురాణార్థవిశారదః"

అని కలదు. (విష్ణు పురాణము. 3-6-15.)

వాయు పురాణమున బ్రహ్మ వేదములకు ముందే పురాణములను ప్రవచించినట్లున్నది.

"పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్
అనన్తరంచ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిర్గతాః"
(వాయుపురాణము. 1-60, 61)

పురాణమున భగవద్విషయము ప్రధానమైనది. సృష్టి స్థితిలయ కారకుడైన పరబ్రహ్మ లీలా విశేషములను వర్ణించును. సత్యమైన యా పరబ్రహ్మమునుచేరు మార్గమును సూచించుట పురాణధర్మము. ఇతిహాసములందు దేశ, రాజ చరిత్రాంశములుండును. పురాణములందును నివి యున్నను అప్రధానములు. భగవద్విషయమే ముఖ్యము. ఏకనాయకాశ్రయత్వము, వస్త్వైక్యము పురాణములందుండదు. యుగాంతర వ్యాప్తికల వస్తువు, సమస్తలోక మన్వంతర వ్యాప్త భగవల్లీలా కథనముండును. కావున పురాణములలో నాయకత్వము పరబ్రహ్మదే. తన్మాహాత్మ్యమున కుపబలక సాధనములుగ నితర విషయములు, చరిత్రలు ప్రసక్తమగుచుండును. ఇది సంగ్రహముగ ద్యోతకమగు పురాణ స్వరూపము.

**పురాణ నిర్వచనము:-**

పురాణమనగ ప్రాచీనమైనదని యర్థము. యాస్కుడు నిరుక్త

మున, "పురా నవమ్ పురాణమ్" యని చెప్పెను. ప్రాచీన కాలమున నవ్యమైనది యని దాని భావము. దీనికే 'అపి' చేర్చి "పురాపి నవమ్" ప్రాచీనమయ్యును క్రొత్తదనము కలది. సర్వకాల పరిగ్రాహ్యమని మఱికొందఱనిరి.

బ్రహ్మాండ పురాణము నందు

"యస్మాత్ పురాహ్యనక్తీదం పురాణం తేన తత్ స్మృతం"

అని యున్నది.

పురా ప్రాచీన వృత్తములను అనక్తి - పొందించునది లేక తెల్పునది యని వ్యుత్పత్తి.

'యస్మాత్ పురాహి అనతి ఇదం పురాణం'

(వాయుపురాణము 1-203)

పూర్వ విషయములు చెప్పునదియని దాని యర్థము.

ప్రాచీన పరంపరను వర్ణించునది పురాణమని పద్మపురాణ నిర్వచనము.

'పురా పరంపరాం వష్టి పురాణం తేన తత్ స్మృతమ్'

(పద్మపురాణము)

బ్రహ్మాండ పురాణమును బట్టియు పూర్వము ఆవిర్భవించిన కారణమున పురాణమని తాత్పర్యము. 'యస్మాత్పురాహ్య భూచ్చైచ తత్పురాణం తేన తత్ స్మృతమ్. (బ్రహ్మాండపురాణము)

'పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః'

(మత్స్యపురాణము)

'ప్రాగ్వృత్త కథనా' (శుక్రనీతి)

మరికొందరు పురా భవం పురాణమ్ అని చెప్పుచుండిరి.

ఈ విధముగ పురాణ శబ్దమునకు ఏవిధమున వ్యుత్పత్తి చూపినను బహు ప్రాచీనమయినదను భావము సర్వామోద యోగ్యమైన విషయము.

వేదాదులందును పురాణ ప్రసక్తి కానవచ్చును.

ఋక్సామాథర్వ మంత్రములు, పురాణములు, యజుర్వేదము, దేవతలు పరమాత్మోద్భూతములని అధర్వ వేదోక్తము.

'ఋచఃసామాని ఛన్దాంసి పురాణం యజుషా సహ
ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వేదివి దేవాది విశ్రితాం'

(అధర్వవేదము 11-7-4)

ఛాందోగ్యోపనిషత్తునందు.

'ఋగ్వేదం భగవో ధ్యేమి యజుర్వేదం సామవేదమా
ధర్వణ మితిహాస పురాణం పంచమం వేదమ్.

(ఛాందోగ్యోపనిషత్ 7-1)

అని పంచమ వేదేతి హాస పురాణము చెప్పబడినది.

'ఋగ్వేద, యజుర్వేద, అధర్వ వేద ఇతిహాస పురాణ ఉప నిషత్సూత్ర....' అని శతపథ బ్రాహ్మణము

'వేద ఇతి హాస పురాణగాథా.... అని తైత్తిరీయారణ్యకము. 2-9.

శ్రాద్ధాది కర్మలందు పురాణ పఠనముండవలయునని మను స్మృతి, వేదార్థ నిర్ణయమునకు పురాణేతిహాస జ్ఞానము అవసరమని వసిష్ఠ స్మృతియును చెప్పినట్లు తెలియుచున్నది.

## పురాణ లక్షణము:-

పురాణమునందు సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతర ములు, వంశ్యాను చరితము అను 5 విషయములు వర్ణింపబడవలయు నని చెప్పబడినది.

'సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశ్యాను చరిత్రం చేతి పురాణం పఞ్చలక్షణమ్.'

(అమరకోశము)

మత్స్యాది పురాణములందు పై శ్లోక ద్వితీయ చరణమునకు, 'సర్వేష్వేతేషు కథ్యన్తే వంశాను చరితంచ యత్'యని పాఠాంతరము.

పురాణములకు దశ లక్షణములుండవలయునని భాగవతాదులందిట్లున్నది.

"సర్గశ్చాథ విసర్గశ్చ వృత్తి రక్షన్తరాణిచ
మనో వంశానుచరితం సంస్థాహేతురపాశ్రయః
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విధుః"

ఈ పది లక్షణములను వెనుక చెప్పిన 5 లక్షణములందు అంతర్గతము చేయవచ్చును. ఉదాహరణమునకు విసర్గము, అపాశ్రయము అనగ సృష్టికర్తయగు బ్రహ్మ యగుటచే అదియు, కర్మవాసనలద్వారా సృష్టి హేతువయిన జీవుడు (హేతువు) ఈ మూడును సర్గమున అంతర్గతములగును. కావున "పురాణం పఞ్చలక్షణం" అనునదియే బహుళ ప్రచారమందినది.

## పురాణ సంహిత:-

కృష్ణద్వైపాయన "వ్యాసుడు" వివిధ కాలప్రోక్త పురాణాదులను సమీకరించి యొక పురాణ సంహితను నిర్మించెను. అది ఆఖ్యానములతోడను, ఉపాఖ్యానములతోడను, గాథలతోడను, కల్పశుద్ధులతోడను రచింపబడినదిగ కాననగును.

"ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైర్గాథాభిః కల్పశుద్ధిభిః
పురాణ సంహితాం చక్రే పురాణార్థ విశారదః"

(విష్ణుపురాణము 3-6-15)

జోక్తిభిః" అనియును, వాయు పురాణమునందు కుల కర్మభిః అనియు పాఠాంతరములున్నవి.

## ఆఖ్యానోపాఖ్యానాలు:-

స్వయముగ చూచిన విషయమును చెప్పుట ఆఖ్యానమనియు, వినిన విషయమును చెప్పుట ఉపాఖ్యానమనియు తెలియనగును.

స్వయం దృష్టార్థ కథనం ప్రాహురాఖ్యానకం బుధాః
శ్రుతస్యార్థస్య కథనముపాఖ్యానం ప్రచక్షతే. శ్రీధరీయము
అని శ్రీధరీయము.

కొంతమంది భావనయందు పెద్ద కథ ఆఖ్యానము, చిన్న కథ ఉపాఖ్యానముగ కలదు.

గాథలు:- వేద పురాణాదులయందజ్ఞాత కర్తృక శ్లోకములు గాథలు.
కల్పశుద్ధి:- శ్రాద్ధార్థ కల్పమని శ్రీధరుల అర్థము.
కల్పజోక్తి యను పాఠగ్రహణముచే నాయా కల్పాదుల జరిగిన విఖ్యాత విషయ వర్ణనమని యర్థమును గ్రహింపవచ్చును.

## అష్టాదశ పురాణములు:-

ప్రథమమున శతకోటి ప్రవిస్తరమైన మూల పురాణము బ్రహ్మప్రోక్తము. "శతకోటి ప్రవిస్తరమ్" అనగ నూరుకోట్ల గ్రంథాల ప్రమాణముగలది అని యర్థము. పూర్వకాలమున ఏ గ్రంథమైనను అది పద్య రూపమైనప్పటికిని, గద్యరూపమైనప్పటికిని గ్రంథ సంఖ్యచే పరిగణింపబడెడిది. అప్పుడు గ్రంథము అనగా ముప్పది రెండు అక్షరములు.

శతకోటి ప్రవిస్తరమై యేకరూపముననున్న
ం దురవగాహమని విష్ణువు వ్యాసావతారమున
మాణముగ సంగ్రహించి యష్టాదశముగ విభ

జించెననియు, శతకోటి ప్రవిస్తరమైన మూల పురాణమిప్పటికిని దేవతల యొద్ద నున్నదనియు బృహన్నారదీయము పలుకుచున్నది.

స్కాంద పురాణము కూడ యిట్లు నుడువుచున్నది.

"పురాణమేక మేవాసీదస్మిన్ కల్పాన్తరేనృప
త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్
స్మృత్వా జగాదచమునీన్ప్రతి దేవశ్చతుర్ముఖమ్
చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా
తదష్టాదశధా కృత్వా భూర్లోకే స్మిన్ ప్రభాష్యతే.

(స్కాందపురాణము. 1-23-30)

వ్యాసకృతమైన మహా భారతము ఇరువది నాల్గువేల శ్లోకములు కలిగిన 'జయ' అను నామము కలది.

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసంతతో జయముదీరయేత్.

కాని భారతము వలెనే అష్టాదశ పురాణములకు, రామాయణమునకు కూడ 'జయ' సంజ్ఞ కలదని భవిష్యత్ పురాణము చెప్పుచున్నది.

"అష్టాదశ పురాణాని రామస్య చరితం తథా
కార్ష్ణం వేదః పంచమశ్చ యం మహాభారతం విదుః
జయేతి నామ్నాత్వేతేంస్తు ప్రవదంతి మనీషిణః"

(భవిష్యపురాణము)

'య' అనునది యొకటికిని, 'జ' యనునది యెనిమిదికిని గుర్తులు. 'అంకానాం వామతోగతిః' యను సిద్ధాంతము ప్రకారముగ 18 సంఖ్యకల పురాణములను సూచించును.

"యస్మిన్ జ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతి" యనునది పురాణ విషయికముగ చక్కగ సంవదించును.

ఇవి మహా పురాణములు పదునెనిమిదిగ నామ ప్రారంభాక్షర నిర్దేశమున దేవీ భాగవతమిట్లు నుడువు చున్నది.

"మద్వయం భద్వయం చైవ బ్రత్రియం వచతుష్టయం
అనాపలింగ కూస్కాని పురాణాని ప్రచక్షతే"
దేవీభాగవతము

మద్వయము : మత్స్య, మార్కండేయ పురాణములు.
బ్రత్రియము: బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త పురాణములు
వచతుష్టయము: విష్ణు, వాయు, వరాహ, వామన పురాణములు
అనాపలింగ కూస్కాలు: అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కంద పురాణములు.

ఇతర పురాణములందును అష్టాదశ సంఖ్య కలదయ్యును కించి ద్భేదము గోచరించుచున్నది.

ఇయ్యవి సర్వ సర్గ హేతువగు రాజస తామస సాత్త్విక గుణ త్రియమున ముప్విధములుగ నుక్తమగుటయు కాననగుచున్నవి.

బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మ పురాణములు బ్రహ్మ పరమై రాజసములుగను, మత్స్య, కూర్మ, లింగ, శైవ, స్కాంద, అగ్ని పురాణములు శివ పరములై తామసములుగను, విష్ణు, నారద, భాగవత, గారుడ, పద్మ, వరాహ పురాణములు విష్ణుపరములై సాత్త్వికములుగను చెప్పబడుచున్నవి.

కాని మరికొన్ని యితర పురాణమ్ముందు విభాగము వేరు విధముగ కన్పించును. గరుడ పురాణము శివ పారమ్యమును చెప్పు వాయుపురాణాన్ని సాత్త్విక పురాణగత మొనర్చినది. ఇట్టి భేదములు ఇతర పురాణములందు కనుపించు విభాగములలోను కలవు. కావున

ఈ విషయములో నన్ని పురాణముల నడుమను ఏక సూత్రిత లేదని స్పష్టమగుచున్నది. ఈ రీతిగ మహా పురాణ పరిగణనమున వాయు, శివపురాణములందు మత భేదమున్నది. అటులనే భాగవతము దేవీ భాగవతమా! శ్రీ మద్భాగవతమా? యని సందేహామున్నది.

పై మహాపురాణములవలె సనత్కుమార, నారసింహాద్యుప పురాణములును, గణేశ, మౌద్గల, కాళి, కల్క్యాద్యుపోప పురాణములు నెన్నియో యున్నవి. వీని యందును పరస్పరము విరోధించుటలు దర్శనీయమే. ఇవియు శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణపత్యాద్యనేక మతములను ప్రబోధించుట కలదు.

మహాపురాణము లన్నియును వ్యాస కర్తృకములనియే చెప్ప బడుచున్నవి. అయినను భాగవతాదులు కావనియు, బోపదేవాది కర్తృకములనియు వాదము కలదు. అది తరువాత పరిశీలింపబడును. ఈ పురాణగతమైన భావగాంభీర్యమును బట్టి యాయా స్థలముల నీషత్ప్రౌఢి కనిపించినను మొత్తము మీద సారళ్య సహజత్వముల నొప్పారుట కలదు. ఈ పురాణములందు సాధారణముగ "ననుష్టు ప్ఛందమే" ప్రయోగింపబడియున్నది.

## భాగవతము

విప్రులకు శ్రుతి స్మృతులు కన్నులనియును, పురాణము మూడవకన్ను కావున నీ మూడు కన్నులచేతను చూచు సామర్థ్యము కలవాడు మహేశ్వరాంశజు డనియును స్కాందరేవా ఖండమున నుక్తమయినది. వేద పురాణ ధర్మశాస్త్ర విద్యలు మూడును సర్వశాస్త్ర సిద్ధాంతము సేయ సమర్థములు. పురాణములు తెలియని వానికేమియు నెఱుగ బడవనియు నందు లేని ధర్మమే లేదనియును, వేదస్మృత్యోక్త

విషయములే పురాణములందుండుననియును, పురాణములు వేద పురుషుని యాత్మ యనియు తదౌన్నత్యము కీర్తింపబడినది. ఈ పురాణములు మిత్ర సమ్మితములుగ నాలంకారిక ప్రోక్తములు.

"సకల పురాణార్థేతి హాసవేత్తగ" శ్రీనాథ కవిసార్వభౌముని ప్రత్యక్ష సుస్పష్ట కీర్తిపై దానికి నికషదృషత్తు. అట్టి వానిగా శ్రీ శాస్త్రి గారిని కూడ బేర్కొనదగును.

అట్టి పురాణములయందు భాగవతమునకొక విశిష్టస్థానమున్నది. గీతా సహస్రనామ రామాయణ శబ్దములు నిరుప పదములైనప్పటికిని భగవద్గీతా విష్ణు సహస్రనామ వాల్మీకి రామాయణములను సూచించుచున్నట్లు నిరుపపదమైన భాగవత శబ్దము శ్రీవిష్ణు భాగవతమునే సూచించుచున్నదని అకాడమీ పోతన భాగవత పీఠికా కారుల మాట. ఇట్లనుట సత్యదూరము కాదు.

పురాణాతి ప్రసిద్ధమైన యీ భాగవతము భక్తి సర్వస్వము. వల్లభ సంప్రదాయ, చైతన్య సంప్రదాయములకిది యుపజీవ్య గ్రంథము. ఇది వైష్ణవులకు ప్రామాణికము. కావున ఆ వివిధ సంప్రదాయకులు తమ కనుగుణముగ భాగవతమునకు వ్యాఖ్యల నొనర్చిరి.

అసలీ భాగవతమును, సమస్త పురాణముల రచనానంతరము వ్యాసుడు సర్వ పురాణ సారమును గ్రహించి రచించినట్లు పద్మ పురాణమున కనుపించును.

"తత్ర పద్మ పురాణంతు ప్రథమంచ ప్రణీతవాన్
తతోన్యాని పురాణాని కృత్వా షోడశతుక్రమాత్
అష్టాదశం భాగవతం సారమాకృష్య సర్వతః
కృతవాన్ భగవాన్ వ్యాసః శుకమధ్యాపయత్ స్వయం.
పద్మ పురాణము

భాగవతమునందే తద్రచనా హేతువును గూర్చిన ప్రస్తావన మనకు కనుపించును.

వ్యాసమహర్షి సర్వ వర్ణాశ్రమములకును హిత మొనర్ప సంకల్పించి వైదిక కర్మములైన యజ్ఞములు జరుగుటకై యేకాకార ముగ నున్న వేద వాఙ్మయమును విభజించి, వానిని వినవర్హతలేని వారికై భారతమును రచించి, భూతహితమునందు తన చిత్తము సంతసింపకుండుటచే సరస్వతీ నదీ తటమున నొంటరిగ నుండి వారి కిని, యోగివరులకు నభిలషితమైన భాగవత విధము పలుకనైతినని విచారించుచుండును. అప్పట్టున దేవర్షి యరుదెంచి వ్యాసుని చింత నెఱిగి సందేహ రాహిత్య మొనర్చి విష్ణు లీలాత్మకమగు భాగవతము సేయ ప్రోత్సహించి చనును. అప్పుడా సాత్యవతేయుడు భక్తి వేదాంత యుక్తముగ భాగవత పురాణమును వినిర్మించెను. దానిని స్వసుతు డగు శుకర్షిచే నధ్యయనము చేయించెను. శుకుడు దానిని మోక్షార్థి యైన పరీక్షిత్తునకు వినిపింప పిదప సూతుడు సత్రయాగ సందర్భ మున శౌనకాది పరమర్షులకు నైమిశారణ్యమున వినిపింప బడినదని తెలియుచున్నది.

పురాణములందు భాగవతము సర్వజన మనోరంజకమై భక్తి భావ సంభరితమై రామాయణ, మహాభారతముల తదుపరి యంతటి పేరునందినది. ఇది నిగమ కల్పతరు గళితమయిన ఫలము. దేవర్షి దానిని వ్యాసుని కొసగినాడు. పరాశరాత్మజుడు దానిని శుకముఖ నిహితము కావింపనది యమృత ద్రవసమ్మితమై శుకముఖమునుండి భూమిపై పడినది. ఆ రసమాస్వాదించు వారికి పరబ్రహ్మానందాను భవము తథ్యము. ఈ భాగవత మాహాత్మ్యము పద్మ పురాణోత్తర ఖండమున ప్రథమమున కల ఆఱధ్యాయములందు సునిశితముగ వివరింపబడి యున్నది.

మత్స్య పురాణమున,

"యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః

వృత్రాసుఖ దోపేతం తద్భాగవతముచ్యతే."

మత్స్యపురాణము అని యున్నది.

శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భాగవత కథను వినిపింప ప్రారంభించిన సమయమున దివౌకసులుపీయూష భాండముతో నరుదెంచిభాగవత కథామృతమును దమకిచ్చి తాము తెచ్చిన యమృతమును బరీక్షిత్తుకిమ్మని వేడుకొనిరట. కాని శుకుడు సుపర్వాణులుత్తమ భక్తులు కారని తలచి వారలకు భాగవతామృతము నీయ నియ్యకొనలేదట. ఇద్దానిని బట్టి భాగవతము భక్త జనైకలభ్యమైనదనియు నమృతాధిక ఫలప్రదమనియు దెలియును.

"శ్రీ మద్భాగవతీ వార్తా సురాణామపి దుర్లభా"

భాగవతమాహాత్మ్యము. 1-17

శ్రీ రామకృష్ణ పరమహంసయు భాగవతౌన్నత్యమును గూర్చి

"The Bhagavata is fried in the butter of Jnana and soaked in the syrup of Bhakti."

అని ప్రశంసించుట గమనింపదగినది.

ఈ భాగవతమున అధిదేవత విష్ణువు. ఇదికాక జగన్మాతయైన పరాంబిక యధిదేవతగాగల 'దేవీ భాగవతము" మరియొకటి కలదు. ఈ భాగవతద్వయమున నేది వ్యాసకృతమను విషయమున పండిత ప్రకాండులలో వాగ్వివాదములు చాల జరిగినవి. శాక్తేయి వైష్ణవ మతస్థుల విద్వేషము ప్రజ్వరిల్లి ఈ విషయమున తారస్థాయినందినది.

కాశీనాథభట్టు అను నాయన దేవీభాగవతమే మహాపురాణముల యందలిదనియు శ్రీ మద్భాగవతము కాదనియు నిర్ణయించుచు "దుర్జన ముఖచపేటిక" యను గ్రంథమును తన వాదమున కనుగుణముగ రచించి ప్రతి పక్ష నిరసనము కావించెను. దానితో భాగవత

మును బోపదేవుడను నతడు రచించి వ్యాస కృతమొనర్చెనని కొం దఱు వితండ వాదము చేసిరి. అద్దానిని నిరసించుచు భట్టోజీ దీక్షితుల శిష్యుడయిన రామాశ్రియ పండితుడు 'దుర్జనముఖచ పేటికా ఖండన మ"ను గ్రంథమును రచించినాడు. మఱియొక పండితుడిద్దానిని ఖండించుచు 'దుర్జనముఖ బద్మపాదుకము'ను రచించెను. దీనితో 'భాగవతస్వరూప నిరాసత్రియోదశమ'ను పేర పురుషోత్తమ పండి తుడు వ్రాయుట జరిగినది. మితాక్షర వ్యాఖ్యాత యయిన బాలం భట్టును ఈ భాగవత రచనా విషయ ప్రస్తావనకు కడంగినాడు. ఈ విషయమున పాశ్చాత్య పండితులును విపులముగ పరిశోధించుట జరిగినది. ఇద్దానికి హేతువు భాగవతశైలి యితర పురాణముల శైలి కంటె నిషద్భిన్నముగ నుండుట. మరియును భారత భాగవతము లందు సాదృశ్యము కల విషయములు కొంతవరకును బరస్పరము సంవదింపకుండుట.

బోపదేవుని కాలము క్రీ. శ. 13వ శతాబ్ది యనియు, శ్రీమద్భా గవత రచనా కాలము క్రీ. శ. 5వ శతాబ్ది కాని యంతకు ముందు కాని యయి యుండవచ్చునని నిర్ధారించుట ప్రస్తుతమునకు జరిగి యుండుటచే శ్రీ మద్భాగవతము వ్యాస కృతమే యని ప్రస్తుత పరి శోధనలకందినంతవరకును ఆమోదయోగ్యమై యున్నది. అనుస్యూత ముగ వ్యాసకృతమే శ్రీ మద్భాగవతమని వచ్చుచుండుట కూడ కారణముగ గ్రహింపదగును.

ఏది యేమైనను అష్టాదశ పురాణములలోనిది శ్రీ మద్భాగవ తమే యని నిర్ధారించుటయు జరిగినది.

ఇక శ్రీమద్భాగవతము వ్యాస కృతమా! కాదా! యనునది మాత్రము ఇట పరిశోధనాంశము కాదు. స్థూలముగ పురాణ విషయ

బడినవి. అంతియ. ఈ భాగవతమును తెలుగున ననువదించిన పోతన్నయు,శ్రీ శాస్త్రిగారలిర్వురును దానిని వ్యాస కృతముగనే యంగీకరించుట నిక్కువము.

శ్రీమద్భాగవతము 18000 శ్లోకములతో ద్వాదశస్కంధములుగ, 335 అధ్యాయములతో వ్యాసకృతముగ నున్నది. ఇందు ప్రస్తుతమైనది యాత్మవిద్య. దీనిని గూర్చి వేఱు ప్రకరణమున విపులముగ చర్చించబడును.

ఈ భాగవతమున పురాణ లక్షణములు 5నుగాక ప్రత్యేకముగ దశ లక్షణములు కనుపించుచున్నవి.

"అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణ మూతయః
మన్వంతరేశానుకథా నిరోధోముక్తిరాశ్రయః
దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణమ్
వర్ణయంతి మహాత్మనః శ్రుతేనార్థేనచాంజసా.
(సంస్కృతభాగ 2 స్కంధ - 10 అధ్యా. 1, 2 శ్లో.లు)

ఈ లక్షణములలో ప్రధానమయినది ఆశ్రయము.

"ఆభాసశ్చ నిరోధశ్చ యతస్త్యధ్యవసీయతే
సాశ్రయః పరబ్రహ్మ పరమాత్మేతిశబ్ద్యతే"
(సంస్కృతభాగ 2 స్కంధ - 10 అధ్యా. 7 శ్లో.)

అభాసమనగ సృష్టి. నిరోధమనగా లయము. ఆ భాస నిరోధములు రెండును దేనివలన సంభవించి ప్రతీతమగుచున్నవో యది యాశ్రయము. బ్రహ్మయనియు, పరమాత్మ యనియు చెప్పబడునట్టిది. ఈయాశ్రయ పదార్థమనగా నాత్మ తత్త్వము నిర్దిష్టముగ తెలియుటకు దక్కిన తొమ్మిది లక్షణములును చెప్పబడినవి. కావున నిది లక్ష్యము.

సర్గమనగ ఆకాశాది పంచమహాభూతములు. శబ్దాది పంచ తన్మాత్రలు, మహదహంకారములు.

విసర్గమనగ పౌరుషము. పురుష సంబంధి. పురుషుడిచట వైరాజుడు, చతుర్ముఖుడు. ఆయన సృష్టి చరాచరాత్మకమైనది విసర్గము.

స్థానమనగ స్థితి, వైకుంఠ విజయము, భగవంతుడవతరించి జగత్పాలనము చేయుట. పోషణము అనగ స్వభక్తులను భగవంతుడనుగ్రహించుట.

ఊతులనగ కర్మ వాసనలు. మన్వంతరములనగ మన్వంతరాధి పతుల ధర్మములు. ఈశాను కథలనగ పరమేశ్వరుని అవతారాది చరిత్రలు, తదనువర్త భాగవతుల విషయములు. నిరోధమనగ పరబ్రహ్మము యోగనిద్రనొంద సర్వ సృష్టియు లయమగుట.

ముక్తి యనగ ఆత్మ యవిద్యను వీడి స్వయమగు పరబ్రహ్మస్థితి నందుట.

ఈ నవ లక్షణములచే దశమమయిన ఆశ్రయ స్వరూపము పట్టువడును కదా!

ఇవ్విధముగా లక్షణ యుక్తమయిన శ్రీమద్భాగవతమునకు మోక్ష శాస్త్రమని ప్రసిద్ధి. అందునను శ్రవణ మాత్రముననే ముక్తి నిచ్చునట్టిది.

ఇట్టి భాగవతము నాంధ్రమున ననువదించుటలో పోతన్న, శాస్త్రిగార్ల దృక్పథములు తదుపరి సవిమర్శముగ పరామర్శింపబడును.

—౦—

# భాగవతాంధ్రత్వము

"ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మ సమ్మితం
ఉత్తమ శ్లోక చరితం చకార భగవానృషిః
సర్వం వేదేతి హాసానాం సారం సారం సముద్ధృతమ్
సతు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్."
(సంస్కృతభాగ 1 స్కంధ - 4 అధ్యా. 40, 42 శ్లో.లు.)

ఇట్లు సర్వ వేదేతిహాసముల సారము గలదిగను, మోక్ష గ్రంథ ముగను ప్రసిద్ధివడసిన భాగవతము భారతదేశమునందు భగవద్భక్తికి పర్యాయపదంగా ప్రసిద్ధికెక్కినది.

అట్టి యీ వ్యాస భాగవతమాంధ్రత్వమును సంతరించు కొనుటలో మన యాంధ్రుల భాగ్యవశమున 'తెలుగుల పుణ్యపేటి'గ నుతింపబడిన పోతన్న చల్లని చేతుల ద్వారమున ననువాదములో ప్రథమ గణ్యమును సంతరించుకొనినది.

ఈ సందర్భముగ ముందు పోతనను గూర్చియు, పోతన భాగవతమును గూర్చియు నీషత్ప్రస్తావనము చేయ దొరకొనుట సమంజసము.

ఆంధ్ర భూమియందు పోతన్న భాగవతము జనతాభిమాన కావ్య ప్రసిద్ధిగన్న భాగవతము. పోతన్న మధుర భక్తికి, అద్వైత భావనకుబట్టుగొమ్మ. ఇది సాహితీ ప్రియంభావుకులకు మాత్రమే కాక సామాన్య జనులకు సహితమారాధ్య గ్రంథము. ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున పోతన్నకు దమ గుండెలలో భక్తిసౌధము నిర్మించి యారాధింపని యాంధ్రుడు ఉండడు, ముక్తికి భగవద్భక్తి సరళ సుందర సులభాతి సులభ సోపాన మధుర పథము. భక్తికి

మారుపేరు ఈ పోతన్న భాగవతము. దానికి కారణమందలి భక్తి గాథలతోపాటు పోతన్న కమ్మని కవిత కూడ. భక్తి యనగ నొకా నొక విధమైన చిత్త పరిపాకము. అట్టి కమ్మని కవితామృతముతో కూడిన భక్తియుతమీ పోతన్న భాగవతము.

ఋషివంటి నన్నయ్య ఆదికవియై తెనుగుభాషకు ప్రాణ భిక్షయు, మనకు పూర్ణ కవితా భిక్షయు పెట్టి వాగనుశాసన బిరుద సార్థకుండయినాడు.

తిక్కన్న మహోజ్జ్వల ధారాశుద్ధి నిండిన నిరర్గళ పదకల్పన మున భారత పంచదశపర్వములు దక్షతతో గూర్చి ఆంధ్రసాహితీస్థితి మూలమై నిలచి కబ్బపు తెనుగుదోటగా శోభించినాడు.

ఎఱ్ఱన్న కవీంద్ర శ్రవణ పుటపేయముగ నిండు పూర్ణత్వ మును సర్వమార్గేచ్ఛా పరతంత్రుడై దీపించినాడు.

పాలకుర్కి సోమన్న శివహృదయుడై పదహారణాల తెలుగు వాడుగ దేశీయముద్రతో దీపించినాడు.

సోమ భాస్కరులు కవితా కాంతిపుంజములను ఉత్తరహరివంశ రామాయణములందు భాసింపజేసిరి.

నన్నిచోడుడు కావ్యత్వమును కుమారసంభవమున నిరూపించి కవిరాజయినాడు.

ఆదికవులయందలి గుణములు జీర్ణించుకొని యనుపమ ప్రతిభా శాలిత్వముతో రసప్రసిద్ధ ధారాధునియై కవితా సౌష్టవమునకు మార్గ దర్శకుడై నిలచినవాడు కవిసార్వభౌముడు, కవితా శ్రీకి నాథుడు నయిన శ్రీనాథుడు.

ఏలకో వీరి యెవ్వరి దృక్కులును భాగవతముపై ప్రసరింప లేదు. అట్లగుట తన పురాకృత శుభాధిక్యముగా భావించుకొనినాడు

పోతన్న. ఇదియే నిజమా! ముమ్మాటికిని. అంతియ కాదు. మరి యాంధ్రజాతి పూర్వ జన్మార్జిత పుణ్య పరిపాక ఫలమును.

పోతన్న తలంపు చూడుడు.

మ॥ ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్
తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెద బునర్జన్మంబు లేకుండగన్.

(పోతనభాగ 1 - 21)

పోతన్న తన జన్మముతోపాటు సర్వాంధ్రియుల జన్మములను సఫలము చేసినాడు. తన భాగవత రచనాభిలాష మెందులకో ప్రారంభముననే చూపినాడు.

"శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు కేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్."

(పోతనభాగ 1 - 1.)

ఈ పద్యము పోతన్న యాత్మీయతకు ప్రబల తార్కాణము. ఆతాన యాధ్యాత్మికతా తారస్థాయి యిందు సంపూర్ణత్వముతో వేదాంతోపలంబనమై గోచరించును.

పోన్న హృదయవాది కవి. అందుచేతనే భాగవత కవిత యంత సహజసుందరమై యుండును. అది యేమి విచిత్రమో యాంధ్ర భారత రామాయణములవలె నీ భాగవతమును బహు కర్తృక మైనది. ప్రధానుడు పోతన్న. తక్కినవారు బొప్పరాజు గంగనార్యుడు, ఏర్చూరి సింగనార్యుడు, వెలిగందల నారయయును. రచనా విషయకముగ - భేదాభిప్రాయములున్నను ప్రస్తుతమునకు పంచమస్కంధ

మును గంగన, షష్ఠస్కంధమును సింగన, నారయ ఏకాదశ ద్వాదశ స్కంధములను అనువదించిరని పరిశోధకులు తేల్చిరి.

పోతన్న యస్తవ్యస్తముగనున్న తన కాలమునాటి దేశ, సాంఘిక మత పరిస్థితులను చూచి చక్కదిద్దుటకో యనునట్లు భాగవతము నద్వైతపరముగ రచించుటకు పూనుకొనినాడు. పోతన్న దేశ కాలములను గూర్చియు బహు వివాదములు పొడసూపినవి. పోతన్న ఓరుగల్లు నివాసి యని కొందఱు, కడపమండలమునకల ఒంటిమిట్ట వాడని కొందరు పలికిరి. జన్మస్థలము బమ్మెర యనియు నివాసస్థల మోరుగల్లుగను నిర్ణయమైనది. ఇక కాలమునను చాల మంది పలు విధములుగ నిర్ణయించుట జరిగినను 15 వ శతాబ్దివాడని నిర్ధారించుట జరిగినది.

పోతన్న తొలుత వీరశైవ కుటుంబీకుడు. క్రమముగ పరిణత మనస్కుడై హరిహరాద్వైతమును గుర్తించిన పరమ తాత్త్వికుడు. అంతియ కాక భక్తి భావ భరితాంతరంగుడు. భక్తి వేదాంతముల-వినాభావ సంబంధ బాంధవ్యముకలవి. ఆ రెండును గంగా యమునల వలె సంగమింప జ్ఞాన సరస్వతి యంతర్వాహినిగ గలవాడు పోతన్న. భాగవత రచనమునకు ప్రధానముగ కావలసిన యర్హతలీ మూడును. అట్టి యర్హత కలవాడు కనుకనే భాగవతమంతవఱకు నాంధ్రీకరింప బడక నిలచి యున్నది. అద్వితీయులయిన కవిత్రయాదులకీ యర్హత లేదనికాదు నాయభిప్రాయము. ఆ మూడును 'సమపాళ్ళ'లో సంపూర్ణముగ కలవాడు పోతన్న. అందులకు వలయు హృదయార్ద్రతయు, ప్రేమ భావమును, కపటమెఱుగని చిత్తస్థితి, సర్వభూతదయ ఈ రీతిగ పరమ భాగవతుడుగ అవతరించినవాడు మన పోతన్న. కావున భాగవతాంధ్రీకరణమునకు సంపూర్ణార్హత కలవాడయినాడు. "వీర మతావేశ సంకులిత ప్రజాజీవనములో శాంతిని సాధింపనుదేశించిన

భగవత్సంకల్పమునకు సాధన భూతుడై పోతన భాగవత మహా కావ్యమును తెనుగువారి కందించినాడు.... (ఆంధ్ర భాగవతవిమర్శ పుట - 57.) అను శ్రీ ప్రసాదరాయ కులపతి వారి మాట నిక్కపు మూటయే.

పోతన్న భాగవత రచనమునకు పూనుకొనిన హేతువిట్లున్నది.

ఆరోజు పూర్ణిమ. దేవతార్చనాదికములయినవి. పూర్వకవినుతి జరుగుటయేకాక వర్తమాన కవులకు ప్రియమును, భావికవుల బహూకరణమును జరిగినది. సోమోపరాగము కాంచి గంగకుచని స్నాతుడయినాడు. అంత సైకతమున పద్మాసనస్థుడై మహేశ్వరధ్యానంబు సేయుచు కించిదున్మీలిత లోచనుడైయున్న పోతన్నకు రామభద్ర దర్శనమయినది. రాముడే "శ్రీమద్భాగవతము దెనిగించుము, నీ భవబంధనములు తెగునని" యానతిచ్చి యదృశ్యుడయినాడు.

ఈవిధముగ శ్రీరామచంద్రుని యానతిని బురస్కరించుకొని పోతన్న పరమాద్భుత మాధుర్యముతో భాగవతామృతము నందించినాడు. మఱియు ఎంతో వినయజ్ఞుడు మన పోతన్న. చూడండి తాను నిమిత్త మాత్రుడననుచు.

"పలికెడిది భాగవతమట
పలికించెడువాడు రామభద్రుండట నే
పలికిన భవ హరమగునట
పలికెద వేఱొండుగాథ పలుకగనేలా?

(పోతనభాగ. 1 - 18.)

యీ విధముగ జెప్పుటలు పరికింపగ వాని లక్ష్యము, హృదయ సుకుమారతయు తెలియును.

ఇక రచనా విధానమున పోతన్న నన్నయాదుల స్వతంత్రానువాద పద్ధతిని, శ్రీనాథుని యథామూలానువాద విధానమును అనుసరించినట్లు కనుపించుననుట యథార్థము. భాగవత పురాణమును పోతన్న తెనుగున కావ్యముగ సంతరించెననవచ్చును.

సంస్కృతాంధ్రోభయాభీష్టులందఱును మెచ్చునట్లు వ్రాసెదనని నిర్వచించినాడు.

"విబుధ జనులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు." (పోతన్న భాగ. 1-17)

నని యెంతో యుదాత్తముగ చెప్పుకొనిన వినయధురీణుడు. పోతన్న తెలుగు భాగవతములోని ప్రతి పద్యం సద్యోముక్తి సంధాయకం. పోతన్న భాగవతం తెలుగు వారి నిత్య పారాయణ గ్రంథము. పోతన్న భాగవతానువాదము రసవంతమై యొప్పును. ఈ భాగవత పద్యములు కంఠతః రాని తెలుగువాడుండడనుట యతిశయోక్తి కాదు.

తెనుగు భాషయందు భారత రామాయణముల నెందఱు కవులైనను ఎన్ని రీతులనైన వచించ వచ్చును. రచించవచ్చును కాని భాగవతమును మరల దెనుగున జెప్పబూనుట కడు సాహసము. పోతన్న కవితముందితర కవుల కవిత సూర్యుని సమీపమున కరదీపిక వలె జిన్నపోవునను మాటలాయన కవితా విశిష్టతను దెలియజేయును.

తదుపరి కాలముననుకొందఱు కవులు పోతన్న రచన చేయనివి, గంగనాడు లవియునగు భాగములను రచింప యత్నించిరి. 'హరిభట్టు' యనునతడు షష్ఠ, ఏకాదశ ద్వాదశ స్కంధములను

ప్రసిద్ధులు మొదటి జంట కవులయిన నందిమల్లయ, ఘంట సింగయయును షష్ఠస్కంధమును 'శృంగారషష్ఠముగదెనిగించిరి. ఏకాదశ ద్వాదశస్కంధముల నాధునికులలో సంపన్నుడుంబై సింగరాచార్యులు, మిన్నికుంటి గురునాథ శర్మగారును వ్రాసిరి.

ఆధునిక కాలమందే శ్రీ శాస్త్రిగారేకాక పూర్తిగ భాగవతాను వాదము చేయుట కనుపించును. గద్వాల సంస్థానాస్థానకవులు జంటకవులుగ శ్రీరామ నృసింహమూర్తి కవులని పేరందిన గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నృసింహమూర్తి యను వారలును శ్రీమద్భాగవతమును పూర్తిగ సాంధ్రీకరించిరి.

పోతన్న భాగవతముపై యెందరో పరిశోధక పరమేశ్వరులు వివిధ కోణముల పరిశీలించి యెన్నో విషయములను వెలయించిరి. ప్రస్తుత పరిశోధనాంశమునకుపబలకముగ సమంజసమని పోతన్న భాగవతమును గూర్చి యించుక చెప్పి యన్య భాగవత భాగములు, భాగవతములున్నవని చెప్పినాడను.

ప్రస్తుతము పోతన్న భాగవతము రస వంతమైనవి, యద్వితీయమైనదియునుండగ శ్రీ శాస్త్రిగారు మరల 'శ్రీకృష్ణభాగవతము'ను రచింప హేతువును పరిశీలించెదను.

## శ్రీకృష్ణభాగవతము:-

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు భారత, భాగవత రామాయణ ములు మూటిని తెనుగున నొక్కచేతిమీదుగ దీర్చి పూర్వ బహు కర్తృక లోపమును లేకుండ జేసిరి. పూర్వ మహాకవులు స్వయముగ తత్త్వాత్కావ్య నిర్మాణ దక్షులయినప్పటికిని యేలనో యా గ్రంథ ములు బహు కర్తృకములుగ వెలిసినవి.

భారత రామాయణములు నన్నయాదుల పిదప మరల వెల యుట యీ తెలుగు భాషయందు కానవచ్చును. రామాయణము

విషయమున మరీని. దీనివలన తెలుగువారికి రామాయణము నెడ కల ప్రీతి విశదమగును. ఈ విధముగ రామాయణ భారతములు మరల రచింపబడినవి. కాని యెవ్వరును భాగవతము వైపునకు చేయిచాచుట యటులుంతము. కనీసము చూచుటకైనను సాహసము చేయలేదు. అది పోతన్న భాగవత విశిష్టత. ఇట్టిస్థితిలో శ్రీ శాస్త్రివారు మరల పరమ ప్రామాదికములైన యీ మూడింటిని యనన్య సాధ్యముగ రచనా నిర్వహణమున దిద్ది తీర్చిరి.

ఇందు భారత భాగవతములు యథామూలముగ శాస్త్రివారి చేతి లో నాంధ్రత్వమును సంతరించుకొనినవి. రామాయణము మాత్రము వివిధ రామాయణ విచిత్ర విషయములు కైకొనబడి రచింపబడినది.

ప్రథమమున తెలుగులో వెలసిన భారత, భాగవత, రామాయణాను వాదములు యథామూలముగాదు. స్వతంత్రరీతిలో మూల మాధారముగ మాత్రము రచింపబడినవి. వీనియందు మూల వ్యత్యయములు కానవచ్చును.

శ్రీ శాస్త్రిగారు ప్రథమముగ భారతమును తమకందుగల ప్రీతి చేతను, వ్యాస హృదయము భారతమున నెట్లావిష్కరింపబడినదో తెలియజేయవలయునను అభిలాషముచేతను, అనువాదమున వ్యత్యయములున్న హేతువు చేతను మరల యథామూలముగ పది సంవత్సరములలో పునర్నిర్మించిరి. అది శాస్త్రివారి పేర శ్రీకృష్ణ భారతముగ వెలసినది.

పిదప సర్వ రామాయణ విచిత్రాంశామూలకములు చూపబడుచు శ్రీకృష్ణరామాయణమను పేర రామాయణము రెండు నెలల పదునైదు దినములలో రూపు దిద్దుకొనినది.

అటు పిమ్మట మిత్రుల ప్రోత్సాహమున మూల భిన్నముల

భావము సత్యము. అదియే శాస్త్రివారి భావమను దానికి తరువాత "నే నొండెంచక సాహసించి" యను దానిలోని "సాహసించి" యను నదియే సాక్ష్యము. ఇట్లు చెప్పుకొనుటలో శాస్త్రిగారికి పోతన్న యందుగల గురుతర భక్తిభావము, పోతన్న భాగవతము నందలి యభిమానము సూచింపబడి వారి వినయ భావమునకు నాటుపట్టయి నది. సరియ. ఇంతకును మూడవదియైన భాగవతమును సంస్కరించి మూలానుసారముగ నిర్మించమని శాస్త్రి వారిని తన్మిత్రులు వేడుట స్పష్టమగుచున్నది. ఇంకను వారు పలుకుచున్నారు చూడుడు.

ఆ॥ ఇదియుగాక భరత పృథివికి మణులైన
మూడు కృతులు చేసి పోడిమిగను
నట్టివాడవగుదువది యురచింపము
తెలయనీకు నాల్గు నెలల పనియె. శ్రీకృష్ణ భాగ 1-15

అంతియగాక భారతగర్భ మాణిక్యములు మూడును రచించిన కీర్తి దక్కునని తిరుగులేని చివరి యస్త్రము శాస్త్రివారిపై ప్రయోగింపబడినది. రచనా కాలమును కూడ ఏదో ఉపాధ్యాయుడు విద్యార్థికి శిక్ష నిచ్చినట్లు నాలుగు నెలలుగ నిర్ణయించినారు. ఇక నేమున్నది. పథకమంతయు పూర్తయినది గ్రంథరచనా కార్యమున్నది. అదియును కాకమానునా? సర్వ సామర్థ్యము దక్షులైన శాస్త్రిగారి యందలిదికదా। అదియును చూడుడు.

వ॥ అని ప్రబోధించిన నేనొండెంచక సాహసించి భాగవత మహాపురాణంబు తదేక దీక్షగా నాల్గుమాసంబులలో ననౌచిత్యంబు పరిహరించి యౌచిత్యంబు గ్రహించి మూలాను సారంబుగా నాంధ్రీకరించి. శ్రీకృష్ణ. భాగ. 1 - 16.

అప్పుడు శాస్త్రిగారు వారలచే నటుల ప్రబోధింపబడి వెంటనే చింపక సాహసించి భాగవతమును ఏకాగ్రతతో నాలుగు నెలల కాల

మున అనౌచిత్యమును పరిహరించి ఔచిత్యమును స్వీకరించి మూలాను సారముగ శ్రీకృష్ణ భాగవతముగ నాంధ్రీకరిచిరి.

ఈ విషయమును బట్టి శ్రీకృష్ణ భాగవత రచనమునకు ఈ క్రింది కారణములను పరిగణింప వచ్చును.

1. మిత్రుల ప్రోత్సాహము,
2. భారత రామాయణములతో బాటు మూడవదియగు భాగవత మును కూడ మిత్రుల ప్రోత్సాముతోడను రచించ దలచుట.
3. పోతన్న యనువాదమున మూలభిన్నములు కానవచ్చుట.

ఇక శ్రీకృష్ణ భాగవతానువాదమిట్లు సాగినదని తెలియు చున్నది.

1. అనౌచిత్య పరిహారత్వము.
2. ఔచిత్య గ్రహణము.
3. మూలాను సారము.

ఈ శ్రీకృష్ణ భాగవతానువాద విధానము తనుపరి పరి శీలింపబడును.

—*—

# భాగవత భక్తి

"భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీకయా" యని పెద్దల భావనము. భాగవతము భక్తి చేతనే యర్థమగును. కాని పాండిత్యాదులవన కాదని తాత్పర్యము.

ప్రథమమునుండియు నీ సృష్టిని పరిశీలించిన మానవులు దీనికి యొక కర్త యజ్ఞాతమున నుండునని భావించి వానిని తెలియ

త్పించుటద్వారా మానవుని హృదయమున నుత్కంఠతో కూడిన యారాధనా భావముదయించి విజృంభించుట జరిగినది. అందులకై యర్చనాదిక కర్మకాండలు వెలిసినవి. భక్తియను నది హృద్గతమైన యొక మధుర భావము.

ప్రాచీన కాలమున మోక్షప్రాప్తి సాధనములుగ జ్ఞాన కర్మ భక్తి మార్గములు నిర్దేశింపబడినవి. ఇందు జ్ఞాన విధానమతి క్లిష్ట తరము. పరిణతమనస్కులైన మహాయోగులకు మాత్రమ. ఇదిసామాన్యుల కందనిది. శంకరాదులకే యిట్టిది యనువైన మార్గము. అట్లే కర్మ మార్గమును అందరకును వీలుకాదు. లింగ వర్ణాశ్రమ వయో భేదముల ననుసరించి కర్మము లెన్నియో విహితములు. కావున నిది యును క్లిష్టతరమే. ఇంక పండిత పామరులనక స్త్రీ పురుష భేద మును లేక యందరకు నాచరణ యోగ్యమైనది భక్తి మార్గము మాత్రమే. జ్ఞాన కర్మ మార్గముల కంటెను భక్తి మార్గమెక్కుడు సౌలభ్యమును కలిగి యున్నది. 'భజ సేవాయాం' యను ధాతువు నకు 'క్తిన్' ప్రత్యయము చేరగా భక్తి పద నిష్పన్నము జరుగును. ఈ ధాత్వర్థమును బట్టి పరిశీలించినచో నిర్మలమైన మనోవాక్కాయ కర్మలతో బరమేశ్వరుని సేవించుటయే భక్తి యనబడును.

అసలు 'భక్తి' అనునది పలువురచే పలు విధములుగ నిర్వచింప బడినది. భగవద్గీతయు నీ భక్తిని గూర్చి యిట్లు చెప్పినది.

"మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే

శ్రద్ధయా పరయోపేతాస్తేమే యుక్తతమామతా" భగవద్గీత.

మిక్కిలి శ్రద్ధకలిగి యేకాగ్ర చిత్తమున భగవదర్పిత బుద్ధితో నుపాసించుట యని తద్భావము.

భక్తి రస్య భజనం ఏతదిహా ముత్రోపాధి నైరాశ్యే నాముష్మిన్ మనః కల్పం" యని యుపనిషద్వాక్యము. గోపాల పూర్వతాపన్యుపనిషత్.

భక్తి యనగా భగవంతుని సేవించుట, హృదయమును తద్గత
ంనర్పుట యని యర్థము.

"అన్యాభిలషితా శూన్యం జ్ఞాన కర్మాద్యనావృతం
ఆనుకూల్యేన కృష్ణాను శీలనా భక్తి రుత్తమా"
భక్తిరసామృత సింధువు.

ని భక్తి రసామృత సింధువు. కృష్ణననుశీలించుటయే ఉత్తమ
యనుట.

"అనన్య మమతా విష్ణౌ మమతా ప్రేమసంగతా
భక్తిరిత్యుచతే" నారద పాంచరాత్రి శ్లోక నిర్వచనము."
యని మరియొక నిర్వచనము. విష్ణువునందు ప్రేమ పూర్వక
న మమతయే భక్తి. శంకరులును
"స్వస్వ రూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే"
(శంకరుల వివేకచూడామణి)

చక్కని సమంజసమైన నిర్వచనమగుచున్నది "స్వస్మిన్ స్వస్య
శ్వరస్య రూపానుసంధానం భక్తిః" ఆత్మయందు నీశ్వర రూపము
రోపించుకొనుట, హృదయమున నీశ్వర నామ రూప గుణ భావన
ముట భక్తి.

మరియు నెందఱో ఋషులు కూడ భక్తి భావముచే తరించి
వచించుటయు కానవచ్చును. భక్తికి రసత్వము ప్రతిపాదించుచు
ధుసూదన సరస్వతి,

"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహకతాంగతా
సర్వేశే మనసో వృత్తిః భక్తిరిత్యభిధీయతే" భక్తిరసాయనము.
ంచు తన భక్తి రసాయన గ్రంథమున పలికినాడు.

భగవంతునియందవిచ్ఛిన్న ప్రవాహమగు చిత్తవృత్తియే భక్తి

లంబన విభావము. తులసీ చందనాదులు, భగవచ్చరిత్రలు నుద్దీపన విభావములు. తత్సమయ సంజాత నేత్ర భ్రూ విక్షేపాది అంగ వికారములనుభావములు. నిర్వేద శంకా హర్షాదులు వ్యభిచారీ భావములు. ఈ విభావానుభావ వ్యభిచారీ భావములు సంయోగించుటచే స్థాయిత్వము నొందిన భగవదాకారతారూపమైన మానస వృత్తిని పోషించుట ద్వారా పరమానంద సాక్షాత్కారాత్మకమైన భక్తిరసము ప్రతీయమానమగునని చెప్పినాడు. ఇట్లు మధుసూదన సరస్వతి తన భక్తి రసాయన గ్రంథమున భక్తికి రసత్వమాపాదించుటయే కాక యన్య రసములు లౌకిక రత్యాది స్థాయి భావములను కలియుండును కనుక హీనములని నిరసించినాడు. ఒక భగవద్రతి మాత్రమే పూర్ణత్వమైనదని సమర్థించినాడు. 'ఉజ్జ్వల నీలమణి' కర్తయైన రూపగోస్వామియు మధుసూదన సరస్వతి యడుగు జాడల ననుసరించినాడు.

ఈ భక్తి రసత్వమును గూర్చి యాలంకారికులు సమగ్రముగ చర్చించి చివరకు భక్తి యనునది భావము మాత్రమే యగుచు కాని రసత్వము నందజాలదని నిర్ధారణమొనర్చిరి. భావము ననుసరంచి ఈ భక్తి భావము మిగిలిన రసము లందంతర్భవించును.

ఈ భక్తి నవ విధములని భాగవతోక్తి.
"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్.
(సంస్కృతభాగ. 7 స్కంధ - 5 అధ్యా. 23 శ్లో.)

ఆసక్తి కారణముగ భక్తి గుణమాహాత్మ్యాసక్తి మొదలగు పదునొకండగు విధములని నారదభక్తి సూత్రములు, శ్రవణాది నవవిధ భక్తులును గుణ ప్రయుక్తమైనట్టివి. భాగవతమునందు ప్రస్తూయమానమైనది ప్రధానముగ నీ సగుణ భక్తికాదు. నిర్గుణమైన భక్తి. ఏక విధమైనది, శ్రీకృష్ణ భాగవతమున గజేంద్రుని ప్రార్థనము చూడుడు.

క॥ విశ్వమయు విశ్వ వేద్యుని
విశ్వాత్ముని విశ్వయోని విశ్వనవిశ్వున్
విశ్వేశు విశ్వసృట్టును
శాశ్వతభక్తిన్ భజింతు స్వాంతమునందున్.

(శ్రీకృష్ణభాగ. 8 - 56.)

ఇందు విశ్వరూపు డయిన యొక వ్యక్తి సంభావింపబడుట కానవసును. అదియే కదా నిర్గుణత్వము.

అట్టి పరమేశ్వరుని యందు గుణశ్రవణ కారణమున అవిచ్ఛిన్నమైలినమగునట్టి మనః ప్రవృత్తి నిర్గుణ భక్తి. ఇందు భేదదృష్టి కానరాదు. ఫలాభిసంధి యుండదు. అహేతుకమైనది. ఇట్టి నిర్గుణ భక్తులు సాలోక్య సామీప్యాది పంచవిధ ముక్తులయందు దేనిని వాంఛింపరు. భగవత్సేవా నిమగ్నతయే వారి ధ్యేయము. అదియే ఫలము. ఇట్టి భక్తి యోగమున సత్త్వాది త్రైగుణ్యము నిరస్తమయి హేలగ బ్రహ్మ భావము కలుగును. బ్రహ్మ భావము దృశ్య ఫలమైనను భక్తి యోగమునకు అనుషంగికమే కదా।

"ఏకాంతినోయస్యన కించిదర్థం
వాంఛంతి యేవై భగవత్ప్రపన్నాః
అత్యద్భుతం తచ్చరితం సుమంగళం
గాయంత ఆనంద సముద్రమగ్నాః"

యను దాని బట్టి బ్రహ్మభావము కంటెను భక్తియోగమే యున్నతమైనదని తెలియుచున్నది. ఇట్టి భక్తి భాగవతమునందు మాత్రమే యుపదిష్టమయినది.

భాగవతమున భగవంతునకు పర్యాయపదముగ 'వాసుదేవ' శబ్దము ప్రయోగింపబడినది. వసుదేవసుతుడగు శ్రీకృష్ణునకేకాక

పరబ్రహ్మమునకును బర్యాయవాచకముగ నున్నట్లు వాఙ్మయ విదితము.

ఈ వాసుదేవ శబ్ద నిష్పత్తి 'పాణిని' అష్టాధ్యాయిలో కనుపించును. పతంజలి భాష్యము వ్రాయుచు నిచట వాసుదేవ సంజ్ఞ క్షత్రియ సంబంధముకాక భగవత్సంబంధి యని చెప్పుట గమనింపదగినది.

భగవద్భక్తి వివిధ భావములలో వ్యక్తము చేయబడును. అందు శాంత దాస్య సఖ్యవాత్సల్య మాధుర్య భావములు ప్రధానము లందురు. ఇందేభావమైనను భక్తి నిస్తారకమైనట్టిదియే.

శాంతభక్తి విరక్తులు, తపోనిధులునైన నారదాది మునీంద్రుల వశము. హనుమదాదులు దాస్య భక్తికి, అర్జునాదులు సఖ్యభక్తికి, యశోదా, నందాదులు వాత్సల్య భక్తికి, గోపికాదులు మాధుర్య భక్తికిని తార్కాణులు. ఇంకను శరణాగతి రూప భక్తికి ప్రహ్లాదాదులు తరించిరి. అంతియే కాక మరియొక విచిత్ర భావము భాగవతము నందు గోచరించును. భగవత్ప్రేమచేతనే కాక భగవద్వైరము చేత గూడ తరింపవచ్చుననుట. ఇది వైరభక్తి యన్న మాట. దీనికి కంసాది పుణ్యజనులు నిదర్శనులు. అనగా వైరమనువదియు భక్తియందంతర్భవించును. దీనినిబట్టి భగవంతుని యందు తలపుండుటయే ప్రధానమని తేలుచున్నది.

వైరముచేతను దరింపవచ్చునని ధర్మజుని సందేహము దీర్చువాడై నారదుడు వివిధ విధములుగ దరింప వచ్చునని పలికిన ప్రఖ్యాత వ్యాస భాగవత శ్లోకమిది.

"గోప్యః కామాత్ భయాత్ కంసోద్వేషాచ్చైద్యాదయో నృపాః
సంబంధాత్ వృష్ణయః స్నేహాత్ యూయం భక్త్యావయం నృప.
(సంస్కృతభాగ 7 స్కంధ. 1 అధ్యా - 30 శ్లో.)

ఇద్దానికి పోతన్న యనువదించిన సొగసైన రచనమిది.

శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి మేము నిదె చక్రిం గంటి మెట్లైనను
ద్ధామధ్యానగరిష్ఠుడైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా.
(పోతనభాగ 7 - 18.)

ఇట్లు శార్దూల వృత్తమున రచింపబడినది.

శాస్త్రిగారు సీస పద్యమున వెలయించిన చెలువమును గాంచుడు,

సీ॥ కామమునన్ గోపికాస్త్రీలు భయమున
గంసుడు ద్వేషంబు కలిగి కొనుట
శిశుపాలుడాదిగా క్షితిపతుల్ పెక్కురు
బంధుత్వమున యదు వంశ జులును
నిండుమైత్రిం జేసి పాండవుల్ మీరును
పూర్ణ భక్తిం జేసి మునుల మేము
భగవంతుడగు కృష్ణ పరమాత్మునందునె
మ్మనము నిశ్చలముగా నునిచి కొలిచి

తే॥ ముక్తులయితిమి ధర్మజా। పోల్చి చూడ
వైరము వహించినను శిశు పాలముఖ్యు
లకును మోక్షము లభియించె లఘుగతులను
సందియంబంద నిట నవుసరము లేదు.
(శ్రీకృష్ణభాగ. 7 - 25.)

ఇందన్ని రకములను వివరించి ప్రస్తుతము సమంజసమైన వైర భక్తిని గూర్చి చివరగ నొక్కి వక్కాణించుట శాస్త్రిగారి ప్రత్యేకత. ఇట శాస్త్రిగారనువాదమున సీస పద్యమును గ్రహించి విపులముగ వివరించి వృత్తౌచిత్యమును బాటించినారు.

సూతుడు శౌనకాది పరమర్షులతో సంతసమున పలికిన విధమిది,

చ॥ అడిగితిరీరులోకహిత మాస పొనర్చుచు బ్రశ్న మిద్దియె
ప్పుడు సకలేష్టదంబగుచు బొంపిరి పోయెడు విష్ణునామమున్
విడువక సంస్మరించినను విఘ్నములయ్యును బాయుబుణ్యముల్
కడుకొని డాయు మక్తియునుగగ్గెడు నెయ్యెట నెట్టివానికిన్.
(శ్రీకృష్ణభాగ. 1 - 130.)

ఇందు విష్ణునామ మాహాత్మ్యము స్పష్టముగ జెప్పబడినది.

క॥ భగవన్మహిమము దెలుపని
దగు కావ్యము కాక తీర్థ మట్టులు వ్యర్థంబగు.
(శ్రీకృష్ణభాగ. 1 - 169.) అని

తదౌన్నత్యము చెప్పబడినది.

కుంతి స్తుతిలోని భక్తి విషయము పరికింపుడు,

తే॥ నీ చరిత్రము వినువారు నిన్ను బొగడు
వారు నీ రూపు ధ్యానించు వారు నిన్ను
గొలుచువారును సంసార కూపములను
గూలిపోవక ముక్తిగైకొందు రండ్రి.
(శ్రీకృష్ణభాగ. 1 - 264.)

ఇందు సంసార కూపమున బడక తరించుటకు విష్ణుభక్తియే సాధనమని యుటంకింపబడినది.

ద్వితీయ స్కంధమున శుకుడు పరీక్షిత్తునకు సర్వరక్షకుని తీవ్ర కాంక్షచే కొలచిననే బ్రహ్మానందతుందిల చిత్తుడగునని చెప్పుట చూడుడు,

మ॥ ఖలులంగొల్వక సర్వ రక్షకునిగాంక్షం గొల్చి నంగర్మబం
ధలతల్ద్రెస్సి సుఖస్వరూపు డగు శ్రీనారాయణుంజేరియె

వ్వలనన్ బాయని సౌఖ్య సంపదలతో వర్తించు చానందతుం
దిల చిత్తుండయి యోగి యోగపరతన్ దీపించు నెల్లప్పుడున్.
(శ్రీకృష్ణభాగ. 2-32.)

ఇందు యోగి విషయము స్థూలముముగ జెప్పబడినప్పటికిని విష్ణు సేవా మహిమము, భక్తిమహిమము గూఢముగ వివరింపబడి యద్దానివలననే కర్మ సంబంధలతలు తెగునని యుక్తమయినది.

సీ॥ విష్ణుని కథలను విననట్టి జానుగుల్
గ్రావంబులంగల కందరములు
వైష్ణవగాథలన్ బలుకని నాలుక
తడికారు కప్పల తొడుగు నాల్క
కమలనాభునకు మ్రొక్కని శిరంబది గడ్డి
బొమ్మపై పెట్టిన పొల్ల శిరము
పుండరీకాక్షుని పొడగనంబోవని
కనులు ప్రతిమకైన గాజు కనులు

తే॥ శార్ఙ్గి కొలువని చేతలు శవము చేతు
లీశ్వరునిగొల్వకుండిన హీన జనుని
దేహమారయ బ్రాణముల్ దెగిన యట్టి
దిక్కుమాలిన ప్రేత పెందేహమనగ.

వ॥ విష్ణుభక్తి పరాయణుండుగాని నరుండు నడపీనుగుంబోనివాడని తెలియందగు .... శ్రీకృష్ణభాగ. 2-61, 62.

యని విష్ణుభక్త్యున్నతి కీర్తింపబడినది. తృతీయస్కంధమున ధరనుద్ధరించిన వరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతించుటలోని భక్తి విషయ మిటులున్నది.

వ॥ .... అఖిల మంత్ర దేవతా ద్రవ్యాత్ముండవు సర్వ క్రతు రూపుడవుభక్తి గమ్యుండవు .... శ్రీకృష్ణభాగ. 3-148.

ఇందు భక్తిగమ్యుడవని భగవంతుని స్తుతించుటలో భక్తి పరమార్ధకత స్పష్టము. సర్వక్రతు రూపుడవనుటలో "యజ్ఞో వై విష్ణుః" అనునది ద్యోతమానము.

భాగవతము మోక్షప్రాప్తికి జ్ఞాన కర్మ భక్తి యోగములు మూడును పథములని సిద్ధాంతీకరించినను వానిలో భక్తి యోగము ప్రధానమని చెప్పును. మోక్షసాధన (సామగ్య్రాంభక్తిరేవగరీయసి) భగవానుడుద్ధవున కుపదేశమొనర్చిన ఘట్టున భక్తి విశిష్టత చెప్పబడుట కనుపించును.

"యత్కర్మభిర్యత్తపసా జ్ఞాన వైరాగ్య తశ్చయత్
యోగేన దానధర్మేణ శ్రేయోభిరితరైరపి
సర్వం మద్భక్తి యోగేన మద్భక్తోలభతేంజసా."

(సంస్కృతభాగ. 11 స్కంధ - 20 అధ్యా. 32, 33 శ్లో.లు.)

ధ్రువుని స్తుతియందు విష్ణు పద సేవనము ముక్తి కంటెను ఘనమైనదని ప్రోక్తమగుట కనుపించును. పరికింపుడు,

తే॥ నీ పదార్చన ముక్తి కంటెన్ ఘనమన
గర్మఫలభుక్తియైన పై ఘన విమాన
ములను విహరించు చింతలో నిలనుగూలు
వేలుపుల జెప్ప వలయునే వేద వేద్య. (శ్రీకృష్ణభాగ. 4-1 61·

మూల భాగవత సప్తమస్కంధమున ప్రహ్లాదుడు పితరునితో నవ విధ భక్తులనిట్లు పలుకును,

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత్తముత్తమమ్.

(సంస్కృతభాగ. 7 స్కంధ. 5 అధ్యా. 23, 24 శ్లోలు.)

శాస్త్రివారి అనువాదమిది,

శా॥ సర్వజ్ఞుండగు నీశ్వరుం దెలిసి విజ్ఞానంబునం దోగుచే
నేర్వన్ విద్యలకున్ ఫలంబగును గానీ కీర్తి నొంధంగగా
దుర్విన్ గర్వినశించుగావునను నే నోవిద్యలన్నేర్చితిన్
సర్వం విష్ణుమయం జగత్తనుచు నశ్రాంతంబు జింతించుటల్.

ఉ॥ ఆగమముల్ బడిన్నుడువు నాదియు నంతము లేక లోకముల్
వీగక సృష్టిచేసియును బెంచియు దు్రంచియు లీలనాడుచున్
దాగతియై మెలంగెడునుదారత నచ్యుతుడంచు గాననా
యోగివరేణ్యునిం దెలియు టొక్కడెరింగితి దండ్రి విద్యలన్
-శ్రీకృష్ణభాగ. 7-146, 147

అనువాదమున మూలములోని నవ విధ భక్తులనలు కానరావు. దానికి హేతువు భక్తులననేకులనేక సంఖ్యలుగ జెప్పిరి. మూల భాగవతము తొమ్మిదియును, నారద భక్తి సూత్రములు పదనొకండు నిత్యాదిగ నెన్నో రకములుగ నున్నవి. అన్నియును భక్తి యందంతర్భవించును గదా ॥ అందులకే శాస్త్రివారందటి సంఖ్యలు ద్యోతకమగునట్లు నొక్క భక్తినే సృష్టిస్థితిలయ కారకుడు, సర్వ వ్యాపకుడునయినట్లుగ వేద ప్రామాణ్యుడైన యా యోగివరేణ్యుని దెలియుటొకటే విద్యలలో నేర్చితినని ప్రహ్లాదునిచే బలికించినారు. ఇందు వైరాది భక్తులునంతర్భవించుచున్నవి. ఇది శాస్త్రి వారి ప్రతిభతో గూడిన తీర్పు. సమంజసమే మరి.

భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు తన మతమును నమ్మి యజస్రము భజింపుమను తండ్రితో పలికిన పలుకులు ముత్యపు తళుకులే,

మ॥ అమృతాస్వాదన మాచరించుచు మహాహ్లాదంబు నందోగు ను
త్తమ చారిత్రుడు గంజిదా్రగుటకు జిత్తంబందు వాంఛించునే
సుమనస్సంఘ సమర్చితుండయిన విష్ణుంభక్తి భావించునే
నమరారీ । యెటులైనగాని విడియన్యంబుంగనంబోదునే.
(శ్రీకృష్ణభాగ. 7 - 210.)

అమృతమును గ్రోలుచు మహానందము ననుభవించు పరమోత్త ముడు గంజిని ద్రావ నిచ్ఛగించునా? దేవతా సమూహ కిరీట మణు లచే శోభించు విష్ణుని పాదపద్మములను భక్తితో భావించు నేను ఇతర ముల నెట్లు చూతును? ఇది ప్రహ్లాదుని భక్తి తత్త్వము. కనుకనే ప్రహ్లాదునకు పరమ భాగవతోత్తములలో అగ్రాసనాధిపత్యము లభించి నది. ఆ పరమభక్తుడు తకు ఉపదేశించిన నారదునికూడ మించి "శిష్యాదిచ్ఛేత్పరాజయమ్" అను సూక్తికి తావలమయినాడు.

భక్తునకు భగవంతుడెట్లువశవర్తుడగునో బలిచరిత్రము నికషో పలము. త్రివిక్రముడు బలితో భక్తి భావనము గూర్చి స్వయముగ బలుకుటలు పరమసత్యములై హృదయంగమములు.

ఉ॥ మేలగుగాక నీకుగడు మిక్కిలి వారును నిన్ను బోలగా
జాలరు దైత్యదానవు లజస్రము నినున్ భజియించుచుండ్రుడు పా
తాళమునందు నేటిసుత దర్పము నేప్పడ ధర్మమూర్తివై
పాలనముంబొనర్చుచు ప్రభంజనుమాప్తుల గూడి వేడుకన్.

(శ్రీకృష్ణభాగ. 8 - 264.)

అనుచు పాతాళాధిపతిని జేసి,

ఉ॥ భక్తుడవీవు భక్తునకు భావమొసంగుదు నేనుగాన నా
సక్తిమెయిన్ భవద్గృహము సంపదలన్ బొలుపొందజేయుచున్
బ్రాక్తన పుణ్యమోయనగ ద్వారముఖంబున జక్రపాణినై
రక్తుడనై మెలంగెద నిరంతరదగ్గున మిచ్చుచుంగృపన్.

(శ్రీకృష్ణభాగ. 8 - 265.)

భక్తుడవు కనుక నీ ద్వారముఖమున కావలికాచెదనని పలికి నాడు. భక్తునియందు భగవంతునికికల యవ్యాజానురాగము దీనిం బట్టి తెలియుచున్నదికదా। దీనిని బట్టి భక్తియొక్క పరమోత్కృష్టత దర్శనీయమగుచున్నది.

ఇక నంబరీషుని భక్తి భావము సగుణారాధనమై యతనికి నిరతి శయానంద సంధాయకమును గూర్చుట స్తుత్యమానము.

సీ॥ అతని చిత్తంబెప్డు హరిపాదపద్మము
లందు ధ్యానాసక్తి నందు చుండు
నతనివాకెపుడు శ్రీపతి గుణగణముల
వర్ణించునట్టి దైవఱలుచుండు
నతని చేతులు హరి సతతము సేవించు
పనులందు లగ్నమై పరిఢవించు
నతని శ్రోత్రములెప్డు హరికథా శ్రవణంబు
సేయుచుండెడుపని బాయకుండు

తే॥ అతని కన్నులు హరి విగ్రహమునె చూచు
నతని, త్వక్కును హరి భక్తునంట నెంచు
నతని జిహ్వా నైవేద్యము నారగించు
నతని శిరము నిర్మాల్యము నవధరించు.

మ॥ భగవద్భక్తుల తోడ గూడుకొని భూపాలాగ్ర గణ్యుండుదా
భగవంతుం బరమేశ్వరున్ హరి రమాప్రాణేశ్వరుం గొల్చుచున్
సుగమంబెంచక సర్వ కర్మములు విష్ణుం జేరనర్పించుచున్
సగుణారాధన మాచరించుచు నిశల్ సాగించె సద్భక్తిమై.

(శ్రీకృష్ణభాగ. - 90, 91.)

ఇందంబరీషుని గాత్రభాగములు వానంతటయవియే విష్ణు సేవా రతియందు తన్మయ మొందుట చూడనాతని భక్తి తత్త్వము విశదమగును. మఱియునతడు 'సుగమంబెంచక' సర్వ కర్మములను విష్ణుదత్తము చేయుట చూడ నతని నిష్కామ భక్తి యోగము స్పష్ట

భారతాశ్వమేధపర్వగతమై యాశ్లోకమునుజూడుడు. కామమున మోక్షకాముని పరిహసించుట కలదు.

"యోమాం ప్రయతతే హన్తుం మోక్షమాస్థాయ పండితః
తస్య మోక్షరతిస్థస్య నృత్యామిచ హసామిచ.

మోక్షార్థియై కామమైన నన్ను చంపుటకు ప్రయత్నించు పండితునకు కూడ మోక్షమునందు కోరిక యున్నది. కావున నట్టి వానిని జూచి నేను నవ్వుకొనుచు నృత్యమొనర్చు చుందునని భావము.

దీనిని బట్టి భగవత్సేవనాభక్తియే శ్రేష్ఠమని తెలియుచున్నది కదా। దశమస్కంధ వర్ణితమైన గోపికా కృష్ణ శృంగారము దివ్యమైనది. మోక్ష సంబంధి శృంగారమే - భక్తి శృంగారము లేక మధుర భక్తి. కావున వారివి లౌకిక శృంగారము కాక యలౌకికము.

పరీక్షిత్తుని సంశయమును శుకర్షి యెట్లు తీర్చెనో చూడుడు'

క॥ గోపికలకు దత్పతులగు
గోపాలురకెల్ల జంతుకోటుల కాల
క్ష్మాపతి జీవంబనగా
నా పురుషోమున కితరులన నుండుదురే?

(శ్రీకృష్ణభాగ. 10 స్కంధ. పూ.భా 2 ఆశ్వా-446.)

ఉద్ధవుడు గోపికల పరమ భక్తి భావనకు నచ్చెరువడి వారికిచ్చిన 'యుల్లాకు' చూడుడు.

మ॥ భవభీతింగల మౌనులేని మదిలో భావింపగానెంతురో
భువనంబుల్ సకలంబు తాన యగుచున్ బొల్పొందు నాదేవునిన్
ధ్రువమై నిశ్చలమైన భక్తిమహిమన్ స్తోత్రంబు గావించుచున్
భువినీ గోపవధూటు లెంతయును సంపూజ్యోద్ధవుల్ చూడగన్.

(శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 3 ఆశ్వా - 374.)

అంతియకాక యంతటి పరమ భాగవతోత్తముడును

తే॥ సర్వముత్యజించి వేశ్రీతలు సారసాక్షు
గొలచి పుణ్యాత్మలైరి వారలు మెలంగు
స్థలములు పవిత్ర తమములై తనరు నచటి
గడ్డిపరకకునే సరిగాను నేను

శ్రీకృష్ణభాగ. 10 పూ. - 3 - 378.

యనుచు ప్రశంసించుటలో గోపికల పరమ భక్తి భావనము సుస్పష్టమై వారి విధానము నిర్దుష్టమని తెలియుచున్నది. గోపికలును ఉద్ధమని సాగనంపుచు పలికినన పలుకులు భక్తి కాంతి పుంజములే.

ఉ॥ మానసముల్ ప్రవృత్తులును మాధవ పత్కమలాశ్రయంబులై
నేమమునొందు మానుడులు నిచ్చలు నచ్యుతనామ చింతయం
దేమటకురిడు మాతనువులీశ నమస్కృతులందు లగ్నమై
భూమి సెనంగు మేమతని మూర్తి రతిన్ బడియందు మెప్పుడున్.

శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 3 ఆశ్వా - 378.

ఇట్టి భావనాయత్త చిత్తలు కనుకనే గోపికలు ఉద్ధవుడంతటి భాగవతోత్తముని సైతము 'అచటి గడ్డి పరకకు నే సరిగాను నేను' యను కొనురీతిని చేయగలిగిన వారయినారు.

కావున గోపికలు కృష్ణ సౌందర్యమును తాత్త్వికదృష్టి చేతనే దర్శించిరికాని యైహికముగ గాదని తేలుచున్నది కదా!

ఈ విధముగ శ్రీకృష్ణభాగవతమున శాస్త్రిగారు సహితము పలు సందర్భముల కలభక్తి తత్త్వమును నేర్పుతో బ్రదర్శించిన వారయిరి.

# భాగవత వేదాంతము

"విద్యావతాం భాగవతే పరీక్షా" యని పెద్దల మాట. విద్యావంతులకు భాగవతము పరీక్షా గ్రంధమని తాత్పర్యము. భాగవతమునందును మిగిలిన పురాణములందు వలెనే రసవంతమైన యెన్నో విషయములు భక్తి భరితములై తన్మయము కలిగింప సరళ సమర్థములై సులభ సాధ్యములై యున్నవి. అటులైన పై మాట యెట్లు పుట్టినది? అందుల కేమాత్రమును శ్రమపడనక్కఱలేదు. భాగవతమంతయు భక్తి వేదాంతములతో నున్నది. అందుముఖ్యముగ ద్వితీయ, తృతీయ, ఏకాదశ ద్వాదశ స్కంధములు వేదాంత తత్త్వమునకు పట్టుగొమ్మలు. ఆయా స్కంధములతో వేదాంత ప్రతిపాదక సందర్భములు సామాన్యముగ కారుకుడు పడనివి వ టియును బహుక్లిష్టములు. భాగవతమందలి వేదాంత ప్రతిపాదక శ్లోకములను సమర్థ వ్యాఖ్య చేయగల వ్యక్తి పాండిత్య ప్రతిభావంతుడనుట సత్యము. ఈ భావ వ్యక్తీకరణ భావమే పై శ్లోకమందు చెప్పబడినది.

ఈ భాగవతమునకు మోక్షశాస్త్రమని కదా ప్రసిద్ధి. ఇందు బోధింపబడినది ఆత్మ విద్య. ఆత్మ తత్త్వము తెలియుటయే వేదాంతము. ఈ విధముగ ఆత్మ స్వరూప తత్త్వమే భాగవత తత్త్వము. అద్దానిని బోధించుటకు భక్తి అనుషంగికముగ గ్రహింపబడినది

పరీక్షిత్తునిశమీకపుత్రుడు తక్షక విషాగ్ని చే నేడు దినములలో శరీరమును విడుతువని శపించినాడు. సప్త దినములలో నట్లగుట తథ్యము. రాజునకు విరక్తి కలిగినది. మరల జన్మ లేకుండ మోక్షము

కలఋషులునువచ్చిరి. పరీక్షిత్ప్రశ్నమునుఋషులు

ఇంతలో రాజు పురాకృత పుణ్యవిశేషముచే శుక

మహర్షి అచటికి వచ్చినాడు. ఆయన రాజునకు భాగవతామృత మనుగ్రహించి మనోరథమును కూర్చినాడు.

రాజు ప్రశ్న యిది,

"అతః పృచ్ఛామి సంసిద్ధిం యోగినాం పరమంగురుమ్
పురుషస్యేహయత్కార్యం మ్రియమాణస్య సర్వథా."

(సంస్కృతభాగ. 1 - 19 - 37.)

మరణ సమయమున జనులు మోక్షముకొఱకేమి చేయవలెనని దాని భావము. భాగవతమే తత్సమాధానము.

"ఏతన్నిర్విద్యమానానా మిచ్ఛతామకుతో భయమ్
యోగినాం నృప నిర్ణీతం హరేర్నామానుకీర్తనమ్.

(సంస్కృతభాగ. 2 - 1 - 11)

విరక్తులై భీతి రాహిత్యమును వాంఛించుంచువారు యోగమవలంబించి హరినామ కీర్తన మొనర్పవలయునని శుకుని సమాధానము. ఇది గ్రంథారంభము. భయమనగా మృత్యుభయమే. ఇంతకు మించిన భయము లేదు. అది పోవలెను. ఎలా పోవుననినచో హరినామ కీర్తనవలన. సరియే. ఎట్టి వారికనగా విరక్తులకు, యోగులకు వైరాగ్యముతో కూడి యున్న భక్తి యోగము మరణ భయమును పోగొట్టునని తాత్పర్యము. నిజమునకు మరణమనునది భయము మాత్రమే. చివరకు శుకుడిదియే యిట్లు చెప్పును.

"త్వంతు రాజన్ మరిష్యేతి పశుబుద్ధిమిమాం జహి
న జాతః ప్రాగభూతోద్య దేహవత్వంచ ననంక్ష్యసి"
"దశంతం తక్షకంపాదే లేలిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ విశ్వంచ పృథగాత్మనః"
"ఏతత్తే కథితం తాత యథాత్మా పృష్టవాన్నృప."

(సంస్కృతభాగ. 12 - 5 - 2, 12, 13.)

రాజా, చనిపోవుదునన్నది పశుబుద్ధి. దానిని జయింపుము. పుట్టినది నీవుకాదు. కావున మరణించునదియు నీవు కాదు. పుట్టిన దేదియో యది మరణించును. నీవడిగినదానికి ప్రత్యుత్తరమిది. కాటువేయు తక్షకుడు, కాటు వడ్డ దేహము, దృశ్యమానమగు లోకము సర్వము నాత్మ స్వరూపమే. ఆత్మకంటె భిన్నములు కావు.

ఇది సారాంశము.

"ఘటే భిన్నే యథాఽఽకాశ ఆకాశః స్యాద్యథాపురా
ఏవం దేహేమృతే జీవోబ్రహ్మ సంపద్యతే పునః"

(సంస్కృతభాగ. 12-5-5.)

ఘటాకాశమనగా ఘటములోనున్న యాకాశము. ఘటమిట ఆకాశమునకుపాధి. ఇట్టి యుపాధి లేని యాకాశము మహాకాశము. ఘటము భిన్నమైనప్పుడు ఆకాశము భిన్నమనవచ్చునా? భిన్నమైనది ఘటముకాని ఆకాశము కాదు. ఆకాశమేమైనది? మహాకాశములో కలసినది. అనగా ఘటమున్నప్పుడును కలసియే యున్నది. విడిగా నున్నట్లు కనిపించినది. ఘటము భిన్నమైనప్పుడు కలిసినట్లు కనిపించినది. ఇట్టి తత్త్వజ్ఞానముచే నీ దేహము విలయమందినప్పుడు ఆత్మ ఆత్మలో కలసి పోవును.

ఇది యంతయును అద్వైత భావమే. భాగవతమున ఈయద్వైత తత్త్వమే ప్రధానముగ నిరూపింపబడినది. భక్తి విశిష్టతయును కల్గి కనుక భాగవతమున అటనట సాంఖ్యాది యితర సంప్రదాయము లను పొడగట్టును. మొత్తము మీద ప్రాధాన్యతను సంతరించు కొనినది యద్వైతమే. భాగవతమునకు కల వివిధ వ్యాఖ్యలలో శ్రీధరీయమునకే యగ్రస్థానము. శ్రీధరుడు భాగవతమున కద్వైత పరముగనే వ్యాఖ్యను కూర్చినాడు. పోతన్న తన యనువాదమున శ్రీధరీయ వ్యాఖ్యనే యనుసరించుట కన్పట్టును. కావున మూల

గవత మంతయును అద్వైత ప్రధానముగనే యున్నదని తెలియును. అందులకై మచ్చునకు కొన్ని యుదాహరణములు పరికింపజేయుదును.

భీష్మస్తుతియందలి భావనము మూలముననున్న తీరు,

"తమిమమహమజం శరీర భాజాంహృదిహృది
ధిష్టితమాత్మ కల్పితానామ్
ప్రతి దృశమివ నైకధార్కమేకం సమధిగతోస్మి
విధూత భేదమోహః"

(సంస్కృతభాగ. 1-9-42.)

ఇందు ఏకమైన పరమాత్మ తత్త్వము చెప్పబడినది. ఏకమైన పరమాత్మ తత్త్వము అద్వైతమే. దానికి శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాద మిట్లున్నది.

మ॥ తెలియన్వేడి వెలుంగొకండయి వియద్వీధిన్ వెలుంగొందుచున్
జలకుంభంబుల బెక్కులట్లగుచు జాంచల్యాద్యపోధర్మముల్
కలుగంబోవని యట్లు విశ్వ విభుడొక్కండయ్యు దానెల్లజీ
వులయందుంగనవచ్చు వానినెడదం బొందించు కొందున్ సదా.

(శ్రీకృష్ణభాగ. 1-290.)

విశ్వవిభుడొక్కడయినప్పటికిని యెల్ల జీవులయందును గానవచ్చుటు స్ఫుటమైన యద్వైతము.

"తదిదంభగవాన్ రాజన్ ఏక ఆత్మాత్మ నాంస్వదృక్
అన్తరో నన్తరోభాతి పశ్యతం మాయ యోరుధా.

(సంస్కృతభాగ. 1-13-47.)

ృష్ణభాగవతమున నిట్టులున్నది.

అజ్ఞానాతి శయంబు పెంపునను దేహంబాత్మగా నెంచుటన్
బాజ్ఞుండయ్యును దేహనాశనమునన్ బ్రాల్మాలిదుఃఖాత్ముడై

యజ్ఞుండట్లుగు నీవు జ్ఞానమున మాయారూపక భ్రాంతికిన్
పరిజ్ఞానంబును బోనడం పకుము ధైర్యస్థైర్యముల్గల్గుటన్.

(శ్రీకృష్ణభాగ. 1 -321.

మాయారూపక భ్రాంతిచేత దేహమే తాననుకొనుట, సమస్తమును వేఱనుకొనుటయును జరుగుచున్నది. ఈ యద్వైతమును శాస్త్రీవారు "మాయారూపక భ్రాంతి" యని తమ యనువాదమున ధ్వనింపజేసిరి.

"విదుర మైత్రేయ సంవాదమున వేదాంత పరములగు ననేక శ్లోకములున్నవి. విదురుని ప్రశ్నమొకటి చూడుడు.

"బ్రహ్మన్ కథం భగవతశ్చిన్మాత్రస్యా వికారిణః"
లీలయా చాపియుజ్యేరన్ నిర్గుణస్య గుణాః క్రియాః"
"క్రీడయా ముద్యమోర్భస్య కామశ్చిక్రీడిషాన్యతః
స్వతస్తృప్తస్యచకథం నివృత్తస్య సదాన్యతః
అసాక్షీద్భగవాన్ విశ్వం గుణమధ్యాత్మమాయయా
తథా సంస్థాపయత్యేతద్భూయః ప్రత్యపిధాస్యతి
దేశతః కాలితో యోఽసావవస్థాతః స్వతోఽన్యతః
అవిలుప్తావబోధాత్మా సయుజ్యేతాజయా కథమ్"
"భగవానేక ఏవైషసర్వ క్షేత్రేష్వవస్థితః
అము దుర్భగత్వం వాక్లేశోవా కర్మభిః కుతః"

(సంస్కృతభాగ. 3 - 7 - 2 నుండి 6.)

సీ॥ నిర్వికారుండును నిర్గుణుండును జిదా
త్ముండునైన భగవంతునకు లీల
చేనైనను గుణక్రియానుబంధమ్మెట్లు
పొసగెడు నిత్య తృప్తుడగు నాత్మ
నకుగామమెట్లగు నకలుషుండు నివృత్తి

గల భగవంతున కెలమిగ్రిడ
యందిచ్ఛయును జెప్పనగునె సృష్టిస్థితుల్
సలుపువాడతడని తెలిపిరప్పు

**తే॥** డతని కాత్మవిజ్ఞాన విచ్యుతి బడయని
జీవునకు **న**విద్యా యోగ భావమెట్లు
క్షేత్రములభోక్తయై యుండు జీవుడరయ
నద్వితీయాత్ముడని చెప్పనగును కాదె.

వ॥ అట్టివానికాత్మానంద భ్రంశము గర్మబంధమునెట్లు కలుగును.

(శ్రీకృష్ణభాగ. 3 - 80, 81.)

ఇందు బ్రహ్మము నిర్వికారము, నిర్గుణము, నిష్క్రియము, చిన్మాత్రమునని సుస్పష్టము. మఱియును జీవుడే యీశ్వరుడని నిర్దిష్టమై యున్నది.

ఇట్టి విదురుని సందేహముల మైత్రేయుని సమాధానములందు సుస్పష్టముగ నద్వైత తత్త్వము గోచరించును.

"సేయం భగవతో మాయా యన్నయేన విరుధ్యతే..
దృశ్యతే సన్నపిద్రష్టాత్మనోఽ నాత్మనో గుణః"

(సంస్కృతభాగ. 3 - 7 - 2 నుండి11.)

సీ॥ విదుర। తర్కమున కెయ్యది విరోధించున
య్యది భగవన్మాయ యనగ నగును

(శ్రీకృష్ణభాగ. 3 - 82.)

దీనియందీశ్వరుని జీవత్వము మాయాయుతమని స్పష్ట వివరణము చేయబడినది.

కపిలుని తత్త్వజ్ఞానబోధనమునందును ఇట్టి యద్వైతభావము కనుపించును.

"దదాపురుష ఆత్మానం కేవలం ప్రికృతేః పరమ్
నిరంతరం స్వయం జ్యోతిరణిమాన మఖండితమ్.

(సంస్కృతభాగ. 3 - 25 - 17.)

సీ॥ ఆత్ముడు కేవలుండని ప్రికృతికి బరుం
డని యపరిచ్ఛేద్యుడని యదహ్యు
డనియుదాసీనుడునని యాత్మలోన నె
ఱుగ గల్గిన నరుండు ....

(శ్రీకృష్ణభాగ. 3 - 242 )

కపిల తత్త్వమునందే మఱియొక సందర్భమున నిటులున్నది.

"అనాదిరాత్మా పురుషో నిర్గుణః ప్రికృతే పరః
ప్రత్యగ్ధామా స్వయంజ్యోతిర్విశ్వం యేనసమన్వితమ్.

(సంస్కృతభాగ. 3 - 26 - 3)

సీ॥ "ప్రత్యక్ప్రికాశుడు ప్రికృతికింబరుడగు
నాత్ముడే పురుషాఖ్యనలరుచుండు ..."

(శ్రీకృష్ణభాగ. 3 - 248.)

ఇందును బరబ్రహ్మ స్వరూపుడు స్వయం ప్రికాశుండనియే చెప్పబడినది.

పరమాత్ముడొక్కడే యయ్యును భ్రాంతిచే పలు రూపములుగ తోచుననుట చూడుడు,

"జ్ఞానమాత్రం పరంబ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్
దృశ్యాభిః పృథగ్భావైర్భగవానేక ఈయతే"

(సంస్కృతభాగ. 3 - 32 -2 6.)

వ॥ .... జ్ఞానమాత్రంబైన పరమానంద స్వరూపంబే పరబ్రిహ్మంబు అనియు బరమేశ్వరుండనియు వాకొనంబడు నతండొక్కండయ్యు బహ్మాణ్ణేంద్రియంబులం జేసిన విభ్రాంతింజేసి మహత్తత్వమనియు ద్వివిధాహంకారమనియు బంచ భూతంబులనియు నేకాదశేంద్రి

యంబులనియు జీవరూపుండనియు నండకోశ దేహుండనియ
దాచుచుండు ....” శ్రీకృష్ణభాగ. 3 - 28

హిరణ్యాక్షుడు మరణింపగ దుఃఖించుచున్న తల్లిని యూ
డించుచున్న హిరణ్యకశిపుని పలుకులు వాని యద్వైతభావనా
విశారదత్వమునకు నిదర్శనములు,

“భూతానామిహ సంవాసః ప్రపాయా మివ సువ్రతే
చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే చలతీవ భూః”
(సంస్కృతభాగ. 7 - 2 - 21 నుండి 23

సీ॥ “తెలియంగ సంసృతి చలిపందిరిని బోలు
ప్రజలు పెక్కురు జలపానమునకు
(శ్రీకృష్ణభాగ. 7 - 49

సత్యమును మానవులెట్లు భ్రమతో తెలిసికొనజాలరో చక్కగ ను
హరణ పూర్వకముగ నిందు చూపబడినది. ఇది యద్వైతభావనమే

ప్రహ్లాదుని దైత్యబాలకోపదేశమున కల జగన్మిథ్యాత్వవ
అద్వైతమే. పరికింపుడు.

“కౌమార ఆచరేత్ ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్ధదమ్.
(సంస్కృతభాగ. 7 - 6 -

ఇందు మానవజన్మ మైనప్పటికిని యధ్రువమనుట గమనింపదగి
దీనికి శాస్త్రిగారి యనువాదమిది,

మ॥ ప్రతిదిష్టంబును వేనవేల్ ప్రజలు చావం జూచుచున్నార
శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు వస్తువ్రాతముల్ ప్రాణ
మృతిలేకుండగ జేయ జాలునె జగన్మిథ్యాత్వ మూహించు
మృతియున్ జన్మము లేని చొప్పుగాన నీమీదవ్విచారింపుడీ.

ఇందలి జగన్మిథ్యాత్వము శంకరుల అద్వైతమే. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నా పరః' అనికదా శంకరప్రతిపాదితము.

దేవకీ గర్భస్థుడైన పరబ్రహ్మ స్వరూపుని బ్రహ్మాదులుస్తుతించు పట్టున నున్న యద్వైత తత్త్వము ఇటులున్నది,

"త్వన్మాయయా సంవృత చేత సస్త్వాం
పశ్యన్తి నానా నవిపశ్చితోయే.

(సంస్కృతభాగ. 10 పూ. భా. 2 - 28.)

ఇద్దానికి శ్రీకృష్ణ భాగవతానువాదమిది,

ఆ॥ నీదుమాయ చేత నిరత సంవృతమైన
మానసంబుగల్గు మర్త్యులు నిను
వేఱుగా దలంతుర విజ్ఞులు తమకంటె
వేఱుగా దలంపబోరు నిన్ను.

(శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 1 ఆశ్వా - 58.)

ఇందు భగవన్మాయచేతనే స్వపర భేదము కలుగుచున్న దనియు, నిజమునకు స్వరూపమొకటేయను భావమున్నది. ఇది యద్వైతమే.

వసుదేవ స్తుతియందును ఇట్టి యద్వైత తత్త్వమే గోచరించును.

"విదితోఽసిభవాన్ సాక్షాత్ పురుషః ప్రకృతేః పరః
కేవలానుభవానంద స్వరూపః సర్వబుద్ధిదృక్
సయేవహ్యాప్రవిష్టః ప్రవిష్ట ఇవ భావ్యసే.

(సంస్కృతభాగ. 10 - 3 - 13, 14.)

శాస్త్రివారి యనువాదము పరికింపుడు.

"నీవు ప్రకృతికి బరుడవు కేవలంబ
యనుభవానందరూపుడవైన వాడ

వెల్ల బుద్ధులకును సాక్షివీవు పరమ
పురుషుడ వెఱుంగుదును నిన్ను బోల్చి నేను"
"ప్రకృతి చేత నీవు త్రిగుణాత్మక జగంబు
మొదట పుట్టించి దానితో బొందు లేని
వాడవయ్యు నుండినవాని పగిది జీవు
డై తలంపగ బడుచుందువాది పురుష.

(శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 1 అశ్వా - 71, 72.)

సంస్కృతాంధ్రములు రెంటను అద్వైతము స్పష్టము.
అట్లే,

'యథేమేఽవికృతా భావస్తథా తేవికృతైస్సహ
నానావీర్యాః పృథగ్భూతా విరాజంజనయన్తిహి.'

(సంస్కృతభాగ. 10 - 3 - 15.)

అనుదానియందును అద్వైతము దర్శనీయము.

సీ॥ "నీవు నిర్గుణుడవు నిజమెన్నగ స్వమాయ
సగుణుండవగుచుందు సర్వలోక

(శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 1 అశ్వా - 74.)

ఈయనువాదమున శాస్త్రివారి విపులీకరణము గోచరించును. "నానా వీర్యా పృథగ్భూతా విరాజం జనయన్తిహి." యను ద్వితీయ చరణమునకు "సర్వలోక ..... జగద్వ్యాప్తినొందు" అనునది స్పష్ట విపులీకరణము. సృష్టిస్థితిలయాత్మకములగు త్రిగుణములచే కృష్ణబ్రహ్మరుద్రాత్మకమైన విధమునందుదు వనుటలో అద్వైతమే యున్నది.

దేవకీకృతమైన విష్ణుస్తుతియందును ఇట్టి యద్వైత తత్త్వము ప్రస్ఫుటముగ చూడగగియున్నది.

"రూపం యత్తత్ ప్రాహురవ్యక్తమాద్యం

బ్రహ్మజ్యోతిః నిర్గుణం నిర్వికారమ్
సత్తామాత్రం నిర్విశేషం నిరీహం
సత్వం సాక్షాద్విష్ణురధ్యాత్మదీపః"

(సంస్కృతభాగ, 10 - 3 - 24.)

ఇద్దానికి యథామూల విస్పష్టానువాదమును శాస్త్రివారు తమ శ్రీకృష్ణభాగవతమున నిట్లు చూపిరి.

తే॥ ఆద్యమవ్యక్త మవ్యయమచ్యుతంబు
బ్రహ్మమును జూచి నిర్వికారంబు నిర్గ
ణము నిరీహము నిర్విశేషమును నీదు
రూపమూహరి వధ్యాత్మదీపమీవ.

(శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 1 ఆశ్వా - 77.)

మూలముననున్న నిర్గుణ, నిరీహ, నిర్విశేష, నిర్వికార, అధ్యాత్మ దీపాది పదప్రయోగముల ననువాదముననుచూపి శాస్త్రి వారద్వైత తత్త్వమును యథామూలఫక్కిని స్ఫుటముగ చూపినారు.

బ్రహ్మదేవుడు స్తుతి యొనర్చిన పట్టునను ఈ యద్వైత భావము గోచరించును.

"తస్మాదిదం జగదశేషమసత్స్వరూపం
స్వప్నాభమస్తధిషణం పుర దుఃఖ దుఃఖం
త్వయ్యేవ నిత్యసుఖ బోధతనావనంతే
మాయాత ఉద్యదపి యత్ సదివా విభాతి."

(సంస్కృతభాగ. 10 - 14 - 22.)

తే॥ 'సచ్చిదానంద రూపుడు సర్వపూర్ణు
డైన నీవలనన్ స్వప్న మట్టి జగము

పుట్టు చావులు గలదయి పోల దోచు
నీవొకండవ నిత్యుడ వింతనిజము.'

(శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 1 ఆశ్వా - 383.)

ఇందు పరబ్రహ్మ మొక్కటి నిత్యమనియు, నీ జగత్తు స్వప్నమందు వలె జన్మాంతములు కలిగి యుండుననియు చెప్పబడినది. ఇది యద్వైత తత్త్వమే.

కాళియుని పత్నులు బాలకృష్ణుని స్తుతించిన పట్టున సువ్యక్తమయిన అద్వైత తత్త్వము కనుగొనుడు.

"నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే
భూతావాసాయ భూతాయ పరాయ పరమాత్మనే
జ్ఞాన విజ్ఞాన నిధయే బ్రహ్మణేనన్తశక్తయే
అగుణా వికారాయ నమస్తే ప్రాకృతాయచ.

(సంస్కృతభాగ. 10 - 16 - 39, 40.)

ఇత్యాదిగ మూలమున నాగ కాంతలు స్తుతించుటకలదు. దానికి శ్రీకృష్ణభాగవతాను వాదమిది.

వ॥ మఱియు షడ్గుణైశ్వర్య సంపన్నుండవును బరమ పురుషుండవును బరమాత్ముడవును బరుండవును పరమాత్మవగునీకు నమస్కారము. జ్ఞానవిజ్ఞానవిధియు ననంత శక్తియు సగుణుండు నిర్గుణుండు నవికారుండునైన బరబ్రహ్మవగు నీకివే యేటికోళ్ళు ...."

శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 2 ఆశ్వా - 72.

పరమాత్ముని సర్వత్వము, నిర్గుణత్వాదికమిందు నిరూపింపబడి యున్నది. ఇది యద్వైతమే.

గోపికా స్తుతిలోని యద్వైత భావమిది చూడుడు,

స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మ విదా త్వయోక్తమ్
అస్త్వేవ మేతదుపదేశపదే త్వయీశే
ప్రేష్ఠోభవాంస్తనుభృతాం కిల బంధురాత్మా"

(సంస్కృతభాగ. 10 - 29 - 32.)

శ్రీకృష్ణభాగవతానువాదమిది.

చ॥ ప్రియులను దల్లి దండ్రులను బిడ్డలదొడ్డల బాసి యుండుటల్
జయమును గోరునారుల కసమ్మతమంటివి మేలు మేము నా
నయమునె దెల్పుచుంటిమి జనార్దన । ప్రాణులకాత్మ వౌటచే
బ్రియులును దల్లిదండ్రులును బిడ్డలు దొడ్డలు నీవె మాకిలన్.

(శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 1 అశ్వా - 355.)

సంస్కృతాంధ్రములు రెండిటియందును అద్వైత ప్రతిపాదిక మైన జీవైశ్వరైకత్వము స్ఫుటముగ నున్నది.

కేశివధానంతరము దేవర్షియైన నారదుడు శ్రీకృష్ణునేకాంత మున కలిసి భాషించిన సందర్భమంతయును అద్వైత తత్త్వ ప్రతి పాదకమే. మూల భాగవతము ఇప్పట్టున నిట్లు నుడువుచున్నది.

"కృష్ణకృష్ణాప్రమేయాత్మన్ యోగేశ జగదీశ్వర ....
త్వైరిదం సత్య సంకల్పః సృజస్యత్సవనీశ్వరః"

(సంస్కృతభాగ. 10 - 17 - 21 నుండి 23.)

అనువాదమిట్లున్నది,

సీ॥ కట్టెలలోనగ్ని కైవడి సర్వభూ
తాంతరాత్ముడవయి సాక్షివగుదు

(శ్రీకృష్ణభా. 20 పూ.భా. 3 అశ్వా - 80)

మూలానువాదములు రెండు నొకేరీతిగా పరమాత్మ తత్త్వ మును స్పష్టీకరించుటలో అద్వైత ప్రతిపాదకములైనవి.

ఉద్ధవునకు శ్రీకృష్ణుడొనర్చిన యుపదేశ సందర్భము నొకపరి పరికింపుడు,

'అమూల మేతద్బహురూప రూపితం....'

(సంస్కృతభాగ. 11-27-27.)

దీనికి శ్రీకృష్ణభాగతానువాదమిది,

'ఆకాశంబు సమస్త భాగములలో వ్యాపించియున్నట్టున
న్నేకాలంబును సర్వ భూతములలో నింపొందుచున్నాడనే
నేకాకింతయు లేదు సర్వజగమందేనంతరాత్ముండనై
వాకోనొప్పుదు గాన జంతు తతి సంభావింపగా నొప్పెడిన్.

(శ్రీకృష్ణభాగ. 11-358.)

మూలము 'ఏతద్బహురూపరూపితం' అని మాత్రమున్నదానిని శాస్త్రిగారు విపులీకరించి తద్గతాద్వైతమును సోదాహరణముగ నిటు చూపిరి,

భాగవతము అంతయును జెప్పి శుకుడు పరీక్షిత్తునకు పరమార్థోపదేశ మొనర్చిన పట్టు గమనింపదగినది.

'మనః సృజతివైదేహాన్ గుణాన్ కర్మాణిచాత్మనః
తన్మనః సృజతే మాయా తతో జీవస్య సంసృతిః'

(సంస్కృతభాగ. 12-1-6.)

తే॥ మనము జీవునకున్ గుణమయము దేహ
మునుసృజించి దానికి హేతు భూతములగు
పుణ్యపాపములం గర్మమును విమోహ
మును సృజించెడి బుధులును మోసపడగ.

తే॥ "మాయచే మనోదేహ కర్మములచేత
జీవునకు గల్గు సంసారమీ విధమున
వానిసంపర్క మెడలిన దాన జీవు
డలరు నిష్కళంకుండయి యవనినాథ."

(శ్రీకృష్ణభాగ. 12-49, 50.)

మూలశ్లోకగత భావమనువాదమున విపులస్పష్టీకరణము చేయబడినది. భగవన్మాయచే జీవునకు సంసారము కలుగుచున్నదనియు, తత్సంసర్గము వీడినచో జీవుడు నిష్కళంకుడగుననియు చెప్పబడినది. ఇది అద్వైత భావము.

ఇట్టి వేదాంత ఘట్టములనటనట నుపనిషత్తులలోని వచనములును కాననగును.

మూలమున,

"అజనిచ యన్మయం తదవిముచ్య నియన్తృ భవేత్...."

(సంస్కృతభాగ. 10 - 87 - 30.)

అనియున్నదానిలోని "నియన్తృ" శబ్దమూధారముగ నిట్లు శ్రీకృష్ణ భాగవతానువాదమున శ్రీ శాస్త్రిగారు ఉపనిషద్వాక్యములను దెనిగింప కూర్చిరి.

సీ॥ భీతిమై వాయువు వీవంగ వెఱచును
భాస్కరుండుదయింప భయము వడును

(శ్రీకృష్ణభాగ. 10 ఉ భా. 3 అశ్వా - 167.)

ఇందు పై సీసపాదములందు "భీతితోడనే వాయువు వీచుట, భాస్కరుడు ఉదయించుట, వీతిహోత్రుడు వెల్గుట, ఇంద్రుడు దండము వహించుట, దండ ధరుడు దోర్దండంబు కదిలించుట, చంద్రుడు వెలుగుట, మృత్యు దేవతయు నుపద్రవమగునని ప్రాణినంటు మాని పాఱుటలనునవి చెప్పబడినవి, ఇవి యన్నియు నిట్లగుట భగవన్నియంతృత్వమునకు దారకాణములు. ఈ వాక్యములు తైత్తిరీయోపనిషత్తునందిట్లున్నవి.

"భీషాస్మాద్వాతః పవతే
భీషోదేతి సూర్యః
భీషాస్మా దగ్నిశ్చ ఇన్ద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః"

(తైత్తిరీయోపనిషత్. 2-8.)

సర్వ స్వరూపుడయిన అతనికి వెఱచియే గాలి వీచుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు. ఇంద్రుడును, అగ్నియు తమ తమ ధర్మముల ననువర్తించుచున్నారు. మృత్యువు ప్రాణులను గ్రసించు చున్నది. అని యుపనిషద్వాక్యార్థము. ఈ యుపనిషత్ వాక్యములే శ్రీకృష్ణభాగవతానువాదమున తెనుగురూపమున చొప్పింపబడినవి.

భాగవతమంతయును పైన తెల్పిన రీతిగ అద్వైత తత్త్వప్రతి పాదికముగ చెప్పబడినది. ఇందు నారాయణుడు బ్రహ్మకొనర్చిన యుపదేశము ప్రథమమునను, శ్రుతి గీతలు నడుమను, ఉద్ధవ గీత లంత్యమునను నుండి యద్వైతమునే ప్రధానముగ చెప్పబడి యున్నవి.

ఈ విధముగ భాగవత ఘట్టము లన్నిటియందును అద్వైత తత్త్వ ప్రతిపాదనమే గోచరించును. భక్తి ప్రధానగ్రంథము కనుక నితరములగు పట్టున విశిష్టాద్వైతాదిక సిద్ధాంతము లున్నవనుట సహజము. తాత్త్వికతకంటె భక్తి భావము ఒక మెట్టు దిగువయే. తాత్త్వికత మహా జ్ఞానులకే సులభసాధ్యము. అయినను అదియే సత్యము. సామాన్యులకు భక్తి భావము సులభ తరణోపాయము. ఈ విధముగ గ్రంథతత్త్వ విషయకముగ అద్వైత, ద్వైత, విశిష్టా ద్వైత సిద్ధాంతములున్నను ప్రాధాన్యము మాత్రమద్వైతమునకే.

ఈ రీతి పరిశీలింపగా శ్రీకృష్ణభాగవతమునద్వైత పరముగనే శాస్త్రిగారు రచించిరనుట స్పష్టము. అసలు వారి శ్రీకృష్ణభాగవతము మూలానుయాయి కదా! శాస్త్రివారీవేదాంత ప్రతిపాదక సందర్భము లందుచిత రీతిని యనువదించిరనుటకు వారి శ్రీకృష్ణభాగవతమే ప్రబల ప్రమాణము. ఇంతటితో దీనిని ముగింతును.

# తృతీయ కళిక

## శ్రీమద్భాగవత శ్రీకృష్ణభాగవతానువాద పరిశీలనము

ఆంధ్రసాహిత్య నందనోద్యానమున పురాకృతపుణ్య విశేష ముగ వెలసినది భాగవత కల్పతరుద్వయము. తెలుగుల పుణ్యపేటిగ స్తుత్యమానుడయిన పోతన్న భాగవతమును కల్పతరువుగనే భావించుట జరిగినది. అట్లు భావించుట సమంజసము. మరియొకటి యుపమించుటకు లేదా రూపించుటకు సరిపడదు. కావున శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతమునటులనందే యంతర్భవించి చుచూట యుక్తము.

వ్యాస భాగవతమును పోతన్నయును, శాస్త్రివారును తమ తమ దృక్కోణల భావించి యనువదించుట జరిగినది. దేని ప్రత్యేకత దానిది. ఆ యిరువురి యనువాద విధానమును ప్రత్యేకముగ చూపి శ్రీకృష్ణభాగవతమునందలి కొన్ని ఘట్టములను మచ్చునకు మూల మైన వ్యాస భాగవతముతో తులనాత్మకముగ పరిశీలించి చూపెదను.

## పోతన - శ్రీమద్భాగవతానువాదము

ఆంధ్రమున "ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి" యని కీర్తింపబడిన నన్నయ భట్టారకుడు భారత కావ్య భిక్షనందించుట ద్వారా సాహిత్య యుగ చరిత్ర ప్రారంభమైనది. పిదప కబ్బపు తెనుగుదోట యయిన తిక్కన్న, సర్వమార్గేచ్ఛా పరతంత్రుడయిన

యెఱ్ఱన్న భారతమునకు సంపూర్ణాకృతిని దిద్ది తీర్చిరి. దీనిని బట్టి యాంధ్ర సాహిత్యమనుహాదముతో ప్రారంభమైనదనుట స్పష్టము.

ఈ యనువాదమును పరిశీలించినచో నాంధ్ర సాహిత్యము మార్గద్వయమునకు స్థానమును కల్పించిన దనవచ్చును. ఆరంభ కాలమున స్వతంత్రానుహాదభావానువాదమును రెండు పముఖలు సాగినను రాను రాను ఆధునిక కాలమున యథామూలానువాదమను మూడవ విధానమును వెలసినది.

స్వతంత్రానువాదమునకు కవిత్రయ రచనమే సాక్ష్యము. ఆ మహాకవులు వ్యాస భారత కథను మాత్రము స్వీకరించి యనవసరములని తోచిన భాగములను విడచియు లేదా సంగ్రహించియు నవసరములని తోచిన పట్టుల నూత్న వర్ణనాదికములు చేర్చియు ననుచితములనిపించిన ఘట్టముల నన్యథాకరణము లొనర్చియు, రమణీయ భాగములను యథాతథముగ ననుసరించియు రచనా పద్ధతిని స్వతంత్రముగ కొనసాగించిరి. కవిత్రయ భారతమును మూల భారతమును పోల్చి చూచిన యెడల యథేచ్ఛానుసరణ రచనయే యధికముగ గోచరించును. కాని కథా సూత్రము మాత్రము విచ్ఛిన్నముగాక రెంటను సాగుట సమానమే. ఈ హేతువుచే నీ రచనా విధానమునకు "కథా కథన పద్ధతి" యను పేరును కలిగినది.

ఇక రెండవది భావానువాదము. దీనికి "రసప్రసిద్ధధారాధుని" యైన శ్రీనాథుడు మార్గదర్శి. ఇందులకు శ్రీథునాని నైషధానువాదము నిదర్శనము. ఈ యనువాదమునను శ్రీథునాని క్రొత్త పోకడలు లేకపోలేదు. కాని యట్టివి చాల స్వల్పము. అతడు ప్రతి శ్లోకమును క్షుణ్ణముగ పరిశీలించి తద్గత భావమును సుష్టుగ జీర్ణించుకొని యది యిసుమంతయైనను చెక్కు చెదరకుండగ ననువాదమున వ్యక్తపఱచి

నాడు. తన యనువాదమున శ్రీనాథుడు కథా భావములకు తుల్య ప్రాధాన్య మొసగినాడు. మూల శబ్దములీ యనువాదమున ననూది తములైనను కాకపోయినను భావము మాత్రము యథాతథముగ సాగిపోవుట కనుపించును.

ఈ యనువాదము మూలవిధేయమునుగాదు, స్వతంత్రమును గాదు. మూలానుసరణమును, అనువాదకుని ప్రతిభయు స్పష్టముగ వ్యక్తమయినవి. భావ ప్రధానమైనది కనుక దీనిని భావానువాద ముగ పరిగణించుట లెస్స.

మిగిలినది మూడవదియైన యథామూలానువాదము. ఈ పద్ధతి యాధునిక కాలముననే గోచరించును. ఆధునికుల నాటకాద్యాంధ్రీ కరణము చూచిన ఈ సరణి స్పష్టముగ కనుపించును.

శ్రీమద్భాగవతము శ్రీనాథయుగమున వెలసినది. దీనికి మూలము వ్యాస కృత సంస్కృత భాగవతము. ఈ భాగవతానువాద భాగ్యము లభించుట తన పురాకృత శుభాధిక్యముగ భావించిన వాడు పోతన్న.

పోతన్న భాగవతానువాదమున తనకు ముందు వెలసిన కవి త్రయము వారి స్వతంత్ర పద్ధతిని, తన సమకాలికుడయిన శ్రీనాథుని భావానువాద విధానమును గూడ ననుసరించెననుటకు తద్రచనమే నిదర్శనము. పోతన్న స్వతంత్రిత మూలమును కుదించుట యందును, అన్యథాకరణమొనరించుట యందును మాత్రమే కాక మూలమును వృద్ధిచేయుట యందును ద్యోతకమగును.

పోతన్న సహజముగ భక్తిపూరిత హృదయుడగుట చేతను, భాగవతము భక్తుల చరిత్రములకాలవాలమగుటచేతను, భక్తులు భగవన్మహిమాదికమును వర్ణించుతావులందు నతడు మిక్కిలి పరవశత్వ

ముతో రచించుట కానవచ్చును. అప్పట్టున మూలగత భక్తిభావ
లకు దన స్వీయ భావములను జతకూర్చి కొంత పెంపు చేకూర
చుండును. ఇట్టి భాగములందుననే సామాన్యముగ పోతన్న స్వ
త్రత యెక్కువగ కానవచ్చి వాని ప్రతిభకు నికషదృషత్తుగనున్న
అటులనే వేదాంత విషయముల ననువదించు పట్టున క్లిష్టతతోప
వ్యాఖ్యాన సాహాయ్యమును గైకొని వివరించుటయు కలదు. ఇట్ట
మూల వ్యాఖ్యానద్వయమున కనువాదములనదగును. మిగిలినపట్ట
పోతన్న శ్రీనాథుని భావమార్గానుయాయియై యథోచితానువ
మొనర్చును. ఈ విధముగ పోతన్న భాగవతానువాదము శ్రీనాథ
యనువాదమువలె మూలానుసారిగను, కవిత్రయపు పద్ధతి
స్వతంత్రమునై యున్నది.

శ్రీనాథుడు కాశీఖండమున మూలమున లేని మయూర సూ
శతక శ్లోకానువాదములొనర్చుట కాననగును. ఇదీ శ్రీనాథుని స్వీ
మైన స్వతంత్రతకు ప్రబల తార్కాణము. ఈ పద్ధతి పోతన్న
భాగవతానువాదమున నొకే చోటున చేయుట కనబడును. అది
కాసుర వధా సందర్భముగ సత్యభామా యుద్ధము. మూల భాగ
మున వ్యాసుడు సత్యభామచే నా సందర్భమున యుద్ధము
చేయింపలేదు. ఇద్దానిని పోతన్న విష్ణు పురాణమునుండికాని, నా
సోమన్న యుత్తర హరివంశము నుండి కాని గ్రహించి యుండు
అన్య గ్రంథ గ్రాహ్యమైన విషయమిది యొక్కటియే పోతన్న భ
వతమున కానవచ్చును. భాగవతానువాదమున పోతన్నతోపా
కొన్ని భాగముల చేయివైచిన గంగన, సింగన, నారయలు
పోతన్న యనువాద విధానమునే మొత్తము మీద ననుసరించ
కనుపించును.

మూల భాగవత శ్లోక సంఖ్య 18000. పోతన్న భాగవతా

వాదమున నితరులతో కలిసి వెరసి 8,980 గద్య పద్యములు. అమూలకములు, పెంపుచేసిన భాగములతో నీ సంఖ్య సిద్ధమయినది. పోతన్న భాగవతానువాదమున సుమారు రెండువేల గద్య పద్యములు పెంపుగా కాననగును.

పోతన్న సహజ పాండిత్యుడనని చెప్పికొనుట కనుపించును. అద్దానికి చదువు సంధ్యలు లేక గాలిని పోగుచేసిన శుష్కవాచాటన మనుట పొనగదు. కవచకుండలములు కర్ణునకు వలెను, జృంభకాస్త్రాదులు కుశలవులకువలెను జన్మ సంసిద్ధ పాండిత్యమనుట సమంజసమే. జన్మాంతర బహుళ కృషి ఫలితము. అడండమైన పాండితీ ధిషణమునకు వాని భాగవత రచనా విన్యాసమే నికషోపలము. కథా ప్రారంభముననే నైమిశారణ్య వర్ణనము ముప్పది మూడు వాక్యములలో శ్లిష్ట బంధముతో వర్ణింపబడి బాణుని కాదంబరీ రచనను తలపించును.

గంగావతరణ సందర్భమున అరువదియారు ముక్తపదగ్రస్తములు విజృంభించుచుండినవి. అందు నుపమాద్యలంకార వైచిత్రి, శ్లేష చమత్కృతి గంగా తరంగములభంగి చెలరేగినవి. భాగవత సేవనము వలన సిద్ధించునది బ్రహ్మానందము. కావ్య రసాస్వాదనము సహృదయులకు నెట్లో, యీ భాగవత రసాస్వాదనము భక్తులకునట్లు. భక్తియున్నప్పుడే భాగవతము సులభముగ బోధపడును. ఈ భావ ప్రమాణముచేతనే "భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యానటీకయా" యనుట వెలసినది.

పోతన్న భాగవతానువాదమున నమూలకములధికముగ కానవచ్చుననుట తెలిసినదియే. అవి యట్లుపొడగట్టుటకు కవి స్వతంత్ర రచనానుసరణమే యని తెల్పుట జరిగినది.

ఒక భాషనుండి మరియొక భాషలోనికి రచనానువాదమొనర్చునపుడు మూలముననుసరించుటకు వలయు ప్రజ్ఞ వేఱు. స్వతంత్ర భావముతో రచనను రసవంతముగ చూపుటకు కావలసిన ప్రజ్ఞవేఱు. చక్కని యనువాదకుడనిపించుకొనుటకు మొదటి తరహా ప్రజ్ఞ చాలును. ద్వితీయమగు ప్రజ్ఞ తత్కృతికర్తల నాదర్శవంతులుగ సారస్వతమున నిలుపుటకు అవసరము. ఈ రెండవ ప్రజ్ఞ కలవారి లేఖిని వారి కృతుల సుధారసవంతములొనర్చుటలో వారి రచననే నియమ నిబంధనములును నిరోధింపలేవు. మూల రచయిత నిర్మించిన సుందర రచనా కృతికిట్టి ప్రతిభా సంపన్నులు తమ ప్రజ్ఞచేత కల్పనా శక్తికి, భావ ప్రకటనమును జోడించి మూలము నతిశయించిన ఒక మహోన్నత శిల్పమును గోచరింపజేయుదురు. ఇట్టి పద్ధతి యందు నొక లోపము గోచరించును. ఒక్కొక్క యెడ ననువాదకుని యజాగ్రత్తవల్లనో, యలక్ష్యము వలననో మూల విషయమనువాదమున విభేదించుటయు జరుగుచుండును. అప్పుడు మూల రచయిత హృదయము స్పష్టముగ నవగతము కాజాలదు.

స్వతంత్రానువాదకులు స్వేచ్ఛాయుతులు. వారి దృష్టి రస సౌందర్యాదికముపైననే లగ్నమగును. ఎంత సొగసుగ చెప్పగలమనదియే సాధారణముగ వారి యాలోచనమగుచుండును. ఈ కారణము చేతనే యనువాదములందు మూల వ్యత్యయములగపడును. కాని యిట్టి స్వతంత్రానువాదము కవి ప్రతిభకు గీటురాయి యనుటలో సందియమందబనియుండదు.

ఈ రీతిగ జూచినచో యథానువాదకునిలో మూల విషయము నటులే చెప్పుటకు వలయు ప్రతిభ సరిపడును. ఇట్టివారు మూల విధేయతతోడనే యుండుట జరుగును కాని తమ యప్రతిమాన ప్రతిభా విశేషముతో సుందర కల్పనాదికము చేయుటకు స్వేచ్ఛ

యుండదు. కాని మూల విషయ మిందు యథా తథముగ నుండి స్పష్టముగ బోధపడును.

ఈ విషయముతో పోతన్న మొదటి కోవకు చెందినవాడగు నని ముందే యనుకొంటిమి. అది యాతని స్వేచ్ఛా తత్త్వమునకు నిదర్శనము. ఇట్టి పోతన్న భాగవతమున కల యమూలక విషయములు కొన్ని యిటు పరిశీలింపబడును.

పరీక్షిన్మహారాజు ప్రార్థనమున శుకప్రోక్తమైన భాగవతమును సూతుడు శౌనకాది ఋషులకు నైమిశారణ్యమున చేయబడిన సత్రయాగ సందర్భమున ప్రవచించినాడు. ఈ సందర్భమున మూల భాగవతమున నొక్క శ్లోకము మాత్రమున్నది.

"నైమిశే నిమిషక్షేత్రే మునయ శ్శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ సహస్ర సమమాసతా.
సంస్కృతభాగ. 1-1-4.

పోతన్న దీనిననువదించుచు శ్లోక ప్రథమ చరణమును కంద పద్యముగ సొగసుగజూపి ద్వితీయ పాదమును స్పృశింపకయే నైమిశారణ్య వర్ణనము నొక సుదీర్ఘ వచనమున చేయుట యమూలకమే. చూడుడు,

క॥ పుణ్యంబై మునివల్లభ
గణ్యంబై కుసుమఫలనికాయోత్థితసా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా
రణ్యంబు నుతింపదగు వరణ్యంబులలోన్.
పోతన భాగ. 1-38.

ఇది మూల భాగవత శ్లోక ప్రథమ చరణమైన "నైమిశే నిమిష క్షేత్రేమునయ శ్శౌనకాదయః" యను దానికి ననువాదమనవలసి

యున్నది. ఇందు శౌనకాదులు మునివల్లభ' పదమున నంతర్భూత మొందిరి. ఇక రెండవ వరణము మొదలు కాకయే,

"మఱియును మధువైరి మందిరంబునుంబోలె మాధవీ మన్మథ సహితంబై ........" పోతనభాగ. 1-39.

అను పాండిత్య స్ఫోరకమైన సుదీర్ఘ వచనము చెప్పబడినది. ఇది మూల భాగవతమున లేదు.

పోతన్న రచనమున శబ్దములు నూత్నమైనవిగ వివిధ విన్యాసములతో గోచరించుచుండును. అవి యంత్య ప్రాసములుగను, ద్వి, త్రి, చతుః ప్రాసములుగను సొగసులీనుట సాధారణము లే.

సూతుని శౌనకాది ఋషులు తమ కార్య సాఫల్యమునకై స్తుతించుటలోని యమూలకత సహజమై యలరారుచున్నది.

క॥ మన్నాడవు చిరకాలము
గన్నాడవు పెక్కులైన గ్రంథార్థంబుల్
విన్నాడవు వినదగినవి
యున్నాడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్.
పోతనభాగ. 1-43

ఈ భావము పోతన స్వీయ మనదగియున్నది. అటులనే సప్తమ స్కంధమున హిరణ్యకశిపు ప్రహ్లాద సంవాదమునను నిట్టి యమూలకము లగపడును.

మూల భాగవతమున హిరణ్యకశిపుడు తనయుని,

"ప్రహ్లాదానూచ్యతాంతాతస్వధీతం కించిదుత్తమమ్
కాలేనైతావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్.
సంస్కృతభాగ. 7-5-22.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్.
"ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా
క్రియతే భగవత్యద్ధాతన్మన్యేఽధీతముత్తమమ్."
సంస్కృతభాగ. 7-5-23, 24.

ఈ విధముగ తనయుని యుత్సంగమున నుంచుకొని యేమి చదివితివనుచు నడిగిన ప్రశ్నము, దానికి ప్రహ్లాదుని యుత్తరము మిక్కిలి సంగ్రహములై యున్నవి. పోతన్న యనువాదమున నివి చాల పెంపునంది గోచరించును.

"చోద్యంబయ్యెడు నింతకాలమరిగెన్...."
"నిన్నున్మెచ్చరు నీతి పాఠ మహిమన్...."

ఈ పద్యములు ప్రశ్నగత భాగములు. ఇందలి ప్రథమ చరణములు మాత్రమే మూలానుసారములు. మిగిలిన దంతయును పోతన స్వకపోల కల్పితమే.

చదివించిరి నను గురువులు (7-166), అంధేందూదయముల్ (7-168), కమలాక్షునర్చించు కరములు (7-169) ఇత్యాది పద్యములన్నియు నమూలకములు.

ఇంకను "మోదముతోడ దైత్యకుల ముఖ్యుడు (7-137) ఇందు గలడందు లేడని (7-275) మొదలగునవియును పోతన స్వీయములే.

ఈ విధముగ ప్రహ్లాద చరిత్రమున సుమారేబది పద్యముల మూలకములైనవి పోతన్న యనువాదమున గోచరించును.

అష్టమస్కంధమున గజేంద్ర మోక్షణ సందర్భమున నీయమూలకత మిగుల నెక్కువగ రసవంతముగ కానుపించును. ఇందు భగవంతుని భక్త పరాయణత్వము మిక్కిలి యౌచిత్యవంతముగ

వర్ణింపబడినది. మూలమున నీ వృత్తాంతము సూత్రప్రాయముగ మూడు శ్లోకములలో ముగియుచున్నది.

"తం తద్వర్త్మనువలభ్య జగన్నివాసః
స్తోత్రంనిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః
ఛందోమయేన గరుడేనస ఊహ్యమాన
శ్చక్రాయుధోఽభ్యగమదాశు యతో గజేంద్రః"
"సోఽంతస్సరస్యురు బలేన గృహీత ఆర్తో
దృష్ట్వా గరుత్మతి హరింఖ ఉపాత్త చక్రమ్
ఉత్క్షిప్యసాంబుజకరంగిరమాహకృచ్ఛ్రా
న్నారాయణాఖిలగురో భగవన్నమస్తే"
"తం వీక్ష్య పీడిత మజస్సహ సావతీర్య
సగ్రాహమాశుసరసః కృప యోజ్జహార
గ్రాహాద్విపాటితముఖాదరిణా గజేంద్రం
సంపశ్యతాం హరి రమూముచ దుస్త్రియాణామ్"

సంస్కృతభాగ. 8-3-31, 32, 33.

వీనిని పోతన్న భక్తి పరవశుడై బహు రసవంతముగ ముప్పదియైదు గద్యపద్యములలో విస్తరింపజేయుట గమనింపదగినది.

ఈ సందర్భమునగల "అలవైకుంఠపురంబులో (8-95) సిరికిం జెప్పడు (8-97) తనవెంటన్ సిరి (8-99) ఇత్యాది లన్నియును పోతన్న కల్పితములు.

అంతియకాక నించుక మూల వ్యత్యయమునిట కాననగును అందొకటి గజేంద్రుని రక్షించినవాడు వైకుంఠవాసి విష్ణుడనుట. రెండవది యప్పటికి లేని వైకుంఠమును వర్ణించుట. మొదటిదానికి మూలమును బట్టి యిది ప్రమాణము. విష్ణ్వవతారమైన "హరి"యను నతడు గజేంద్రుని రక్షించినాడు. ఇతడు హరిమేధునకును హారిణికిని

జనించిన వ్యక్తి. కావున నితడు నారాయణావతారుడు కాని పోతన్న చెప్పినట్లు నారాయణుడు కాడు.

రెండవది గజేంద్రమోక్షణము నాల్గవ మన్వంతరమున జరిగినట్లును, వైకుంఠ నిర్మాణము ఐదవ మన్వంతరమున జరిగినట్లును వ్యాస భాగవతము. శుభ్రునకు వికుంఠ యనునామెకు జన్మించుటచే వైకుంఠుడనియు నట్టి కాలముననే వైకుంఠము నాతడు నిర్మించెననియు మూలము. అప్పుడు వైకుంఠమే లేని నాల్గవ మన్వంతరమున వైకుంఠ వర్ణనము పొసగదు. తదుపరి పోతన్న,

"వైకుంఠః కల్పితో యేన లోకో లోక నమస్కృతః
రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ ప్రియకామ్యయా"
సంస్కృతభాగ. 8-5-5.

అని యున్నదానికి 'అవనిపై వైకుంఠమని యెడిలోకంబు కల్పించె" నని యనువదించెను. కావున మూల భిన్నత పోతన్న యనువాదమున నుండుట స్పష్టము. ఇటుల చూపుట పరిశీలనము మాత్రమే కాని యా మహాకవివి యన్యథాకరించుటకు కాదని నా వనవి. ఈ గజేంద్ర మోక్షణ సందర్భముగ పోతన్న సుమారు డెబ్బది పద్యములు స్వయముగ కల్పించినవి యున్నవి.

అటులే క్షీరసాగరమథనమునను పోతన్న స్వతంత్రించుటద్యోతకమగును. మహాకూర్మ వర్ణనము మూలకము. సురాసురుల మథనమునకల వచనమమూలకము. హాలాహలవిజృంభణమున నున్న సుదీర్ఘ వచనమమూలకమే.

లక్ష్మీదేవి ప్రభవించిన పట్టును అమూలకమున కాకరమై యున్నది. ఈపట్టున ఇరువది పద్యములు కమనీయ కల్పనములున్నవి. ఇవి యన్నియు నమూలకములే. ఇందలి

"హరి సూచిన సిరి సూడదు

సిరి చూచిన హరియు జూడ సిగ్గును బొందున్
హరియును సిరియును దమలో
సరిచూపుల జూడమరుడు సందడి పెట్టెన్.

పోతన భాగ. 8 - 285.

యను రమణీయ పద్యమాయమూలక గుచ్ఛగతమే.

అటుపిమ్మట వామన చరిత్రముననేక కల్పనములు చేయ బడినవి. ఇందు చాల పద్యములమూలకములై కనబడును. ఇందలి ప్రసిద్ధమైన ఆదిన్ శ్రీసతి కొప్పుపై (8-591). ఇంతింతై వటుడింత యై (8-620) ఇత్యాదుల మూలకములే.

ఆ తదుపరి మత్స్యావతార కథయందును నధికముగ నమూలక విషయములున్నవి. ఇచటి మత్స్యావతార వర్ణన సీసపద్యము (8-717) పోతన్న స్వీయమే.

నవమస్కంధమున రంతిదేవాంబరీషుల వృత్తాంతములందీయమూలకములు కాననగును. యయాతి చరిత్ర, దుష్యంతోపాఖ్యానములందునంతగా నీ భిన్నత తోపదు. అందులకు కారణమిట్లూహింపవచ్చును. రంతిదేవాంబరీషుల చరితలవలె యయాతి చరిత్ర, దుష్యంతోపాఖ్యానములు విష్ణుభక్తి ప్రధానములు కావు. విష్ణుభక్తి ప్రతిపాదితములైనవానియందే పోతన్న మానసము విజృంభించును. అందుచేతనే యట్టివి అమూలకములకధికముగనాకరములైయున్నవి.

దశమస్కంధము భాగవతమున నగ్రస్థానీయమై యున్నది. మూల భాగవతకర్తయు దీనిని మహామహితముగ దిద్ది తీర్చుట కాంచదగును. ఇతర స్కంధముల లేని వస్త్వైక్యత, ఏకనాయకాశ్రయతయు నిందు కలవు. శ్రీకృష్ణుడు నాయకుడు. జననాది పర్యం

తమై ప్రబంధమనదగినరీతిని మలచబడినది. ఇద్దానిని శృంగార వీర రసాత్మకమైన ప్రౌఢ కావ్యముగ నెంచవచ్చును.

మూల భాగవతమున దశమస్కంధమున పూర్వోత్తరార్ధములు కలిపి మొత్తము తొంబది యధ్యాయములున్నవి. పోతన్న యనువాదమున మూడువేల నూట యిరువది నాలుగు గద్య పద్యములు వెలసినవి. దీనిని పోతన్న ప్రత్యేక శ్రద్ధాదృష్టితో ననువదించుట గమనింపదగినది. ఈ కారణముననే పోతన్న యనువాదమున సగ భాగమీ దశమస్కంధమే యాక్రమించినదని చెప్పవచ్చును.

శ్రీకృష్ణ జనన సందర్భమున చక్కని యమూలకములు పొడగట్టుచున్నవి.

"క్రేళ్ళురికి మసలె లేగలు
మల్లడిగొని అంకెలిడియె మదవృషభంబుల్
పెల్లుగ మొదవుల పొదుగుల
జల్లించెంబాలు బాలు సంభవవేళన్.

ఏమినోము ఫలమొ యింత ప్రొద్దొకవార్త
వింటిమబలలార వీనులలర
మన యశోద చిన్ని మగవాని గనెనట
చూచివత్తమమ్మ సుదతులార.

పోతనభాగ. 10. పూ. భా. 178, 184.

బాలకృష్ణుని దుడుకుచేష్టలు మధురమయ్యును నించుక మేర మీరినవేమో యనిపించును. శ్రీకృష్ణుడు పరబ్రహ్మస్వరూపము కదా! దుండగీండ్రు సైతమును చేయని ధూర్తకృత్యములు శ్రీకృష్ణునిచే చేయించుట కొంచెము బాధేయనిపించును. ఇవి యన్నియు నమూలకములే.

మూల భాగవతమున ముప్పదియవ యధ్యాయములో గోపికలు శ్రీకృష్ణుని కానక వెదకుచు బరవశత్వముతో జేసిన వింత చేష్టలు వర్ణితములైనవి. పోతన్న తన యనువాదమును వానితో తన స్వీయ రమణీయభావములను జతచేసి మిక్కిలి యద్భుతముగ జేసినాడు. ఈ పట్టున గల "నల్లనివాడు పద్మనయనమ్ములవాడు" (10 పూ-1010)" "ఈ చరణంబులే యిందునిభానన" (10 పూ-1029) మున్నగువానికి మూలము లేదు.

ఇంకను బాలకృష్ణుని చేష్టలు సుమధురముగ పోతన్న చేతిలో సార్ధకతనందినవి.

రుక్మిణీ కళ్యాణ ఘట్టమునను నిట్టివి ద్యోతమానములే. బాలరుక్మిణిని వర్ణించుపట్టున కల,

"బాలేందురేఖ దోచిన"

"మఱియు దినదిన ప్రవర్ధమానయై"

"వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు"

"దేవకీ సుతు కోర్కితీగలు వీడంగ". (10-1685-1689)

రుక్మిణీ సందేశమున,

"ప్రాణేశనీమంజుభాషలు వినలేని

కర్ణ రంధ్రంబుల కలిమి యేల" (10-1701)

ఇత్యాదులప్వితీయములమూలకములే.

జలక్రీడ, రాసక్రీడాదుల యందును పోతన్న స్వీయ కల్పనలగపడును.

ఇట్టి యమూలకములేకాక శ్రీధరీయ వ్యాఖ్యానమునను సరించి పెరిగిన పట్టులును మిక్కిలిగ పోతన్న భాగవతమున గోచ

పోతన్న భాగవతమున ఇతర కవులైన వారిలో గంగన రచనము మొత్తము మీద మూలమునకు సన్నిహితముగనే యుండుట కానవచ్చును. ఇక సింగనకు పోతన్న యందపరిమిత గౌరవభావ ముండుట వాని రచనములో కాననగును. ఈతడు పోతన్న వలెనే విస్తృత దృష్టికలవాడనుట కాననగును. సామర్ధ్యము కలవాడేకాని యాధ్యాత్మికత పరిపక్వము కాలేదని భావింపవచ్చును. మిగిలిన వాడు నారయ. వీని రచనమున నట నట యమూలకములున్నను మొత్తముమీద సంగ్రహీకరణమే యగపడును.

ఈ విధముగ పైన చూపబడినవి మచ్చునకు మాత్రమే. చెప్ప వలెననిన నెంతయినను చెప్పవచ్చును. ఆ పనిని పోతన్న భాగవతముపై నెందఱో మహామహులు కావించియున్నారు. ప్రస్తుత పరిశోధనమునకుచితముగ నాకు దోచిన విధముగ కొంత చెప్పితిని.

ఇంతకును పై పరిశీలనమును బట్టి పోతన్న భాగవతానువాదము స్వతంత్రరీతిలో మూలమునకు విధేయముగ కనబడినను దూరముగనే సాగినదనుట నిర్ధారణమగుచున్నది.

పిదప మచ్చునకు కొన్ని ఘట్టములు మూలాంధ్రభాగవత ద్వయము మూడింటను పరిశీలించి తదుపరి శ్రీకృష్ణభాగవతానువాదమును వీలయినంత సమగ్రముగ మూలముతో జూపుదును.

—*—

# తులనాత్మక పరిశీలనము

## 1. అశ్వత్థామ పరాభవము :-

యుద్ధభూమిని యూరువులు తెగికూలిన దుర్యోధనునకు ప్రియము చేయువాడయి యశ్వత్థామ నిద్రించుచున్న ద్రౌపదీ సుతుల శిరస్సులు ఖండించుటతో ప్రారంభమగును. మూల భాగవతమున నిటులున్నది.

'భర్తుః ప్రియం ద్రౌణిరితిస్మ పశ్యన్ కృష్ణాసుతానాం
స్వపతాం శిరాంసి
ఉపాహరత్ విప్రియమేవ తస్య జుగుప్సితం కర్మ
విగర్హయన్తి. సంస్కృతభాగ. 1-7-14.

దీనిని పోతన్న,

వ॥ "....అశ్వత్థామ దుర్యోధనునకుంబ్రియంబుసేయు వాడై
నిదురపోవు ద్రౌపదీ పుత్రుల శిరంబులు ఖండించితెచ్చి
సమర్పించె...." పోతన భాగ. 1-140.

సీ॥ ........గురుపుత్రుడైన యశ్వత్థామ
తన నృపతికి బ్రియంబని తలంచి

తే॥ తనకు విప్రునకుం దగదనుచు దలప
కఘమనెడుమాట మఱచి దుష్టాత్ముడగుచు
ద్రౌపదీ పుత్రకులను నిద్రాళులైన
వారి కుత్తుకలను గోసె వాడి కత్తి.

శ్రీకృష్ణభాగ. 1-204.

యనుచు శాస్త్రిగారనుగదించిరి.

మూలమున "విప్రియమేవ తస్య జగుప్సితంకర్మవిగర్హయన్తి" యనునది పోతన్న యనువాదమున పైవచనాంతమున అది క్రూర కర్మంబని లోకులు నిందింతురనుచు కానవచ్చును.

శాస్త్రిగారు దానిని వివరించుచు,

"తనకు విప్రునకుందగదనుచు దలప

కఘమనెడు మాట మఱచి దుష్టాత్ముడగుచు" అని తమ శ్రీకృష్ణభాగవతమున స్పష్టపఱచుట కానవచ్చును. పోతన్న వలె "ఖండ శిరములను చూపుట" యిచట విడువబడినది. కార్యము ప్రధానముగాని యిటులొనర్చుట యనవసరమని శాస్త్రిగారు విడచి యుందురు. ఇట సందర్భమును బట్టి పోతన్న భాగవతముకంటెను శ్రీకృష్ణభాగవతము స్పష్ట వివరణ మొనర్చుట తెలియును.

అర్జునుడు ద్రౌపదినోదార్చిన విధమును మూలభాగవతమిట్లు పేర్కొన్నది,

"మాతా శిశూనాం నిధనంసుతానాం నిశమ్య ఘోరం పరితప్యమానా
తదారుదద్బాష్పకలాకులాక్షీతాం సాంత్వయన్నాహ కిరీటమాలీ"
తదా శుచస్తేప్రమృజామి భద్రే యద్బ్రహ్మబంధోః శిరఆతతాయినః
గాండీవముక్తైర్విశిఖైరుపాహరిత్వాఽఽక్రమ్యయత్స్నాస్యసి
దగ్ధపుత్రా"

సంస్కృతభాగ. 1-7-15,16.

పోతన్న భాగవతమున,

ఉ॥ బాలురచావు కర్ణముల బడ్డగలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము చెక్కుల రాలనేడ్చి పాం
చాల తనూజ నేలబడి జాలి బడంగని యెత్తి మంజువా
చాలత జూపుచుం జికురజాలముదువ్వుచు గ్రీడియిట్లనున్.

మ॥ "ధరణీశాత్మజపీవు నీకువగవన్ ధర్మంబె? తద్ద్రౌణిని
ష్కరుణుండై విదళించెబాలకుల మద్గాండీవ నిర్ముక్తభీ
కర బాణంబుల నేడు వాని శిరమున్ ఖండించి నే దెత్తు ద
చ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాడుమిచటన్ శీతాంశుబింబాననా"

పోతన భాగ. 1-141, 142.

యనుచు మూల శ్లోకమునందలి రెండు చరణములును రెండు పద్యములై కనబడును.

శాస్త్రిగారి శ్రీకృష్ణభాగవతము,

ఉ॥ "కన్నకుమారులిటిలుగ కంటికి మంటికి నేకధారగా
విన్న జనాళి గుండియలు వ్రీలివడం బడి రోదనం బొన
ర్చన్నెఱిదప్పి యప్పుడతి పజ్జకు ఫాల్గునుడేగుదెంచి తా
గన్నులనీరు నించుచును గాంత గనుంగొని యూఱడింపుచున్.

ఉ॥ ఏడువ కీవు నేనిపుడయేగి దురాత్ముని బ్రహ్మ బంధువున్
జూడక దేశికాత్మయని చూచుచునుండగ నెల్ల వారు నా
పోడిమి చూపి గాండివ సముద్ధత బాణ పరంపరాహతిన్
గాడుడిగించి తచ్ఛిరము గైకొని వచ్చెద నీకు నిచ్చెదన్.

క॥ కడకాలదన్ని దానిని
జడములలో దానమాడి సాధ్వీమణి నీ
యెడ గల్గు దుఃఖ మిగ్గతి
వెడలంగా జేసి కొమ్ము వెలదులతోడన్.

శ్రీకృష్ణభాగ. 1-205 నుండి 207.

యనుచు సనువదించినది.

పోతన్న ద్రౌపది పుత్రవధ నివి బాష్పతోయ కణజాలము చెక్కులరాల నేడ్చినది.

శాస్త్రిగారి ద్రౌపది కంటికిమంటికి నేకధారగా విన్న జనాళి గుండియలు వ్రీలి పడంబడి రోదన మొనర్చినది.

మూలమునకల "తదారుదద్బాష్పకలాకులాక్షీ" యనునది పై విధముగ ననువదింపబడినది.

పోతన్న ద్రౌపది యిట మూలములోవలె యథాతథముగ నేడ్చినది.

శాస్త్రివారి ద్రౌపది కంటికిమంటికి నేకధారగానే కాక విన్న వారి గుండెలు బద్దలగునట్లు రోదించినది. ఇటు శాస్త్రివారి తెలుగు పదములనుడికారపు సొంపు పుత్రశోక సంతప్తయగు మాతృమూర్తి తీవ్ర దుఃఖమును స్పష్టమొనర్చుచు కనుల కట్టించుట సందర్భోచిత్యముతో శోభించుచున్నది. ఇటు ద్రౌపది అచ్చపు తెలుగు స్త్రీవలె రూపు కట్టుట కాననగును.

అట్లే యట్టి ద్రుపదనందనను మంజువాచాలత జూపుచు జికుర జాలము దువ్వుచు నర్జునుడోదార్చినట్లుపోతన్న అనువాదము.

శాస్త్రివారు "ఫాల్గునుడేగుదెంచి దా గన్నుల నీరు నించుచును గాంత గనుంగొని యూఱడించి నట్లు" సహజముగ ననువదించిరి.

ఇటు పోతన్న "సాంత్వయన్" యను మూలపదమును విడచి సామాన్యముగ "క్రీడి యిట్లనున్" యనినాడు. పైగా మంజువాచాలతతో భాషించుటయు నగపడును. ఇది కరుణ రసప్లావితమైన సందర్భమునకు తగినట్లు లేదు.

కాని శాస్త్రివారు తమ యనువాదమున నర్జునుని కండ్లయందును నీరు చిప్పిల జేసి మూల పదమును చక్కగ "నూఱడింపుచున్" అని చూపిరి.

శాస్త్రివారి యనువాదమౌచిత్యవంతమై సందర్భమునకు దగినట్లు ఉన్నది. ఇచటనొక సంశయము కలుగ వచ్చును, అది,

"అర్జునుడు ధీరోదాత్తుడు కదా। అట్లు దుఃఖించుట
ఔచిత్యమా? యని.

ఔచిత్యమేయని నా యభిప్రాయము. అర్జునుడు మాత్రము మానవుడు కాదా? స్వయముగ స్వీయ పుత్రశోకమనుభవించు ఘట్టమిది. అట్టి స్థితిలో నెట్టివారికైనను దుఃఖ తీవ్రతచే మూఢత్వము కలుగును. భారత యుద్ధమున నర్జునుడే స్వయముగ కృష్ణునితో యుద్ధము చేయలేనన లేదా! ధర్మజునకే యెన్నియో మారులు గాంధారీ ధృతరాష్ట్రులు కనబడని సందర్భాదులందు వివేకమును దుఃఖమాక్రమించి మూఢత్వమును కలిగింపలేదా? ఇవి యన్నియును ధీరోదాత్త నాయకుల విషయములు కాదా? ఇత్యాదులెల్లౌచిత్యభాసురములో పుత్రశోకమున భార్యతో దానును నించుక విచారించుట యౌచిత్యవంతమే. సరియ.

తదుపరి మూలగతమైన బ్రహ్మబంధు, ఆతతాయి పదములు శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదమున దురాత్మ, బ్రహ్మబంధు, దేశికాత్మ యనుచు కనుపించి యుచితమైన యనువాదము లనిపించును. శాస్త్రివారి అర్జునుని పలుకులు మిక్కిలి నౌచిత్యవంతముగ కనుపించును.

"ఎల్లవారు చూచుచుండగ, నా పోడిమి చూపి, కాడుడుగించి" ఈ పదములు సార్థకములై స్త్రీయయిన ద్రౌపదికి నిజమైన యూఱట గలిగింప సమర్థములైనవనుటలో సందియము లేదు.

పోతన్న భాగవతానువాదమున వాని శిరమును ఖండించి తెచ్చి యిచ్చెదనని మాత్రమే యున్నది. అంతియ కాక "తచ్ఛిరమున్ ద్రొక్కి జలంబులాడుమిచటన్ శీతాంశు బింబాననా" యనియు నర్జునుడిట ననును.

ఇచట ద్రౌపదిని "శీతాంశుబింబాననా!" యని సంబోధించుట ర్భమునకు తగినట్లు లేదు. మఱియు నేదో త్రొక్కి జలములాడి పశమనమొందుమని సామాన్యముగ నున్నది.

శాస్త్రిగారు "సాధ్వీమణి" యను సంబోధనము వైచి యౌచి ము నాదరించిరి. ఇది సాభిప్రాయము. సాధ్వీమణులు క్షమాధ ు. ఇట్టి క్లిష్ట స్థితిలో నోర్పు వీడవద్దని భావము. అంతియ కాక ంత చక్కగ "కడకాలదన్నుమనుట" లోని సొగసు మిక్కిలిది.

ఈ విధముగ పోతన్నను మించిన వారై శాస్త్రులవారు శ్రీ ష్ణభాగవతమున నీ సందర్భమును తమ యనువాదమున చూపి ుటు స్పష్టము. ఈ సందర్భముననే యర్జునుడు బ్రహ్మాస్త్రద్వయ ను ఉపసంహరించినట్లున్నది. మూలమున,

'ప్రజోపప్లవమాలక్ష్య లోక వ్యతిరేకరంచతమ్
మతంచ వాసుదేవస్య సంజహారార్జునోద్వయమ్.
సంస్కృత భాగ. 1-7-32.

పోతన్న తన యనువాదమున, 'మాధవునాజ్ఞన్ విజయుండు ువిశిఖద్వందోప సంహారమున్' పోతనభాగ 1-151.
మూల భావమునే చెప్పెను.

శాస్త్రివారు భారతముననున్నట్లు నారద వ్యాస మహర్షుల క చెప్పి వారి యుపదేశముచే నర్జునుడు తన బ్రహ్మాస్త్రము నుప హరించి పిదప నశ్వత్థామ ప్రయోక్తాస్త్రమును నుపసంహరించి ు చెప్పిరి. శ్రీకృష్ణభాగ. 1-221-231.

ఇచట శాస్త్రివారు భారతానుసారమని చెప్పుకొనుట లేదు.

రించి విపులీకరణమని పాదపీఠికలో చెప్పుకొనుట కానవచ్చు చున్నది. అట్లనుకొందమన్ననిట యట్టిదేదియు కానరాదు. కావున శాస్త్రివారాధారముగ గైకొనిన మూల భాగవత ప్రతి యందిటుల నేమైన యున్నదేమో। భావి పరిశోధకులు తేల్పవలసినది.

బంధితుడైన యశ్వత్థామను జూచి వామ స్వభావయైన ద్రౌపది మ్రొక్కి భర్తతో విడిపింపుమని వేడినట్లు మూలమున నిట్లున్నది.

"తథాహృతం పశుశత్పాశబద్ధమ వాఙ్ముఖం కర్మజుగుప్సితేన నిరీక్ష్యకృష్ణాపకృతం గురోః సుతం వామస్వభావాకృపయా ననామచ"

"ఉవాచ చాసహన్త్యస్య బంధనానయనంసతీ
ముచ్యతాం ముచ్యతామేష బ్రాహ్మణోనితరాంగురుః"

సంస్కృతభాగ. 1-7-42, 43

ఈ పట్టున పోతన్న తన యనువాదమున ద్రౌపది యశ్వత్థామతో భాషించినట్లు ముందుగా నమూలకములైన నాలుగు పద్యములను రచించినాడు.

"పరగన్ మామగవారలు", "భూసురుడవు బుద్ధి దయా", "ఉద్రేకంబునరారు", "అక్కట పుత్రశోక" ఇవి ద్రౌపది స్వభావమునకు ప్రబల ప్రమాణములు. పోతనభాగ. 1-159-162.

శాస్త్రివారిట మూలానుసారముగనే

వ॥ ....పశువుంబోలె పగ్గంబులంగట్టి పడవైచిన గురుపుత్రుంగని కరుణాతరంగితాంతరంగయై నిజవల్లభుం గాంచి యిట్లనియె

మ॥ "గురుపుత్రుండనుబ్రాహ్మణుండితనినింగ్రోధంబునంజేసియు క్కగణింగొడ్డునుబోలె గట్టుటలునే గానంగలేకుంటినో

కరుణాళూ! విడిపించు బంధనములన్ గండెన్‌శరీరంబయో
తరలుంబోదురితంబువచ్చెడిని నీతండెన్న ద్రోణుండెకా.

శ్రీకృష్ణభాగ. 1-236, 237.

పిమ్మట ద్రౌపది పలుకులకు ధర్మజుడు సంతసించినట్లు మూల మున నిటులున్నది.

"ధర్మ్యం న్యాయ్యం సకరుణం నిర్వ్యళీకం సమంమహత్
రాజాధర్మసుతో రాజ్ఞ్యాః ప్రత్యనన్దద్వచోదద్విజాః"

సంస్కృతభాగ. 1-7-49.

పోతన్న దీనిని,

వ॥ "....అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబునునిర్వ్యళీకంబును సమంజసంబును శ్లాఘ్యంబునుంగా ద్రౌపది పలుకు పలుకు లకు ధర్మనందనుండు సంతసిల్లె" పోతనభాగ. 1-166.

అని యనువదించెను.

శాస్త్రివారు,

వ॥ "అని ధర్మార్థ సహితంబులును గరుణాయుతంబులును సకల లోక పూజనీయంబులునగు ద్రౌపదీ వాక్యంబులు విని ధర్మరా జిట్లనియె.

శా॥ "నీ వాక్యంబులు న్యాయమార్గమునకున్ వ్రేలంతయున్ దూరమై
పోవెంతో కరుణా రసంబుకలవై పూజ్యంబులై యొప్పెడిన్
నీవిట్లాడుదువంచు నేననుకొనన్ లేదెంతయో పుత్రదుః
ఖావేశంబున నున్న యిప్పుడును నీస్వాంతంబు శాంతంబహో.

శ్రీకృష్ణభాగ. 1-239, 240.

అని మూల భావమును వివరించుచు నించుక మార్పు చేయుట కనుపించును. ఇది వారి యౌచిత్య దృష్టికి నికషదృషత్తు ధర్మజుని

ఋజువర్తనము, నిర్మోహమాటము నిందు స్పష్టముగును, ఇది ధర్మజు పాత్రకు మిక్కిలి వన్నె తెచ్చునదిగ నున్నది.

ద్రౌపది మాటల కాగ్రహించి భీముడశ్వత్థామను తానే సంహరింతుననగ ద్రౌపది యడ్డువచ్చి నిలువబడినది. అప్పుడు శ్రీకృష్ణుడు వారిని వారించుటను మూలమిట్లు చెప్పినది.

"నిశమ్య భీమగదితం ద్రౌపద్యాశ్చ చతుర్భుజః
ఆలోక్యవదనం సఖ్యురిదమాహహసన్నివ."

సంస్కృతభాగ. 1-7-52.

ఇచటి "చతుర్భుజః" యను పదమును శ్రీధరుడు "భీమంతం హన్తుం ప్రవృత్తే, ద్రౌపద్యాం చానిచ్ఛంత్యాం సహసా తన్నివారిణే ప్రవృత్తాయాం, ఉభయో స్సన్నివారణాయాఽవిష్కృత చతుర్భుజః" అని వ్యాఖ్యానించెను. పోతన్న యీ శ్రీధరీయ వ్యాఖ్యననుసరించును,

"భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుండై రెండుచేతుల భీముని వారించి కడమ రెండు చేతుల ద్రుపద పుత్రికను దలంగం ద్రొబ్బినగుచు భీమునకిట్లనియె." పోతనభాగ. 1-168.

అని అనువదించినాడు. పైగా మూలమున కృష్ణుడర్జునునితో పలికినట్లుండగ పోతన్న భీమునితో పలికించుట కాననగును.

ఈ విషయము శ్రీకృష్ణభాగవతమున,

వ॥ "శ్రీకృష్ణుడు నవ్వుచు నర్జును దిక్కు మొగంబై యిట్లనియె"

శ్రీకృష్ణభాగ. 1-244.

యను విధముగ మూలాను సారముగనే శాస్త్రిగారిచే ననువదింప బడినది.

పోతన్న భగవన్మాహాత్మ్యమునకు దగినట్లు రచించుటలో

తన మహిమలను చూపుట కలదా? దుష్టశిక్షణార్థమౌచిత్యమే. కా
యీ విధముగ జూపుట నింక నెచ్చటను పాండవులవద్ద కానరా
కాని ఏమైనను పోతన్న యీ సందర్భమున శ్రీధరవ్యాఖ్య ప్రభా
ముచే నిటుల రచించుట స్పష్టము.

ధర్మబద్ధముగ శిరోమణినిగ్రహించి యశ్వత్థామను వెడలి
చిన పట్టు మూలమున నిటులున్నది.

'అర్జునః సహసాఽఽజ్ఞాయ హరేర్హార్ద మథా విరా
....బ్రహ్మ బంధూనాం వధోనాన్యోస్తి దైహికః'
సంస్కృతభాగ. 1-7-55 నుండి 57.

పిమ్మట పాండవులు సపరివారముగ గంగకు, మృతుల
తరణ కార్యములొనర్ప వెళ్లిరని కలదు. పోతన్న,

శా॥ 'విశ్వస్తుత్యుడు శక్రసూనుడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగ బుచ్చుకొని పాశవ్రాత బంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రొబ్బె శిబిరోర్వీభాగముంబాసిపోన్

క॥ 'నిబ్బరపు బాల హంతయు
గొబ్బున దేజంబు మణియు గోల్పడి నతుడై
ప్రబ్బిన చింతన్ విప్రుడు
సిబ్బితితో నొడలిగబ్బుసెడి వడి జనియెన్.

ఆ॥ ధనముగొనుట యొండె దలగొఱుగుట యొండె
నాలయంబు వెడల నడుచుటొండె
గాని చంపదగిన కర్మంబు సేసిన
జంప దగదు విప్రజాతి బటికి.

వ॥ "ఇట్లశ్వత్థామం బ్రాహ్మణావ శిష్టుంజేసి వెడలనడచి...."యని సహజ రీతిలో ననువదించెను. దీనిని శాస్త్రివారు

పోతనభాగ. 1-171 నుండి 174.

నావుడును జిష్ణుడాకృష్ణు భావ మెఱిగి
చేత గరవాలమును బూని చేర వచ్చి.

శ్రీకృష్ణభాగ. 1-246.

ఇత్యాదిగ మూలాను సారమొనర్చిరి. పిమ్మట శ్రీకృష్ణుడశ్వత్థామను శపించుట యిందు కానవచ్చుచున్నది. ఇది భావి కథకు నుపబలకముగ నుండుట యౌచిత్యము. ఈశాపవిషయము భారతము నందు కానవచ్చును. ఈ విషయమిచట చెప్పుట భావి ప్రయోజన కారిగ యుక్తమే.

ఈ విధముగ నశ్వత్థామ పరాభవము కన్పట్టును. పోతన్న రసదృష్టి, శాస్త్రివారి యథానువాదకదృష్టి వారి వారి భాగవతానువాదములందు పైన చూపిన విధముగ కానవచ్చును. ఇట్లు పరిశీలన కావింపగా మొత్తముమీద నిరువురి యనువాదముల యందును శ్రీకృష్ణభాగవతమే మూలమునకు దగ్గరగ నున్నట్లు కనుపించును.

## 2. భీష్మ స్తుతి :

శరతల్పగతుడైన మందాకినీ నందనుని సందర్శింప ధర్మనందనుడు శ్రీకృష్ణాదులతో చనును. అప్పట్టున భీష్ముడు పాండవుల బన్నములను పరామర్శించి తన ముంగిట నున్న శ్రీకృష్ణునియందు చూడ్కులు నిలిపి స్తుతించును. యుద్ధమున తన విశిఖ వృష్టికినొచ్చిన శ్రీకృష్ణుడు తన నంతముచేయ బయలుదేరిన సందర్భమును గుర్తు చేసికొని గాంగేయుడు కృష్ణపరమాత్మను స్తుతించును. అనంతరము తన చిత్తమును కృష్ణాయత్తమొనర్చి పరంధామమొందుటజరుగును. మూల భాగవతమున,

"త్రిభువన కమనంతమాలవర్ణం రవికరగౌరవరాంబరం దధానే
వపురలక కులావృతాననాబ్జే విజయసఖే రతిరస్తు మేఽన వద్యా"
సంస్కృతభాగ. 1-9-33.

అనియుండగ పోతన్న,

మ॥ త్రిజగన్మోహననీలకాంతి తనువుద్దీపింప బ్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్తముఖారవిందమతి సేవ్యంబై విజృంభింపమా
విజయుంజేరెడు వన్నెకాడు మది నావేశించు నెల్లప్పుడున్.
పోతనభాగ. 1-217.

యని యనువదింప శాస్త్రిగారు శ్రీకృష్ణభాగవతమున,

ఉ॥ నల్లని మేనికాంతులు ఘనా ఘనసంపద సొంపుడింప సం
పల్లలితోత్తరీయము సువర్ణ సువర్ణము మేలమాడ న
ల్లల్లన గుంతలంబులు ముఖాబ్జమునందళులట్లు వ్రేల, వ్రే
పల్లె విహారమున్ సలుపు బాలుని గృష్ణుని నే దలంచెదన్.
శ్రీకృష్ణభాగ. 1-277.

యని యనువదించిరి.

మూల భాగవతమున నున్న త్రిభువన కమనంతమాలవర్ణం
యనుదానికి పోతన్న 'త్రిజగన్మోహన నీలకాంతి తనువనినాడు.

శాస్త్రిగారు "ఘనా ఘన సంపద సొంపనుచు "త్రిభువ
కమనం" అను నర్థమును వాచ్యమొనర్పక జగన్మోహనముగ నుం
నని ధ్వనింపజేసిరి. ఇటనొక విషయము స్పష్టమగును. "తమ
వరమ్" అను దానిలోని "తమాల" పదము విడువబడినది. పోతన
దానిని సామాన్య నీలకాంతియే యని చూపినాడు. శాస్త్రిగారు 'నల్ల
మేనికాంతు' లని యంతటితో నూరకుండక 'ఘనా ఘన సం

సొంపు' అనుదాని జెప్పి తమాల శబ్ద స్ఫురణ మొనర్చుట గమనింప దగినది.

రవికరగౌర వరాంబరం" అనునది శ్రీకృష్ణధారణా వస్త్ర సూచితము. ఆయన పీతాంబరధారి కదా! దీనికి పోతన్న "ప్రాభాత నీరజ బంధు ప్రభమైన చేలమని యనువదించినాడు. ఇటు గమనింప దగినది మూలమునందలి "రవికర" పదము. పోతన్న దానిని "ప్రాభాతరవి" యనినాడు.

ప్రాతఃకాలమున సూర్యకాంతి మిక్కిలి యెఱ్ఱనై యుండును. శ్రీకృష్ణుడు పీతాంబరధారియే కాని రక్తాంబరధారికాడు. మూలమున "గౌరవరాంబరం" అని యుక్తముగానే యున్నది. "గౌర" పదము నకు "పీతోగౌరో హరిద్రాభః" అనియు నిఘంటువు. శాస్త్రిగారీ భావ మును గమనించి "సువర్ణమ"ని నారు. సూర్యకాంతులు మొదట నెఱ్ఱనివైనను క్రమముగ పసుపు రంగు గలవగును. కావున శాస్త్రి గారు రవికరములు గౌరములని మూలభావమును గ్రహించి సందేహ నివృత్తి యొనర్చిరి.

ఇక "అలకకులావృతాననాబ్జే" యనునది పోతన్న చేత 'నీలా లక వ్రజసంయుక్త ముఖారవిందము' అని యనువదింపబడి యా యలకలు నల్లనివిగా జెప్పబడినవి.

శాస్త్రిగారు 'ఆననాబ్జ' యను పదమునందలి 'అబ్జ' పదము సార్థకమగునట్లు మూలమునకు మెఱుగుపెట్టినట్లుగ' 'కుంతలంబులు ముఖాబ్జమునందళులట్లు వ్రేల' అని యా యలకలు తుమ్మెదలవలె నున్నవని వివరించుట స్పష్టమగుచున్నది.

"విజయసఖే" యనునది పోతన్న యనువాదమున "మా విజ యుంజేరెడు వన్నెకాడు" అని చూపినాడు. శాస్త్రిగారి శ్రీకృష్ణభాగ

వతమున "వ్రేపల్లె విహారమున్ సలుపు బాలుని గృష్ణుని" యని కాన నగుచున్నది. దీనికి శాస్త్రివారనువాదమున కాధారముగ గొన్న ప్రతి యందునట్టి పాఠముండియుండ వచ్చును. మఱియొకటి—
"స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామృత మధికర్తుమవప్లుతోరథస్థః
ధృతరథచరణోభ్యయాచ్చలద్గుర్హరిరివ హన్తు మిభంగతోత్తరీయః"

సంస్కృతభాగ. 1-9-37.

యని మూలభాగవతము.

దీనికి పోతన్న,

సీ॥ కుప్పించి యెగసిన గుండలంబుల కాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి కదల
జక్రంబు జేపట్టి చనుదెంచురయమున
బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగు బాటు సేయక
మన్నింపుమని క్రీడి మఱల దిగువ

తే॥ గరికిలంఘించు సింహంబు కరణి మెఱసి
నేడు భీష్ము నిజంపుదు నిన్ను గాతు
విడువు మర్జున। యనుచు మద్వి శిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

పోతనభాగ 1-221.

యనుచు రసవంతమైన యనువాదమొనర్చినాడు.
శాస్త్రిగారు శ్రీకృష్ణభాగవతమున,

సీ॥ చక్రంబు చేబూన సమరంబునందను
తన నియమంబెల్ల వెనుకద్రోచి

చక్రంబు వట్టింతు శౌరిచేనను నాదు
బాస చెల్లించెదువాడ యగుచు
నాశరంబులనొచ్చి నలువటి మునికోల
రథముపైబెట్టి చక్రంబు వట్టి
కరిమీద బడదూక హరివోలె నేలకు
నుఱికి లంఘించి నాయున్న కడకు

తే॥ గేశపాశము విడివ్రేల క్షితితలంబు
దద్దఱిల్లగ బైకోక తావు వీడ
హుంకరించుచు నరుదెంచునంకకాడు
నాకు దిక్కయి యుండెడు గాక యిపుడు.

శ్రీకృష్ణభాగ. 1-282.

యని స్పష్టానువాద మొనరించుటకానవచ్చును. పోతన్న "అవప్లుతో రథస్థః" యను దానిని

"కుప్పించి యెగసిన కుండిలంబులకాంతి
గగనభాగంబెల్ల గప్పిగొనగ" అని యా

"యవప్లుతిని" రూపు కట్టుటలో బెంపు స్పష్టము. "చలద్గుః" అనగా చలించుచున్న భూమి కలవాడని యర్థము. ఈ భావమును

'ఉరికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి గదల' యని భూ

చలన హేతువు వివరించినాడు పోతన్న.

"ధృత రథ చరణః, గతోత్తరీయః" యను రెండును

"చక్రంబు చేపట్టి చనుదెంచురయమున
బైనున్న పచ్చని పటము జాఱ" అని సొగసుగా

పలికినాడు.

ఇక యసలు విషయమిచ్చటనున్నది. "స్వనిగమమపహాయ మత్ప్రతిజ్ఞామృతమధికర్తుమ్ అవప్లుతో రథస్థః" అనగా తాను చక్రము ధరించనని కృష్ణుడొనర్చిన ప్రతినను వీడి "కృష్ణునిచే చక్రము పట్టింతుననిన నా ప్రతిజ్ఞను నిజము చేయుటకై రథము నుండి భూమికి నురికిన వాడను వాక్యార్థము పోతన్న యనువాదమువ విడువబడి స్ఫురణావకాశమైన లేకుండగ భిన్నముగ చూపుట కానవచ్చుచున్నది.

"నమ్మితి నాలావు నగుబాటు సేయక
మన్నింపుమని క్రీడి మఱల దిగువ"

అనుచు నర్జునుడు తన శౌర్యము నవ్వులపాలగునని వెనుకకు మరలునట్లు లాగుచుండగా నని పోతన్న తెలుగు చేయుటలో శ్రీకృష్ణుని భక్త పరాధీనత్వమునకు నికషదృషత్తనదగిన తన ప్రతిన పోయినను భక్తుడయిన భీష్ముని ప్రతిజ్ఞ నిలిపినాడను భావము లేదు.

ఈ విషయము శాస్త్రివారి నిశిత పరిశీలనా దృష్టికి గోచరించి
"చక్రంబుచే బూన సమరంబునందను
తన నియమంబెల్ల వెనుక ద్రోచి
చక్రంబు పట్టింతు శౌరిచేననునాదు
బాస చెల్లించెదువాడ యగుచు"నని నిస్సందేహముగ వివరణ రూపమున స్పష్టపఱుపబడినది.

## 3. గాంధారీ ధృతరాష్ట్రుల మహా ప్రస్థానము :

విదురోపదేశమున గాంధారీ ధృతరాష్ట్రులు సర్వమును బరిత్యజించి హిమవంతమున కేగుదురు. ఈ విషయము మూలభాగవతమున మిక్కిలి సంగ్రహముగ ముప్పది శ్లోకములందు జెప్పబడియున్నది.

విదురుడు ధృతరాష్ట్రునకుపదేశ మొనర్చిన యెడ మూల మున నిట్లున్నది.

"అగ్నిర్నిసృష్టోదత్తశ్చ గరోదారాశ్చ దూషితాః
హృతం క్షేత్రం ధనం యేషాం తద్దత్తైరసుభిః కియత్
తస్యాపి తవ దేవోఽయం కృపణస్య జిజీవిషోః"

సంస్కృతభాగ. 1-13-23, 24.

దీనికి పోతన్న యనువాదమిటులున్నది.

క॥ పెట్టితిరి చిచ్చు గృహమున
బట్టితిరి తదీయ భార్య బాడడవులకుం
గొట్టితిరి వారు మనుపగ
నెట్టైన భరింపవలెనె యీ ప్రాణములన్.

క॥ కనియెదవో బిడ్డల నిక
మనియెదవో తొంటికంటె మనుమలమాటల్
వినియెదవో యిచ్చెదర
మ్మని యెదవో దానములకు నవనీసురులన్.

పోతనభాగ. 1-310, 312.

ఇందు మూల భాగవత విషయమునకు మొదటి పద్యము కొంచెము దగ్గఱగ నున్నది. ఇందు మూలమున నున్న "హృతం క్షేత్రం ధనం యేషాం తద్దత్తైరసుభిః కి యత్" యనునది విడువబడి నది. రెండవ పద్యమునకు మూలమున నాధారమే లేదు. అది యమూలకము.

శాస్త్రివారి యనువాదమిటులున్నది.

సీ॥ మేమున్న యింటికి మిన్ను ముట్టగ నిప్పు

రానాడు మా పత్ని మానభంగ మొనర్చి
రడవులకుందోలిరపుడు మమ్ము
విషసర్పముల చేత వెట్టగా గఱిపించి
నిదురించుచుచో గట్టి నీట ద్రోచి
మా రాజ్యము హరించి మా సర్వమును గైవ
సము చేసికొని మమ్ము జంపనెంచి

తే॥ రకట నీ పుత్రులనుచు నెప్డయిన మాట
బడులననుకొన్న నీదగు నెడదకెంత
యేనియును దాపముదయించు నిట్టితొడుసు
లేల శాంతుడవైవని కేగు మీశ. శ్రీకృష్ణభాగ. 1-311.

ఇది మూలమునకు చాల దగ్గఱగ నున్నది. అయినను మూల మునందలి "తద్దత్తైరసుభిః కియత్" అనుదానికి ననువాదము మృగ్యము.

అట్లే మూలమున గాంధారి యనుగమనమును గూర్చి,
"పతిం ప్రయాన్తం సుబలస్య పుత్రీ పతివ్రతాచానుజగామసాధ్వీ"
సంస్కృతభాగ. 1-13-29.
అని మాత్రము చెప్పబడినది.

ఈ విషయమును పోతన్న ఎంతో పొంపు చేసి చెప్పుట కాన వచ్చును. రెండు పద్యములు ప్రత్యేకము వ్రాయబడినవి.

శా॥ అంధుండౌ పతిన్ వరించి పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనమున్ ధరించి నియమ ప్రఖ్యాతయై యున్నత
ద్గాంధారక్షితనాథు కూతురును యోగప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతి వెంటనేగెనుదయత్సాధ్వీగుణారూఢయై.

చ॥ వెనుకకురాకచొచ్చు రణవీరుని కైవడి రాజదండనం
బునకు భయంబులేక వడిబోయెడు ధీరుని భంగినప్పుడా

వనిత దురంతమైన హిమవంతము పొంతవనాంత భూమికిన్
బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేగె బ్రీతితోన్.

పోతనభాగ. 1-315, 316.

ఇందు గాంధారీ పాతివ్రత్యము స్ఫుటముగ వివరింపబడి మూలమును మించినది. ఇక శ్రీకృష్ణభాగవతమున శాస్త్రిగారు,

వ॥ '....గాంధారియు నతని ననుసరింప....'

శ్రీకృష్ణభాగ. 1-314.

అనుచు మూల విధేయముగనే కొంత కుదించి యనువదించుట కాననగును.

ధర్మజుడు విదురసహితులైన గాంధారీ ధృతరాష్ట్రులనుగానక సంజయుని ప్రశ్నింపనాతడిటుల సమాధానమిచ్చుట మూల భాగవతమున కానవచ్చును.

"నాహం వేద వ్యవసితం పిత్రోర్వః కులనందన
గాంధార్యావా మహాబాహో ముషితోఽస్మి మహాత్మభిః"

సంస్కృతభాగ. 1-13-36.

పోతన్న ఇటులనువదించినాడు,

తే॥ "అఖిలవార్తలు మున్ను నన్నడుగుచుండు
నడుగడీరేయి మీ తండ్రి యవనినాథ
మందిరములోన విదురుతో మంతనంబు
నిన్న యాడుచునుండెను నేడు లేడు.

వ॥ 'విదురగాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుబోయిరో వారల నిశ్చయంబు లెట్టివో యెఱుంగ....'

పోతనభాగ. 1-320, 321.

ఇది మూలభాగవతమున కానరాదు. మూలమున నాకు తెలియదనియే సంజయుండు చెప్పెను కాని నిన్న రాత్రి మందిరములో విదురునితో నేవో మంతనములు జరిపినాడు, విన్న నున్న వాడు నేడు లేడు అనినట్లు లేదు. ఇది యంతయు పోతన్న కల్పితము.

శాస్త్రీవారి యనువాద మీ విషయమున మూలానుసారము గనే కలదు.

ద్విపద। 'నాతోడ జెప్పక నన్ను వంచించి
నా తండ్రి ధృతరాష్ట్ర నరనాథుడతని
నాతి యెందే బోయినారొ నే నెఱుగ
రాతిరియగుదాక రాజుతో నుంటి' శ్రీకృష్ణభాగ. 1-317.

ఇందు చివరిపాదము స్పష్టతకు జెప్పబడినదని తోచును.

పిమ్మట తుంబుర సహితుడైన నారదుడు వచ్చి ధర్మజునిచే నభ్యర్థితుడై తత్త్వముపదేశించి ధృతరాష్ట్ర గాంధారుల దేహత్యాగాదికము వివరించును. నారదుడు ధర్మజునకు తత్త్వముపదేశించిన పట్టున శ్రీకృష్ణభాగవతమున నించుక మూల కుంచనము కానవచ్చును.

## 4. పరీక్షిద్వృత్తాంతము:

ధర్మజుని రాజ్య పట్టాభిషేకము అశ్వమేధయాగములు మూడు నైన పిదప శ్రీకృష్ణుడు ద్వారకానగరోన్ముఖుడై రథ మధిరోహించు పట్టున నుత్తర శ్రీకృష్ణుని గురుపుత్రానలభయ విహ్వలయయి వేడుకొనుచు స్తుతించుట యిటులున్నది.

"గన్తుం కృతమతిర్బ్రహ్మన్ ద్వారకాం రథమాస్థితః

"పాహి పాహి మహా యోగిన్ దేవ దేవ జగత్పతే
నాన్యం త్వదభయం పశ్యే యత్రమృత్యుః పరస్పరమ్"
"అభిద్రవతి మామీశ శరస్తప్తా యసోవిభో
కామం దహతు మాం నాథ మామే గర్భో నిపాత్యతామ్"
సంస్కృతభాగ. 1-8-8 నుండి 10.

ఈ మూల భాగవత విషయము పోతన్నచే నిట్లనువదింపబడి యున్నది.

వ॥ అంత వాసుదేవుండు వ్యాస ప్రముఖ భూసుర పూజితుండై యుద్ధవ సాత్యకులు గొలువ ద్వారకాగమన ప్రయత్నంబున బాండవుల వీడ్కొని రథారోహణంబు సేయు సమయంబున దత్తరపడుచు నుత్తర పనుదెంచి కల్యాణ గుణోత్తరుండయిన హరికిట్లనియె.

మ॥ ఇదె కాలానల తుల్యమైన విశిఖంబేతెంచె దేవేశ, నే
డుదరాంతర్గత గర్భదాహమునకై యుగ్రాకృతిన్ వచ్చుచు
న్నది దుర్లోక్యము మానుపన్ శరణమన్యంబేమియున్ లేదు నీ
పద పద్మంబులె కాని యొండెఱుగ నీ బాణాగ్ని వారింపవే.

క॥ దుర్భర బాణానలమున
గర్భములో నున్న శిశువు ఘన సంతాపా
విర్భావంబును బొందెడి
నిర్భర కృపగావు మయ్యనిఖిలస్తుత్యా.

క॥ చెల్లెలి కోడల నీ మే
నల్లుడు శత్రువులచేత హతుడయ్యెను సం
ఫుల్లారవిందలోచన
భల్లాగ్ని వణంచు శిశువు బ్రతికింపగదే.

ఆ॥ గర్భమందు గమల గర్భాండ శతములు
నిముడుకొన నటించు నీశ్వరేశ
నీకు నొక్క మానినీ గర్భ రక్షణ
మెంత బరువు నిర్వహింతుగాక.

పోతనభాగ. 1-176 నుండి 180.

ఇందు నుత్తర స్తుతించువవసరమున మూల విస్తారము స్పష్టమగుచున్నది.

మూలమున "అభిద్రవతి మామీశ శరస్తప్తాయసోవిభో" అని మాత్రముండగ పోతన్న బాగుగ పెంచి "ఇదెకాలనల....", దుర్భర బాణానల...." అను రెండు పద్యములుగ చెప్పినాడు. పిదప "చెల్లెలి కోడల...", "గర్భమ్మందు గమల..." అను రెండు పద్యములకును మూలములేదు. ఇవి పోతన్న స్వకపోల కల్పితములు. ఈ విధముగ పోతన్న యనువాదమిచట మిక్కిలి విస్తరించినది.

ఇక శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున.

వ॥ "...కృష్ణుడు సాత్యకి ప్రభృతులతో బాండవానుజ్ఞాతుండై
రథంబధిరోహించి ద్వారకాపురంబునకుం బ్రయాణంబయ్యె
నయ్యవసరంబున. శ్రీకృష్ణభాగ. 1-250.

అని సందర్భమును వివరించినారు. మూలమున నున్న "ఉత్తరాంభయ విహ్వలామ్" యనుదానిని జక్కగ స్పష్టమొనర్చి సన్నివేశౌచిత్యము పాటించిరి.

మత్త॥ "వెట్టనూర్చుచు నూర్పులెంతయు వింట బర్వెడు నట్లుగా
నట్టునిట్టు పదద్వయంబిలయందు దొట్రిల మెట్టుచున్
బిట్టుగా మెయి జెమ్మటల్ ధరణిం బడంగనుదోయినీర్
షట్టి కాలువగట్ట నుత్తర పొక్కుచుం బఱువెత్తుచున్.

శ్రీకృష్ణభాగ. 1-251.

ఇందు నుత్తర భయ విహ్వలత కన్నుల కట్టింపబడినది. మాతృమూర్తి కాబోవు నొక స్త్రీ సహజమైన భీతిచే నెటుల భయ విహ్వలయైనదో సహజ సుందరముగ జిత్రింపబడినది. ఇది శాస్త్రి వారి పాత్రోచిత రచనా పాటవమునకు నిదర్శనము.

"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి
లౌకికీనాంహి సాధూనాం అర్థం వాగనువర్తతే"

భవభూతి ఉత్తరరామచరితమ్.

అనికదా యార్యోక్తి.

అట్టి స్థితిలో నుత్తర,

శా॥ "ఓ కృష్ణా। మధుసూదనా। యదుపతీ। యోవాసుదేవా। హరీ।
నాకై వచ్చుచునుండె నగ్ని వలె మంటల్ మండుచున్ మెండుగా
నో కారుణ్య పయోబ్ధి। వరద। నన్నో మంగ నిప్పట్టునన్
నీకుందక్క మఱొక్కరుండెవడుగానీ లేడు లేడో ప్రభూ।

క॥ నాగతికిన్ వగవను నే
నాగర్భముగతికి వగతు నళినదళాక్షా।
వేగమ వచ్చెడి నిదిగో
లోగక యిచ్చిచ్చు టలుగులోజొఱ బాఱన్.

క॥ రక్షింపుము రక్షింపుము
రక్షక! చెడకుండ బొందురాజుకులము నా
కుక్షిస్థ శిశువొకండే
పరిక్షీణత బాపుపొంతె వఱలెడు తెలియన్.

శ్రీకృష్ణభాగ. 1-252 నుండి 254.

యని ప్రార్థించుట కలదు. ఇందు స్త్రీ స్వభావము చక్కగ చిత్రింపబడి మూలమునకే మెఱుగు దిద్దబడినది.

తన గతికి చింతింపక తనకుక్షిస్థ శిశువుకై చింతింతుననుటలో నొక మాతృమూర్తి యావేదన సుస్పష్టము. మఱియు "పాండురాజ కులము చెడకుండ కాపాడుమని వేడుకొనుటలో నామెకు వంశమందు కల భావౌన్నత్యము విశదమగుచున్నది. "నిన్ను మించి రక్షించు వాడు వేఱొకడు లేడనుటలో కృష్ణునిపై కల స్థిర విశ్వాసము స్పష్టము.

ఈ విధముగ పరిశీలించిన యెడల నీ పట్టున పోతన్నను మించిన యనువాదము శాస్త్రివారిచే చేయబడినదని చెప్పవచ్చును.

పిదప శ్రీకృష్ణుడు సూక్ష్మరూపుడై విరాటుపుత్రి గర్భముజొచ్చి తన చక్రధారచే నశ్వత్థామ ప్రయోక్త బ్రహ్మాస్త్రమును నివారించుట కలదు.

"యద్యప్యస్త్రం బ్రహ్మశిరస్త్వమోఘంచాప్రతిక్రియం
వైష్ణవం తేజ ఆసాద్య సమశామ్యద్ భృగూద్వహ.
సంస్కృతభాగ. 1-8-15.

అని మూలముననున్నది.

తరువాత కుంతి శ్రీకృష్ణుని స్తుతించుట కలదు. అందొకటి రెండు పరిశీలింతుము.

"గోప్యాదదేత్వయి కృతాగసిదామతావ
ద్యాతే దశాశ్రుకలిలాంజన సంభ్రమాక్షం
వక్త్రం వినీయ భయ భావనయా స్థితస్య
సామాం విమోహయతి భీరపి యద్బిభేతి.
సంస్కృతభాగ. 1-8-31.

దీనికి పోతన్న యనువాదమిటులున్నది.

ఉ॥ కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్న చో
గోపిక త్రాటగట్టిన వికుంచిత సాంజన బాష్పతోయధా

రా పరిపూర్ణ వక్త్రము గరంబుల బ్రాముచు వెచ్చనూర్చుచుం
బాపడవై నటించుట కృపావర। నామది జోద్యమయ్యెడిన్.

పోతనభాగ 1-191.

ఇందు మూల వివరణముగ "కోపము తోడ నీవు దధి కుంభము భిన్నము సేయుచున్నచో" అని యున్నది.

ఇటు "త్వయికృతాగసి" యనుదానికి శ్రీధరుడు "దధిభాండ స్ఫోటం కృతవతి" యని వ్యాఖ్య వ్రాసినాడు. పోతన్న యీ శ్రీధరవ్యాఖ్య ననుసరించి "దధికుంభము భిన్నము సేయుచున్నచో" నని యనువదించుట సుస్పష్టము.

ఇక శాస్త్రిగారు,

ఉ॥ "నీ వపరాధివంచెఱుగ నేరక తల్లి యశోద త్రాటనిన్
నోవగుదేర గట్టిన గనుంగవనశ్రులు దేర బుల్కనన్
దేవినిజూచుచుం జకిత దృష్టుల లేని భయంబు నొందితీ
వా విధముందలంచుకొన నచ్చెరువయ్యెడు నిందిరావరా.

శ్రీకృష్ణభాగ. 1-262.

యని యథాతథముగ ననువదించిరి.

మఱియొకటి చివరగా స్తుతించునది,

"శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావధ్రుక్
రాజన్యవంశదహనానపవర్గ వీర్య
గోవిన్ద గోద్విజ సురార్తి హరావతార
యోగేశ్వరాఖిల గురో భగవన్నమస్తే.

సంస్కృతభాగ. 1-8-43.

దీనిని పోతన్న యిటులనువదించినాడు.

శా॥ శ్రీకృష్ణా। యదుభూషణా। నరసఖా। శృంగార రత్నాకరా
లోకద్రోహి నరేంద్ర వంశదహనా। లోకేశ్వరా। దేవతా

నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా। నిర్వాణ సంధాయకా
నీకున్ ప్రొక్కెద దుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ.

పోతనభాగ. 1-199.

ఇందు మూలమున లేని శృంగారరత్నాకరా, నిర్వాణ సంధాయకా, నిత్యానుకంపానిధీ యను సంబోధనములు కూర్చబడినవి. మఱియును "నమస్తే" యనిదానికి "నీకున్ ప్రొక్కెద" నని యనువాదము చేయబడి "తుంపవే భవలతల్ నిత్యాను కంపానిధీ"యనునది యధికముగా చెప్పబడినది. పోతన్న భక్తి దృష్టి కిటువంటి వెన్నియో వాని భాగవతానువాదమున కానవచ్చును. మఱియును "శృంగార రత్నాకరా" యని కుంతిచే పలికించుట కాననగును. ఇటు నీ పదము భాగవత తత్త్వ దృష్ట్యా జీవేశ్వర సంబంధ సాన్నిహిత్య సూచకమే కాని లౌకికమైన కామ వాసన కలిగి యుండుట కాదు. ముందు శ్లోకమున రతి శబ్దముపయుక్తమై యున్నది.

"త్వయిమేఽనన్య విషయా మతిర్మధుపతేఽసకృత్
రతిముద్వహతాదద్ధా గంగేవౌఘ ముదన్వతి.

సంస్కృతభాగ. 1-8-42.

ఇటు రతి శబ్దమునకు శ్రీధరుడు "అనవచ్ఛిన్న ప్రీతి" యని చెప్పినాడు. కావున పై పద్యమున పోతనచే కూర్చబడిన 'శృంగార రత్నాకరా' యను సంబోధనమునుకూడ మిగిలిన శ్రీకృష్ణా, నరసఖా మొదలగు వానివలె భావించుట సమంజసము.

ఇక శాస్త్రిగారు,

శా॥ భూభారంబు వహించి శిష్టజనులంబోషింపగా క్షత్రియుం
డై భూదేవుల బాధలందొలచి దేవాధీశులంగొల్చియెం
తోభక్తిన్గలయోగివల్లభుడవైతోపంగనైతో ప్రభూ
మాభూనాథ నమస్కరించెద నిదేమమ్మేలు కొమ్మెప్పుడున్.

శ్రీకృష్ణభాగ. 1-265.

ఇందు స్థూలముగ శ్రీకృష్ణ, నరసఖ యను సంబోధనలు కానరావు. కాని, "రాజన్య వంశదహనాపవర్గవీర్యం" అనునది "శిష్టజనులంబోషింపగా" ననుదానిచే ధ్వనింపజేయబడినది. మఱియు గోద్విజసురార్తి హారణత్వమును దానిచేతనే సూచింపబడి "యల్పాక్షరమనల్పార్ధమ్ము"నునది సార్ధకమగునట్లు చెప్పబడినది. దేవాధీశులన బ్రాహ్మణులని భాగవతము చేతనే తెలియును. అనగా భూసురులను సేవించువానిగ చూపబడెను. మూలమునందలి "యోగేశ్వరాఖిలగురో 'యనునఽ' యోగివల్లభుడవైతోపంగనైతో ప్రభూ" అయినది. మాభూనాధ యను సంబోధనము ప్రయోగింపబడినది. 'ఇంధిరా లోకమాతా మా రమా మంగళ దేవతా" యని లక్ష్మీనామములగ నమరము. కావున 'మా' యనగ లక్ష్మి. భూ - భూదేవి. ఇరువురకును నాధుడైనవాడా!" యని తాత్పర్యము.

ఈ విధముగ శ్రీకృష్ణభాగవత మిప్పట్టున మూల విధేయమైన యనువాదమును చూపినది. పోతన్న యనువాదమున నమూలక వ్యాప్తి గోచరించును. దీనిని బట్టి యనువాదమున వారి దృష్టిపథములు తెలియును.

పిమ్మట మూల భాగనతమున ద్వాదశాధ్యాయమున నీ విషయము కనబడును. శౌనకాదులు సూతుని పరీక్షిజ్జన్మాదిక మడుగగా నాతడు ధర్మజుని రాజ్య పాలనాదికముతో ప్రారంభించును.

"అపీపలద్ధర్మరాజః పితృవద్రంజయన్ ప్రజాః
అధిజహ్రుర్ముదం రాజ్ఞః క్షుధితస్య యథేతరే"

సంస్కృతభాగ. 1-12-4 నుండి 6.

దీనికి పోతన్న యనువాదమిట్లున్నది.

వ॥ "....ధర్మనందనుండు చతుస్సముద్రముద్రితాఖిల జంబూ
ద్వీపంబు నార్జించియు, మిన్ను ముట్టిన కీర్తినుపార్జించియు,

నంగనా తురంగమాతంగ సుభటకాంచనాది దివ్య సంపదలు సంపాదించియు, వీర సోదర విప్రవిద్వజ్జన వినోదంబులం బ్రమోదించియు, వైభవంబు లలవరించియు గ్రతువు లాచరించియు, దుష్టశిక్షణ శిష్ట రక్షణంబు లొనరించియు ముకుంద చరణారవింద సేవారతుండై సమస్త కామంబులందు నభిలాషంబు వర్జించి యరిషడ్వర్గంబు జయించి రాజ్యంబు సేయుచు,

తే॥ చందనాదుల నాకట సగ్గువాడు
దనివినొందని కైవడి ధర్మ సుతుడు
సంపదలు పెక్కు గలిగియు జక్రిపాద
సేవనంబుల బరిపూర్తి సెందకుండె. పోతనభాగ. 1-275

ఇందు ధర్మజుని పాలనము విశదముగ జెప్పబడినది. కాని మూలముననున్న "పితృ వదర్జంజయన్ ప్రజాః" యనునది విడువబడినది. మఱియును "చందనాదుల..." ఇత్యాది పద్యమమూలకము. పోతన్న స్వీయ కల్పితము.

ఇపుడు శ్రీకృష్ణభాగవతానువాదము చూతము,

సీ॥ తఱిదప్పకుండగ స్తనయిత్నువులు వచ్చి
నెలమూడువానలు నిలచి కురిసె
క్ష్మాతలంబదిసస్య సంభరితంబయ్యె
గుంభవృష్టిగ బాలు గోవులిచ్చె
ఋతుధర్మమును దప్ప కెల్ల యోషధులును
ఫలియింప నయ్యెను బ్రజలు దనియ
వనములన్నియు బుష్పఫలభరితములయ్యె
నలుగడ ధర్మము నిలువనయ్యె

తే॥ వ్యాధులాధులు క్షామడాంబరములీతు
లెందునుం గాన బడవయ్యె నెల్ల ప్రజకు

సకల సౌఖ్యములుంగ్గలై శమనసుతుడు
శాంతుడై రాజ్యమేలునా సమయమందు.

శ్రీకృష్ణభాగ. 1-294.

ఇటుల స్పష్ట వివరణముతో మూలభావమును ధ్వనింపజేయుట కాననగును.

క్రమము తప్పకుండగ మేఘములు నెలకు మూడు సారులు వర్షించినవిట. మూలమున యజ్ఞాదులు ధర్మజునిచే నొనర్పబడినట్లు ఉన్నది. యజ్ఞయాగాదులవలన సువృష్టి కలుగునని వేదశాస్త్రములు చెప్పును. దీనిని బట్టి వర్షములు చక్కగ కురియుచున్నవనుటచే యజ్ఞయాగాదులొనర్పబడుచున్నవని గ్రహింపవచ్చును.

ఇట్లు ధ్వని వైచిత్రిచే నన్నియు నవగాహనమగును.
"సంపదః క్రతవో లోకా మహిషే భ్రాతరో మహీ" యనునది
"క్ష్మాతలంబదిసస్య సంభరితంబయ్యె
గుంభవృష్టిగ బాలుగోవులిచ్చె" అని యయినది.
క్రతువుల విషయము పైన వివరింపబడినది. ఇట్టివన్నియు జరుగు చుండుటచే వాని కీర్తి మిన్ను ముట్టదా యేమి? అని ధ్వని సూచితము. ఇక ధర్మజుని కృష్ణభక్తి జగద్విదితము. ప్రత్యేకము చూపనక్కఱ కలుగదని శాస్త్రివారి భావనయై యుండవచ్చును. ఇటుల పాలనాదికము గోచరించును.

పోతన్న యనువాదమున ఇట్టి స్పష్టత గోచరించుటలేదు. పిదప యిట్లు చెప్పబడినది,

"మాతృ గర్భగతో వీరః సతదా భృగునందన
క్షతజాత్యంగదాపాణిన మాత్మనః సర్వతోదిశమ్"

సంస్కృతభాగ. 1-12-7 నుండి 9.

"మాతృగర్భగతో...తేజసా" యనుదానికి పోతన్న,

వ॥ "అంత గొన్ని దినంబులకు నభిమన్యుకాంతాగర్భంబునం దున్న డింభకుండు దశమాస పరిచ్ఛేద్యుండై గర్భాంతరాళంబున దురతంబైన యశ్వత్థామ బాణానలంబున దందహ్యమానుడై తల్లడిల్లుచు' నని యనువదించుట చేసినాడు. మూలమున దశమాస పరిచ్ఛేద్యుండై' యనుదానికి అధారములేదు. కాని తరువాతి '11 వ శ్లోకమున "మిషతోదశమాస్యస్య తత్రైవాంతర్దధే హరిః" యని కలదు. ఇందలి "దశమాస్యస్య" యను దానికి "దశమాసపరిచ్ఛేద్యస్య" అని శ్రీధర వ్యాఖ్య. దీనిని పోతన్న ముందుగానే గ్రహించి యనుసరించుట స్పష్టము.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతమీ విషయమున "ఉత్తర గర్భంబునందుండు నర్భకుండు" శ్రీకృష్ణభాగ. 1-295.
అని మూలానుసారముగ చెప్పుట జరిగినది.

పోతన్న తరువాత గర్భస్థ శిశువు చింతించుటను 5 పద్య గద్యములను అమూలకముగ చెప్పినాడు.

ఉ॥ "కుయ్యిడ శక్తిలేదు...."

క॥ "చిచ్చుల కోల వశంబున...."

క॥ "చెచ్చెర బాణ జ్వాలలు...."

శా॥ "రాడా చూడ సమస్త...."

వ॥ "అని గతాగత ప్రాణుండై...."

పోతనభాగ. 1-278 నుండి 282.

ఇవి పోతన్న కల్పించినవి. పిమ్మట "అంగుష్ఠమాత్రమమలం" అను శ్లోక భావమును పోతన్న తనదైన దృష్టితో బాగుగ పెంచినాడు.

సీ॥ మేఘంబుమీఁది క్రొమ్మెఱుగు కైవడి మేని
పైనున్న పచ్చని పటము వాఁడు
గండభాగంబుల గాంచన మణిమయ
మకరకుండల కాంతి మలయువాఁడు

శరవహ్ని నణగించు సంరంభమున జేసి
కన్నులనునుగెంపు గలుగువాడు
బాలార్క మండల ప్రతిమానరత్నహా
టక విరాజిత కిరీటంబువాడు

తే॥ కంకణాంగద వనమాలికా విరాజ
మానుడసమానుడంగుష్ఠమాత్రదేహు
డొక్క గద జేత దాల్చి నేత్రోత్సవముగ
విష్ణుడావిర్భవించెనవ్వేళయందు." పోతనభాగ. 1-283.

మూలము నందలి "శ్యామం తటిద్వాససం" అనునది మొదటి పాదమైనది. మూలమున "వసనము" మాత్రమే తటిత్తుతో పోల్పబడినది. పోతన్న మేనను గూడ మేఘముతో పోల్చినాడు. "తప్తకాంచన కుండలం" అనునది ద్వితీయపాదమైనది. మూలమునందలి కాంచనమునకు మణులను కూర్చి గండభాగముల మీద మలయించినాడు. "క్షతజాక్షం" అనుదానికి "అహోమద్భక్తస్యాపి గర్భే అస్త్రాది పీడేతి సంరంభాదత్యా రక్తనేత్రం"అని "శ్రీధరీయ వ్యాఖ్య. పోతన్న దానిని తీసికొని "శరవహ్ని నణగించు" ఇత్యాదిగ తృతీయ పాదము చేసినాడు. ఇందు "కన్నుల నునుగెంపు" పోతన్న స్వీయము. "స్ఫురత్పురటమౌళినం" అనునది "బాలార్కమండల...." ఇత్యాదిగ చదుర్థపాదమైనది. శ్రీమద్దీర్ఘచతుర్బాహుం" అనునది విడువబడినది. "కంకణాంగద వనమాలికా విరాజమానుడగుచు" నని యధిక విశేషణము చేరినది.

పోతన్న రచన యిట్లు చాల పెరిగినది.

దీనిని శాస్త్రీవారు శ్రీకృష్ణభాగవతమున నిట్లనువదించినారు,

సీ॥ నీలంపు జాలడాల్ డీలింపజాలుమై
హొంబట్టు రెంటెంబు డంబుమీఱ

నునుబోర గౌస్తుభమను మానికవుబేరు
కొ్రిక్కారు మెఱుగునా గొమరుమిగుల
గెంగేల తలకట్టు సింగాణి వలమురి
గుడిసె వాల్గుదెయును గదిమి దెలుప
వేవెలుంగుల జేని చేవ గాదని పించు
బొమిడికమొదల బొదలుచుండ

తే॥ బేరురంబున సిరికడుంబేర్మిదనర
నింతయై యింతలోపల నెంతో యగుచు
వేడిమికి దాళజాలక వెచ్చనూర్చు
కడుపు లోపలి వానికి గానవచ్చె.

శ్రీకృష్ణభాగ. 1-296.

ఇందు శాస్త్రీవారు పోతన్న ననుసరించుట స్పష్టము. "పేరు రంబున సిరికడుం బేర్మిదనర" ననుటలో వారి స్వీయత తెలియును.

చతుర్బాహువులను "కెంగేల దలకట్టు సింగాణి వలమురి, గుడుసు వాల్గుదెయును గడిమి దెలుప" అనుచు స్ఫురింప జేసిరి. దానికి ముందు వచనమున "అర్భకుండశ్వత్థామ శస్త్రాగ్నిల దహ్యామానుండగుచు నప్పుడు తన సమీపంబున నంగుష్ఠ మాత్ర ప్రమాణంబు గల యొక పురుషునింగాంచె నతండును" అని చెప్పినారు.

పోతన్న యట్టి పురుషుడు డావిర్భవించెనని మాత్రమే చెప్పినాడు. శాస్త్రీవారు మూలములోని "సర్వతోదిశేమే" యను దానిని విడువక స్పష్టముగ "ఇంతయై యింతలోపల నెంతో యగుచు" వ్యాపించెనని స్పష్టముగ యథాతథముగ చెప్పినారు. పోతన్న దీనిని మార్చుట స్పష్టము.

పిదప పరీక్షిజ్జననము, జాత కర్మాదికములుటంకింపబడినవి. పిమ్మట 15వ అధ్యాయమున ధర్మజుడు శ్రీకృష్ణుని నిర్యాణవార్తను

విని కొంతసేపు విచారించి పరీక్షిత్తునకు పట్టము కట్టినట్లున్నది. అనంతరము పరీక్షిత్పాలనాదికము, మునికుమార శాపము, భాగవత శ్రవణాభిరుచిని శుకుడు కలిగించుటలు చెప్పబడినవి.

పరీక్షిత్తు వేటకు బోయి బుభుక్షాపిపాసావ్యధితుడై సమాధి గతుడైన శమీకుని జూచి విధి బలిమిని రోషించి సర్ప శవమును వాని కంఠమున వేసి పోవును.

"అభూత పూర్వః సహసాక్షుత్తృడ్భ్యామర్దితాత్మనః
బ్రాహ్మణం ప్రత్యభూద్ బ్రహ్మన్ మత్సరో మన్యురేవచ;
నతు బ్రహ్మ ఋషేరంసేగతాసుమురగంరుషా
వినిర్గచ్ఛన్ ధనుష్కోట్యా నిధాయపురమాగమత్"
సంస్కృతభాగ. 1-18-29, 30.

ఇటు రాజు పిపాసార్దితుడై మున్నెట్టి యకృత్యము చేయని వాడైనను నిటులనొనరించెనని కలదు. అతడు మృత సర్పమును ముని మెడను వేయుటకు పిపాసాతురుడగుటయే హేతువుగదోచును.

పోతన్న యిట్లనువదించినాడు,

ఆ॥ వారిగోరుచున్న వారికి శీతల
వారి నిడుట యెట్టి వారికైన
వారితంబుగాని వలసిన ధర్మంబు
వారి యిడడు దాహవారి గాడు.

చ॥ "అని మనుజేశ్వరుండు మృగయావసరాయతతోయదాహ సం
జనితదురంతరోషమున సంయమిదన్ను దిరస్కరించి పూ
జనములు సేయడంచుమృత సర్పమునొక్కటి వింటికోపునన్
బనివడి తెచ్చి వైచెనటు బ్రహ్మమునీంద్రుని యంసవేదికన్.
పోతనభాగ 1-459, 460.

ఇందు మొదటి పద్యము పోతన్న కల్పితము. అంతకు మున్న

వారి గోరి ఫలితము రామి యటుల దలచును. పిదప నున్న పద్య మున మూలమునందలి "అభూతపూర్వః" యనునది విడువబడినది. ఈ పదము పరీక్షిత్పాత్రకు ప్రాణభూతమైనది. పోతన్న దీనిని యేల విడచెనో మరి.

శాస్త్రివారు తమ యనువాదమున మాత్రము దీనిని విడువక తెలిగించిరి.

వ॥ 'అని ప్రార్థించియు బ్రత్యుత్తరంబుకానక పిపాసార్ది తుండు కావున నొండెఱుంగక మున్నెప్పుడు నెట్టి తప్పునుం జేసి యెఱుంగని యమ్మహారాజు కర్మపరిపాకంబునంజేసి పరికింపజాలక"

శ్రీకృష్ణభాగ. 1-320.

ఇటు పరీక్షిత్తు తానెంత పిపాసార్దితుడయినను మర్యాదపూర్వ కముగ వర్తించుట యిందు కానవచ్చును. "కర్మపరిపాకమునంజేసి" యనునది చేర్చి శాస్త్రిగారా పాత్రకు మఱింత వన్నె చేకూర్చిరి. ఈ సొగసు పోతన్న యనువాదమున గానరాదు.

శృంగి యా యవమానమును విని రోషించి యా యకారణ కృత్యమునకు వగచుచు వలుకుట కలదు. రెండు పద్యము లీయెడ జెప్పబడినవి. ఇవి యమూలకములు,

ఉ॥ "ఆడడు తన్ను దూషణము"

ఉ॥ "పాము హిరణ్య దానములు"

పోతనభాగ. 1-467,468.

ఇవి రుండును పోతన్న కల్పితములు.

ఇటనొక విషయమసందర్భముగ నున్నది. పరీక్షిత్తు సర్ప శవమును ముని కంఠమున వైచి తన పురమునకు వెడలి పోయినట్లు మూలము. అటులనే యనువాదములును. కాని పోతన్న మరల' మునికుమారక శాపము విని కరినగరంబునకు పోయినట్లు" చెప్పినాడు.

రెండుమార్లు చనుట పొసగదు.

శాపము రాజు వినినట్లు మాత్రమున్నది. నగరికి వెళ్ళిపోయి నాడు కనుక నగరముననే వినినాడని యర్థమగును. మూలమున,

"న చిన్త్య యన్నిత్థ మథాశ్రృణోన్ యథా
మునేః సుతోక్తో........" సంస్కృతభాగ. 1-19-4.

ఇక శ్రీకృష్ణభాగవతమున నీ విషయము సరిగనే యున్నది. కాని శమీక శిష్యుడయిన గౌరముఖుని వలన వినినట్లున్నది. మూలమున నిటుల లేదు. దీనినే యాధారముగొని శాస్త్రివారు చెప్పి నారో యూహ్యము. పరీక్షిత్తటుల విరక్తుడై ప్రాయోపవిష్టు డగును.

## 5. యాదవ ప్రళయము:-

సంస్కృత భాగవతమున నీ యాదవ ప్రళయ విషయము ప్రథమస్కంధమునందును, ఏకాదశస్కంధము నందు మిగుల విపుల ముగను హృదయంగమముగ జెప్పబడి యున్నది.

మూల భాగవత ప్రథమస్కంధమున పదమూడవ యధ్యా యము చివర నారదుడు ధర్మజునోదార్చి తత్త్వోపదేశము కావించి తుంబుర సహితుడై యథేచ్ఛంజనును. పిదప ధర్మజుడు తనవారితో పలికినట్లులిటులున్నది.

"ఇత్యుక్త్వాథారుహత్స్వర్గం నారదః సహతుంబురః
యుధిష్ఠిరోవచస్తస్య హృదికృత్వాజహాచ్ఛుచః"
సంస్కృతభాగ. 1-13-59.

మూలమున నిటులుండగా పోతన్న తన యనువాదమున ధర్మజుడు భీమునితో పలికినట్లు మార్చినాడు.

గించి తుంబుర సహితుడై స్వర్గంబునకు నిర్గమించిన వెనుక
ధర్మజుండు భీమునింజూచి యిట్లనియె.

పోతనభాగ. 1-331

శాస్త్రిగారు మూలాను సారముగనే తమ శ్రీకృష్ణభాగవతాను
వాదమున నిట్లు నుడివినారు,

వ॥ "…. ధర్మజుండును విగత విచారుండై బంధులంజూచి"

శ్రీకృష్ణభాగ. 1-328.

పిదప దుర్నిమిత్తములను గమనించి భీమునితో ధర్మరాజు
పలికినట్లు మూలము.

"నిమిత్తాన్యత్యరిష్టానికాలే త్వనుగతేనృణామ్
లోభాద్యధర్మ ప్రకృతిం దృష్ట్వో వాచానుజం నృపః"

సంస్కృతభాగ. 1-14-5.

ఈ విషయము చూచి పోతన్న భీమునితో ధర్మజుడనినట్లు
మొదట చెప్పినాడు. శాస్త్రివారు యథా తథముగ,

వ॥ "ఇట్లనేకంబులగు దుర్నిమిత్తంబులు పొడకట్టుచుండుట లెఱింగి
ధర్మరాజు భీమునిం బిలిచి యిట్లనియె. శ్రీకృష్ణభాగ. 1-331
అని స్పష్టముగ ననువాదమొనర్చుట కలదు.

ఈ సందర్భమున ద్వారకకు వెళ్ళిన యర్జునుడింకను రాకుం
డుటకు హేతువు తెలియక చింతించుచుండును. ఇప్పట్టు పరికింపుడు,

'అపి దేవర్షిణాదిష్టః సకాలోఽయముపస్థితః
యదాఽఽత్మనోంగమాక్రీడం భగవానుత్సిసృక్షతి"

సంస్కృతభాగ. 1-14-8.

ఈ విషయము ననువదించునెడ పోతన్న మూలమునతిక్రమిం
చుట కానుపించును.

మ॥ యవపద్మాంకుశచాపచక్రఝుష రేఖాలంకృతంబైన మా
ధవు పాదద్వయమింక మెట్టెడు పవిత్రత్వంబు నేడాదిగా

నవనీకాంతకులేదు పో మఱి మదీయాంగంబు వామాక్షిబా
హువులాకంపమునొందుచుండు నిలకేయుగ్రస్థితుల్ వచ్చునో'

పోతనభాగ. 1-343.

శాస్త్రివారి యనువాదము యథాతథమై యిటులున్నది.

ఉ॥ "ఇమ్మెయినారదుండు వచియంచిన యట్టులకాలమయ్యెనో
యమ్మురదానవారి యెటు లాఱడి పొందగ నయ్యెనోకటా।

శ్రీకృష్ణభాగ. 1-332.

అనంతరమర్జునుడు రాగా విషయమెఱుంగుటకై ప్రశ్నించుట కలదు. ఈ సందర్భమున పోతన్న బాగుగా పెంపొనర్చుట చూడ వచ్చును. అర్జున ప్రత్యుత్తరములు కూడ చాల విపులములుగ నున్నవి.

ఈ సందర్భమున పోతన్న యనువాదమునకల,

సీ॥ చెలికాడరమ్మని చీరునన్నొకవేళ
మన్నించునొకవేళ మఱదియనుచు
బంధుభావంబున బాటించునొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు
బోద్ధయై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్య మొనరించు జనవిచ్చు నొకవేళ
గ్రీడించునొకవేళ గేలిసేయు

తే॥ నొక్కశయ్యాసనంబున నుండు గన్న
తండ్రికైవడి జేసిన తప్పుగాచు
హస్తమునబట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ మాధవు మఱవరాదు. పోతనభాగ. 1-369.

యనునది యమూలకము.

మూలమున నిప్పట్టున నిటులున్నది.

"శయ్యాసనాటనవికత్థనభోజనాదిష్వైక్యాద్వయస్యఋతవానితి విప్రలః
సఖ్యుః సఖీవ పితృవత్తనయస్య సర్వం సేహేమహాన్మహితయా కుమతే రఘుం..."

సంస్కృతభాగ. 1-15-19.

మూలమున నిట్లు సంగ్రహముగ నున్న విషయము పోతన్న చేతి చాల విస్తృతమైనది. ఈ విషయమున శాస్త్రివారి శ్రీకృష్ణభాగః మును మిక్కిలి సంగ్రహత్వమును కలిగి యున్నది.

యాదవుల నాశనమును గూర్చి యర్జునుడు మూల భాగః మున నిట్లునినట్లు కలదు.

"రాజంస్త్వయాభివృష్టానాం సుహృదాంనః సుహృత్పురే
విప్రశాపవిమూఢానాం నిఘ్నతాంముష్టిభిర్మిథః
వారుణీం మదిరాం పీత్వా మదోన్మథితచేతసాం
అజానతామివాన్యోన్యంచతుః పంచావశేషితాః"

సంస్కృతభాగ. 1-15-22, 23.

దీనికి పోతన్న,

మ॥ యదువీరుల్ మునినాథుశాపమున గాలాధీనులైయందఱున్
మదిరాపాన వివర్ధమాన మద సమ్మర్దోగ్రరోషాంధులై
కదనంబుల్దమలోన ముష్టిహతులంగావించి నీఱైరి న
ష్టదశం జిక్కిరి నల్గురేవు రచటన్ సర్వంసహా వల్లభా"

పోతనభాగ. 1-376.

ఇందు గాలాధీనత్వము పోతన స్వీయము. మఱియు న... దుగురు మిగిలిరని మూలమున కలదు. కాని సప్తదశులుగా ...

వ॥ అయ్యో మహారాజా! యాదవ వీరులందఱు మద్యపానంబున నొడలెఱుంగక ముని శాపంబునంజేసి తమలో దారు పోరి చచ్చి రందు నల్వురు మాత్రమే శేషించిరి. శ్రీకృష్ణభాగ. 1-343.

ఇటుల మూలానుసారము సంక్షిప్త రూపమున కలదు. మూలమున "చతుః పంచావశేషితాః" యనుదానికి నల్వురు మాత్రమని సంగ్రహింపబడినది. ఇందెత్తుగడ మూల శ్లోక ప్రారంభమును స్ఫురింప జేయుచున్నది.

ఇక నీ విషయమేకాదశస్కంధమునను జెప్పబడినది. అది ప్రత్యక్ష చిత్రీకరణము. ప్రథమాధ్యాయమున ముసలోదయ వృత్తాంతము ఇటులున్నది.

"విశ్వామిత్రోఽసితః కణ్వోదుర్వాసోభృగురంగిరాః....
సాంబస్య దదృశుస్తస్మిన్ ముసలంఖల్వయస్మయమ్"
సంస్కృతభాగ. 11-1-12 నుండి 17.

పోతన్న ఇటులనువదించినాడు,

వ॥ ద్వారకానగరంబున కనతిదూరంబున నుండు పిండారకంబను నొక్క పుణ్యతీర్థంబునకరిగిరి. అంత,

క॥ దర్పించి యాదవులు దమ
నేర్పున గౌమరారు సాంబు నెలతుకరూపం
బేర్పడ శృంగారించుక
కర్పూర సుగంధి పోల్కి గావించిరొగిన్.

పోతనభాగ. 11-18, 19.

ఇందు ఋషులు పిండారక తీర్థమునకరిగినట్లున్నది. పిదప యాదవులు సాంబునకు స్త్రీ వేషము వైచినట్లు మాత్రము చెప్పబడినది. మూలమున యదునందనులు క్రీడాలోలరై యుండినట్లున్నది.

పిదప,

ఉ॥ "మూకలు గూడి యాదవులు ముందట బెట్టుక యార్చి నవ్వుచున్"

క॥ "యదుడింభకులను గనుగొని....ననుచున్"

క॥ "వాలాయము యదుకులని ...పల్కుటయున్"

వ॥ "మదోద్రేకులయిన యాదవ బాలకులు ముని శాపభీతులై వడవడ వడంకుచు సాంబు కుక్షినిబద్ధ చేలగ్రంధి విమోచ నంబు చేయు సమయంబున ముసలంబొకటి భూతలపతితం బైన విస్మయంబు నొంది......."

పోతనభాగ. 20 నుండి 23.

అని కలదు. ఇందు స్త్రీ వేషము వైచిరనియే యున్నది కాని యంతర్వత్నీత్వము చెప్పబడలేదు. తరువాత వారి ప్రశ్న మును బట్టి గ్రహింపవలెను. అంతియ. మరియు మూలమున లే కుక్షి నిబద్ధ చేల గ్రంధి విమోచనము కనుపించుచున్నది. మఱియ మూలములోని "ప్రష్టుం విలజ్జతీ సాక్షాత్" యనునదియు విడు బడినది.

ఈ విషయానువాదము శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతము నిటులున్నది,

సీ॥ "....కణ్వ విశ్వామిత్ర కాశ్యపాత్రి వశిష్ఠ
భృంగ్వగిరోఽసిత విష్ణురాత

తే॥ నారదాది మునీంద్రులా ద్వారకకడ
నున్న పిండారకంబని యెన్నబడెడు
తీర్థమున నాడ జనుదెంచి తీరభూమి
నధివసించిరి స్వేచ్ఛమైనాడు కొనుచు.

వ॥ అయ్యవసరంబున,

ఉ॥ "యాదవనందనుల్ తటమునందగుసైకతభూస్థలంబులన్
మోదముతోద బెక్కులగు పోకడలన్ బడియాటలాడుచున్
గాదనువాడు లేక కనుగానని తీఱున సంచరించుచున్
వాదములాడుకొంచు బహు భంగుల గానగవచ్చిరచ్చటన్
శ్రీకృష్ణభాగ. 11-10 నుండి 12.

ఇందు యాదవుల యాట విడువక చెప్పబడినది. మఱి "కనుగానని తీఱున" యను చక్కని జాతీయ ప్రయోగము ය బాలకుల మందభాగ్యత్వమును స్పష్టమొనర్చుచున్నది.

పిదప చక్కగ నంతర్వత్నీ వేషము వైచినట్లు చెప్పబడి వ విషయ స్పష్టీకరణము కానవచ్చును.

క॥ జాంబవతీ సుతుడగు నా
సాంబునకా సమయమందు నంతర్వత్నీ
సంబంధంబగు వేషము
సంబరమున వేసిరచ్చు సల్పిన రీతిన్.

సీ॥ గుంటలు వడి కనుల్ గొనబు దప్పగ వెల
వెలఁ బాఱునెమ్మోము వెలయుచుండ
గాళ్ళనుం జేతులు కాడలట్లయి వ్రేల
నడకల బడలికల్ నలువు మీఱ
మట్టి వాసనలతో మట్టు మీఱుచు నూర్పు
లడుగడుగునకు బెల్లడరుచుండ
బాలతో నుబ్బిన పాలిండ్ల పై మొన
లిందనీలము తళ్కులీను చుండ

ఆ॥ జాకిబానబోలి వ్రేకనై యుదరంబు

నిమ్న తలము లెందునే గానరాకచూ
లాలుగాగ నయ్యెసాంబుడపుడు. శ్రీకృష్ణభాగ. 11-13, 14.

పై పద్యము నందలి "యచ్చుసల్పిన రీతి" యీ పద్యమై నిండు చూలాలయిన సాంబుని మన కట్టెదుట నిలపును. శాస్త్రివారి యౌన్నత్య దృష్టికిదియును నికషోపలము. ఇది మూలమున కేవన్నె దిద్దినటులున్నది.

పిదప మూలములోని "ప్రష్టుం విలజ్జతీ" యనునది,

ఆ॥ అడగవలయుననెడు నడియాస యగు గాని
సిగ్గు పెంపు వలన దగ్గఱకయి
యడుగ జాలకుండె నయ్యచెప్పుండని
నవ్వుచుండ మౌనినాథులపుడు. శ్రీకృష్ణభాగ. 11-16.

యని స్పష్టముగ చెప్పబడినది. నారయ దీనిని విడచినాడని మొదట చెప్పితిని.

పిదప మునిశాపభీతులగుట యిటులున్నది.

వ॥ "అని కనలి పలికిన నులికిపడి యదుపుత్రులు సంతప్తచిత్తులై జాంబవతీ సుతునుదరంబుపై గల వస్త్రంబులెల్ల, విచ్చు చుండునంతలో నందునయస్మయంబగు ముసలంబొండు చూపట్టుటయు" శ్రీకృష్ణభాగ. 11-18.

ఇందు పోతన్న యందు వలె కుక్షి నిబద్ధ చేల గ్రంధి విమోచనము లేక మూలానుసారముగ నుదర వస్త్ర విమోచనమే కలదు.

పిదప యదు బాలురు దానిని కొని రాజునకు చూపినట్లు మూలమున నిట్లున్నది.

"కిం కృతం మందభాగ్యైర్నః కిం వదిష్యన్తినో జనాః
కర్తుం నైచ్ఛద్ విప్రశాపం కాలరూప్యన్వమోదత.
సంస్కృతభాగ. 11-1-18 నుండి 24.

నారయతా నిట్లనువదించినాడు,

వ॥ "....దానింగొని చని దేవకీనందను సన్నిధానంబునం బె
యెఱింగించిన...." పోతనభాగ. 11-23.

ఇందు మూలములోని,

"కిం కృతం మందభాగ్యైర్నః కిం వదిష్యన్తి నో జనాః"

యనునది విడవబడినది. పిదప యదుబాలురు ముసలమును రా
యుగ్రసేనుని జేరి చూపి పలికినట్లున్నది. నారయ దానిని మ
శ్రీకృష్ణునకు చెప్పినట్లనువదించినాడు. మఱియు చివరనున్న '
వాంజాతసర్వార్థం ఈశ్వరోపితదన్యథా

కర్తుం నైచ్ఛద్ విప్రశాపం కాల రూప్యన్వమోదత" యిఁ
యిప్పుడే దానిని చూపినాడు.

వ॥ అతండాత్మ కల్పిత మాయారూపంబగుట నెఱింగియు, నె
గని విధంబున వారలంజూచి యిట్లనియె"

పోతనభాగ. 11-23.

పిదప మూల విషయ విస్తరణము కనుపించును,

క॥ మదిచెడి కన్నుంగానక
మదయుతులై మునులగల్ల మాటల జెనయం
గడిసి కులక్షయకారణ
విదితంబగు శాపమొందు వెఱ్ఱులు గలరే!

క॥ ధరణిసుర శాపమునకు
హరి హర బ్రహ్మాదులైన నడ్డముగలరే
నరులనగ నెంతవారలు
కరమరుదుగ బూర్వ జన్మ కర్మము ద్రోవన్.

పోతనభాగ. 11-24, 25

వ॥ "అయస్మయంబగు ముసలంబొండుచూపట్టుటయు నట్టె వీడి యడలుచు **మనము** చేసినదానికి నెల్లరుంగర్హింపకుండరని విహ్వలించుచు ముసలముంగొని గృహంబునకుం జని దాని నుగ్రసేనునకుం జూపి తమ పాపంబునకు దల్లడిల్లుచు నెల్ల వృత్తాంతంబు నెఱుంగ జెప్పిన నప్పురుషుండును,

చ॥ తవిలెను విప్రశాపమది దైవమకారణ మెన్నదీని కెం
దెవరును జాలియుండరగునేనియు జెప్పెద దీని నబ్ధి యం
దవునొకజాత జూర్ణమగునట్టులు చేసిజలాంతరంబునన్
దవులగ గల్పుడీయనుచు దత్పరతన్ వచియించెనంతటన్.

శ్రీకృష్ణభాగ. 11-18, 19.

అంత్యమున,

వ॥ "... భగవంతుడిది యంతయు నెఱింగి యు నెఱుంగని తెఱంగున మెలంగుచు లోలోదానికనుమోదించుచు సమర్థుండయ్యు విప్రశాపంబన్యథా పొనర్చుట కుందలంపడయ్యె."

శ్రీకృష్ణభాగ. 11-21.

ఈ శ్రీకృష్ణభాగవతానువాదము మూలమునకు యథాతథముగ నున్నది.

పిదప ముప్పదియవ యధ్యాయమున మూలమున నిట్లున్నది. పరీక్షిత్తు శుకునిచే నుద్ధవుడు బదరికాశ్రమమునకు వెడలినట్లు విని తదుపరి వృత్తాంతమును గూర్చి ప్రశ్నించుటతో నిట్లు ప్రారంభమగును,

"తతో మహాభాగవత ఉద్ధవే నిర్గతే వనమ్
దృష్ట్వా జిష్ణోర్యుధిరథగతం యచ్చ తత్సామ్య మాయుః"

పోతన్న భాగవతమున నారయ ఈ విషయమునిట్లు చెప్పుట కానుపించును,

క॥ చెప్పిన విని రాజేంద్రుడు
చొప్పడ శ్రీకృష్ణకథలు చోద్యముగాగన్
జెప్పిన దనియదు చిత్తం
బొప్పగ మునిచంద్ర నాకునుత్తములొప్పన్.

తే॥ అంతటను గృష్ణుడేమయ్యె నరసిచూడ
యదువు లెట్టులు వర్తించి రేర్పడంగ
ద్వారకాపట్టణంబెవ్విధమున నుండె
మునిజనశ్రేష్ఠయానతీ ముదముతోడ.

పోతనభాగ. 11-116, 117.

ఈ యనువాదము నామమాత్రముగ నున్నది. మూలవిషయములు మూడున్నర వంతులు విడువబడినవి. మొదటి పద్యమమూలకమే. శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదమిటులున్నది.

ఉ॥ ఉద్ధవుడగ్గతిన్ బదరికోర్వికి బోయిన భూత భావనుం
డిద్ధ చరిత్రుడైన పరమేశ్వరుడాహరి ద్వారకాపురిన్
సిద్ధమునీంద్ర శాపమున జేసి యదూద్వహులెల్ల ద్రెళ్ళిపో
బుద్ధి నెఱింగి తానపుడు పోయిన పోకడలెల్ల దెల్పుమా.

క॥ ముని శాపంబున దానుం
దన లోకము జనెడు నట్టి తరుణము నందున్
దన మేను విడిచి చనెనో
తనవెంటుంగొంచు జనెనొ తాత్పర్యమునన్.

సీ॥ వేత్రతలెవ్వని మేను వీక్షించి మరు బాటి
కగ్గమై వలవంతనందుకొనిరొ॥

శ్రీకృష్ణభాగ. 11-370 నుండి 372.

ఈ యనువాదము మూలమును యథాతథముగ జూపుచున్నది. రెండవ పద్యము మూలములోని "తనుం న కథమత్యజిత్" యను దానికనువాదము. ఎట్లు త్యజించెను? అనుదానిని వివరణమున చూపుట జరిగినది. ఈ విధముగ నంతయు మూలానుసారముగనే యున్నది.

పిదప శుకుడిట్లు చెప్పుట మొదలిడును,
"దివి భువ్యంతరిక్షేచ మహోత్పాతాన్ సముత్థితాన్
దృష్ట్వాఽఽసీనాన్ సుధర్మాయాం కృష్ణః ప్రాహ
యదూనిదమ్

ఏతే ఘోరా మహోత్పాతాద్వార్వత్యాం యమ కేతవః
ముహూర్తమపి న స్థేయమత్రనోయదుపుంగవాః"
సంస్కృతభాగ. 11-30-4, 5.

ఇత్యాదిగ శ్రీకృష్ణుడు చెప్పి వారిని శంఖోద్ధారమునకు పోవుదమని సిద్ధమొనర్చును. అటులందఱును ప్రభాసమునకు వెళ్ళుదురు. దీనికి పోతన్న భాగవతమున ననువాదము కానరాదు.

వ॥ "అనిన రాజునకు శుకుండిట్లనియె. వాసుదేవుండన్యాయ ప్రవర్తకులగు దుష్టుల సంహరించి న్యాయప్రవర్తకులగు శిష్టుల బరిపాలనంబుజేసి, బలరామసమేతంబుగా ద్వారకానగరంబు వెడలినంగని, యాదవులు దమలో దాము మదిరాపానమత్తులై." పోతనభాగ. 11-118.

ఇందు శ్రీకృష్ణ సంభాషణమే లేదు. బలరామ కృష్ణులు ద్వారకను వీడి యెచ్చటకు వెళ్ళినారోలేదు. యాదవులు ద్వారకను వీడక యందే పోరి నశించినట్లున్నది. ఇది యంతయు మూల విరుద్ధము.

శాస్త్రివారి యనువాదము యథాతథముగ నిటులున్నది.

చ॥ "భువిదివినంతరిక్షమున బుట్టిన దుశ్శకునంబులంగడున్
నవయయుచున్న యాదవుల నందకపాణిభయంబు
గొల్పుచున్
సవసవగాగనిట్లనియె నా ప్రియ బంధువులార నా శహే
తువులివె కానవచ్చెడిని దోరముగా మన ద్వారకాపురిన్.

వ॥ అని కృష్ణుడు చెప్పిన యదుపుంగవులెల్లరు వల్లెయని చెప్పిన చొప్పున స్త్రీలనంపి వుచ్చి తారు తేరు లెక్కి ప్రభాస తీర్థంబునకుం జని స్నానదానాదులొనరించి భగవంతునారాధించుచు దైవము ప్రేరేపించుటంజేసి పిన్నలు పెద్దలు నాకెల్లరు మైరేయక మద్యముం గ్రోలిరంత,

శ్రీకృష్ణభాగ. 11-374, 378.

ఇటుల శ్రీకృష్ణభాగవతమున నీ విషయము మూలము ననుసరించియే స్పష్టముగ నున్నది.

పిదప యాదవుల నాశము చెప్పబడినది. రామకృష్ణులవతారము చాలించుట మూలమున నిటులున్నది,

"రామః సముద్ర వేలాయాం యోగమాస్థాయ పౌరుషమ్
తత్యాజలోకం మానుష్యం సంయోజ్యాత్మానమాత్మని.

సంస్కృతభాగ. 11-30-26.

పోతన్న భాగవతమున నిట్లు నారయ యనువదించుట కలదు,

వ॥ "అంత నీలాంబరుండు వేటొక త్రోవంబోయి యోగ మార్గంబున ననంతునింగలసె...." పోతనభాగ. 11-118.

ఇటు మూలమునకల "సముద్ర వేలాయాం" అనునది విడువబడినది. "సంయోజ్యాత్మానమాత్మని" యని యుండగ "ననంతునింగలసె"నని

ఇక శాస్త్రివారి యనువాదము చూతము,

మ॥ బలరాముండు సముద్రతీరమున సంబద్ధాసనస్థుండు యో
గలసమ్మూర్తియుధ్యాననిశ్చలుడునై కన్పట్టి యొక్కింతలో
పలసంకర్షణమూర్తి తానగుట నేవంరూపమర్త్యాకృతిన్
దొలగందోయుచు నైజతేజమున యందుం జేరనే గెన్వడిన్.
శ్రీకృష్ణభాగ. 11-382.

ఇందు మూలమువనుపరించియే స్పష్ట వివరణము కానవచ్చును.

శ్రీకృష్ణుడవతారమును చాలించు సందర్భము మూల భాగవతమున నీ విధముగ నున్నది.

"రామనిర్యాణమాలోక్య భగవాన్ దేవకీసుతః
మృగస్యాకారం తచ్చరణం వివ్యాధమృగశంకయా
లోకాభిరామం స్వతనుం ధారణాధ్యానమంగళమ్
యోగధారణయాఽఽగ్నేయ్యాదగ్ధ్వా ధామావిశత్స్వకమ్
సంస్కృతభాగ. 11-30-27 నుండి 31-6.

ఈ విషయమును పోతన్న భాగవతమున నారయ యిట్లను వదించినాడు.

వ॥ ".... అప్పరమేశ్వరుండును మఱియొక మార్గంబునం జని యొక్క నికుంజపుంజంబు చాటున విశ్రమించుటం జేసి చరణంబు, వేఱొక చరణంబు మీద సంఘటించి, చంచలంబుగా వినోదంబులు సలుపు సమయంబున, నొక్క లుబ్ధకుండు మృగవధార్థంబుగావచ్చి దిక్కులునిక్కి నిరీక్షింపుచుండవృక్షంబుచాటున నప్పరమపురుషుని చరణంబు హరిణ కర్ణంబుగాబోలు నని, దానిగని ..........పవిత్రాంతః కరణుండై ప్రాయోపవేశంబునం బ్రాణంబులు వర్జించి వైకుంఠపద ప్రాప్తుండయ్యె.
పోతనభాగ. 11-118.

ఇందు మూలవిషయము చాల విడువబడినది. మూలమ
"మృగస్యాకారం తచ్చరణం" అని యుండగ నారయ "హరిణ
ణంబుగా బోలు" నని మార్చినాడు.

పిదప దారుకుడు శ్రీకృష్ణునన్వేషించుచు తులసివాసనలం
డినవాయువుంబట్టి కృష్ణుడున్న ప్రదేశమును గుర్తించి తదభిముఖ
చనినట్లు మూలమున నిటుల గలదు.

"వాయుం తులసి కామోదమాఘ్రాయాభిముఖం యయౌ"

సంస్కృతభాగ. 11-30-41.

ఈ విషయమును నారయ చెప్పనే లేదు.

క॥ "దారుకుడు గనియె నంతట
జారు నిరూఢావధాను సర్వజ్ఞు హరిన్
మేరుసమధీరు దనుజ వి
దారుని నేకాంత పరుని దద్దయు వేడ్కన్.

పోతనభాగ 11-119.

సామాన్యముగ జూచెనని మాత్రమే చెప్పుట నారయ య
వాదమున పై విధముగ నరయ వచ్చును. పిదప నారాయణుడై
పదంబున కరుగుటను నారయ యిట్లు చెప్పెను.

వ॥ "....అప్పరమేశ్వరుండును శతకోటి సూర్య దివ్య తేజో
సితుండై వెడలి, నారదాదిముని గణంబులును బ్రహ్మా రు
దేవతలును, జయ జయ శబ్దంబులతోడం గదలిరానిజప
మున కరిగె, నారాయణ విగ్రహంబు జలధి ప్రాంతం
జగన్నాథస్వరూపంబై యుండె."

పోతనభాగ. 11 - 122.

వారి వారి లోకములకు వెడలినట్లున్నది.

"బ్రహ్మరుద్రాదయస్తేతు దృష్ట్వా యోగగతిం హరేః
విస్మితాస్తాం ప్రశంసంతః స్వంస్వం లోకం యయుస్తదా"
సంస్కృతభాగ. 11-31-10.

ఈ విషయమంతయు నారయ యనువాదమున విడువబడి "ప్రశంసంతః" యనునది మాత్రము "జయజయ" శబ్దములతోడంగ దలిరానని బహు క్లుప్తముగ నుండుట స్పష్టము.

మూలమున శ్రీకృష్ణుడు యోగముననుసంధించి యోగాగ్నిచే తనువును దహింపజేయకయే వైకుంఠగతుడయ్యెనని (11-31-6) యుండగ నారయ యోగధారణా విషయమునే విడిచినాడు.

ఇటులీ విషయము నారయ యనువాదమున మిక్కిలి సంగ్రహింపబడి యన్యథా కరణము చేయబడి కానుపించును.

ఇక శాస్త్రిగారు మూలమును యథాతథముగనే యనువదించుట శ్రీకృష్ణభాగవతమున కానవచ్చును.

ఉ॥ రాముడు దేహమున్విడి విరాజిలుచున్ వినువీధినుండి తే
జోమహిత స్వరూపమున జూచుచు నుండగమించుటల్‌యదు
గ్రామణి కృష్ణుడారసి కరంబు మనంబున సంతసించుచున్
సామములన్ బఠించుచు విశాలతలంబున సంచరించుచున్.

క॥ ఒక మఱ్ఱిచెట్టు క్రిందన్....యను రీతిన్.

సీస॥ "పొగలేని యగ్నినా దగదగమని వెల్గు
దేహకాంతుల కడన్ దేజరిల్ల"
శ్రీకృష్ణభాగ. 11-383 నుండి 385.

ఇందు మూల భావము యథాతథముగ నున్నది. శ్రీకృష్ణుడు సామములను బఠించుచు సంచరించుట మాత్రము చేర్పబడినది.

మూలమున పిప్పల వృక్షమని యుండగ నిందు మఱ్ఱి వృక్ష
మని యుండుట తెలియును.

పిదప,

చ॥ జరయను వేటకాడపుడు శౌరిని దూరము నంద చూచి చెం
దిరమటు లెఱ్ఱనై పయికి దేరి కనంబడు వామపాదమున్
జిఱుమెకమన్ భ్రమన్ ముసల శేషము ముల్కినెసంగునమ్మునన్
గరమనురాగ మేరుపడ గాడగనేసెరయంబెసంగగన్.

వ॥ అట్లేసి వాడతిరయంబున నటకుం బఱచి వచ్చి చతుర్భుజం
బులతో నున్న భగవంతుండగు వాసుదేవునింజూచి

శ్రీకృష్ణభాగ. 11-386, 387.

యని విషయము మూలానుసారముగ జెప్పబడియున్నది. మూల
మున వ్యాధుడు "చతుర్భుజం తం పురుషం దృష్ట్వా"-చతుర్భుజుడైన
యప్పురుషుని "జూచి" యని యుండుట యీ శాస్త్రివారి యనువా
దమునను నటులే కానవచ్చును. కాని నారయ శరఘాతమునకు
నొచ్చి శ్రీకృష్ణుడు పలవించినట్లు మూలమున లేని విషయమును
అతడు "హా హా రవంబునం గదలుచుండ" నని చెప్పినాడు. మఱి
యును రథగరుడధ్వజాదులు సూతుడాశ్చర్య చకితుడై చూచుచుండ
నాకసమునంటి వెడలిపోవుట లేదు. అంతియకాక సూతుని బిలచి
శ్రీకృష్ణుడు చెప్పిన విభయము వసుదేవాది బంధుజన దేహత్యాగాది
విషయములను నారయ విడచి పెట్టినాడు.

శాస్త్రివారు కృష్ణ నిర్యాణమును,

వ॥ "యోగంబనుసంధించి యోగాగ్నిచే నిజదేహంబు దహింపక
దానితోడన నెల్లరుంగనుచుండ మెఱపు మెఱసిన తెఱంగున
మెఱసి తన దివ్యధామంబగు వైకుంఠంబున కకుంఠగతిం

చు వచ్చిన దారింబట్టి చనిరి." శ్రీకృష్ణభాగ. 11-398.

యని మూల భావము నటులే చూపినారు. ఇంతకు మున్ను బ్రహ్మాది దేవతలు గృష్ణ దర్శనలాలసులై నిరీక్షించుచు వాసుదేవుని గీర్తించి నటులీపై వచనమునందే మూలానుసారముగ నున్నది.

పిదప నీ వృత్తాంతమంతయు చెప్పి పరీక్షిత్తుతో శుకుడు భాషించిన విధము మూలమున నిటులున్నది,

"రాజన్ పరస్య తనుభృజ్జననాప్యయేహా
మాయావిడంబన మేవహి యథా నటస్య
సృష్ట్వాత్మ నేదమను విశ్వ విహృత్యచాన్తే
సంహృత్యచాత్మమహిమ్నో పరతః స ఆస్తే."

సంస్కృతభాగ. 11-31-11.

ఇత్యాది విధముగ బలికిన శుకభాషణమును, తరువాయి విషయమున్ను మొత్తము 35 శ్లోకములను నారయ యనువదింపక విడచినాడు.

శాస్త్రివారు విడువక యథాతథముగ ననువదించుట శ్రీకృష్ణ భాగవతమున జూడ వచ్చును. పై శ్లోకమునకు

శాస్త్రివారి యనువాదమిది,

క॥ లీలా మానుష విగ్రహు
డేలీల నటుండువోలె నిటు వేషంబుం
దాలిచి కర్జము దీటిన
పైలలి విచ్చేసె గాదె పార్థివముఖ్యా"

శ్రీకృష్ణభాగ. 11-399.

ఇటుల దదనంతర వృత్తాంతమంతయు జెప్పబడి మూలానుసారముగ నేకాదశస్కంధము ముగియును.

## 6. గజేంద్ర మోక్షణము :-

ఈ వృత్తాంతమష్టమస్కంధమున గలదు.

ఈ సందర్భమున పోతన్న యనువాదమున మూలభిన్నములున్న వని యితః పూర్వము సంగ్రహముగ స్పృశించియుంటిని. ఇప్పుడు సవివరముగ పరిశీలించెదను.

భాగవతము నందలి కల్పనామయమైన యన్నింటిలోను గజేంద్రమోక్షణ కథయే మకుటాయమానమైనది. మూలమున నతి సంగ్రహముగ సూత్రప్రాయముగ నున్న యీ విషయము పోతన్న యనువాదమున మిక్కిలి విస్తృతమై భక్తి ప్రబోధక రత్నమై ఎంతో ప్రశస్తినందినట్టిదైనది.

మూల భాగవతమున శుకుడు పరీక్షిత్తుతో నిట్లనుచున్నాడు,
"చతుర్థ ఉత్తమ భ్రాతా మనుర్నామ్నా చ తామసః
తత్రాపి జజ్ఞే భగవాన్ హరిణ్యాం హరి మేధసః
హరిరిత్యాహృతో యేన గజేన్ద్రో మోచితో గ్రహాత్"
సంస్కృతభాగ. 8-1-27 నుండి 30.

దీనిని బట్టి నాల్గవ మనువైన తామసుని కాలమున విష్ణువు హరిణీహరిమేథులను దంపతులకు జనించి గజేంద్రుని గ్రాహము బారినుండి రక్షించినట్లు స్పష్టమగుచున్నది. దీనిని బట్టి యీ గజేంద్రరక్షకుడు విష్ణ్వవతారుడు కాని విష్ణువు కాడని తెలియుచున్నది.

పోతన్నయు ననువాదమొనర్చుచు నిటులనే చెప్పుటకలదు.

సీ॥ మానవాధీశ్వర! మనువు నాలవవాడు
తామసుండనగ .... హరి పుట్టె
హరిమేధునకు బ్రీతి హరిణియందు

ఆ॥ గ్రహని బద్ధుడైన గజరాజు విడిపించి

ఇటుల జెప్పియు పిదప "అలవైకుంఠపురంబులో" యని పఠించి వైకుంఠమునుండి గరుత్మంతునైన నధిష్ఠింపక పరుగుగున వచ్చెననియు, అతని వెనుక వైకుంఠపురములోని యాబాలగోలము వచ్చిరనియు మూలములో లేని విషయమును బెంచి గజేసి యవతారమూర్తి శ్రీహరిని సాక్షాద్వైకుంఠవాసియైన నారాయణుని జేసినాడు.

గజేంద్రప్రార్థనము వినిన చక్రి యార్తావనత్వమును మూలమ్ము చెప్పినది.

"ఏవం గజేంద్రముపవర్ణిత నిర్విశేషః
ఛందోమయేన గరుడేన సముహ్యామానః
చక్రాయుధోభ్యగమదాశు యతో గజేంద్రః"

సంస్కృతభాగ. 8-3-30, 31.

మూలవిషయము పోతన్న యనువాదమున నింతింతై యన్నగ నెంతోయై మూల భిన్నముగ త్రివిక్రమత్వము దాల్చినది.

శాస్త్రివారు మూలవిధేయముగనే యనువదించుటలిటుల రుపించును,

ఇట్లు గజేంద్రుండనేక విధముల బ్రస్తుతించి మొఱ్ఱవెట్టుటలు బ్రహ్మదులాలకించియు దమ్ముగాదను నట్లూరకున్నంత జగన్నివాసుండగు శ్రీహరి.

॥ వినియొండొక్కడు వల్కకెవ్వరికి దోర్వీర్యంబునం జక్రముం గొని ఛందోమయుడయిన తార్క్ష్యుని పయిం గూర్చుండి తద్దేశమున్
జని దంతీంద్రునిడాయవచ్చి తనపై స్వాంతంబుసంధించునా యన రక్షింపగ జెప్పి పుచ్చె బలశౌర్యావక్రముం జక్రమున్

శ్రీకృష్ణభాగ. 8-62, 63.

ఈ విధముగ శాస్త్రివారు మూలవిషయముల నటులనే యను వదించి పోతన్న పెంచిన శ్రీమహావిష్ణుని భూలోకావతరణ సందర్భమున లక్ష్మీదేవి సౌందర్య వర్ణనము, శృంగార చేష్టలు మొదలగునవి పరిహరించి భక్తి భావమునకు బాధ లేకుండ రమణీయముగ పోషించుటు స్పష్టమగుచున్నది.

ఈ సందర్భమున పోతన్న యనువాదమున మఱియొక యిబ్బంది కనుపించుచున్నది. ఈ కథ నాల్గవ మన్వంతరములో జరిగినట్లు మూలమే ప్రమాణము. 5వ మన్వంతరమునగాని వైకుంఠ నిర్మాణము జరుగలేదు. ఈ విషయము మూల భాగవతమున నిటులున్నది.

"పంచమో రైవతో నామ మనుస్తామససోదరః
పత్నీ వికుంఠా శుభ్రస్య వైకుంఠైః సురసత్తమైః
తయోః స్వకలయా జజ్ఞే వైకుంఠోభగవాన్ స్వయమ్
వైకుంఠః కల్పితో యేన లోకోలోక నమస్కృతః
రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ప్రియ కామ్యయా"

సంస్కృతభాగ. 8-5-2 నుండి 5.

వికుంఠాయాః అపత్యం పుమాన్ వైకుంఠః" కావున నాయన సర్వలోకములును నమస్కరించుచుండగా, లక్ష్మీ ప్రార్థనమునను వైకుంఠమును నిర్మించెనటు, ఆయన పేరు మీదుగా వైకుంఠమన బడినదని స్పష్టమగుచున్నది. దీనిని బట్టి పోతన్న నాల్గవ మన్వంతరములో జరిగిన గజేంద్రమోక్షణ సందర్భమున కావించిన వైకుంఠ వర్ణనాదిక మసంగతమగుచున్నది. పోతన్న దీనిని తరువాత,

"అవనిపై వైకుంఠమనియెడు లోకంబు
గల్పించె నెల్ల లోకములు మ్రొక్క"

అని భూలోకమున నిర్మించినట్లుగ మార్చినాడు.

శాస్త్రిగారు శ్రీకృష్ణభాగవతమున నిటులనువదించినారు,

శా॥ వైకుంఠుండపుడాత్మపత్ని యగుచున్ వర్తించు శ్రీదేవికిన్
ప్రాకామ్యంబును గూర్పనెంచి తదభిప్రాయానుసారంబుగా
లోకాలోకము మీది భాగమున వేల్పుల్మెచ్చ నిర్మించె శ్రీ
వైకుంఠాఖ్య పురీవరంబు ద్రిజగద్వర్ణ్య ప్రభావంతమున్.

శ్రీకృష్ణభాగ. 8-71.

ఇందు మూలానుసారముగా భావవివరణము చేయబడియు డుట స్పష్టమగుచున్నది.

## 7. అంబరీషోపాఖ్యానము :-

మహాభక్తుడయిన యంబరీషుడు భక్తిచే నమోఘమయి బ్రాహ్మణ దండమును సహితము వమ్ము చేయుట వాని శీలముః వ్యక్తమొనర్చును. మూలమున శుకుడిట్లు ప్రారంభించుచుండెను.

"అంబరీషో మహాభాగః సప్తద్వీపవతీం మహీం
అవ్యయాంచ శ్రియం లబ్ధ్వా విభవంచాతులంభువి
మేనేతి దుర్లభం పుంసాం సర్వేతత్ స్వప్న సంస్తుతం
విద్వాన్ విభవనిర్వాణం తమో విశతియత్ పుమాన్."

సంస్కృతభాగ. 9-4-15, 16.

దీనికి పోతన్న యనువాదమిది,

శా॥ సప్తద్వీప విశాల భూభరముదోః స్తంభంబునంబూని సం
ప్రాప్త శ్రీయుతుడై మహా విభవ సంపచ్చాతురింగల్గి దు
ర్వ్యాప్తిం జెందక వైష్ణవార్చనల మేరంగాలముంబుచ్చుచు
సప్తిం బొందక యొప్పె సద్గుణ గరిష్టుండంబరీషుండిలన్

ఇది మూల భాగవత ప్రథమ శ్లోకమునకు దగ్గరగ నున్నది. ద్వితీయ శ్లోకము విడువబడినది.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతమున అనువాదమిటులున్నది,

మత్త॥ అంబరీషునకేడు దీవుల నాధిపత్యమునెల్లలో
కంబులంగనరానిసంపద గల్గు భాగ్యము భోగ్యమె
ప్డం బొసంగు గొఱంత యింతయు బుట్ట బోవదు వానిదే
శంబునందటులైన నాతడజస్రమున్ సువిరక్తుడై"

వ॥ సంసారంబు నిస్సారంబనియు సమస్తవస్తుజాలంబునుంగలలో గానవచ్చు పదార్థతుల్యంబనియు దేహంబు నశ్వరంబనియు, విశ్వమంతయు జలబుద్బుదంబనియు దలంచుచుండు.

శ్రీకృష్ణభాగ. 9-88, 89.

మూల భాగవతమునందలి శ్లోకద్వయమిటు రెండు పద్యగద్యములుగ ననువదింపబడినది. రెండవ శ్లోకము స్పష్టముగ గద్యమున సవివరముగ నున్నది. ఇటుల పోతన్న విడిచిన విషయము స్పష్టముగ ననువదింపబడి యున్నది.

పిదప మూలమున నంబరీషుని విష్ణుభక్తి తత్త్వమిటుల జెప్పబడినది.

"వాసుదేవే భగవతి తద్భక్తేషుచ సాధుషు ....
కామంచ దాస్యేనతు కామ కామ్యయా యథోత్తమ శ్లోక
జనాశ్రయా రతిః" సంస్కృతభాగ. 9-4-17 నుండి 20.

దీనికి పోతన్న యిట్లనువాదము కావించెను,

సీ॥ చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద
పలుకులు హరి గుణ పఠనమంద
కరములు విష్ణు మందిరమార్జనము లంద

చూపులు గోవింద రూప వీక్షణ మంద
శిరము కేశవనమస్కృతులయంద
పదములీశ్వరగేహ పరిసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద

సంగమచ్యుత జనగుణ సంగమంద
ఘ్రాణమసురారి భక్తాంఘ్రికమలమంద
రసనతులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద యా రాజ చంద్రమునకు.

పోతనభాగ 9-82.

ఇందు "తద్భృత్యగాత్రస్పర్శేంగ సంగమమ్" అనునది ...ంగమచ్యుత జనగుణ సంగమంద" యని యనువదింపబడినది. ...మను దానికి గుణమనునది సరియైన యనువాదము కాదు. ...సంగమమనుదాని కరచరణాద్యవయవ సంబంధమనియు, గాత్ర ...ర్శనమనిన యాలింగనహస్తస్పర్శనాదికమనియు శ్రీధరుడు ...ష్టముగ వ్యాఖ్యానించినాడు. దీనినిబట్టి పోతన్న యనువాదము ...లానుసారముగ లేక మూల భిన్నముగ నున్నది.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాద మిటులున్నది,
అతని చిత్తంబెప్డు హరి పాద పద్మము
లందు ధ్యానాసక్తినందుచుండు
నతనివాకెపుడు శ్రీపతి గుణగణముల
వర్ణించునట్టి దైవఋలుచుండు
నతని చేతులు హరి సతతము సేవించు
పనులందు లగ్నమై పరిఢవించు
నతని శోత్రములెప్డు హరికథా శ్రవణంబు

తే॥ అతని కన్నులు హరి విగ్రహమునె చూచు
నతని త్వక్కును హరిభక్తునంటనెంచు
నతని జిహ్వ నైవేద్యము నారగించు
నతని శిరము నిర్మాల్యము నవధరించు.

శ్రీకృష్ణభాగ. 9-90.

ఇందు భావము మూలమునకు దగ్గరగనే యున్నది.

తద్భృత్య గాత్ర స్పర్శేంగ సంగమమ్" అనునది మూలాను సారముగ" "అతని త్వక్కును హరిభక్తునంటనెంచు" నని స్పష్టముగ ననువదింపబడినది.

ఆ ప్రజలును స్వర్గ సుఖములిలయందే యనుభవించుచు పర లోకమును సహితమపేక్షింపరనుచు మూలమిట్లు నుడువుచున్నది.

"స్వర్గో న ప్రార్థితో యస్య మనుజైరమర ప్రియః"

సంస్కృతభాగ. 9-4-24.

ఇది పోతన్న యనువాదమున విడువబడినది. శ్రీకృష్ణభాగ వతమున ననువదింపబడినది.

వ॥ "వాని ప్రజలు స్వర్గ సుఖంబులను మించిన సర్వసుఖంబులు భూలోకమందు పొంది పరలోకంబపేక్షింపకుందురు.

శ్రీకృష్ణభాగ. 9-92.

సుదర్శన చక్రము దుర్వాసుని వెన్నంటి తరుముటు మూల మున నిటులున్నది,

"దిశోనభః క్ష్మాం వివరాన్ సముద్రాన్
లోకాన్ సపాలాం స్త్రిదివంగతస్సః
యతో యతోధావతి తత్ర తత్ర
సుదర్శనం దుష్ప్రసహం దదర్శ"

సంస్కృతభాగ. 9-4-41.

దీనికి పోతన్న యనువాదమిది,

మ॥ "భువిదూరన్ భువిదూరునబ్ధి జొరనబ్ధింజొచ్చు నుద్వేగియై
దివిబ్రాకన్ దివి బ్రాకు దిక్కులకుబో దిగ్వీథులంబోవు జి
క్కి వెసన్ గ్రుంకిన గ్రుంకు నిల్వనిలుచున్ గీడింప గీడించు నొ
క్కవడిన్ దాపను వెంటనంటి హరి చక్రంబన్యదుర్వ క్రమై"
పోతనభాగ. 9-107.

చక్రము మహర్షిని వెన్నంటి తరుమునపుడు భూమి దూరిన తానును భువి దూరుట, అతడు సముద్రమున జొచ్చినపుడు తానును సముద్రమున జొచ్చుటలుచితమే. కాని యతడు నిల్చినపుడు చక్రము నిల్చుట, కీడించిన కీడించుట లర్థ రహితములు. తాను నిల చినచో నిలచి, తొలగినప్పుడు తొలిగిన యెడల దుర్వాసుడు చక్ర మునకు భయపడవలసిన యవసరముండదుకదా! మూల భాగవత మున నీ విధముగ లేదు. అతడెక్కడికి పోయినను చక్రమక్కడ తోచెననియే యున్నది. కావున నిట పోతన్న యనువాదము మూల మునకు సరికాజాలదు.

శాస్త్రివారి యనువాదమిటులున్నది,

సీ॥ తఱుముచు చక్రము తానెల్ల కడలను
నిండి మండుచు మౌని నివ్వెనుకొని
గుహజొచ్చిననతండు కుదిరి యుండగలేక
దిక్కులకుంబాఱె దిక్కులేక
వెన్నంటగని భీతి మిన్నంటి యతలాది
లోకముల్ కనుచు నీరాకరమున
బడిడాగియుండియు వడి స్వర్గమున కేగి
తలదాచుకొనుటకు దావులేక

తే॥ మిఱ్ఱంగవచ్చెడు చక్రము నంగిటు బడ
నయి భయమ్మున వడకుచు నంతలోన
సత్యలోకమునకు బోయి స్రష్టగాంచి
దీనముగ నూర్చుచుం బల్కె దెసలు గనుచు.

శ్రీకృష్ణభాగ. 9-107.

ఇందు పూర్వభాగము పై మూల శ్లోకమున కనువాదము. పోతన్నవలెనిటు ససంగతత్వము తోపక మూల భావము యథాతథముగ నున్నది.

ఈ విధముగ నీ యంబరీషుని వృత్తాంతమును భాగవత ద్వయ మావిష్కరించినది.

## 8. దుష్యంతోపాఖ్యానము :-

మూలభాగవతమున సూత్రప్రాయముగ సుమారిరువది శ్లోకములలో నీ వృత్తాంతమున్నది. పోతన్న తన యనువాదమున నీ విషయమును మిగుల పెంచుట కాననగును.

మూల భాగవతమున నేరుగ కథ యిట్లు నుడువబడినది.
"దుష్యన్తో మృగయాం యాతః కణ్వాశ్రమ పదంగతః
తత్రాసీనాం స్వప్రభయా మండయన్తీం రమామివ
విలోక్య సద్యోముముహే దేవమాయామివ స్త్రియమ్
బభాషేతాం వరారోహాం భటైః కతిపయైర్వృతః"

సంస్కృతభాగ. 9-20-8,9.

దుష్యన్తుడు వేటకరిగి కణ్వాశ్రమ పదస్థలమున శకుంతలను చూచి మోహవివశుడై యామెతో భాషించుటకుపక్రమించుట పై శ్లోక ద్వయ భావము. పోతన్న దుష్యన్తుని వేటనే మూడు పద్యములలో పెంచినాడు.

క॥ పారావారపరీతో
దార ధరాభారదక్ష దక్షిణహస్త
శ్రీరాజిల్లగ నొకనా
డారాజేంద్రుడు వేట యందభిరతుడై

క॥ గండక కంఠీరవ భే
రుండ శశవ్యాళ కోల రోహిషరురువే
దండ వ్యాఘ్ర మృగాదన
చండశరభ శల్య భల్ల చమరాటువులన్.

క॥ చప్పుడు సేయుచు మృగముల
రొప్పుచు నీరముల యందు రోయుచు వలలం
ద్రిప్పుకొని పడగబోవుచు
దప్పకయేయుచును వేట తమకంబొప్పన్.

క॥ మృగయూధంబుల వెంటను
మృగలాంఛన సన్నిభుండు మృగయాతురుడై
మృగయులుగొందఱు గొలువగ
మృగరాజ పరాక్రమంబు మెఱయగ వచ్చెన్.

వ॥ ఇట్లు వచ్చి వచ్చి దైవ యోగంబున గణ్వమహాముని
తపోవనంబు చేరంజని. పోతనభాగ. 9-594 నుండి 598

మూలమున 'దుష్యన్తో మృగయాం యాతః' యని మాత్ర మున్నది. పోతన్న యనువాదమున మూడు పద్యములైనది. ఇది యంతయు నమూలకమే. పిదప 'కణ్వాశ్రమ పదంగతః' యని మూలమున నున్నది. పోతన్న యనువాదమున కల 'దైవయోగం బున' యను దానికి మూలములేదు. స్వీయ కల్పనము. పిదప రెండు పద్యము లాశ్రమ వర్ణనమున నున్నవి.

క॥ ఇత్తెఱగున మృగజాతుల.... (9-599, 600)

తరువాత నున్న నాలుగు గద్య పద్యములు నమూలకములై యున్నవి కానుపించును.

శకుంతల యాశ్రమమునందే యున్నటుల మూలము.

'తత్రాసీనాం స్వప్రభయామండయన్తీం రమామివ' అని. దుష్యన్తుడట్టి యామెను చూచినాడు.

పోతన్న యనువాదమున మూలభిన్న మిటులున్నది.

శా॥ ఆకణ్వాశ్రమమందు నీరజనివాసాంత ప్రదేశంబులన్
మాకందంబులనీడ బుష్పలతికామధ్యంబునన్ మంజురం
భాకాండాంచిత శాలలో గుసుమ సంపన్నస్థలిన్ జూచెనా
భూకాంతుండు శకుంతలన్నవనటత్ భూ ప్రర్యటత్కుంతలన్.

పోతనభాగ. **9-607.**

ఇందలి నీరజనివాసాంత.... సంపన్నస్థలిన్ యనునదంతయు పోతన్న కల్పనమని స్పష్టమగుచున్నది.

దుష్యంతుడాశకుంతలను జూచి వెంటనే భాషించినట్లు మూల భాగవతము.

'కాత్వం కమల పత్రాక్షీ కస్యాసి హృదయంగమే
కింవాచికీర్షితమ్ త్వత్ర భవత్యా నిర్జనేవనే
వ్యక్తం రాజన్య తనయాం వేద్మ్యహంత్వాం సుమధ్యమే
నహి చేతః పౌరవాణామధర్మే రమతే క్వచిత్.

సంస్కృతభాగ. 9-20-11,12.

పోతన్న ముందుగా నామెను జూచిన దుష్యంతుడు మనంబున భావించిన విధమమూలకముగా మూడు గద్య పద్యములందు జూపి నాడు. పిదప శకుంతల భావమును మూడు గద్య పద్యములలో నమూలకముగ చెప్పి పెంచినాడు.

మూలమున దుష్యంతుడు చూచిన వెంటనే శకుంతల సమాధా నించుట కలదు. పోతన్న యనువాదమున రసదృష్టితో మిక్కిలి విస్తృతమై యీ విషయము కనుపించును.

పిదప గాంధర్వ వివాహము, దుష్యన్తుడు పురము వెడలుట, భరతజననము, కణ్వుడు శకుంతలను పుత్త్రి సహితముగ నత్తవా రింటికి బంపుట, దుష్యంతుడు గగనవాణి భాషణమున వారిని గ్రహించుట ఇత్యాది కథాకథనము కలదు.

ఈ విషయములన్నింటి యందును పోతన్న పెంపు కాన వచ్చును. అమూలక భావములునగపడును.

శాస్త్రీహరి యనువాదము యథాతథముగ సంగ్రహింపబడి కానవచ్చును.

శా॥ ఆదుష్యంతుడు వేటలాడుట కరణ్యానిం బ్రివర్తింపుచున్
మోదంబేర్పడ గణ్వుడుండునుట జంబుం జేరియందొక్కచో
నేదోకర్జమునందు నుండు నవలానీక్షించి మోహించి యో
హోదేవీ॥ యెవరీవు నిన్ననిన నెంతో సంతససంబయ్యోడిన్.

శ్రీకృష్ణభాగ. 9-369.

ఒక్కచో నేదో కర్జమునందునుండు నవలానీక్షించెనని యిం దుండుట స్పష్టము. ఇది సూటిగా విషయముచెప్పబడినదై యున్నది. పోతన్నకువలె పెంపులేదు. వెంటనే శకుంతల సమాధానించుట కలదు.

"అన శకుంతల యనియెనో యవనినాథ
కౌశికునకు మేనకకును కలిగినట్టి
దాన గణ్వుడు నను బెంచె ధర శకుంత
లాఖ్య కైతి ననంగ నాయవనిజాని. శ్రీకృష్ణభాగ. 9-370

పిదప గాంధర్వవిధినివివాహమయి యభీష్టసిద్ధుడయి దుష్య స్తుడు పురము వెడలును.

ఇచట శాస్త్రీవారు "దుష్యన్త ప్రసాదంబున గర్భవతియై మూడు వర్షంబులు నీరు మోసి సూర్యాగ్నిసదృశదేహుండగు సుకుమారుంగనియె ...." అని చెప్పుటలో శకున్తల మూడు సంవత్సరములు నీరు మోసినట్లు కలదు. ఇది మూలభాగవతమున కానరాదు. అట.

అమోఘ వీర్యం రాజర్షిర్మహిష్యాం వీర్య మాదదే
శ్వోభూతే స్వపురం యాతః కాలేనాసూత సా సుతమ్
సంస్కృతభాగ. 9-20-17.

అని మాత్రమున్నది. ఇందు "కాలేనా సూత సా సుతమ్" అని యుండగ శ్రీకృష్ణభాగవతమున మూడు వర్షములు నీరుమోసినట్లు చేర్చబడినది. ఇట్లు శకుంతల మూడు వర్షములు నీరు మోయుట సంస్కృతాంధ్ర భారతములలో గానుపించును. ఇచట శాస్త్రీవారు భారత ప్రభావితులయి యుండవచ్చును.

పిదప భరత జననము జరుగగా గణ్వుడు జాత కర్మాది క్రియలొనర్చినట్లు కలదు.

"కణ్వః కుమారస్య వనే చక్ర సముచితాః క్రియాః"
సంస్కృతభాగ. 9-20-18

సముచితములైన క్రియలొనర్చినట్లు మూలము. శాస్త్రీవారు "....కణ్వుండు జాతకర్మాది సత్క్రియా కలాపంబులు నిర్వర్తించి భరతుండని పేరు పెట్టె" శ్రీకృష్ణభాగ. 9-374.

అని యందే భరతుడని నామకరణమొనరించినట్లు చెప్పి వివరించినారు. మూలమున తరువాతనైనను నామకరణ విషయము లేదు. ఈ జాత కర్మాది క్రియలందే యది జరుగుట సముచితము.

శాస్త్రివారు మూలమున గూఢముగ నున్న విషయమును స్పష్ట మొనర్చిరి.

పోతన్న మాత్రము దుష్యన్తునితో నాకాశవాణి దారాసుతులను భరింపుమనిన యెడల నాపేరు కలిగినదని చెప్పినాడు. ఈ విషయము మూలభాగవతమున లేదు. మూలమున.

"భరస్వపుత్రం దుష్యన్త మావమంస్థాః శకున్తలామ్."
సంస్కృతభాగ. 9-20-21.

అని యాకాశవాణి పలుకును పోతన్న.-

"ఇట్లు శరీరవాణి సర్వభూతంబులకు దేటపడ భరింపు మని పలికిన నా కుమారుండు భరతుండయ్యె." పోతనభాగ 9-633.

ఇది పోతన్న కల్పనము. సంస్కృతాంధ్రభారతములందును నిది కానరాదు.

పిదప భరతుని దిగ్విజయాదికము మూలమున నిటులున్నది.

"కిరాతహూణాన్ యవనానన్ధ్రాన్ కంకాన్ ఖశాంఛకాన్
అబ్రహ్మణ్యా నృపాంశ్చాహన్మ్లేచ్ఛాన్దిగ్విజయేఽఖిలాన్."
సంస్కృతభాగ. 9-20-30.

పోతన్న దీనిని,

వ॥ "....దిగ్విజయకాలంబున శకశబర బర్బర కష కిరాతక హూణ మ్లేచ్ఛ దేశంబుల రాజుల పీచంబడంచి."

పోతనభాగ. 9-635

యని యనువదించుచు మూలములోని యాంధ్రులను విడచి తన దేశాభిమానము ఋజువుపఱచుకొనినాడు.

శాస్త్రివారిది యంతయు ననవసరమని యెంచి కాబోలు మిక్కిలి కుదించి.

చ॥ భరతుడిలాతలేశుడయి బాహుబలంబున నెల్లఁజేండ్ల బెం
పరుగ జయించి...." శ్రీకృష్ణభాగ. 9-375.

యని మాత్రము చెప్పి పై సమర్థింపున కాస్కారము లేకు జేసినారు.

ఈ విధముగ నీ వృత్తాంతము ననువదించుటలో పోతన్న పై నన్నయ్య, కాళిదాసుల ప్రభావము పడుట నిస్సంశయముగ గోచరించును. శాస్త్రివారు మాత్రము తమ ఫక్కిలోనే మూలమునకు సన్నిహితముగ నీ వృత్తాంతమును నడిపించుట స్పష్టమగుచున్నది.

## 9. శ్రీకృష్ణుని దుడుకు చేష్టలు :-

గోపికలు శ్రీకృష్ణుని దుడుకు చేతలు యశోదాదేవికి తెల్పు సందర్భమున మూలభాగవతమునందు మూడు నాలుగు శ్లోకములు మాత్రము గోచరించును. పోతన్న ఈ పట్టున నిరువదియైదు పద్యములను రచించుట గమనింపదగినది. ఇందు రసభరితములున్నను కొన్ని యసమంజసముగ కానవచ్చునవి యున్నవి.

మూల భాగవత ప్రవచనమిటులున్నది.

"తతస్తు భగవాన్ కృష్ణో వయస్యైర్వ్రజ బాలకైః
శృణ్వత్యాః కిల తన్మాతురితిహోచుః సమాగతాః
వత్సాన్ ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథదధిపయః కల్పితైః స్తేయయోగైః
మర్కాన్ భోక్ష్యన్ విభజతి సచేన్నాత్తిభాండం భినత్తి
ద్రవ్యాలాభే సగృహ కుపితో యాత్యుపక్రోశ్యతోకాన్
వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖీ నహ్యుపాలబ్ధుమైచ్ఛత్."

సంస్కృతభాగ. 10-8-27 నుండి 31.

ఈ మాత్రమున్న విషయము పోతన్న యనువాదమున విశృంఖలతతో విజృంభించినది. మచ్చునకొక పద్యము జూపుదును.

నా కొడుకును నా కోడలు
నేకతమున బెనగ బాము నీతడు వైవం
గోక లెఱుంగక బాటిన
గూకలిడెన్నినుతుండు గుణమె గుణాఢ్యా

పోతనభాగ. 10 పూ. భా. 324.

శాస్త్రివారి యనువాదము మూలానుసారము రచింపబడుటలో
లమున "ధార్ష్ట్యాన్యశతికురుతే మేహనాదీని వాస్తౌ"యను దాని
ని యనౌచిత్యము పరిహరింపబడి సంగ్రహత్వము కానుపించును.

అవలంగృష్ణుడు రాముతో గలిసి యందుండు వారల్ సమా
పవయస్కుల్ జనుదేరనాడుకొనుచుండంగాంచి గోపాంగనల్
దవులన్ సంభ్రమ మెంతయేని మదికిన్ దన్మాత యానందగో
పవధూ రత్నము జేరి యిట్లనిరి తాత్పర్యంబు సంధించుచున్.

ఆలకై క్రేపుల నసమయమున విడ్చి
పిలుచు నవ్వుచు నింటు గలుగువారి
వారు రాగని సందు నారసి చని లోని
కటుబాలు పెరుగుల నట్టె త్రావి
దొంగతనంబునన్ దొరకినవానిని
గడుపార దాదిని కడ మెలంగు
క్రోతులకు బెట్టు గ్రోతులు లేకున్న
తిని తాను భాండముల్ తునుగ గొట్టు

ఇంటు దినుబండ మేదియు నంటకున్న
బిల్లలను గిల్లి యేడ్పించి వెస గమించు
నింటివారలు లేకుంట లెఱిగి కొనుచు
యెట్లొ పొరుగిండ్లలో జొచ్చి కృష్ణుడకట.

ఈ రీతిని శాస్త్రివారి యనువాదమున ననౌచిత్యమేమియు గానరాక విషయము మిగుల సుకుమారముగ నున్నది.

## 10. గోపికా వస్త్రాపహరణము :-

ఈ సంధర్భమున మూల విషయమునకును పోతన్న యను వాదమునకును కొంచెమే భేదము కనుపించును. ఈ విషయమును మూలముతో పరిశీలించెదను.

మూలమున దశమస్కంధమున నిరువది రెండవ యధ్యాయ మీ వృత్తాంతమును జెప్పును.

"హేమన్తే ప్రథమేమాసి నన్దవ్రజ కుమారికాః
చేరుర్హవిష్యం భుంజానాః కాత్యాయన్యర్చన వ్రతమ్.

సంస్కృతభాగ 10-22-1.

అని ప్రారంభమగుట మూలమునందు కాననగును.

కాత్యాయనీ వ్రతమాచరించుచున్నవారు నందునిమంద యందలి గోపకుమారికలని దీనిని బట్టి తెలియుచున్నది. కుమారిక లనగా పసితనము వీడి కౌమారమున నున్న బాలికలు. కృష్ణ సంబో ధనమున అబలాః అనియూ కవి సంబోధనములుగా గోప్యః, సుమ ధ్యమాః, దారికాః అనియు మూల భాగవతమున గోచరించును.

పోతన్న ముందుగా గోపకుమారికలని చెప్పియు, నా బాలి కలను తరుణులుగా,

మ॥ రమణుల్ప్రొద్దుట మేలుకాంచిసఖులన్ రండంచునాత్మీయనా
మములంజీరి కుచద్వయీ భరములన్ మధ్యంబులల్లాడగా
బ్రమదోద్దామ గజేంద్రయానలగుచున్ బద్మాక్షునిం బాడుచున్
యమునా తీరము జేర బోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై.

పోతనభాగ. 10 - 209.

అనుచు యౌవనవతులుగా వర్ణించినాడు. వారిట్లు కాళిందికి జనుట లెఱిగి కృష్ణుడు మిత్రులతో జని వారి వలువలను హరించి నట్లు మూలమున నిటులున్నది.

"భగవాంస్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః
వయస్యైరావృతస్తత్ర గతస్తత్కర్మ సిద్ధయే
తాసాం వాసాంస్యుపాదాయ నీప మారుహ్య సత్వరః"

సంస్కృతభాగ. 10-22-8,9.

దీనిని పోతన్న,

క॥ తోయజ నయనలు యమునా
తోయములందుండు టెఱిగి దూరగుడయ్యున్
దోయజనయనుడు హరితన
తోయుము గోపకులు దాను దోతెంచె నృపా.

తరల॥ కదలకుండని తోడివారల గన్నుసన్నల నిల్పుచున్
బదములొయ్యన నేల బెట్టుచు బద్మనేత్రుడుమౌనియై
పొదలమాటున నల్లనల్లన పొంచి పొంచిన తాంగుడై
యదను గోరుచు డాసి వేత్రతల యంబరంబులు దొంగిలెన్.

పోతనభాగ. 10-813, 814.

అని యనువదించినాడు. మూలములోని "కృష్ణో యోగేశ్వ రేశ్వరః" యనునది దూరగుడయ్యున్" దెలిసికొనినాడనుటలో సూచింపబడినది. ఈపదము శాస్త్రివారి యనువాదమున నటులే ప్రయోగింపబడుట కాననగును. అది తరువాత పరికింతము.

పిదప మూలమున,

"పాణిభ్యాం యోనిమాచ్ఛాద్య ప్రోత్తేరుః శీత కర్శితాః"

సంస్కృతభాగ. 10-22-17.

అని యున్నదానిని,

క॥ చంచత్పల్లవకోమల
కాంచన నవరత్న ఘటిత కంకణరుచిరో
దంచితకర సంఛాదిత
పంచాయుధ గేహలగుచు బడతులు వరుసన్.

పోతనభాగ. 10-837.

యని మరింతజేసి వర్ణించుట చూడనగును.

మఱియును,

వ॥ "చని ప్రౌఢలైన సుందరుల ముందఱనిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదురునిలచిన ...." పోతనభాగ. 10-838.

యని యా బాలికలలో గొందఱు ప్రౌఢలు గూడ నున్నట్లు పోతన్న చెప్పుట స్పష్టము.

అంతియకాక శ్రీకృష్ణుడా కుమారికలను జూచి,

సీ॥ "శృంగారవతులార। సిగ్గేల మిము గూడి
పిన్ననాటను గోలె బెరిగినాడ."

పోతనభాగ. 10 - 839.

అని యనేకవిధములుగ పరిహాసములాడెనని చెప్పిన సందర్భమున ప్రౌఢలనియు, శృంగారవతులనియు మూలమున లేని శృంగారము కల్పింపబడినది.

పిదప కృష్ణుడు,

ఆ॥ వ్రతము ఫలము మీకు వలసిన జక్కగ
నింతులెల్ల జేతులెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుడు చీరలు సిగ్గుపో
నాడ నేల యెగ్గులాడనేల? పోతనభాగ. 10-839.

అని యనగా నా బాలికలు,

"....వ్రత భంగంబంచు శంకించిపా
లతటున్యస్త కరాబ్జలై సరసలీలన్ మ్రొక్కిరట్లందఱున్.
పోతనభాగ. 10 - 841.

అని మ్రొక్కినట్లు చెప్పుటలో వ్రత నిరూపణము విడువబడి శృంగార రస ప్రసంగముతో బూర్తి యగుట స్పష్టమగుచున్నది.

ఇక శాస్త్రివారి యనువాదమును జూచెదము,

శా॥ హేమంతంబున కాది మాసమగుచున్ హేమించుమార్గంబు సు
శ్రీమంతంబుగ నంద గోకుల కుమారీ రత్నముల్ భక్తిమై
నా మాసంబున నన్నినాళ్ళులనుగాత్యాయన్యభిఖ్యాంబికా
ప్రేమాంచద్వ్రతముంబొనర్చిరి హవిస్స్వీకారముంజేయుచున్.
శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 2-186.

ఇందు మూలములోని "నంద వ్రజ కుమారికాః" యనునది "నందగోకుల కుమారీ రత్నముల్" అని యనువదింపబడినది.

పిదప మూలమున,

"ఆప్లుత్యాంభసి కాళింద్యా జలాన్తే చోదితేఽరుణే
కృత్వా ప్రతికృతిం దేవీ మానర్చుర్నృప సైకతామ్
గంధైర్మాల్యైః సురభిభిర్బలిభిర్ధూపదీపకైః
ఉచ్చావచైశ్చోపహారైః ప్రవాళ ఫలతండులైః"
సంస్కృతభాగ. 10-22-2,3.

అని వారి వ్రత విధానము వివరింపబడినది.

శాస్త్రివారి విషయమును మూలానుసారముగా,

తే॥ నిచ్చలరుణోదయంబున నియతి లేచి
వారు కాళిందికింజని వారినాడి
మడుగులంగట్టి నీళులకడను సైక
తమున గాత్యాయనీదేవి దగనొనర్చి.

వ॥ "ప్రాణప్రతిష్ఠగావించి గంధమాల్య ధూపదీప నైవేద్యాదులు, షోడశోపచారంబులు గావించి యుచ్చావచంబులగు నుపహా రంబులు ప్రివాళ ఫలతండులంబులు సమర్పించి పూజించి"
శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 2-187, 188.

యని యనువదించిరి.

పోతన్న యీయెడ మిగుల సంగ్రహించి "సురభి కుసుమ గంధంబులిడి, ధూపదీపంబులిచ్చి బహువిధోపహారంబులుసమర్పించి" యనినాడు.

ఈ సందర్భమున శాస్త్రిగారు,

"ఆ మగువలు ప్రత్యహంబు నా నది చెంతన్", 10,పూ.2-190
"వ్రజకన్యామణులొక్కనాడు ...." 2 -192

వనితలు, 'కన్యకులును' 2 -194
'కన్నియలార' 2 -200
'అనినస్దారికలు' 2 -202
'నారీమణుల్' 2 -208
'గోపబాలికలు' 2 -209.

అనుచు నా బాలికలను జెప్పుట గమనింపదగినది. ఇటు యువ తులను స్ఫూర్తియైన కలుగదు.

శ్రీకృష్ణుడా యుదంతమెఱింగి తన వారితో నచ్చోటుడాయు టను శాస్త్రివారు మూలానుసారముగ నిట్లనువదించిరి.

సీ॥ ఆ యుదంత మెఱింగినట్టిదై యోగీశ్వ
రేశ్వరుండగు కృష్ణుడెల్లవారి
చేలంబులంగొన జిత్తంబు గావించి
చెలికాండ్రతో నల్ల జేరి యటకు
బిల్లివలెం బాద విన్యాసమొనరించు

చును బోయి వస్త్రములను గ్రహించి
కడనున్న నీపవృక్షము నెక్కి తనవారు
నవ్వీన మఱియును నవ్వి తాను

తే॥ వనితలంబిల్చి పరిహాస వాక్యములను
బలుకుచున్ మీరు వచ్చి మీ వస్త్రములను
గైకొనుడు వేఱువేఱుగా గాని కూడి
కాని యేతెండు నావుడు గన్యకలును.
శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 2-194.

ఇందు మూలములోని యోగేశ్వరేశ్వరుండను పదము ప్రం
గింపబడి యౌచిత్యము పోషింపబడినది. మఱియు "పిల్లి వలెం బ
విన్యాసమొనరించుచును బోయి" యను నుడికారపు సొంపు శా
వారి సందర్భౌచితీ దృష్టికి ప్రబల తార్కాణము. ఈ విధముగ
యమంతయు మూల విధేయమై యులరారుచున్నది. పిదప,

వ॥ "కృష్ణాక్ష్వేళితంబు చూచి ప్రేమరసపరిపూతులై యొ
నొకరు చూచుకొనుచు నవ్వు మోముల సిగ్గు నభినయించు
బోయి వస్త్రంబులు తెచ్చుకొనంజాలక కృష్ణుని నర్మ
నంబుల నాకర్షింపబడియు నా కంఠదఘ్నంబులగు జ
బుల మునింగియుండి వడంకుచు గృష్ణుని దిక్కు మొగం
యిట్లనిరి." శ్రీకృష్ణభాగ. 10 పూ భా. 2-195.

ఇందు మూలమునందలి "క్ష్వేళిత" శబ్దమటులనే చక
ప్రయోగింపబడినది. ఈ సందర్భమున పోతన్న యనువాదవ
మిక్కిలి పెంపు కనుపించుచున్నది. ఇచటను శాస్త్రివారు మ
విధేయులే యైరి.

పిదప కృష్ణుని మాట విని దారికలు నీరము వెలుప

"తతో జలాశయాత్ సర్వాదారికాః శీతవేపితాః
పాణిభ్యాం యోని మాచ్ఛాద్య ప్రోత్తేరుః శీతకర్శితాః
భగవానాహతా వీక్ష్య శుద్ధ భావ ప్రసాదితః
స్కన్ధే నిధాయ వాసాంసి ప్రీతః ప్రోవాచ సస్మితమ్"

సంస్కృతభాగ. 10-22-17, 18.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాద మిటుల నున్నది.

మ॥ అనినందారికలా జలాశయమునందత్యంతశీతార్తలై
తనువుల్ బిట్టువడంక లేచి యొక హస్తం బాత్మ భూగేహమున్
స్తనయుగ్మంబు మఱొక్క హస్తమును బొందన్నిల్పితత్తీర ధా
త్రిని జేరంజనుదెంచి రచ్యుతుడు వారింజూచి ప్రీతాత్ముడై.

శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 2-202.

మూలముననున్న "దారికా" శబ్దము ప్రయోగింపబడి యౌ చిత్యము చక్కగ బోషింపబడినది. కాని "ఆహతా" యను విశేషణము విడువబడినది. మఱియు "పాణిభ్యాంయోనిమాచ్ఛాద్య" యని మూలమున నుండగా "ఆత్మభూగేహ"మనియు నదియొక చేతను, "స్తన యుగ్మంబు" మఱొక్క హస్తమున బొందన్ నిల్పిరనిరి. ఈ విషయమున బోతన్నను ముందు నిల్పికొనినట్లు రచనమగపడును.

ఈ విధముగ నదీమధ్యమునుండి తీరము జేరిన యా గోపికలను "ప్రతిఫలంబు మీరు వలచిన జక్కగనింతులెల్ల జేతులెత్తి మ్రొక్కి, చేరి పుచ్చుకొనుడు" అని శ్రీకృష్ణుడు పల్కగా నా బాలికల "వ్రత భంగమంచు శంకించి ఫాలతటన్యస్త కరాబ్జలై సరస లీలన్ మ్రొక్కిరట్లందఱున్" అని పోతన్న మూలమువలె గాక సరసముగ పూర్తిచేయుట గమనింప దగినది.

మూలమున,

"యూాయం వివస్త్రా యదపోధృత వ్రతా
వ్యగాహతైతత్తదు దేవహేళనమ్
బద్ధ్వాంజలిం మూర్ధ్న్యపనుత్తయేంహసః
కృత్వా నమోఽధో వసనం ప్రగృహ్యతామ్"

సంస్కృతభాగ. 10-22-19.

మీరు వస్త్రములను వీడి జలమున ప్రవేశించి స్నానమొనర్చి వ్రతము చేయుట మీ ప్రియదైవమునకపరాధ మొనర్చుటయే. కావున నా పాపము పోవుటకై శిరస్సున దోసిలి పట్టి నమస్కరించి మీ వస్త్రములను మీరు పుచ్చుకొనుడు. అని ధర్మహానికి ప్రాయశ్చిత్తముగా నమస్కారమును విధించెనుగాని వారిని కృష్ణుడు పరాభవించుట కట్లనలేదు.

చ॥ వివసనలై జలంబుల బ్రవేశమొనర్చిరటన్న శాస్త్రముల్
తపుననవిద్ది తప్పగును దాని దొలంగగ జేసి కొంటకో
నవలలు మీరలౌదలలనాటగ నిల్పుచు హస్తయుగ్మమున్
ధవుడగు నాకు మ్రొక్కి వసనంబులుగైకొని పోవుటొప్పెడిన్

శ్రీకృష్ణభాగ. 10 పూ. భా. 2-204.

అని శాస్త్రివర్యులు యథామూలముగ దెనిగించి ధర్మముగ దెలిపిరి. అట్లు శాస్త్రసమ్మతమైన కృష్ణవాక్యము విని వ్ర
భంగమునకు వెఱచి,

"ఏకేన పాణినా నేమురేకేనాచ్ఛాద్యచాంగనాః"

సంస్కృతభాగ. 10-22-20.

ఒకచేతితో గప్పుకొని యొక చేతితో నమస్కరించిరి అ
మూలము నిట్లు శాస్త్రివారనువదించిరి.

ఉత్సాహ। అనినవారు ధర్మయుక్తమైన వాని వాక్యమున్
వినియొకంట నాడుగుఱిని వేడ్కగప్పియొంట మ్రొ

అని మూలమునకు అనుకూలముగ వ్రాయబడినను మూలము నందలి యాచ్ఛాదనము మాత్రము తొలగింపబడి బయలొనర్ప బడినది.

అటులొక చేత మ్రొక్కినందులకు కృష్ణుడు
"ఏకేన పాణినా యోవై ప్రణమద్దేవ మచ్యుతమ్
తస్యదండః కరచ్ఛేద ఇతి ధర్మవిదో విదుః
తస్మాదుభాభ్యాం పాణిభ్యాం ప్రణత్వాస్వామినం నరః
తథాచ యూయం కురుత........"

సంస్కృతభాగ 10-22-21.

అను మూలమునకు,

"ఒక్కచే తను నమస్కరింపరాదు దైవతముల నెప్పుడున్"

క॥ ఒకడైన చేత మ్రొక్కిన
సకలంకుని చేయి దునుమ శాస్త్రము చెప్పున్
దికమక లాడక మీరెం
డుకరంబుల నన్ను మ్రొక్కుడు ముదంపడుచున్.

సంస్కృతభాగ. పూ. భా. 2-205, 206.

అని యనుకూలముగా శాస్త్రిగారనువదించినారు. తరువాత వ్రజ కన్యలు వివస్త్రాప్లవనంబు వ్రతభంగకరంబని తెలిసికొని హస్తద్వయమున మ్రొక్కి వస్త్రములను దీసికొని, ధరించి, కృష్ణుని యెడ ద్వేషభావము లేక యెంతయు ప్రేమము వహించిరి. తరువాత శ్రీకృష్ణుడు వారలయభీష్టము ఫలించునని వెడలుటకనుజ్ఞ యొసగ వారును శ్రీకృష్ణ పాదపద్మధ్యానంబు గావించుచు వ్రజమునకు జనుటతో విషయము పూర్తియగును.

పోతన్న భాగవతానువాదమున నీ విషయమున మూలమున కింతఅత భేదము కన్పట్టగా శాస్త్రివారి యనువాదము మూల సన్నిహితముగ నుండుట స్పష్టము.

## 11. రుక్మిణీ కళ్యాణము :-

ఈ కళ్యాణ వృత్తాంతమును బోతన్న మూలమును మించి పరమరమణీయముగ జిత్రించుట జగద్విదితము. ఈపోతన్న యను వాదము రసవంతమై యొకప్రత్యేకతను సంతరించుకొనినది. మూల విధేయత్వ కారణమున జూచినచో సహజముగనే యీ సందర్భము నందును గొన్ని మార్పులు గలవు. ఆ దృష్టితో దీనిని గూడ కొంత పరిశీలించెదను.

మూలమున శుకమహర్షియిటుల బ్రారంభించుటగోచరించును
"రాజాఽఽసీత్ భీష్మకో నామ విదర్భాధిపతిర్మహాన్
తస్య పంచాభవన్ పుత్రాః కన్యైకాచ వరాననా
రుక్మ్యగ్రజో రుక్మరథో రుక్మబాహు రనన్తరః
రుక్మకేశో రుక్మమాలీ రుక్మిణ్యేషాం స్వసా సతీ"

సంస్కృతభాగ. 10-52-21, 22.

భీష్మకునకైదుగురు పుత్రులు నొక కుమార్తెయు ననుచు వా వారి నామములను మూలము పై విధముగ జెప్పుచున్నది. పోతన్న యిటు మూడు నాలుగు పద్యములలో రుక్మిణి బాల్య యౌవనములన వర్ణించుట కలదు. ఇవి యమూలకములు.

క॥ "బాలేందురేఖ దోచిన...."

వ॥ "మఱియు దినదిన ప్రవర్ధమానయై...."

సీ॥ వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు...."

వ॥ అంత.

సీ॥ దేవకీసుతుకోర్కి ..."

పోతనభాగ. 10-1687 నుండి 1691.

పిదప మూలము రుక్మిణి వినికిడి వలన గృష్ణుని పతిగ వరిం

"సోప శ్రుత్య ముకున్దస్య రూప వీర్య గుణ శ్రియః
గృహాగతైర్గీయమానాస్తం మేనే సదృశం పతిమ్"
సంస్కృతభాగ. 10-52-23.

పోతన్న,

క॥ తన తండ్రి గేహమునకుం
జనుదెంచుచున్న యతిథి జనులవలన గృ
ష్ణుని రూప బల గుణాదులు
విని కృష్ణుడు దనకు దగిన విభుడని తలచెన్.
పోతనభాగ. 10 పూ. భా. 1693.

యని మూలము వలెనే రచించుట కలదు.

ఈ సందర్భమున అకాడమీ భాగవత పీఠికా కారులు "మూలమునందీ సందర్భమున గృష్ణుని ప్రసక్తియే లేదు ....
పోతన రుక్మిణి యౌవనోదయముతోపాటు కృష్ణునికి రుక్మిణి యెడ గల ప్రణయభావోదయమును గూడ వర్ణించుటయే కాక యతడా బాలారత్నమును దనకిల్లాలుగ జేకొనదలంచుచుండెనని కూడ జెప్పియుండెన"ని వ్రాసిరి. పుట. 34

ఈ విషయమునకు మూల భాగవతమున నాకరమున్నది. చూచుడు,

"తాం బుద్ధి లక్షణౌదార్య రూప శీల గుణాశ్రయామ్
కృష్ణశ్చ సదృశీం భార్యాం సముద్వోఢుం మనోదధే."
సంస్కృతభాగ. 10-52-24.

బహుశః వారు చూచిన మూల ప్రతులలో నీ విషయము లుప్తమై యుండవచ్చును.

దీనిని బట్టియే పోతన్న,

క॥ ఆలలన రూపు బుద్ధియు
శీలములక్షణము గుణము జింతించితగన్
బాలా రత్నము దనకి
ల్లాలుగ జేకొందుననుచు హరియుందలచెన్.

పోతనభాగ. 10 పూ. భా. 1694.

అని చెప్పినాడు.

అనంతరము బంధువుల తలంపునకు భిన్నముగ రుక్మి తనను చైద్యున కీచలంచుట లెఱిగి రుక్మిణి ఖిన్నయై యాప్తుడైన బ్రాహ్మణు నొకరుని గృష్ణుని కడకు బంపెనని మూలభాగవతమున నిటులున్నది.

"విచిన్త్యాప్తం ద్విజఃకంచిత్ కృష్ణాయ ప్రాహిణోద్ద్రుతమ్.

సంస్కృతభాగ. 10-52-26.

పోతన్న,

ఉ॥ అన్న తలంపు దానెఱిగియన్నవనీరజగంధిలోననా
పన్నతనొంది యాప్తుడగు బ్రాహ్మణునొక్కని జేరి గర్వసం
ఛన్నుడు రుక్మి నేడు నను జైద్యునకిచ్చెదనంచునున్నవా
డెన్ని విధంబులంజని బుధేశ్వర। చక్రికి విన్నవింపవే.

క॥ అయ్యాకొడుకువిచారము
లయ్యయు వారింప జాల డటుకాకుండన్
నెయ్యమెఱింగించి చేరుము
చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్.

వ॥ అని కొన్ని రహస్య వచనంబులు సెప్పిన...."

పోతనభాగ. 10 - 1697 నుండి 1699.

మూలమున "విచింత్య" యని యున్నదానికి పోతన్న యన వాదమున నింత చేయుటయే కాక "కొన్ని" రహస్య వచనంబుల

శాస్త్రివారి యనువాదమటులే యుండుట నిటుల గాంచవచ్చును.

ఉ॥ తల్లియుదండ్రియున్ బుధులుదాయలు రుక్మిణి శౌరికీయగా
నుల్లము సేయుచుండనది యొప్పనివాడయిరుక్మి కృష్ణునిన్
బ్రిల్లదముల్ వచించుచు శుభంబది కాదని త్రోసిపుచ్చి సం
పల్లలితుండు చైద్యుడని వానికి సోదరీనీదలంచుచున్.

క॥ జననియు జనకుడు బంధువు
లును వాని తలంపు మాన్పలో జాలమి నే
మనకూరకుండి రిట్లని
వినివనితయు మనమునందు వెతలగుడుచుచున్.

శా॥ అప్డున్బ్రాహ్మణుబిల్వబంచి యొకనిన్ వ్యాఖ్యానముం జేయుచున్
దృప్తుండైన సహోదరుందెలిపి సందేశంబుగావించుచున్
వ్యాప్తంబైన నిజాశయంబు యదువంశాబ్ధీందుడౌ శౌరికిన్
దృప్తింబొందగ జెప్ప బుచ్చెవినతుల్ దీపింపగాజేయుచున్.

శ్రీకృష్ణభాగ. 10 ఉ. భా. 1-83 నుండి 85.

శాస్త్రివారి యనువాదమున విషయము మూలానుసారముగనే యున్నది.

పిదప బ్రాహ్మణుడు ద్వారకకు జని రుక్మిణీ సందేశమును గృష్ణునకు వినిపించును. మూల భాగవతమున నిప్పట్టున విప్రుడు కృష్ణుని జేర నాతడాసనము డిగ్గి యర్చించినట్లున్నది.

"ద్వారకాం ససమభ్యేత్య ప్రతీహారైః ప్రవేశితః
అపశ్యదాద్యం పురుషమాసీనం కాంచనాసనే
దృష్ట్వా బ్రహ్మణ్యదేవస్తమవరూహ్య నిజాసనాత్
ఉపవేశ్యార్హయంచక్రే యథాత్మానం దివౌకసః"

సంస్కృతభాగ. 10-52-27, 28.

పోతన్న యిట్లున,

అన్నగధరుండున్న నగరు ప్రవేశించి యందు గనకాసీను యున్న పురుషోత్తముంగాంచి, పెండ్లికొడుకవు గమ్మని దీవించి ముసిముసి నగవులు నగుచు....” పోతనభాగ. 10-1699.

యని యనవదించుచు బ్రాహ్మణునిచే పెండ్లికొడుక గమ్మని దీవింప జేయుటయే కాక కృష్ణునిచే ముసి ముసి నగవు నగుపించి యమూలకముగ జెప్పినాడు.

శాస్త్రివారు తమ పథమున నటులు మూలమును ననుసరిం టయే కానవగును,

వ॥ “....కాంచనాసనాసీనుండగు వాసుదేవునిందరియం జే టయు నతండతనిగాంచి నిజాసనంబునుండి దిగి వానినం సీనుంగావించి పూజించి.

శ్రీకృష్ణభాగ. 10 ఉ భా. 1-85.

బ్రాహ్మణుడు రుక్మిణీ సందేశమును శ్రీకృష్ణునకు వినిపిం పట్టున మూల భాగవతమున నెనిమిది శ్లోకములు కలవు.

పోతన్న యీ మూల భావములకు దన స్వీయ భావము గూడ జేర్చినాడు.

మూలమున నీ సందర్భమున,

“శ్రుత్వా గుణాన్ భువనసున్దర శృణ్వతాంతే
నిర్విశ్య కర్ణవివరైర్హరతోంగ తాపమ్
రూపం దృశాం దృశిమతామఖిలార్థ లాభం
త్వయ్యచ్యుతా విశతి చిత్తమపత్రపంమే.

సంస్కృతభాగ. 10-52-37.

యని యున్నదానికి పోతన్న యిటులనువదించినాడు.

సీ॥ ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోక
దేహ తాపంబులు దీఱిపోవు
ఏనీ శుభాకారమీక్షింపగన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నేనీ చరణ సేవలేప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబు బొందగలుగు
నేనీలసన్నామమేప్రొద్దు భక్తితో
దడవిన బంధసంతతులుపాయు

తే॥ నట్టి నీయందు నా చిత్తమనవరతము
నచ్చియున్నది నీ యాన నానలేదు
కరుణ జూడుము కంసారి ఖలవిదారి
శ్రీయుతాకార, మానినీ చిత్తచోర. పోతనభాగ. 10-1703.

ఈ పద్యములోని మొదటి రెండు చరణముల భావము మాత్రమే మూలమునందున్నది. తక్కినదంతయు పోతన్న స్వయముగ కల్పించి పూరించినదే.

అటులే మూలమున,
"కాత్వా ముకుంద మహతీ కులశీలరూపవిద్యావయో
ద్రవిణధామభిరాత్మతుల్యమ్
ధీరాపతిం కులవతీ నవృణేత కన్యా కాలేనృసింహ
నరలోక మనోభిరామమ్."
సంస్కృతభాగ 10-52-38.

యని యున్న శ్లోకమును పోతన్న,

శా॥ ధన్యున్ లోక మనోభిరాము గులవిద్యారూప తారుణ్య సౌ
జన్య శ్రీ బలదాన శౌర్య కరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదేమును రమాకాంతాలలామంబు రా

జన్యానేకపసింహ నావలననే జన్మించెనేమోహముల్.

పోతనభాగ. 10-1704.

యని యనువదించుటలో పద్యోత్తరార్ధమునగల "కోరదేమును రమాకాంతాలలామంబు రాజన్యానేకపసింహ నావలననే జన్మించెనే మోహముల్" యనునదియు నమూలకమే. అట్లే,

సీ॥ ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమి యేల!

సీ॥ పల్లవ వైభవాస్పదములు పదములు
కనకరంభాతిరస్కారులూరులు...."

ఉ॥ ఆయెలనాగ నీకు దగు......"

పోతనభాగ. 1710 నుండి 1713.

యను పద్యములును పోతన్న స్వీయ కల్పితములే.

రుక్మిణి బ్రాహ్మణుని రాకకై నిరీక్షించుచు విచారించు సందర్భమున నా బ్రాహ్మణుని నామ మగ్నిద్యోతనుడని (10-1723) యమూలకముగ జెప్పుట గమనింపదగినది.

పిదప నీ సందర్భమున గల,

ఉ॥ "పోడను బ్రాహ్మణుండు...."

ఉ॥ "చెప్పదు తల్లికిం దలపు జిక్కు ..."

చ॥ "తుడువదు కన్నులన్ వెడలు తోయ కణంబులు...."

సీ॥ "మృగనాభి యలదదు మృగరాజమధ్యమ...."

వ॥ "మఱియును...."

మ॥ "మలగున్ మెల్లని గాలికిన్...."

పోతనభాగ 1728 నుండి 1733.

యనునవన్నియును పోతన్న యమూలకముగ వ్రాసినవే.

అటులనే వచ్చిన విప్రుని జూచి రుక్మిణి సంతుష్టాంతరంగయై యన్యమైన ప్రియమేదియు జేయనేరక యాతనికి నమస్కరించెనని మాత్రము మూలమున నిటులున్నది.

"తమాగతం సమాజ్ఞాయ వైదర్భీహృష్ట మానసా
నపశ్యన్తీ బ్రాహ్మణాయ ప్రియమన్యన్నమామ సా"

సంస్కృతభాగ. 10-53-31.

దీనికి పోతన్న,

మ॥ "జలజాతేక్షణు దోడి తెచ్చితివినాసందేశముం జెప్పి న
న్నిలువం బెట్టితి నీకృపం బ్రతికితిన్ నీ యట్టి పుణ్యాత్ముకుల్
గలరే దీనికి నీకు బ్రత్యుపకృతిన్ గావింగానేర నం
జలిగావించెద భూసురాన్వయమణీ! సద్బంధు చింతామణీ"

పోతనభాగ. 10 - 1737.

యని మూల భాగవతమునందలి మూల భావమును బాగుగా బెంచి కృతజ్ఞతా సూచకమైన పద్యము నిటుల రచించినాడు.

ఈ విషయమును శాస్త్రిగారు,

"ఇచ్చవచించు భూసురుని నెంతే భక్తి భావించుచున్
మెచ్చినమస్కరించె గరముల్ మేకొల్పి రెండుందగన్.

శ్రీకృష్ణభాగ. 10 ఉ.భా. 1-115.

యని మూలానుసారముగనే యనువదించినారు.

పిదప రుక్మిణి పార్వతికి మ్రొక్కి తిరిగి వచ్చు సందర్భమున పోతన్న యిటులనొక సుదీర్ఘ వచనమును వ్రాసినాడు.

వ॥ ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కాఱు మెఱుం గుతెఱంగున ....మత్తమరాళంబు భంగి...."

పోతనభాగ. 10 - 1746

ఇందు వాడబడిన యుపమానములన్నియును బోతన్న స్వీయ కల్పితములు.

అట్లే కృష్ణుని సంగ్రామ సంరంభమునకు జరాసంధాది రాజన్య చక్రము పొందిన దుస్థితి వర్ణింపబడినది.

"అని రుక్మిణీదేవిని హరి యూఱడించె...." అను ఈ వచనము అమూలకమైనట్టిది. పోతనభాగ. 10-1756.

మూలమున అనంతరము శ్రీకృష్ణుని రుక్మిణీ హరణమునకు గుపితుడై రుక్మి యిట్లు శపథమొనర్చుట కలదు,

"అహత్వా సమరే కృష్ణమప్రత్యూహ్యాచ రుక్మిణీమ్
కుండినం న ప్రవేక్ష్యామి సత్యమేతత్ బ్రవీమివః"

సంస్కృతభాగ. 10-54-20.

పోతన్న తన యనువాదమున,

ఉ॥ బల్లిదు నన్ను భీష్మ జనపాల కుమారుని జిన్నజేసినా
చెల్లెలి రుక్మిణిం గొనుచు జిక్కని నిక్కపు బంటువోలె నీ
గొల్లడు పోయెడిన్ రథము గూడగదోలుము తేజితోల్లసత్
భల్లపరంపరన్ మదము బాపెద జూపెద నా ప్రతాపమున్.

పోతనభాగ. 10-1763

యని చూపుటలో మూలమునందలి మాట చెల్లని యెడల 'కుండిన' న ప్రవేక్ష్యామి' యనిన రుక్మి పలుకులు కానరావు.

పరాజితుడై అవమానింపబడిన రుక్మి పురము ప్రవేశింపక భోజకటమను కుండినపుర సమీప గ్రామమునకు వెళ్ళెనని మూలము

'చక్రే భోజకటంనామ నివాసాయ మహత్పురమ్
అహత్వాదుర్మతిం కృష్ణమప్రత్యూహ్యాయవీయసీమ్
కుండినం న ప్రవేక్ష్యామీత్యుక్త్వాతత్రావసద్రుషా'

సంస్కృతభాగ. 10-54-52.

దీనిని పోతన్న,

వ॥ "....అట రుక్మి యనువాడు ప్రాణావశిష్టుండై విడువబడి, తన విరూప భావంబునకు నెరియుచు హరిం గెల్చి కాని కుండినపురంబు జొరనని ప్రతిజ్ఞ చేసి, తత్సమీపంబున నుండె...." పోతనభాగ. 10-1780.

అని యనువదించుటలో రుక్మి యిచట ప్రతిన యొనర్చినట్లుంటయే కాక తత్సమీపంబుననుండెనని మాత్రము చెప్పబడుట కలదు.

భోజకటునామము విడువబడినది.

శాస్త్రివారు శ్రీకృష్ణభాగవతమున,

వ॥ "....అట్లు విడువంబడిన రుక్మియు ప్రాణావశేషుండై తన విరూపకలనంబుననుస్మరించుచు వితథమనోరథుండై కృష్ణు నింజంపి రుక్మిణిందేలేని వాడగుటం జేసి ప్రతిజ్ఞకు భంగ పాటు వాటిల్లెనని సిగ్గుపెంపున గుండినఁబునకుంబోక భోజ కటంబను పురంబునకుంజని కాపురంబుండె...."

శ్రీకృష్ణభాగ. 10 ఉ. భా. 1-160.

యని యనవదించుటలో మూల విషయము యథాతథముగనున్నది.

మఱియు రుక్మి కృష్ణుని వెన్నంటి భాషించిన విధము మూల భాగవతమున నిటులున్నది.

"కుత్ర యాసిస్వసారం మే ముషిత్వా ధ్వాంక్షవద్ధవిః"

సంస్కృతభాగ. 10-54-25.

దీనికి బోతన్న,

సీ॥ మాసరివాడవా మా పాప గొనిపోవ
నేపాటిగలవాడ వేదివంశము...."

పోతనభాగ. 10-1765.

యని యనువదించుట వ్యంగ్యార్థ విస్తృతమై యున్నది.

ఈ విధముగ ఆంధ్రానువాద ద్వయమున మూలానువాద విషయముననయ్యాయి రచనా దృక్పథములు గోచరించుచున్నవి. మఱియు మూల భాగవతమున నీ వృత్తాంతము దశమస్కంధోత్తర భాగమున నుండగా బోతన్న దశమస్కంధపూర్వ భాగాంతమున నీ వృత్తాంతము జెప్పి పూర్తిచేయుట గమనింపదగినది. శాస్త్రివారు మాత్రము శ్రీకృష్ణభాగవతమున దశమస్కంధోత్తర ప్రథమాశ్వాసమునసీ విషయమును మూలముననుసరించుచు జెప్పిరి.

పై విధముగ రుక్మిణీ కళ్యాణఘట్టము మూలాంధ్రభాగవతములలో బ్రస్తావింపబడి యున్నది.

## 12. కుచేలోపాఖ్యానము :-

శ్రీకృష్ణుని సుహృత్ స్నేహ భావమునకీ యుపాఖ్యానము ప్రబల ప్రమాణము. ఈ విషయమునించుక పరిశీలింతును.

భార్యా ప్రేరణమున కుచేలుడు శ్రీకృష్ణదర్శన భాగ్యమభిలషించి చని వాని డాయగా నతడును బాల్య మిత్రునిజూచి పరిష్వంగ మొనరించి తీసికొనివచ్చినట్లు మూలమున నిటులున్నది.

"తం విలోక్యాచ్యుతో దూరాత్ ప్రియా పర్యంకమాస్థితః
సహసోత్థాయ చాభ్యేత్యదోర్భ్యాం పర్యగృహీన్ముదా"

సంస్కృతభాగ. 10-80-18.

పోతన్న యీ పట్టున,

మ॥ కనిడాయంజనునంత గృష్ణుడు దళత్కంజాక్షుడ ద్వేదవి
ప్రునినశాంత దరిద్రపీడితు గృశీభూతాంగు జీర్ణాంబరున్
ఘనతృష్ణాతుర చిత్తు హాస్య నిలయున్ ఖండోత్తరీయున్ గుచే
లునినల్లంతనె చూచి సంభ్రమ విలోలుండై దిగెన్ దల్పమున్.

క॥ కరమర్థి నెదురుగా జని

స్ఫురణన్ దోడ్తెచ్చి సమా
దరమున గూర్చుండ బెట్టె దనతల్పమునన్.

పోతనభాగ. 10 ఉ. భా. 976, 977.

పై పద్యమున కుచేలుని గూర్చి చెప్పిన విశేషణములు మూల భాగవతమున లేవు. అవి యున్నియును అమూలకముగ పోతన్న కల్పితములే.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదమును చూడుడు,

మ॥ ....ఆ బ్రాహ్మణ్యుడల్లల్లనన్
బదముల్ వేయుచు దిక్కులంగనుచు రా బల్యంకమందుండి శ్రీ
పదుడాకృష్ణుడు దవ్వులంగని కడు బ్రజ్ఞా సమగ్రుండునై.

చ॥ వడివడి లేచి చేతులను బారలు సాపుచు బోయి సందిటన్
గడువడి జేర్చి బ్రాహ్మణుని గాఢతరంబుగ గౌగిలింతలన్
బుడిబుడి మాటలం దనిపి బుజ్జవమారగనజ్జ లేయగా
నడచుపు దోడుకొంచు జనె నాతుకలుండెడు నట్టిచోటికిన్.

శ్రీకృష్ణభాగ. 10 ఉ.భా. 2-330, 331.

ఈ ప్రస్తాదివనము మూలానుసారమే. శ్రీకృష్ణుడు కుచేలుని జూచి పరిష్వంగమున జేర్చుటలోని సొగసు నుడికారముల సొంపుతో కడు కమనీయముగ జెప్పి శాస్త్రివారు పోతన్నను మించుట స్పష్టమగుచున్నది.

శ్రీకృష్ణుడు కుచేలునితో సల్లాపమొనరించుచు గురుప్రశంస మొనరించు పట్టున దాము గురుపత్నినియుక్తులై యింధనార్థమరణ్యమునకు బోయినప్పుడు కుండపోతగ వర్షము కురియుట, చీకటి పడుటయు, గురువర్యుడు తమను వెదకుచు నడవికరుదెంచుటయు నిత్యాది విషయ ప్రస్తావనమొనరించినాడు. ఆ సందర్భమున మూల భాగవతమున నిటులున్నది.

"ప్రవిష్టానాం మహారణ్య మపర్తౌ సుమహద్ద్విజః
వాతవర్షమభూత్ తీవ్రం నిష్ఠురాః స్తనయిత్నవః
సూర్యశ్చాస్తంగ తస్తావత్ తమసాచావృతాదిశః
నిమ్నం కూలం జలమయం న ప్రాజ్ఞాయత కించన
వయం భృశం తత్ర మహానిలాంబుభిర్నిహన్యమానా
ముహురంబుసంప్లవే
దిశోఽవిదన్తోఽథ పరస్పరం వనే గృహీతవన్తాః
పరిబభ్రిమాతురాః"

సంస్కృతభాగ. 10-80-36 నుండి 38.

దీనికి పోతన్న,

సీ॥ ఘుమఘుమారావ సంకుల ఘోర జీమూత
పటల సంఛన్నాగ్ర భాగమగుచు
జటుల జంఝానిలోత్కట సముద్ధూత నా
నా విధ జంతుసంతానమగుచు
జండదిగ్వేదండ తుండ నిభా ఖండ
వారిధారాపూర్ణ వసుధ యగుచు
విద్యోతమానోగ్ర ఖద్యోత కిరణజిత్
విద్యుద్ద్యుతిచ్ఛటా విభవమగుచు

తే॥ నడరి జడి గురియగ నినుండస్తమింప
భూరినీరంధ్ర నిబిడాంధకార మేచి
సూచికా భేద్యమై వస్తుగోచరంబు
గానియట్లుండె మనము నవ్వానదడిసి.

పోతనభాగ. 10 ఉ. భా. 995.

ఈ సీసమున వర్షము నిజముగా నిప్పుడే పడుచున్నట్లు సహజముగ వర్ణింపబడుటలో బోతన్న రసదృష్టి స్పష్టమగును.

పిదప "సూర్యశ్చాస్తంగతస్తావత్" యనుమూల శ్లోకము పోతన్న యనునాదమున

ఆ॥ బయలు గొందియు బెనుమిట్టు పల్లమంబు
రహిత సహితస్థలంబు లేర్పఱుపరాక
యున్న యత్తఱి మనము నొండొరుల చేతు
లూతగా గొని నడచుచునుండు నంత.

పోతనభాగ. 10 ఉ. భా. 996.

అను పద్యముగా గోచరించును. అంతియకాక వారి చలిబాధ యిటుల నమూలకముగ జెప్పబడినది.

క॥ బిసబిసనప్పుడు నుడుగక
విసరెడి చలి చేత వణకు విడువక మనమున్
బసచెడి మార్గము గానక
మసలితిమంతటనునంశుమంతుడు బొడిచెన్.

పోతనభాగ. 10 ఉ. భా. 997.

మఱియును,

"ఏతద్విదిత్వా ఉదితేరవౌ సాందీపనిర్గురుః"

సంస్కృతభాగ. 10-80-39.

యను మూల శ్లోకములోని "ఉదితేరవౌ" యనునది పోతన్న యనువాదమున బెంపుసేయబడి,

క॥ తెలతెలవాఱిన వనముల
గలకలమని పలికె పక్షిగణమెల్లెడలన్
మిలమిలని ప్రొద్దుపొడుపున
దళదళయను మెఱుగుదిగ్వితానము నిండెన్.

పోతనభాగ. 10 ఉ. భా. 998.

యను రీతిగానవచ్చును.

ఈ పట్టున శాస్త్రిగారు శ్రీకృష్ణభాగవతముననొక సీస పద్యమున మాత్రము మూల సంగ్రహ విషయమును సంగ్రహముగ నటులే నుడివినారు.

సీ॥ ఒకనాడుపాధ్యాయునువిద యింధనములు
లేవు తెండని మనతోవచింప
మన మడవికి పోయి మసలుచున్నప్పుడు
ప్రళయంబుగా గాలివాన వచ్చె
నాలోవిభాకరుడస్తంగతుండయ్యె
గటిక చీకటి దెసల్ గ్రమ్ముకొనియె
మిట్ట పల్లములేక మట్టమై నీర్నిండె
మిన్ను మన్నెఱుగదు కన్నుదోయి

తే॥ జడమయంబగు నక్కాఱుటడవియందు
దిక్కొకండును లేకుండ దేవురు వడి
సంభ్రమించుచు మన మొక్క చక్కినిలచి
నొండొరుంగట్టుకొని యుంటి మొయ్యనొయ్యె.

మఱియు దెల్లవారుటయును,

వ॥ అంత గొంతలో సూర్యోదయంబునకు వాతవర్షంబు శాంతించుటయు...." శ్రీకృష్ణభాగ. 10 ఉ. భా. 2-343, 344.

యని సంగ్రహముగ నటులనే చూపబడియున్నది.

అనంతరము కుచేలుని మహద్భాగ్యాదికము చెప్పబడినది.

ఈ రీతిగ నీ వృత్తాంతమునను బోతన్న, శాస్త్రివారల రచనా దృక్పథములు స్పష్టమగును.

అంతియకాక పోతన్న మూల భాగవత విషయములను దన యనువాదమున సంగ్రహించియును, మూల భిన్నముగ రచించుట

ఇప్పుడు విపులముగ నీ విషయమును శాస్త్రివారి శ్రీకృష్ణభాగవత ముతో పరిశీలించెదను.

ప్రథమమున మూల సంగ్రహ విషయముల బరిశీలించెదను.

వామన చరిత్రయందు యాతుధానులు స్వర్గమునాక్రమింప దివౌకసులు గురుని యుపదేశముననుసరించి యటనుండి నిష్క్రమించిరి. అప్పట్టున దేవమాత పుత్ర దైన్యస్థితికి దుఃఖించుచుండగ నాగమించిన కశ్యపు డామెను కుశలమడుగుచు దుఃఖ హేతువును గూర్చి సంప్రశ్నించును. మూలభాగవతమున గశ్యపుడు,

"అప్య భద్రం న విప్రాణాంభద్రే లోకేధునాగతమ్
నధర్మస్యనలోకస్య మృత్యోశ్ఛందానువర్తినః"

సంస్కృతభాగ. 8-16-4.

ఇత్యాదిగ ప్రశ్నించును. అదితి యీ విధముగ సమాధాన మిచ్చుట కలదు.

"భద్రం ద్విజగవాం బ్రహ్మన్ ధర్మస్యాస్య జనస్యచ
త్రివర్గస్య పరంక్షేత్రం గృహమేధిన్ గృహా ఇమే
అగ్నయోఽతిథయో భృత్యాభిక్షవోయేచ లిప్సవః
సర్వం భగవతో బ్రహ్మన్ను ధ్యానాన్న రిష్యతి
కోనుమే భగవన్ కామో న సంపద్యేత మానసః
యస్యా భవాన్ ప్రజాధ్యక్ష ఏవం ధర్మాన్ ప్రభాషతే.

సంస్కృతభాగ. 8-16-11 నుండి 13.

పోతన్న యీ సమాధానములన్నిటిని విడచివైచి యదితిచే వెంటనే,

ఉ॥ ప్రేమ యొకింత లేక దితి బిడ్డలు బిడ్డలు బిడ్డలున్మహా
భీమ బలాఢ్యులై తనదు బిడ్డల నందఱదోలి సాహసా
క్రామిత వైరులయ్యు నమరావతి నేలుచున్నవారు నీ

కేమని విన్నవింతు హృదయేశ్వర మేలు దలంచి చూడవే.
పోతనభాగ. 8 - 469.

యనుచు తన మనోవేదనను బలికించినాడు.

శాస్త్రివర్యులు శ్రీకృష్ణభాగవతమున మూల భాగవతమునం వలెనే యదితి సమాధానములనుట్టంకించుట గోచరించును.

మ॥ గృహకృత్యంబుల నేమఱిల్లకతిభక్తిన్ వహ్నులంగొల్చు చ
న్వహమున్వచ్చెడు నర్థికోటికిని మృష్టాన్నంబుగల్పించుచు
సహజప్రేమను భృత్యులంగనుచు నాస్వాంతంబునన్నీ పయి
బహుభక్తింగొనియుంటినామయమెదేవామేనలేదారయన్.

శ్రీకృష్ణభాగ. 8-182.

మఱియును మూలమున,

"తవైవమరీచమనః శరీరజాః ప్రజా ఇమాసత్వరజస్తమోజుషః
సమోభవాంస్తాస్వసురాదిషు ప్రభోతథాఽవిభక్తం భజతే
మహేశ్వరః"

సంస్కృతభాగ 8-16-14.

అనియును అదితి పలికినది. పోతన్న యిదియును విడచినాడు. శాస్త్రివర్యులు,

ఉ॥ వ్యాధులకన్న నాధులు భయప్రదముల్ మునినాథ యిప్డు నా
కాధి యొకండు చిత్తమున యిందయికుందుజనింప జేయనో
నాథ సమస్వభావుడవనాథశరణ్యుడవీవు నీకు నీ
క్రోధము నేరిపై నెపుడు గూడ జనింపదు నిక్కమింతయున్.

ఉ॥ సత్వరజస్తమంబులను సంభవమందిరినీకు బుత్రికుల్
సత్వమె సత్యమైనదని సర్వ జగంబు దలంచుచుండు నీ
సత్వమునన్ జనించిన విశాల యశస్కుల నీకొమాళ్ళ మి
త్రత్వము హెచ్చజూచుటకు దావకపాదములాశ్రయించెదన్.

యను విధమున మూలానుసారముగ జెప్పినారు.

పిదప కశ్యపుడు భార్యతో భగవత్సేవ కావించి బహు సౌభాగ్యములనందుమని చెప్పిన నామె యా యర్చనాదికమును తెలుపుమని వేడినది. అప్పుడు కశ్యపుడు,

"ఏతన్మే భగవాన్ పృష్టః ప్రజాకామస్య పద్మజః
యదాహ తే ప్రవక్ష్యామివ్రతం కేశవతోషణమ్"

సంస్కృతభాగ. 8-16-24.

ఇత్యాదిగ నలుబది శ్లోకములలో పయోభక్షణవ్రతాచరణ విధానమును మంత్రాదులను వివరించినట్లు మూల భాగవతముననున్నది.

దీనిని బోతన్న మిక్కిలి సంగ్రహించి,

వ॥ కశ్యప ప్రజాపతి సతికి బయోభక్షణంబనువ్రతంబుపదేశించి, తత్కాలంబును దన్మంత్రంబును దద్విధానంబును దదుపవాస దాన భోజన ప్రకారంబులు నెఱింగించెను...."

పోతనభాగ. 8-4-20.

యని యొక వచన భాగమున రెండు పాదములలో ముగించినాడు.

శాస్త్రివారు దీనిని 5 గద్యపద్యములలో వివరించుటయే కాక దిగువన వ్యాఖ్యానరూపముగ సమగ్రముగ జూపినారు.

అటులనే యదితి పయో భక్షణవ్రత మాచరించి ప్రత్యక్షమైన విష్ణువును స్తుతించి తన వేదనను జెప్పికొని ప్రార్థించినది. విష్ణువు నామె నోదార్చి తానామెకు బుత్రునిగ జన్మింతునని పలుకును. ఇప్పట్టున మూల భాగవతమున 17వ యధ్యాయమున నెనిమిది శ్లోకములలో విపులముగ వర్ణింపబడినది. పోతన్న దానిని గడు సంగ్రహించి రెండు పద్యములందు మాత్రము చూపినాడు.

శా॥ "నీకోడండ్రను... వర్తించి వర్తింపగాన్"

వ॥ "బలిమిన్ దైత్యులజంపరాదు.... దుఃఖమింకేటికిన్."

పోతనభాగ. 8-486, 487.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతమున,

వ॥ అని ప్రార్థించినం బ్రసన్నుండై పరమేశ్వరుండు...."

శ్రీకృష్ణభాగ. 8-195.

అను వచనమున మూల విషయమును జక్కగ జెప్పుట కాననగును.

నారదుడు పితరుడయిన పరమేష్ఠిని బ్రపంచ ప్రకారమునడిగిన విషయమును జెప్పుటకు ముందు శుకుడు గుర్వాది వందనమొనరించుచు బరమేశ్వరుడు తన వాక్కునలంకరించుగాక యని ప్రార్థించుట యిటులున్నది.

"భూతైర్మహద్భిర్య ఇమాః పురోవిభుర్నిర్మాయ శేతేయద
మూచుపూరుషః
భుంక్తే గుణాన్ షోడశ షోడశాత్మక స్సోలంకృషీష్ట
భగవాన్ వచాంసిమే."

సంస్కృతభాగ. 2-4-23.

ఇందు "సోలంకృషీష్ట భగవాన్ వచాంసిమే" యనుదానిని పోతన్న,

తే॥ అట్టి భగవంతుడవ్యయుండచ్యుతుండు
మానసోదిత వాక్పుష్పమాలికలను
మంజునవరస మకరంద మహిమలుట్ట
శిష్టహృద్భావలీలల జేయుగాత. పోతనభాగ. 2-68.

యనుచు ననువదించుటలో స్వీయభావనావృద్ధి కన్పించును.

శాస్త్రివారు మాత్రము,

వ॥ 'ఓయయ్య నాకుంబ్రసన్నుండవై బోధనాశక్తి గల్గింపుము....'

యని యనువదించుచు మూల భావమును "బోధనాశక్తి గల్గింపుమ" నుచు జూపిరి.

గోపికా గీతలలో నున్న

"విషజలాప్యయాద్వ్యాలరాక్షసాద్వర్ష మారుతాద్వైద్యుతానలాత్
వృషమయాత్మజాద్విశ్వతోభయాదృషభతేవయం రక్షితా ముహుః"

సంస్కృతభాగ. 10-31-3.

యను శ్లోకమును బోతన్న యిటులనువదించినాడు.

ఆ॥ విషజలంబువలన విషధర దానవు
వలన గాలివానవలన వహ్ని
వలన మిసులు వానివలనను రక్షించి
కుసుమశరుని బారి గూర్పదగునె.

పోతనభాగ. 10 ఉ. భా. 1037.

ఇందు మూల శ్లోకము పద్యములోని మూడు చరణములతో బూర్తియయినది. నాల్గవ చరణమైన "కుసుమశరుని బారి గూర్ప దగునె" యునునది పోతన్న నేర్పు.

శాస్త్రివారి యనువాదమిది,

సమ్మతా॥ విషజలంబుచే విద్యుదగ్నిచే
వృషభదైత్యుచే విశ్వభీతిచే
విషధరాహిచే వీరు నీ పర్జిజల్
విషమమిాగగావించితో ప్రభూ।

శ్రీకృష్ణభాగ. 10 పూ.భా. 2-397.

ఇది యథామూలమై యున్నది.

పైని పోతన్న మార్పు చేర్పులు.

మూల భిన్నములు నటనట కానవచ్చును,

మూల భాగవత తృతీయస్కంధమున ద్వాదశాధ్యాయమున బ్రహ్మ సృష్ట్యాది యిట్లు చెప్పబడినది.

"ససర్జాగ్రేన్ధతామిస్రమథతా మిస్రమాది కృత్
మహామోహంచ మోహంచ తమశ్చా జ్ఞానవృత్తయః"

సంస్కృతభాగ. 3-12-2.

బ్రహ్మ సృష్టికి ముందు నంధతామిస్రము, తామిస్రము, మహామోహము, తమస్సను నవిద్యావృత్తులను సృష్టించెనని పై శ్లోక భావము.

పాతంజల యోగశాస్త్రము కూడ నీ యవిద్యా పంచకము నిట్లు పలుకుచున్నది.

"తమోఽవివేకో మోహస్స్యాదంతః కరణవిభ్రమః
మహామోహస్తు విజ్ఞేయోగ్రామ్యభోగసుఖైషణా
మరణంహ్యంధతామిస్రం తామిస్రః క్రోధఉచ్యతే
అవిద్యా పంచపర్వైషా ప్రాదుర్భూతామహాత్మనః"

పోతన్న యనువాదమున దీనిని శ్రీధరీయ వ్యాఖ్యననుసరించి యర్థ వివరణను జూపినాడు.

వ॥ పరమేష్ఠి యీసృష్ట్యాది నహమ్మను దేహాభిమాన బుద్ధిగల మోహంబును, అంగనా సంగమసృక్చందనాది గ్రామ్యభోగేచ్ఛలుగల మహామోహంబును, దత్ప్రతిఘాత జాతంబైన క్రోధంబునందు గలుగు తామిస్రంబును, దన్నాశంబునందహమేవ మృతోఽస్మి యను నంధతామిస్రంబును, జిత్త విభ్రమంబునను నవిద్యాపంచక మిశ్రంబుగా ...."

పోతనభాగ. 3-367.

శ్రీధరుడును మూలమునందలి వరుసను దాటుమాటుజేసి వ్యాఖ్య యొనరించినాడు. పోతన్న మోహమ్ముతో బ్రారంభించి

చిత్త విభ్రమంబుతో ముగించెను. పోతన్న యిచట తమస్సునకు బదులుగా జిత్త విభ్రమమనుట స్పష్టమగుచున్నది. "తమః" అనగా స్వరూపా ప్రకాశమని శ్రీధరుడును, అవివేకమని పాతంజల యోగ శాస్త్రమును నుడువుట యుండగా బోతన్న చిత్త విభ్రమమని యను వదించుచున్నాడు.

మఱియు "మోహస్స్యాదంతః కరణ విభ్రమః" అని పాతం జలము. పోతన్న శ్రీధరుననుసరించి మోహమన "అహమ్మను దేహా భిమాన బుద్ధి యని వివరించి తమస్సనగ జిత్తవిభ్రమమని యనువ దించినాడు. ఇటులనుట పై రెంటికిని విరుద్ధము.

ఇక శాస్త్రిగారు,

"ఆ బ్రహ్మదేవుండు మునుమున్న సృష్టికింగడంగి తమస్సు మోహము మహామోహము తామిస్రమంధతామిస్రముననునవిద్యా వృత్తిలేనింటింజేసి...." శ్రీకృష్ణభాగ. 3-114.

అని యనువదించినారు. ఇందు మూల పదములు భిన్నముగ మారలేదు. కాని మూల క్రమము మాత్రము మారుట స్పష్టము. ఇది తప్ప మూల విరుద్ధమేమియు నిందులేదు.

మఱియును మూలమున దృతీయస్కంధమున గాలాది నిరూ పణమున భగవత్తత్వమిట్లు చూపబడినది.

"కాలోఽయం పరమాణ్వాది ద్విపదార్ధాంత ఈరితః
నైవేశితుః ప్రభుర్భూమ్న ఈశ్వరోధామమానినామ్.
సంస్కృతభాగ. 3-11-38.

దీనిని పోతన్న,

తే॥ మందిరార్ధాది కర్మాభిమాన శీలు
రైన వారికి నాశ్రయంబగుట జేసి
యరయ హరి దద్గుణ వ్యతి కరుడు గాన
కాలమమ్మేటికెన్నడు గర్తగాదు. పోతనభాగ. 3-362.

యని యనువదించినాడు. ఇందు "హరి దద్గుణ వ్యతికరుడ గాన యను హేతువును బోతన్న కల్పించినాడు. ఈశితుః భూమ్న యనువానికి "అమ్మేటికి, "ప్రభుః అనుదానికి "కర్త" యనియు ఈశ్వరః అనుదానికి "ఆశ్రియంబగుటచేసి" యనియు బోతన్న యనువదించుట స్పష్టమగుచున్నది.

శాస్త్రివారి యనువాదము మూలానుసారముగ శ్రీకృష్ణభాగవతమున నిటులున్నది.

వ॥ ఈ కాలము దేహ గేహాభిమానులకు బ్రభువగుగాని పరమేశ్వరునకు బరిచ్ఛేదంబు గావింపం జాలదు.

శ్రీకృష్ణభాగ. 3-112.

బాలకపిలుడు తండ్రి యగు కర్దమునితో బలికిన పట్టున మూల భాగవతమున నిటులున్నది.

"ఏష ఆత్మపథోఽవ్యక్తో నష్టః కాలేన భూయసా
తం ప్రవర్తయితుం దేహమిమం విద్ధిమయా భృతమ్.

సంస్కృతభాగ. 3-24-37.

నేను పూర్వము బ్రవర్తింపజేసిన సూక్ష్మమైన యాత్మ మార్గము కాల ప్రభావమున మఱుగువడగా దానిని పునః ప్రతిష్ఠించుటకయి యిట్లు అవతరించితినని గ్రహింపుమని యీ శ్లోక తాత్పర్యము. పోతన్న దీనిని

సీ॥ నాచేత బూర్వంబునం బ్రతి శ్రుతమైన
వచనముల్ దప్పకవరమునీంద్ర
నీయింట బుట్టితి నిర్హేతుకస్థితి
భూరిదయాగుణంబుననవాప్త
సకల కాముడ నేను సన్ముని వేషంబు
ధరియించు టెల్ల నాకొఱకుగాదు

విను మహాత్మకులైన మునులకు బరమాత్మ
గురుసద్వివేకంబునరసిచూపు

తే॥ తత్త్వబోధంబు కొఱకును దాల్పబడిన
యంచిత వ్యక్తమార్గమైనట్టి దేహ
మని తలంపుము మత్పదధ్యానభక్తి
ధీపరాయణమహిమంబు తేజరిల్ల. పోతనభాగ. 3 - 850.

అని యనువదించుటలో మూలమును బాగుగ వివరించుట తెలియును. కాని "ఆత్మపథః" యను దానికి విశేషణమైన "అవ్యక్త" యనుదానిని విడచి "అంచిత వ్యక్త మార్గమైనట్టి" యను విశేషణములను గల్పించుట తోచును.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదము సంగ్రహముగ నిటులున్నది.

ఉ॥ నామునుపల్కినట్టి నుడినాటుకొనంబొనరించువాడనై
ప్రేముడిజేసి యిట్లవతరించితి మీకు సుతుండనై ద్విజ
గ్రామణి నీవు ధన్యుడయి క్రాలుదు వింకిటుసాంఖ్యయోగమున్
భూమి వెలార్ప జేయటకు బుద్ధియునాకగు భూసురోత్తమా.
శ్రీకృష్ణభాగ. 3 - 236.

"అవ్యక్తమైన యాత్మ పథమ"ను దానిని "నామును పల్కినట్టి నుడి" యని సూచించి పిదప "సాంఖ్యయోగమున్" అనుదానియందు తత్త్వమునిమిడించి ధ్వనింపజేయుట శాస్త్రివారి యనువాదమున గోచరించును.

మఱియు గపిలుడు మాతయైన దేవహూతికి దత్త్వ లక్షణ ముపదేశించు పట్టున మూలమున నిటులున్నది.

"హృదయాన్మన ఉత్థితమ్
మనసశ్చంద్రమా జాతోబుద్ధిర్బుద్ధేర్గిరాంపతిః

అహంకారస్త్వతో రుద్రశ్చిత్తం చైత్తస్తతోభవేత్.

సంస్కృతభాగ. 3-26-60, 61

హృదయమునుండి మనస్సు, మనస్సునుండి చంద్రుడు, బుద్ధియు, బుద్ధినుండి బ్రహ్మమును కలుగును. అహంకారమునుండి రుద్రుడును, చిత్తమును, చిత్తమునుండి క్షేత్రజ్ఞుడును గలుగుదురని పై మూల భాగవత శ్లోక భావము.

దీనికి బోతన్న యనువాదమిది,

క॥ విను హృదయము వలనను మన
మును మనమున దుహినకరుడు బుద్ధియుజిత్తం
బున బ్రహ్మయు క్షేత్రజ్ఞుం
డును గలిగిరి యవ్విరాజుడున్ బూరుషతన్.

పోతనభాగ. 3-903

ఇందు మొదటి రెండుపాదములయనువాదము సరిగనున్నది. చివరి రెండు పాదములందు భిన్నత గోచరించుచున్నది.

"బుద్ధేర్గిరాంపతిః" అనుదానికి "చిత్తంబున బ్రహ్మయు"నని యనువాదము. బుద్ధియు చిత్తమును వేరు వేరు. అహంకారము నుండి రుద్రుడు, చిత్తమును, జిత్తమునుండి క్షేత్రజ్ఞుడును గలిగిరను టను పోతన్న విడచి చిత్తముననే బ్రహ్మయు, క్షేత్రజ్ఞుడును గలిగి రని యనువదించినాడు. ఇది మూల భిన్నము.

ఇక శాస్త్రివారనువదించుచు నవియన్నియు జనించినవని మాత్రము క్రమముగ జెప్పిరి. ఇందు మూలత్యాగముగాని, మూల భిన్నతకాని గోచరించుట కనిపించదు.

'మనము చంద్రుడు బుద్ధియు జననమగును"

వ॥ మఱియు బ్రహ్మయు, నహంకారంబును రుద్రుండును జిత్తము క్షేత్రజ్ఞుడు గలుగు. శ్రీకృష్ణభాగ. 3-250, 251

గంగన రచనమైన పంచమస్కంధమునగల భరతోపాఖ్యాన మున నొకసందర్భమిటులున్నది. ముందుగా మూలము జూచి యను వాదము నరయుదము.

"....పారిప్లవదృష్టి రగతతృషా భయాత్ సహసైవోచ్చ క్రామ"

సంస్కృతభాగ. 5-8-4

దీనికి గంగన "....అపగతతృషయగుచు నదినుల్లంఘించునెడ...." అని యనువదించినాడు. పోతనభాగ. 5-101

"అగతతృషా యనుదానికి నగతాతృట్ యస్యాః" అని శ్రీధరీయము. దీనికి నారయ "అపగతతృషయగుచు"నని యనువదించుట పూర్తిగ విరుద్ధము.

శాస్త్రిగారిటుల ననువదించుట వారి శ్రీకృష్ణభాగవతమున గాననగును.

"....కాఉఱుబెండను నోరెండగ జేయునట్టి దగతోడన్ రెండు జాల్ పొద్దునన్"

చ॥ అదిచెవులందు బెద్ద పిడుగట్లుపడం గడుబీతుజెందియు
న్నెదరియు బెగ్గడిల్లియునునిప్పెఉపాటును ఉిచ్చపాటునుం
గదురగనల్లలేడివడిగాడుపు తండ్రిని ముట్టలేచి యం
గదగలుగంగ నేటిదరి గట్టుపయిం బడిచచ్చె బాటునన్.

శ్రీకృష్ణభాగ. 5-109, 111

షష్ఠస్కంధమును రచించిన సింగన్నయును మూల భావములను సరిగ వ్యక్తపఱపకుండుటయు గోచరించును.

"కంకుః కాలో ధర్మ ఇతి హ్యేతేదైహ్యాస్య సాక్షిణః
ఏతైరధర్మో విజ్ఞాతః స్థానందండస్య యుజ్యతే
సర్వే కర్మానురోధేన దండమర్హాన్తి కారిణః"

సంస్కృతభాగ 6-1-42, 43

సింగన్న,

సీ॥ ఎవ్వనిచే దనయిరవొందు త్రిగుణస్వ
భావమై యున్నట్టి ప్రాణిచయము
లనుగుణనామక్రియా రూపములచేత
నెంతయుదమయంత నెఱుగబడును
సర్యముండనలంబునాకాశమును బ్రభం
జనుడు గోచయమును శశధరుండు
సంధ్యలు దివములు శర్వరీచయములు
కాలాంబు వసుమతీ జాలములును

తే॥ దేహధారికి సాక్షులై తెలుపుచుండు
దండనస్థాన విధము సద్ధర్మగతియు
దగుల మీర క్రమానురోధనము చేసి
యఖిల కర్మలు దండార్హులరయునెపుడు

పోతనభాగ. 6-84

అని యనువదించుటలో నన్వయము సరిగ కుదురుటలేదు.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదమిది.

మనుజుడొనర్చిన పనుల నన్నింటిని
దివియును భువి యును దేవతలును

తే॥ చంద్రసూర్యులు నగ్నిసంజలును బవలు
రేలు దిక్కులు జలములు కాలముసమ
వర్తియగు ధర్మరాజునవశ్యమెఱుగ
సాక్షిభూతులై చెప్పుచుండ్రప్పుడపుడు.

వ॥ కావున మేము ధర్మాధర్మము లెఱుంగుచుందుము. మాచే
నధార్మికులు మాత్రము శిక్షింపబడుదురు. శిక్షార్హు నేమేమ
ఇపుడు శిక్షించుచుంటిమి. కాని కాని వానిని శిక్షింపబూనము.

శ్రీకృష్ణభాగ. 6-43, 44

ఇందు మూల భాగవత శ్లోక భావము స్పష్టముగ ననువదింప బడుట చూడదగును.

సింగన రచనమున నమూలకవర్ణనములుగూడ నున్నవి. అజామిళుని గూర్చిన పట్టున మూలమున నిటులున్నది.

'ఏకదాసౌవనం యాతః పితృసందేశకృద్ద్విజః
ఆదాయతత ఆవృత్తః ఫలపుష్ప సమిత్కుశాన్'

సంస్కృతభాగ. 6-1-58.

ఈ శ్లోకముననువదించుటకు బూర్వము సింగన యజామిళుని యౌవనోదయమును వసంతమును పద్య సప్తకమున (6-89 నుండి 94) విపులముగ వర్ణించుట మూలమున లేదు.

మచ్చునకు మీసముల వర్ణనకల యీ కంద పద్యము పరికింపుడు,

క॥ తమ్మివిరిమీద ద్రావిలిన
తుమ్మెదపంక్తియునుబోలె దోరపు లీలం
గ్రమ్ముకొని విప్రతనయుని
నెమ్మొగమున గానబడియె నెటిమీసంబుల్.

పోతనభాగ. 6 - 93

ఈ సొగసైన యమూలక వర్ణనము సింగన యూహకు తార్కాణమే.

అటులనే మూలమున,

"తామేవ మనసాధ్యాయన్ స్వధర్మాద్విరరామహ"

సంస్కృతభాగ. 6-1-63

అని యున్నదానిని సింగన మిగుల విపులీకరించుచు,

శా॥ ఆలీలావతి గండపాళికలపై హాస ప్రసాదంబుపై
నాలోలాలక పంక్తిపై నొసలిపై నాకర్ణ ధృగ్భాతిపై

హేలాపాదికుచద్వయోరుకటిపై నిచ్చల్ పిసాళింపగా
జాలింబొందుచు నాత్మ గుందుచుమనోజాతానలోపేతుడై.

పోతనభాగ. 6-103.

యని యనువదించినాడు. ఈ పద్యము పోతన్నదైన "ఆది
శ్రీసతి కొప్పుపై...." (8-591) యనుదానిని దలపించును. సింగ
పోతన్న రచనను బాగుగ జీర్ణించుకొని యానడవనే నడచుట వా
రచనమున గానవచ్చును. దీనినిబట్టి సింగనకు బోతన్నపైగల గు
తర గౌరవభావము స్పష్టమగును.

ఇక ఏకాదశ ద్వాదశస్కంధములననువదించిన నారయ రచ
మున మూల సంగ్రహము, మూలత్యాగములు బాగుగ కానుపించున
యాదవ ప్రళయ ఘట్ట పరిశీలనమున నింతకు ముందు నీవిషయవ
ప్రస్తావించబడినది. కొలదిగ నిప్పుడు జూతము. ఏకాదశ స్కం
మున షష్ఠాధ్యాయమున బ్రహ్మాది దేవతలు ద్వారక కరి
శ్రీకృష్ణుని వైకుంఠమునకాహ్వానించుచు స్తుతించిరి, అప్పుడు మూ
మున ఇరువది శ్లోకములున్నవి. (11-7-27) నారయ దీని నంతః
విడచి యిటులనొక పద్యమున నుడివినాడు.

క॥ కనిపరమేశుని యాదవ
వనశోభిత పారిజాతు వనరుహ నేత్రుం
జనకామిత ఫలదాయకు
వినుతించిరి దివిజులపుడు వేదోక్తులతోన్. పోతనభాగ. 11-

బ్రహ్మస్తుతిలోని

'యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ
శరచ్ఛతంవ్యతీయాయ పంచవింశాధికంప్రభో'

సంస్కృతభాగ. 11-6-25.

యను శ్లోకమును మాత్రము,

తే॥ అఖిలలోకేశ। సర్వేశ। యభవ। నీవు
నుదయమందుట భూభారముడుప కొఱకు
బంచవింశోత్తర శతాబ్ద పరిమితంబు
నయ్యె విచ్చేయు వైకుంఠ హర్మ్యమునకు.

పోతనభాగ. 11-85

అని తెలిగించినాడు.

శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున నిప్పట్టున పది పద్యములో మూలవిషయమున నువదించుట కాననగును. మచ్చునకొకటి,

సీ॥ ఓ మహాప్రభువరా మేము తొల్లింటను
భూమి భారము దీర్ప బోలుననుచు
విజ్ఞాపనము సేయ వినినీవు సరియని
చని భారముడిపితి సత్యసంధు
లందు ధర్మమునిల్పి తధికకీర్తి దిశావ
లయముల వెదజల్లితయము మెఱయ
యదువంశమునయందు నవతరించిన నీదు
రూపమత్యుత్తమై పఱగెను

తే॥ నూటయిరువది యేనేండ్లు నేటి వఱకు
గడిచెనిక జేయగలిగిన కార్యమొండు
లేనిదగుగాన నీవు నీ స్థానమునకు
నరుగుదేనెంచుమనుచు మా ప్రార్థనంబు.

శ్రీకృష్ణభాగ. 11-113

పై విధముగ నారయ సంగ్రహించుటయే కాక విడిచిపెట్టిన విషయములనేకములు. మూలమున నేకాదశస్కంధమున పది మొదలు 29వ యధ్యాయము వఱకునుద్ధవునకు గృష్ణుడెఱిగించిన యధ్యాత్మిక విషయములు చాలవఱకును దెనిగింపబడలేదు. కృష్ణనిర్యాణా

నంతరము పార్థుడు మృతుల కూర్ధ్వదైహికములొనరించుట, వజ్రుని పట్టాభిషేకాదులు, నారయచేత ననువాదమున విడువబడినవి. అట్లే ద్వాదశస్కంధమునను జాల సంక్షేపించుట కానవచ్చును. భాగవత సారాంశముకల 12వ యధ్యాయము పూర్తిగ విడిచిపెట్టబడినది.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదమున నీ విషయములన్ని యును గోచరించును.

ఈ విధముగ శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతమును బోతన్న భాగవతముతో పరిశీలించు పట్టున మూలభాగవతమాధారమగును. పోతన్న శ్రీకృష్ణభాగవతములను గంగాయమునలుగ భావించి మూలమైన వ్యాస భాగవతమును నంతర్వాహినీ కరదీప సాహాయ్యమున పం డ్రెండు స్కంధములకు సమన్వయ సమీక్ష నీవిధముగ గావించితిని.

ఈ పై విమర్శనము వలన బోతన్న భాగవతమున లోపము లున్నవను భ్రమ పనికిరాదు. ముఖ్యముగ పోతన్న దృష్టి రసదృష్టి. మూల విషయమును శబ్దార్థ రామణీయకముతో రసమును గుమ్మరింప జేసినాడు పోతన్న. మూల భావమంతయు కొంఅవడకుండ ననువాద మొనర్చిన దీక్షాపరులు శాస్త్రివర్యులు. అంత్యాను ప్రాసాదికముతో ధారాళమైన శయ్యతో మందార మకరంద మాధుర్యముతో గవిత నం దించుటలో బోతన్న యద్వితీయుడు. మూలానుసారమైనను నెగుడు దిగుడులేక సునాయాసమైన రీతిని రచన సాగించుటలో శాస్త్రివారి! వారే సాటి. ఈ దృష్టితో ప్రకృత విషయికముగ శాస్త్రివారి కవిత దృష్టి నుగ్గడించుట ముఖ్యము. కావున మూలానుసరణమున బోతన్న కంటె శాస్త్రివర్యులను ముందునకు దీసికొనిరానైనది. ఇటుల బరి లించుటలో స్థాలీపులాక న్యాయముననుసరించుటకు బ్రధానము గ్రంథవిస్తరభీతి కారణము. కావున సహృదయులవధరింతురుగాక. తదుపరి శ్రీకృష్ణభాగవతమునించుక మూలముతో బరిశీలింతును.

# శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్యము

శాస్త్రివర్యులు తమ భాగవత రచనావశ్యకతకు హేతువును జూపుచు,

"భాగవత మహాపురాణంబు దదేకదీక్షగా నాల్గు మాసంబులలో ననౌచిత్యంబు పరిహరించి యౌచిత్యంబు గ్రహించి మూలానుసారంబుగా ........" 1-16.

యని తమ రచనా పథకమును నుడివినారు. పోతన్నకువలె స్వతంత్ర రచనా విధానము కాదు. కావున వారి వారి రచనములలో వలె విస్తృతముగ మూలత్యాగ, మూల కుంచన, మూల చాలనాది వివిధ పద్ధతులిందు దోపరావు. ముఖ్యముగ ననౌచిత్యంబు పరిహరించుట, యౌచిత్యబు గ్రహించుట (అమూలకమైనను) లు పరిశీలనకు సమంజసములు. ఈ హేతువుగ నించుక మూలమునకు మార్పు చేర్పులు తదితరములు గోచరింపవచ్చును. ఈ కతమున నీ శ్రీకృష్ణ భాగవతమును మూల భాగవతముతో పరికించి సంక్షిప్త పరిశీలన మొనరింతును.

1. ప్రథమస్కంధమున భాగవత పురాణ రచనా హేతువు వివరింపబడి యున్నది. వ్యాసర్షి సమస్త పురాణములను రచించి, వేద విభాజన మొనరించి, యితిహాసములను విలిఖించి, లోకోపకారంబు గావించి నప్పటికిని వాని హృదయమున నేదియో కొఱత యింకను నుండినదని వితర్కించుచుండును. అప్పట్టున నారద మహర్షి పరాశరాత్మజ

"కృష్ణస్య నారదోఽభ్యాగాదాశ్రమం

శాస్త్రివర్యులా నారదుని సకల కలా విశారద

కడు సొగసుగ నొక సీస పద్యమున రూపు కట్టించినారు.

సీ॥ వేదోపనిషదర్థ వేత్త పురాణేతి
హాస కల్పన్యాయ భాసురమతి
ధర్మ తత్త్వజ్ఞుండు ధర్మార్థకామ మో
క్ష వినిశ్చయజ్ఞాన కలిత చిత్తు
డంగషట్కవిధిజ్ఞుడైక్యసంయోగనా
నాత్వాది సమవాయనయ విదుండు
పంచావయవ యుక్త వాక్య దోషగుణజ్ఞు
డుత్తరోత్తరవక్త సత్త్వ పస్వి

తే॥ కవి ప్రగల్భుడు మేధావి భువనదర్శి
సర్వశాస్త్ర ప్రవీణుడు సంధి విగ్ర
హాది షాడ్గుణ్య తత్త్వజ్ఞుడనఘమూర్తి
నారదుడఖిల కలా విశారదుండు. 1-162

శాస్త్రివారి నారదుడు సర్వశాస్త్ర ప్రవీణుడును అఖిలాకలా విశారదుడునేకాక కవి ప్రగల్భుడునై యిటు కనిపించును.

పోతన్న యునిప్పట్టున నారదుని రూపవర్ణనము కావించినాడు. ఇచట బోతన్న పైమాఘకవి ప్రభావము కనబడును. పోతన్న యొనరించినది రూప వర్ణనము మాత్రమే.

శాస్త్రివారిచట నారదుని యఖిలకలావిశారదతను బరమ రమణీయముగ వర్ణించినారు. ఇది వారి ప్రతిభా సంపన్నతకును, వర్ణనా వైశారద్యమునకును నికషోపలము. ఇట్లు నారదుని ప్రావీణ్యము వర్ణింపబడుట మిగుల నౌచిత్యవంతము. భావిని పురాణమకుటాయమానమైన భాగవతమును గూర్చి సాత్వతేయునకు వివరించి తద్రచనా శ్రీకారమునకు బ్రధాన హేతుభూతుడగును. కావున నట్టి భాగవత నిర్మాణమునకు వలయు సత్త్వము కలవానిగ నారదుని శాస్త్రివారు చిత్రించుట యౌచిత్యవంతమై యున్నది.

2. పాండవమధ్యముడు తనను వెన్నంటి వచ్చుచున్నాడని గ్రహించి ప్రాణపరీప్సువై ద్రోణనందనుడు సత్తువకొలది పరువెత్తి నట్లు మూలమున,

"పరాద్రవత్ ప్రాణపరీప్సురుర్వ్యాం యావద్గమం రుద్ర
భయాద్యథార్కః" 1-7-18

అని యున్నది. ఇటు "రుద్రభయాద్యథార్కః" యనుదానికి "కః బ్రహ్మ మృగోభూత్వా సుతాయబ్ధు ముద్యతస్సన్ రుద్రస్య భయాద్యథా పలాయతేస్మ" అని శ్రీధరుడు వ్యాఖ్యానించెను. దీనిని బోతన్న యనుసరించినాడు.

వ్యాఖ్యను బట్టి బ్రహ్మ పలాయనమును జిత్రగించుటకు హేతువు తనయావ్యామోహము, శివాగమనమును. కాని యిట సందర్భమటువంటిదికాదు. అశ్వత్థామ భీతికి శిశు హత్య హేతువు. ఈ రెండు పట్లను సమానత్వమున్నది భీతియందు మాత్రమే. కాని హేతువులందు గాదు. పై కారణము పట్టించినను బొసగదు. ఈ దృష్టిచే శాస్త్రివారు తమ యనువాదమున,

వ॥ అశ్వత్థామయు దన్ను జంపవచ్చు నర్జునుని దూరంబునం
జూచి యేచిన బీతున...." 1-208.

యని యనౌచిత్యమును బరిహరించి యుచితరీతిని జెప్పినారు.

3. విదురుడు తీర్థయాత్రలనుండి పునరాగమించి ధృతరాష్ట్ర నకు నుపదేశమొనరించును. అప్పటున భీమసేనుని బ్రస్తావనము మూల భాగవతమున నిటులున్నది.

"భీమాప వర్జితం పిండ మాదత్తే గృహపాలవత్" 1-13-22

పోతన్న యిది యనౌచిత్యముగ నున్నదని యించుకమార్పు చేసి నుడికారపు సొంపుతో ననువదించినాడు,

శాస్త్రివారు భీముడు పంచపాండవులలో నొకరుడుకదాయని భీముని ప్రసక్తే చేయలేదు. పాండవులు ధర్మవర్తనలు, దైవసహాయ శక్తులు. భీముడించుక సత్త్వ సంపన్నుడయ్యును నిటుల వర్తించుట ననౌచిత్యమని భావించియుందురు. అది యంతటి కీర్తి ధనులకు కళంకము కదా! స్వభావరీత్యా భీముడు కించిదుద్రేకి కావచ్చును. కాని యిటుల వర్తించుట శాస్త్రివారికి నచ్చియుండదు. ఆ కారణమున బాండవులనకున్నను బ్రజ నకమానరనుచు వాని చేతలను విదురుడే ఖండించి పలికినట్లు శాస్త్రివారి యనువాదము గోచరించును.

తే॥ పాండవులు నిన్ను ననకున్న బ్రజలు నిన్ను
ననక మానరు ధృతరాష్ట్ర తనయ పక్ష
మగుచు జేసిన నీ చేత లతివిగర్హ్య
ములని నీ చిత్తమే నీకు దెలుపకున్నె. 1-312

పాండవులు ధర్మజ్ఞులు కనుక నిందింపరు. కాని లోకము నోరు మూయించుట యసాధ్యము కదా! అని యనుటలో ననౌచిత్యము బరిహరింపడి పాండవుల కీర్తి సుకీర్తితమైనది.

4. శృంగి పరీక్షిత్తును గోపముచే తక్షకవిషానల దహ్యుడవు కమ్మని శపించును. తండ్రియైన శమీకుడది విని పుత్రుని మందలించును. మూల భాగవతమున నీ సందర్భమున నిటులున్నది.

"నిశమ్య శప్తమతదర్హం నరేంద్రం సబ్రాహ్మణో నాత్మజమభ్యనన్దత్
అహోబతాంహో మహదజ్ఞతేకృతమల్పీయసిద్రోహ ఉరుర్దమోధృతః"

నవైనృభిర్నరదేవం పరాఖ్యం సమ్మాతుమర్హస్య విపక్వబుద్ధే
యత్తేజసా దుర్విషహేణ గుప్తావిన్దన్తి భద్రాణ్యకుతోభయాః ప్రజాః"

1-18-41

శాస్త్రివర్యులీయెడ సమీకర్షిచే మిక్కిలి యౌచిత్యవంతముగ బలికించి మూలమునకు మెఱుగులు దిద్దుట యిటుల దర్శనీయమగును.

క॥ సీ సీ దోసము చేసితి
భూసురుడవు మఱి తపస్వి ముఖ్యుడవిధినీ
భాసురమతి ధర్మంబని
చేసినయదియే ప్రకోపశీలుడ వకటా!

ఉ॥ కోపము సత్యముంజెఱచు గోపము తాపము గల్గజేసెడుం
గోపము వైరకారణము కోపము ధర్మమునుందొలంచెడుం
గోపముసర్వకార్యములకుం బ్రతిరోధకరంబు కోపమే
పాపము కోపియైన జనవంచితుడై నరుడందు గష్టముల్.

ఆ॥ దయయు క్షమయు లేని తపసి తపంబును
మత్తుడైన వాని విత్తచయము
ధర్మబాహ్యుడైన ధరణీశు రాజ్యంబు
నోటి కడవలోని నీటి బోలు" 1-384 నుండి 386

కోపము పాపమని వారి విపుల వ్యక్తీకరణము ప్రతివారికిని శిరోధార్యము. అటులనే తరువాత వేమన్నవలె కడు సరళ రామణీయకసూక్తి ప్రవచనమాటవెలదిలోనే వెలుగులను సంతరించుకొనుట ప్రశంసనీయము. ఇందు "ధర్మబాహ్యుడైన ధరణీశు రాజ్యంబు" ననునది ప్రస్తుత పరీక్షిత్ప్రవర్తనమునకును జెందును. ఇది శాస్త్రి వారి యమోఘౌచితీ దృష్టికి నికషోపలము.

అటులనే పరీక్షిత్తును మునికుమారక శాపము నాకర్ణించి చింతించుట మూలభాగవతమున నిటులున్నది.

"మహీపతిస్త్వథతత్కర్మగర్హ్యం విచిన్తయన్నాత్మకృతం సుదుర్మనాః
అహోమయానీచమనార్య వత్కృతం నిరాగసి బ్రహ్మణిగూఢతేజసి.
1-19-1.

శాస్త్రివారాతని విచారము నెటుల సొగసుగ జూపినారొ పరికింపుడు,

క॥ తన్నెఱుగ కెదిరి నెఱుగక
యున్నట్టుల యుండి తపము నొనరుచు మునులం
గన్నుంగానక వదరుచు
బన్నంబులు గూర్చు జనులు బడలంబడరే.

సీ॥ కడుపులోపలి చల్ల గదలకుండగ నింట
నిట్లుండ కడవికేలేగినాడ
నేగి యంతన పోవ కిట్టట్టు మెట్టుచు
మెకములగమి నేల మెసవినాడ
మెసవి యంతన పోక వెనబాఱు పందితో
గఱకరినై యేల పఱచినాడ
బఱచి యంతన పోక పాప పీనుగునెత్తి
తపసి కుత్తుక నేల తాపినాడ

తే॥ దాపితినిగాన దయలేక తాపసుండు
పాముచే జావుమని తిట్టె బాము వెట్టె
నకట చెడుపోకలం బోయి యాగడముగ
గ్రొవ్వి యుండిన వారికి గొడవలరుదె. 1-398, 399.

పై పద్యము సొగసుగ నలతి యలతి పదముల కాహాళ స ధించినట్లు సూక్తి సుధాకరమై తేజువారినది. తరువాతి సీసమున ప క్షిత్తు మానసిక స్థితికి నద్దము పట్టుటకు హేతువు ముక్తపదగ్ర రామణీయకమనుట పరమ సత్యము. ఇంత చెప్పికొనమెఱుపువ నున్న,

"అకట చెడుపోకలం బోయి యాగడముగ
గ్రొవ్వి యుండిన వారికి గొడవలరుదె"

అనుదానిలోని భావము సూటిగ హృదయ కహరములోనికి జొచ్చుకొనిపోవును. ఇట్టి సూక్త్యాదికమును చెప్పుటలో దిక్కన్నను మఱిపింతురనుట సమంజసము.

5. ద్వితీయస్కంధమున శౌనకుడు సూతునితో శుకుడు పరీక్షిన్మహారాజునకింకను నేమి యేమి చెప్పెనో యవ్వాని నన్నిటిని సవిస్తరముగ జెప్పుచుని పలుకును. ఆ సందర్భమున మూల భాగవతమున నిటుల నున్నది.

"ఆయుర్హరతివైపుంసాముద్యన్నస్తంచయన్నసౌ
తస్యర్తే యత్ క్షణోనీత ఉత్తమ శ్లోక వార్తయా' 2-3-27

శాస్త్రివారి యనువాద రామణీయకమిారీతిగ శోభించుచున్నది.

చ॥ ................................. నిరంతరంబు సం
సరణమువంజరించునరజంతువు నాయువు నాడు నాడహా
స్కరుడుదయించినప్పుడును సాయము వచ్చినయప్పుడుత్తరో
త్తరము హరించి కొంచు జను...."

తే॥ దినము దినమట్టు లాయువు తీఱెడునని
తానెఱుంగక మూర్ఖుడు దారపుత్ర
గృహధనాదులకై తహ తహ పడి తన
కాలమును దోసి పుచ్చు నక్కటకటకట.

క॥ బ్రదుకుటకు ఫలము తనదగు
నుదరము పోషించుకొనుట యొక్కటెయనుచున్
హృదయేశునెఱుగజాలక
యదవదలగు వాని జన్మమది యేమిటికిన్. 2-56 నుండి 58.

ఈ యనువాదము మూల విషయమును వివరించుచు తాత్త్విక పరముగ మిగులనౌచిత్యవంతమై యలరారుచున్నది తేటగీతిలో చివరనగల "అక్కటకటకట" యను ప్రయోగము లోకరీతినిజూపుచ

సత్యమునరయుమికి తీవ్ర స్పందనమును జూపుచున్నది. చివరి
దము స్పష్టముగ వ్యంగ్యరీతిని జేయదగిన కార్యము ప్రమాణీకరిం
చున్నది.

6. బ్రహ్మ తపమొనరించి వైకుంఠధామ దర్శనమున ధన
డగును. ఆ తావున వైకుంఠవాసులను గూర్చి మూల భాగవతము
నిటులున్నది.

"నయత్ర మాయా కిముతాపరే హరేః
అనువ్రతాయత్ర సురా సురార్చితః" 2-9-10

ఇందలి "హరేరనువ్రతా" యనుదానిని శాస్త్రివారు క
నుచితత్వముతో నిటుల వివరించిరి.

సీ॥ గంగాది తీర్థముల్ గని యెఱుంగని చెట్టు
డడుగున బుట్టించునమరగంగ
గూడుగుడ్డలులేక కుతిలగుడుచు నిన్వ
డాఢ్యుడు లక్ష్మికటాక్షమునకు
గుట్టుపోగులును లేకట్టిటుపడుపేద
కౌస్తుభాహారముంగడగ దాల్చు
నడుగెడు నడలేమి నలసెడు బడుగు మేల్
పులుగు తత్తడి నెక్కి మెలగుచుండు.

తే॥ గత్తి గనిజంకు పిటికి చక్రంబు పట్టు
వెన్నుడనుమాట యొకమాటు విన్నయేని
తిరుపతులయందు నెమ్మేను దొరగనేని
యట్టివారందునెందునున్నట్టి వారు." 2-110.

ఇందు విష్ణుభక్తులయౌన్నత్యము స్పష్టీకరింపబడినది. వారె
వ్వారైనను వెన్నుడనుమాట నొకమారు విన్నయేని" యనుచ
విష్ణునామాకర్ణఫలముచే సారూప్యమొందిరని తద్ధేతువును జూపి య

చిత్యము ననుసరించిరి. మరియు "కలౌ వేంకటనాయకః" అను దానిని బురస్కరించుకొని "తిరుపతులయందు నెమ్మేను దొరగనేని" యని స్వీయభావము నుటంకించి సొగసు దెచ్చిరి. ఇట్టివారుట వైకుంఠ పురవరులు. ఇట్లు నుడువుట మిక్కిలి యుచితమే.

7. స్వాయంభువ మనువు జామాతనన్వేషించుచు కర్దమతపోవనమునకరుదెంచును. అత్తఱినత్తపోవనవర్ణనము మూలమునకొంత భాగము ఇటులున్నది.

"సర్వర్తు ఫలపుష్పాఢ్యం వనరాజిశ్రియాన్వితమ్,
మత్తద్విజగణైర్ఘుష్టం మత్తభ్రమర విభ్రమమ్
మత్తబర్హినటాటోప మాహ్వయన్మత్తకోకిలమ్." 3-21-40,41
శాస్త్రివారి యనువాద సౌందర్యమిది చూడుడు,

మ॥ ఋతుధర్మంబులు లేక సర్వతరువుల్ తేలుంబవళ్ళున్ లతాం
తతతుల్ పండ్లును బత్రముల్ మునులకున్ దాత్పర్యముంజేసి క
ల్ప తరూత్తంసములట్లొసంగుచును జిల్కల్ గోరువంకల్ కడుం
శ్రుతి పేయంబుగబల్క స్తోత్రము లొనర్చుం బోయనంబొల్చెడున్.

సీ॥ మావిపూదేనెల మత్తిల్లి యలిగాయ
కాళిసుస్వరముల నోలిబాడె
శుకశారికాది సచ్ఛకున సంతానవై
తాళికాళిఘన శబ్దముల బలికె
చివురాకులను మేసి చిరురవంబున వన
ప్రియకోటి కాహళ బ్రీతి బట్టె
ఱెక్కలల్లార్చుచు నొక్కట గొలకుల
హంస కాంతాళి నాట్యంబులాడె

తే॥ అట్టి యాశ్రమ సంతసమావహిల్ల

మన్మథోత్సాహ జనకుండు మాధవుండు
సొగసులకునెల్ల దానకమగుచునెపుడు
వెలయుచున్నట్టి వనలక్ష్మి బెండ్లియాడె. 3-199;200.

మూలమునందలి "సర్వర్తు ఫలపుష్పాఢ్యంవనరాజి శ్రియాన్వితమ్" అనునది పై మొదటి పద్యమైనది. అందునున్న పక్షితతులు శ్రుతిపేయముగ నారావించుట స్తోత్రము లొనర్చుచున్నట్లున్న దనుట శాస్త్రీవారి మాట. అది యాశ్రమ ప్రాంతము కదా! ఎల్లప్పుడును స్తోత్రపాఠములే వినబడును. అది పరమ రమణీయ వాచారూఢమునునై స్వరయుక్తముగనుండును. ఆ భావము స్ఫురింపించిరి. ఇది కడు నౌచిత్యవంతము.

అంతకుమించి తరువాత సీసమున వసంత శోభా వర్ణనము. వసంతము ఋతురాజము కదా! పైగా వివాహ సన్నాహముతో మాధవుడు వనలక్ష్మిని బెండ్లియాడినట్టులు వర్ణితము. ఇది భావి సూచకము. కర్దముడు దేవహూతిని వివాహమగును. అంతియకాక కర్దముడు విష్ణువుచే ననుగ్రహింపబడినవాడు. కావున తాదృశ మాధవుడైనాడు. వనలక్ష్మి సుభగసుందరతకు బ్రతీక. దేవహూతి యట్టి య[illegible] లోక సౌందర్యవతి. ఆమె సౌందర్యమునుగూర్చి యొక గంధర్వు[illegible] స్థితికూడ స్పష్టముగ జెప్పబడినది. కావున వనలక్ష్మి మాధవు[illegible] కళ్యాణ కళ్యాణమువలె దేవహూతీ కర్దముల పరిణయమగున[illegible] మిక్కిలి సొగసుగ సూచించి శాస్త్రివర్యులు నిండుగ నౌచిత్యమ[illegible] ననుసరించిరి. ఇదియు మూలమును మించి యున్నది కదా! మూ[illegible] మునే యేమిటి పోతన్ననుగూడ మించి యున్నది.

7. చతుర్థస్కంధమున దక్షాధ్వరధ్వంస వృత్తాంతము కలద సతీదేవి పతి యభీష్టమునకు వ్యతిరేకయై పిత్రధ్వర దర్శనాభిలాషర్[illegible]

చను. అప్పట్టున పితరుడు దక్క మాతయు సోదరులు సంతసింతురు. అప్పుడు మూల సందర్భమిది,

"తమాగతాం తత్రన కశ్చనాద్రియాత్
విమానితాం యజ్ఞకృతోభయాజ్జనః"
"దత్తాంసపర్యాం వరమానసంచ సా
నాధత్త పిత్రాప్రతినందితా సతీ" 4-4-6 నుండి 8.

ఇట్లవమానమొంది శివరహితముగ జేయు నీ యధ్వరము శివమగునేయని జనకునితో తీవ్రముగా భాషించును. ఈ సందర్భమున దక్షుడు ప్రతివచనమిచ్చుచునిందుధరుని నిందించినట్లు మూలమున లేదు. శాస్త్రివర్యులీపట్టున దక్షునిచే నక్షర దూషణమొనరింపజేసి వాని మదమునువిదిత మొనర్చిరి.

ఉ॥ అండజయాన, వాడొకమహాత్ముడు నాపచియింపవచ్చితే
నిండిన యీ సభన్ సురముని ప్రవరుల్ వినుచుండనేరు పా
షండు నెఱుంగరీ పొగడు చాలిక చాలును వల్లకాటిలో
బండెడు బండనీ మగడు వానిని గన్గొనరోత పుట్టెడున్. 4-52

ఈరీతి శివాపరాధమొనరించిన దక్షుని మదాంధత స్పష్టమగును. ఈ సందర్భమున వ్యంగ్య వైభవముతో నిందాస్తుతియు శాస్త్రిగారు వానిచే నిటుల జేయించిరి.

ఆ॥ ఏడ్పుగొట్టు విధవ యిలులేని సన్న్యాసి
వాని కన్నుగాల వానియిల్లు
వల్లకాడుగాను వాని రూపమురుత్త
బూడిదగను బాడు మొంది కొయ్య. 4-56.

ఇవన్నియును సర్వమంగళాను పర్వుడయిన శర్వుని సర్వవి, ము లే,

ఏడ్పుగొట్టనగా రుద్రుడు, విధవ యనగా ధవుడు లేనివాడు, సన్న్యాసివలె నుండువాడు, వాని కన్నుగాల యనగా జ్వలించు నిటలాక్షముకలవాడు, వాని యిల్లు వల్లకాడునకు శ్మశానవాసి, వాని రూపు రుత్త బూడిదయన భస్మధారి, మొండి కొయ్యయన స్థాణువు. ఇట్టి రచనా సౌందర్యము శాస్త్రివారి సొమ్ము. ఈ శివనిందవిని యిందు ధరు వామ భాగ కుందునగందుచు నభిమానముతో నిరభిమానులై యేతెంచిన వాసవాది సదస్యుల నిట్లు గర్హించినది.

సీ॥ ఈశ్వరద్రోహియౌ నీతని కూటికై
వాచివచ్చితివోయి వాసవుండ
యిట్లుకార్యము దక్షుడెఱిగి చేయుచునుండ
నీవిట్లుపేక్షించు టేల చక్రి
నినునెత్తిపైబెట్టుకొను శివున్ దూషింప
నిందుండ నీకొప్పునే మృగాంక
కర్మసాక్షి వినీవ కర్మముంగనుచిట్లు
హర్షించుచుంటివే యర్యముండ

తే॥ సర్వభక్షక దుష్ట ప్రసాదమీవు
సాపడగ వచ్చితే బృహస్పతి భవచ్చ
రిత్ర చిత్రము నీ పెద్దఱికము చాలు
నెఱుగరిందఱు ముందగు నెగ్గులకటు. 4-58.

ఇందు ప్రథమ పాదమున నింద్రుని నిందించుట కలదు. "సర్వభక్షక" దుష్టప్రసాదమీవు సాపడగవచ్చితే' యనిహవ్య వాటుని, తద్వారా ముప్పది మూడు కోట్ల దేవతలను దుయ్యబట్టుట కడు సొగసుగ నున్నది. దీనితో ఇంద్రుని, ఇంద్ర పాలితులను "దూర్వారబట్టుట మిగుల రామణీయకమై శాస్త్రులవారి రచన సందర్భాచితితోనలరారుచు నున్నది.

మఱియును సతియోగవీతిహోత్రునిచే దగ్ధమయిన పట్టున నచటి భీతావహపరిస్థితి యెంత సహజముగ వర్ణింపబడినదో తిలకింపుడు,

సీ॥ గడగడలాడెడు నెడదలతో మునుల్
వేల్పులు చేతులు పిసికికొనిరి
చేతి సుక్స్రువములు భీతిమై బడవైచి
ఋత్విగ్గణము పాఱెనిట్టునట్టు
సూర్యచంద్రాదులు సూచుచుంగదలక
మెదలక తలకున నదవదవడి
రిందీవరాక్షుడిద్వేయుపద్రవమగు
దెంచునో యని భయమెంచుచుండె

తే॥ అదటుగుండెలతో నిండ్రు డడలుగుడిచె
దిగులులోదోచె దక్షుని మొగమునందు
బెక్కులుత్పాతములు యజ్ఞవేది బోడమె
యోగవహ్ని సతింగాల్చి యున్నయపుడు. 4-60

మూలమున నీ పట్టున సతీ దగ్ధమును జూచి భువిజ, దివిజులు హాహారవమున దత్కార్యమును దలచినటులిటులున్నది.

"తత్పశ్యతాం ఖేభువిచాద్భుతం మహత్
దాహేతివాదః సుమహానజాయత
హన్తప్రియా దైవతమస్య దేవీ
జహావసూన్ కేన సతీ ప్రకోపితా" 4-4-28.

మూలమున నీ రీతి మాత్రము చెప్పబడగా శాస్త్రివర్యులౌచితీ భాసురముగ సందర్భమును కండ్లకు గట్టించిరి.

8. పురంజనోపాఖ్యానమున బురంజనుడు పురాద్వేషియై వర హిమాలయ ప్రాంతమున నున్న నవద్వారపురీవరము నరసి,

తత్ప్రాంతమున విహరించు తరుణిని బరికించి, తద్విషయ సేకరణము నకై ప్రశ్నించినటుల మూలమున నిటులున్నది.

"కాత్వం కంజపలాశాక్షి కస్యాసీహ కుతః సతి
ఇమాముపపురీం భీరు కించికీర్షసి శంసమే. 4-25-26.

ఇద్దానికి శ్రీ శాస్త్రివర్యులు సందర్భమునకు దగినట్లు శృంగార రసభాసురముగ మోహితుడైన పురంజనునితో గడు సొగసుగ బ్రశ్నింపజేసిరి. అరయుడు,

మ॥ వెలదీ! యెవ్వరి దానవెవ్వతెవు నీ పేరేమి యెందుండి యి
ప్పొలతుల్ గొల్వగ వచ్చితీవలరు నిప్పూదోటకున్నేటివై
వలఁజేనిం గికురించి వచ్చు రతివో వాడంపనిందున్న వా
రలనేచంజనుదెంచు పూములికివో రారమ్ము వాకిమ్మొగిన్.
4 - 324.

రతివా లేక రతిపతి పంపిన పూములికివా యనుటయే కాక రారమ్ము వాకిమ్మొగిన్" అని పలుకుటలోని త్వర వాని మోహ తీవ్రతను సూచించుచున్నదై సందర్భోచితముగ నున్నది. ఇంతకు ముందే మూలమున నాతని మోహమును

"స్నిగ్ధే నాపాంగ పుంఖేన స్పృష్టః ప్రేమోద్భ్రమద్భ్రువా"
4-25-25.

అను శ్లోకపాదమున గానవచ్చును. దీనిని సొగసుగ పై విధముగ శాస్త్రులవారు చూపినారు. ఇది యౌచిత్యవంతమే మరి.

**9.** భరతుడు సర్వమును బరిత్యజించి చక్రనదీ తీరముననున్న పులహమున్యాశ్రమంబగు సాలగ్రామ క్షేత్రమునకు జనును. ఆ తావున తదాశ్రమ ప్రాంతమును గూర్చి మూల భాగవతమున నిటులున్నది.

"…. పులహాశ్రమోపవనే వివిధ కుసుమ కిసలయ తులసికామ్బుభిః కందమూల ఫలోపహారైశ్చ సమీహమానో …. 5-7-11.

ఇందు కందమూలాది ఫలాదులతోడను, వివిధ కుసుమ తులసి కాంబువుల తోడను నాశ్రమ మున్నదని మాత్రమున్నది.

శ్రీ శాస్త్రివారు ప్రధానమైన యాశ్రమ ప్రాంత శాంతతత్త్వమును మిక్కిలి సొగసుగ వివిధ విరోధి జంతువుల యాత్మీయతతో నిటులనుచితముగ జెప్పినారు.

చ॥ కులుకున నేన్గు లేనుగులగొంగలు గోరిక నాలునాలదిం
డ్లెలుకలు నెల్క గొంటులొకయింతయులోనెడలేక యందునన్
గలజడదారిరాయలకు గల్గిన తేజున నొక్కగొంతుగా
నలరెడు నల్లకానగొనియాడగ నౌనవరాదు బ్రహ్మకున్.
5-103

అచటి జడదారిరాయల తపోబలమే యట్టి దానికి గట్టి హేతువట. మృగముల యైక్యభావము మరింత సొగసుగ దెలుగు నుడికారపు 'సొంపుతో "ఒక్కగొంతుగా" నని చెప్పబడినది. అంతేనా? ఆ యాశ్రమోన్నతిని వర్ణించుట బ్రహ్మతరముగూడకాదుట. ఎంత చక్కని యౌచిత్యదృష్టి శాస్త్రులవారిది. మూలముననున్న కందమూలాదిక విషయము విడువబడినది. ఇంతటి మాహాత్మ్యమున్న మున్యాశ్రమమున నవి యుండెనని చెప్పనేల? ఆశ్రమ ప్రాంతమున నయ్యవి తప్పక యుండునని శాస్త్రివార భావము కాబోలు.

మృగశాబకము వెడలిపోగా దద్విరహోద్విగ్న మానసుడై దిగులుతో భరతుడు దాని గూర్చి విలపించుచు పలవించిన పట్టున మూల భాగవతమిట్లు చెప్పుచున్నది.

"అన్యదా భృశముద్విగ్నమనా నష్టద్రవిణః ఇవ కృపణః సకరుణమతి తర్షేణ హరిణకుణక విరహ విహ్వల హృదయ సంతా

పస్తమే వాను శోచన్ కిలకశ్మలం మహదభిరంభిత ఇతిహోవాచ"

"అపిబత సవైక్ర్రుపణ ఏణ బాలకో మృతహారిణీ సుతో౽సా సమానార్య స్య.... 5-8-15,16.

ఇత్యాదిగ నాతని హృదయగతస్థితి చెప్పబడినది.

శాస్త్రివర్యులుమూలభావము చెక్కు చెదరకుండగ తెలుగ పలుకు బడులను గూర్చి యనితర సాధ్యముగనీ సందర్భమును కడ నేర్పుతో ననువదించుటలోని సొగసు గమనింపుడు"

మ॥ 'అకటానా చిటిపాపనిన్వదచి నీవడ్డింతలేకేగితే
మొకమాటుంబును బాసితే యడవినే మోసంబునేన్జెందితె
యొకలోయంబడి దారితప్పితె మెకంబున్నట్టి చోటంటితె
సెకలోజొచ్చితె పచ్చికల్మెసవుచున్ జెర్లాడుచున్నిల్చితే
5-11

ఈరచనా పాటవము సందర్భమును బఠితులకు కనుల కట్టించ నట్టిదై మిగుల నార్ద్రతను గర్భీకరించుకొని యున్నదనుటలో సందియముండదు. ఇందు చక్కని "చిటిపాప" "సెకలో జొచ్చు "చెర్లాడు" చిన్ని కొమ్ముకన నొయ్యనగోకు, బువ్వ బుక్కెడు, ముద్ద గుడుపు మొదలగు పద ప్రయోగముల సొగసు స్వానుభవ పూర్వ ముగ జవిజూడవలసినదే. అంతియకాక సీసమునకల యంత ప్రాసము మఱింత సొగసు కూర్చినది. ఈ నైపుణి మహాకవు కత్యంత సామాన్యమనుట విశేషోక్తికాదు.

10. అజామిళుని గూర్చి ప్రారంభమున మూలమున వా దురాచారా ధర్మవర్తనాదిక మిట్టుల వర్ణింపబడినది.

"కాన్యకుబ్జేద్విజః కశ్చిత్ దాసీపతిరజామిళః

బంధ్యక్ష కైతవైశ్చౌర్యైర్గ్రిర్హితా వృత్తి మాస్థితః
బిభ్రత్కుటుంబమశుచిర్యాతయామాసదేహినః 6-1-22.23

ఈమాత్రమున్న విషయమును శాస్త్రివారు పరమ రమణీయ భాసురముగ నాలు పద్యములలో వాని దుర్వర్తనను చితరీతినను వదించినారు. మచ్చునకు నొండు రెండు పరికింపుడు,

తే। కాన్యకుబ్జమునాగ విఖ్యాతమైన
దేశమున నజామిళుడను ద్విజుడొకండు
కలడు వాడొక్కదాసిని గట్టుకొన్న
కాంతగా జేసికొని లోక కంటకుడయి.

ఉ। ప్రాసగువంశధర్మములు పాడయిపోవగ దల్లి దండ్రులన్
రోసి బహిష్కృతుండగుచు రోత జనింపగ నెల్లవారికిన్
దోసములాచరించుచును దొప్పలు దోరలు మద్యమాంసముల్
వేసరకెల్లవేళలను వేడుక మీఱగ స్వీకరింపుచున్. 6-22,23

అజామిళుని లోకకంటకత్వము సహజ సుందరముగ నిందు సంతరింపబడినది. ప్రాసగువంశధర్మములు, కత్తెఅదొంగ, ద్విపాత్సశువు మొదలగు జాతీయముల సొంపు కడు నింపుకలిగించుచున్నవి. వాని దుర్జనత్వమునిటుల వివరించుట సందర్భౌచిత్యమనుటలో సందియమందబనియుండదు.

11. ఇంద్రుడు విశ్వరూపుని సంహరింప బుత్రశోక క్రోధో జ్జ్వలిత మానసుడై త్వష్ట యింద్రుని సంహరింప వృత్రాసురుని జనింపజేయును. ఆ వృత్రుని యుగ్రమూర్తి మూల భాగవతమున నిటుల వర్ణింపబడినది.

"అథాన్వాహార్య వచనాదుత్థితో ఘోరదర్శనః
కృతాన్త ఇవ లోకానాం యుగాన్త సమయే యథా

విష్వగ్నివర్ధమానం తమిష్టమాత్రిం దినేదినే
దగ్ధశైల ప్రతీకారం సంధ్యాభ్రానీకవర్చసమ్
తప్తతామ్ర శిఖాశ్మశ్రుం మధ్యాహ్నార్కోగ్రలోచనమ్.
6.9-12 నుండి 14

శాస్త్రివారి యనువాదము గాంచుడు.

సీ॥ ప్రళయకాలానిల ప్రజ్వలదగ్నినా
వెలుగు చుండెడు మేనితళుకువాడు
దావాగ్ని దగ్ధభూధ్రము పోల్కి సకలభీ
మాకారమున జూడనైనవాడు 6-179

మూలమును శాస్త్రివారి యనువాదము నీ సందర్భమున నొక దానితో నొకటి పోటీపడుచున్నవాయనిపించును. తెలుగులోని యంత్యప్రాసమనువాదమున కొక విధమైన సొగసు గూర్చి మూలమును మించినట్లనిపింపజేయును.

మూలమున,

"దేదీప్యమానే త్రిశిఖీ శూల ఆరోప్యరోదసీ" 6-1-25

యనియున్న విషయమనువాదమున నెత్తుగీతిగ నవతరించి శాస్త్రివారి యౌచితీ దృష్టికి నికషోపలమై వెలుగొందినది.

12. ఉశీనరేంద్రుడు యుద్ధమున మరణింపగ నాతనిభార్యలు భర్తృవియోగదుఃఖితలై విలపించిన పట్టున మూలమున నిటులున్నది.

"ఉశీనరేంద్రం విధినా తథాకృతం
పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః
హతాః స్మనాథేతి కరైరురోభృశం
ఘ్నంత్యో ముహుస్తత్పదయో రుపాపతన్."

"రుదంత్య ఉచ్చైర్దయితాంఘ్రి పంకజం
సించంత్య అస్రైః కుచకుంకుమారుణైః
విస్రస్త కేశాభరణాః శుచం నృణాం
సృజన్త్య ఆక్రన్దనయా విలేపిరే" 7-2-31,32.

ఇదియప్పటి హృదయ విదారక స్థితిని జూపుచున్నది.
శాస్త్రివారి యనువాదమున నా సందర్భమిారీతి జూపబడనది.

చ॥ ఉరములు మోదికొంచు గడునున్నత కేశకలాపముల్విడన్
విరులవి రాలి నేలబడ వెల్లువలట్లయి పాఱనశ్రువుల్
ధరణియు నాకసంబులు విదారితమయ్యెడునో యనన్రవం
బరుదయి పర్వ నేడ్చిరి గతాయువు భూపతిమిాద వ్రాలుచున్.
7-55.

మూలములోని భర్తృపాద పంకజ పతనము, స్తన కుంకు మారుణికతయును శాస్త్రివారనువాదమున విడచినారు. గతాయువైన భర్తృ శరీరమును జూచిన స్త్రీలు వివేక మూఢులై యయోమయలై పతిశరీరముపై వ్రాలి విలపింతురు కాని వివేక సహితలై పూజ్య భావమున పతి పాదముల నర్చించిన రీతినీ పట్టున నొనరింపరు.

అట్లొనర్చుట యౌచిత్యవంతము కాదు. మఱియును భర్త రణరంగమున బోరుచుండగా స్తనకలశ కుంకమ చందన చర్చాది కమున సింగారించుకొనుటయు సమంజసమనిపించుకొనదు.కనుక శాస్త్రివారీ యసందర్భతను బరిహరించి యౌచిత్యమునుబోషించినారు. అంతియకాక కడు సహజముగ "ఉరములుమోదికొనిరని" మూలమును జెప్పి, విరులు రాలినేలబడినట్లు, నశ్రువులు వెల్లువలయి పాఱినట్లు, మన్ను మిన్నులు విదళనమయినట్లుగ దుఃఖారావమున నేడిచిరని లలితముగ జూపినారు. ఈరీతిగ నౌచిత్యము శ్రీకృష్ణభాగవతమున బోషింపబడినది.

13. హిరణ్యకశిపుని దురంతములకు దురపిల్లిన సురలు దామోదరుని జేరి తమ పరితాపము పోవ బరికీర్తించిన సందర్భమున మూల భాగవతము నుడివిన తీరిటులున్నది.

"తస్యోగ్రదండ సంవిగ్నాః సర్వేలోకాః సపాలకాః
అన్యత్రాలబ్ధ శరణాః శరణం యయురచ్యుతమ్
తస్యై నమోస్తు కాష్ఠాయై యత్రాత్మా హరిరీశ్వరః
యద్గత్వా ననివర్తన్తే శాన్తాః సంన్యాసినోஉమలాః
ఇతితే సంయతాత్మానః సమాహితధియోஉమలాః
ఉపతస్థుర్హృషీకేశం వినిద్రా వాయుభోజనాః 7-4-21నుండి23.

ఈరీతి దేవతలు జేరి విష్ణుని స్తుతించిన పట్టున విషయము సంగ్రహముగ నున్నది. శాస్త్రివర్యులు తమ శ్రీకృష్ణభాగవతానువాదమున నిరువది గద్య పద్యములందు మిక్కిలి విపులీకరించి దిద్ది తీర్చిరి.

సురలు క్షీరసాగరమును జేరి దానిసోయగమును దిలకించిన భంగియిది.

మ॥ కనిరావేల్పులనల్ప కౌతుకమునం గళ్యాణరత్న ప్రభా
జనితాహ్లాదము సంభృతామృత రసస్వాదంబు చంద్రాదిపా
వన దాయాదమతి ప్రసాద మపనిర్వాదమ్ము నుశీ్రదమున్
వినిరూఢోన్నతనాదముద్ధృతమహావేదమ్ము క్షీరోదమున్.

7-106

ఈ పద్య రచనా శిల్పము పోతన్నను మరిపించును. పిదప శ్వేత ద్వీప వర్ణనము,

ఉ॥ తరగలరాపిడిం బొడమి తద్దయు ముద్దగ దేరి వేరె పెం
పరమయి పాలవెల్లి నడుమందపు వెన్నయె వెల్లదీవియై

తిరపడెవెన్క వేల్పులు దధిన్మథియింపగనా సుధారసం
బరుదుగనాడు దాని పయి నారి పరంగె మెఱుంగు పూతయై.
7 - 110.

యని సొగసుగ వెన్నవలె పాలకడలిని మెఱుగు మీఱినట్లు చేయబడినది. పిదప వైకుంఠపురరాజమిటుల చెన్ను మీఱినదట.

మ॥ అరుదారన్మణి భర్మ నిర్మిత మహా హర్మ్య ప్రభాపుంజమున్
వరణస్థాపిత నూత్నరత్న సురుచిప్రాతంబునుంగూడి భా
స్కర కోటి ద్యుతులన్ హసించుచును వేడ్కంబొల్చి వైకుంఠమ
న్పుర రాజంబు విరాజమానమగు సంపూర్ణ ప్రభావంబునన్.
7-112.

ఈ పట్టు శాస్త్రివర్యుల వర్ణనా వైదుష్యమునకు నౌచితీ యను సరణమునకును ప్రబల నిదర్శనము.

పిదప నమరులు దామోదరుని బ్రవిమల భక్తితో ముకుళిత హస్తులై స్తుతించిన ఫణితి శాస్త్రివారి రచనకు మకుటాయమానము.

సీ॥ హంసాయ వాఙ్మనసాతీత రూపాయ
నిర్గుణాయగుణాత్మనే నమోస్తు 7-119.

ఇట్లు వేదాత్మకుని వేదమురీతిగ నాది భాషాత్మకముగ నుతింపజేయుట మిక్కిలి యౌచిత్యశోభితమై యలరారుచున్నది.

ఈ రీతిగ మూలమున నతి క్లుప్తముగ నున్న యీ విషయము వర్ణనాత్మకమై శాస్త్రివర్యుల చేతి యందు విపులౌచిత్యమునందినది.

14. ప్రహ్లాదచరిత్రయందు విష్ణువు దేవతలకభయ మిచ్చి హిరణ్యకశిపుని సుతుడుగ బ్రహ్లాదుడవతరించుననియు, తద్వారా లోకశాంతి జరుగుననియు జెప్పును. వెంటనే మూలమున,

“తస్య దైత్యపతేః పుత్రాశ్చత్వారః పరమాద్భుతాః

ప్రహ్లాదోఽభూన్మహాంస్తేషాంగుణైర్మహదుపాసకః” 7-4-30 యని చెప్పబడినది.

శాస్త్రివర్యులీతావున నౌచిత్యముతో హిరణ్యకశిపుని పత్ని యంతర్వత్ని యగుటను మిక్కిలి చక్కగ మూడు నాల్గు పద్యము లలో వర్ణించినారు.

ఉ॥ ఆ విబుధారిదేవివిబుధాంగనలున్నటి పన్నగాంగనల్
భూవలయాంగనల్ తనకు ముచ్చట లెచ్చగ నూడిగంబున
భావన మీఱ జేపులును మాపులునుం బొనరింప బెంపునన్
దా విలసిల్లి యెల్లరు ముదంపడ గుర్విణి యయ్యెనయ్యెడన్
7-130

ఈ వర్ణనమునందనౌచిత్యమేమియు గానరాక సందర్భౌ త్యమేన్నిండి యుండి మూలమును మించినది.

పిదప ప్రహ్లాదుడంతటి భక్తాగ్రేసరుడగుటకు కారణమున శాస్త్రివారు మూలమున లేకున్నను గల్పించి యిట్లుబ్రమాణీకరించి

ఆ॥ అట్లునీరుమోసి యై దాఱునెలలైన
వెనుక జక్రధరుడు వెలది మిన్న
కలను బోల దోచి గర్భస్థుడగు నర్భ
కునకు బోధపఱచి చనియె నిచ్చ. 7-133.

అట్లు కానియెడల ధానవ పుత్రుడంత వినీతుడుగుట యెట్టు దీనికుపబలకముగ శాస్త్రివారు ముందు చూపుతో సురల కభం మిచ్చి పంపిన పిదప గరుడలాంఛనుని యిట్లాలోచింపజేయు జేసినారు.

వ॥ “అనివారినెల్ల నంపివుచ్చి యచ్యుతుండు దైత్యవధోపాయ బంతరంగంబున జింతించి యంతరంబరయుచుండె” 7-127

ఈ రీతి జెప్పుట మిక్కిలి యౌచిత్యవంతము.

అటులనే ప్రహ్లాదుని వర్ణించునెడల మూలమున,

ప్రహ్లాదోఽభూన్మహాంస్తేషాం గుణైర్మహదుపాసకః 7-4-30

అని యున్నది. ఇందలి "మహదుపాసకః" అనుదానిని గ్రహించి తను యనువాదమున నిటుల వివరించినారు.

సీ॥ కదలడు మెదలడు కమలేశ్వరునిలోన

సేవించు చున్నట్టి జీవిగాన 7-136.

మూలముననున్న దైత్యపతేః పుత్రాశ్చత్వారః అను విషయము శాస్త్రి వారి యనువాదమున విడువబడినది. ప్రహ్లాదుని విషయమే ప్రస్తుతము ప్రధానమని యెంచి కాబోలు శాస్త్రివారు దాని జోలికి బోలేదు.

అతని యుపాసనత్వము పై రీతి సీసమున రూపు కట్టింపబడుట ప్రహ్లాదుని పాత్రకు కూడ నౌచిత్యమే యయినది.

హిరణ్యకశిపుడు తనయునివిద్యాభ్యాసమునకైగురుకులమునకు బంపనతని యధ్యయనము గూర్చి మూలభాగవతమున నిటులున్నది.

"యత్తత్రగురుణాప్రోక్తం శుశ్రువే నుపపాఠచ

నసాధు మనసామేనే స్వపరాసద్గ్రహాశ్రయమ్ 7-5-3."

ఏవిధముగ గురువులు పఠింపించిరో ప్రహ్లాదుడు ఆ విధముగ పఠించుచువానిని మిథ్యలని తెలిసినవాడైపట్టించుకొనడని దీనిభావము.

శాస్త్రివారు దీనిని ఈ విధముగ ననువదించినారు.

సీ॥ చదివింపబోయిన జదువనొల్లండొజ్జ

చదివిన చదువెల్ల జట్టుపడగ 7-144.

మూలమున "శుశ్రువేనుపపాఠచ" అని యుండగ నీశాస్త్రివారి యనువాదము పూర్తి విరుద్ధముగ దోచును. కాని యిట్లనువదించుట శాస్త్రివారికి తెలియకా! ఇటనొక విషయము గూఢముగ నున్నది.

ప్రహ్లాదుడు పుట్టుకతోడనే బ్రహ్మజ్ఞాని. అట్టివానికి లౌకికవిద్యలతో బనేమి? నిజమైన తాత్త్వికుడు పరబ్రహ్మమును దక్క యన్యమును దలపడు. అందులకు బరీక్షిత్తునకు భాగవతోపదేశమొనరించిన శుకమహర్షియే ప్రమాణము. ఈ యాధారముగ శాస్త్రివర్యులు ప్రహ్లాదుని మూలమునకంటె మరింత యున్నత స్థితిలో గూర్చుండ బెట్టి పాత్రకు వన్నెదెచ్చిరి. కావున నౌచిత్య భాసురమై యిది శోభిల్లుచున్నది.

మఱియు విద్యాభ్యాసమును గూర్చి ప్రశ్నించు జనకునితో దనయుడైన ప్రహ్లాదుడు సమాధానించుట మూల భాగవతమున నిటులనొక శ్లోకమునందు మాత్రమున్నది.

'తత్ సాధు మన్యే సురవశ్య దేహినాం
సదా సముద్విగ్న ధియామసద్గ్రహాత్
హిత్వాత్మపాతం గృహమంధకూపం
వనంగతో యద్ధరి మాశ్రయేత' 7-5-4.

దీనిని శాస్త్రివారు విపులీకరించుచు నాలుగుపద్యములలో ననువదించిరి. "యద్ధరిమాశ్రయేత" యనుదానికి జక్కగ,

శా॥ సర్వజ్ఞుండగు నీశ్వరుందెలిసి విజ్ఞానంబునం దోగుతే
నేర్వన్ విద్యలకున్ ఫలంబగును గానీకీర్తినొందంగ గా
దుర్విన్ గర్వి నశించు గావునను నేనో విద్యలన్నేర్చితిన్
సర్వంవిష్ణుమయంజగత్తనుచు నశాంతంబుజింతించుటన్"

7-146.

అని ప్రహ్లాదునిచేననిపించిరి. ఇట్లనువదించుటలో శాస్త్రివారు పోతన్నచే బ్రభావితులైరని భావింపవచ్చును.

ఈ సందర్భమున హిరణ్యకశిపుడు గురువులతో బలికిన పలుకులు తండ్రి హృదయమునకు నద్దము పట్టును. మఱియు

గురువులయెడ నెటుల బూజ్య భావముండవలెనో తెలియజేయును.

దీనికి మూలమున నాకరము లేదు. కాని రెండవసారి ప్రహ్లాదుని ప్రశ్నించి తీవ్రముగ వాని నిందించినట్లున్నది ప్రస్తుతమీ యౌచిత్యయుక్తమైన హిరణ్యకశిపుని పలుకులనరయుడు,

చ॥ గురువులు మీరు మాకు గడు గూర్చిన వారలు మిమ్ము మే మెదన్
నిరతము గొల్చుచుందుము వినీతులమై యిటు మాకుమారుని
కరణి గృతారాధుడగు కష్టుని దుష్టుని బెద్ద సేయమా
గరువమెఱుంగజాలడిటు గారణ మేమితలంపనయ్యెడిన్.
7-126

హిరణ్యకశిపుడు రాక్షసుడయ్యును పరమజ్ఞాని. సోదర మరణమునకు దురపిల్లు దల్లి నూరార్చుచు నతడు జేసిన తత్త్వోపదేశమే యందులకు నిదర్శనము. అట్టి వానికి గురుస్థానము తెలియకపోవునా? కావున నీరీతి నాతడు వారినడుగుటలో నెంతో యౌచిత్యమున్నది. మఱెచ్చటను హిరణ్యకశిపుడు గురువులను నిందించినట్లు శాస్త్రివారనువదింపలేదు. దీనినిబట్టి శాస్త్రివారికి గురువులయందుకల గురుభావము ద్యోతకమగును.

ప్రహ్లాదుని దిద్ది తెత్తుమని తోడుకొని పోయి గురువులు వివిధోపాయంబుల బుజ్జగించి, బోధించి, తల్లిచేతందిద్దంపనెంచి లీలావతి గడుకుం గొంపోవ నామె సుతుని గౌగిటంగదియించిచుంచుపుడుకుచు నుపలాలించుచు బలికినట్లు శాస్త్రివారు శ్రీకృష్ణభాగవతమున రెండు పద్యములలో జెప్పినారు. ఇట్లు చూపుట కడుయొప్పిదమై యున్నది.

చ॥ కడుపున గన్న బిడ్డడవుగాని యొకండవుగావు తండ్రి

నడుపుముదానవాంతకు మనంబున వీడుము వీడకున్న నీ
పడియెడు పాటు జూచియొకపాటి గ నేనెటుతాళియుండెదన్.

తే॥ ఉఁడుమీ యన్న యింద్రాది యోధవరుల
నున్నయట్లుండి కోపించు నన్ను నిన్నొ
కండుగజేయును దల్లికిగడుపుశోక
మిడక వేవేగ హరిభక్తి విడువుమన్న. 7-168,169.

ఇందు లీలావతి అటు భార్యగను నిటు తల్లిగను వర్తించవలసి నరీతి వర్తించినది. గర్భశోకము కలిగింపకుమని కొడుకును బుజ్జగించినది. పిల్లలు తల్లిమాట తప్పక విందురని గురువులెంచి యిటులొనరింపించుట సందర్భమునకు దగినటులున్నది. ఇది శాస్త్రివారి యనువాద పాటవమునకు నిదర్శనము. ఇద్దానికి మూలమున గొంచెమొకరము కనుపించును.

"దైత్యేంద్రం దర్శయామాస మాతృమృష్ట మలంకృతమ్"
7-5-19.

దీనిని శాస్త్రిగారు గ్రహించి పైవిధముగ తమ యనువాదమును దీర్చదిద్ది యొప్పింపజేసిరి.

పిదప గురువులు ప్రహ్లాదుని సహాధ్యాయులతో సధ్యయనము గావింపజేసిరి. ప్రహ్లాదుడును గురువులు నిత్యకర్మానుష్ఠానమునకై చనగా దైత్య బాలకులకు జ్ఞానోపదేశమొనరించి తన జ్ఞానమునకు హేతువు వారడుగగా సవివరముగ జెప్పును. ఈ విధముగ మూలాను సారముగ శాస్త్రివారు చెప్పి ప్రహ్లాదుని యఖండ జ్ఞానమును విదిత మొనర్చి యా పాత్రకు శోభ గూర్చిరి.

ప్రహ్లాదుని వర్తనమెఱిగి గురువులు కినుకతో హిరణ్యకశిపుని వద్దకు శిష్యునిగొనిపోయి పరిస్థితిని వివరించినట్లు హేతువు చూపుటలో

గురుదోషమేదియు లేదని స్పష్టీకరణము తోచి యౌచిత్యవంతమై యలరారినది.

మ॥ దనుజాధీశ్వర! నీ సుతుండు కులతిక్తుం బేరికిం గాడు చె
ప్పిన మాటల్ చెవిబెట్ట డన్యమతముస్వీడండు దుష్టత్వముం
గొని వర్తించుచు దోడి బాలకుల గైకో జేసె దుర్బుద్ధులా
తని మూలంబున నెల్ల రాక్షసులకుం దబ్బిబ్బుగానయ్యెడిన్. 7-182.

ఈ మాటలు విని హిరణ్యకశిపుడులికిపడుచు తనయుని గూర్చి పలుకుట యిటులగుపించును.

ఆ॥ అనిన నులికి పడుచు నమరారి యేమేమి?
చేటు కాలమయ్యెనోటు? కడుపు
చెడగ బుట్టి కొడుకు నుడి గొన్న యరి గాని
కొడుకుగాడు నాకు గూళవాడు. 7-183.

ఇట్లనుటలో హిరణ్యకశిపున యప్పటి మనఃస్థితి విశదమగుచున్నది. ఈ సందర్భమున పితాపుత్రుల వాగ్వివాదము కడు రమ్యమై తిక్కన్న నాటకీయ శైలిని దలపింపజేయును.

మూలమున హిరణ్యకశిపుడు సుతునఁనేకవిధముల హింసించి శూన్యఫలితుడై మరల విద్యాభ్యాసమునకై గురువుల కప్పగించినట్లు కలదు. ఈ రీతిగ మూడు పర్యాయములు మొత్తము మీద జరుగును. శాస్త్రివారిది పరిహరించిరి. రెండవసారికూడ ప్రహ్లాదుని వర్తనమును నిశ్చలముగ దోచగ మూడవ పర్యాయము విద్యకంపుటలో నౌచిత్యము కానరాదు. కావున శాస్త్రివారు దీనిని బరిహరించి రెండవ యనుభవము కాగానే దానవపతి తనయుని వధకుద్యోగింపించుట జేసినట్లు కథాకథనమును నిరాటంకముగ సాగించిరి.

మున నొక్కొక్కచో మూలమును మించుచు నౌచిత్యవంతమై కాన వచ్చును.

15. గజేంద్రమోక్షణమున గజేంద్రుడు నిదాఘపీడితుడై పరిసరమున సరోవరమున్నట్లు గ్రహించిన విధము మూల భాగవతమున నిటులున్నది.

"గిరిం గరిమ్ణాపరితః ప్రకంపయన్ నిషేవ్యమాణోఽలికులైర్మదాశనైః
సరోఽనిలం పంకజరేణురూషితం జిఘ్రన్ విదూరాన్మదవిహ్వలేక్షణః 8-2-23,24

ఈమాత్రము దానిని శాస్త్రివారు మిక్కిలి సుందరముగ నిట్లు తీర్చిదిద్దిరి.

సీ॥ జలములపైనాడి జలజగంధముతోడ
గనవచ్చు చల్లని గాలివలన
కమలకాండ వినూత్న సముపేతపరిమళ
సహకారి జనసమాసంబువలన
భంగరంగచ్చక్రవాక కారండవ
హంసాది పక్షి శబ్దాళి వలన
నిరత కల్లోల వినిర్గత శీకర
సందోహ సంస్పర్శసంధివలన

తే॥ కలదు కాసారమిందని తెలిసిమదిని ..........8-26.

ఈ యనువాదమున శాస్త్రివారి రమణీయ రచనా దృష్టి గోచరించును.

అటులనే నక్రముతో విక్రమించు గజరాజు యుద్ధ పద్ధతి మూలమున నీరీతి గోచరించును.

"విముక్త శుర్దీనధియోంపరేగజాః
పార్ణిగ్రహస్తారయితుం నచాశకన్

నియుధ్యతోరేవమిభేన్ద్రనక్రయోః
వికర్షతోరన్తరతో బహిర్మిథః" 8-2-28.

ఈరీతిగ గజనక్రముల పోరాటము చెప్పబడినది. శాస్త్రివారి పట్టున వాని యుద్ధ సంరంభమును విపులముగ నెనిమిది పద్యములలో జూపినారు.

గజరాజు విక్రమమునెటుల వర్ణించిరో చూడుడు.

సీ॥ ఇనుపటోకళ్ళకు నెనవచ్చు కొమ్ముల
గొట్టి పై చిప్పలు గుండజేసి 8-35.

ఇందు జక్కని యుపమానములు ఇనుపటోకళ్ళు, కాలపాశము వంటివి ప్రయోగింపబడి యధికతర రామణీయకతను గూర్చినవి. మూలమున నింతకుముందు "గజోయథాబలం" అని మాత్రమాకరము శాస్త్రివారి యనువాదమునకు గానుపించును. ఆ "యథాబలం" యనునది శ్రీకృష్ణభాగవతమున బైరీతిని జక్కగ రూపుకట్టి కరి పోరాటము కనులముందాడినది.

16. దేవదానవులు పాలకడలిని జిలుకగా సమస్త వస్తువులు పుట్టినవి. అప్పట్టున నుచ్చైశ్రవము జనింప నీశ్వర శిక్షచే నింద్రుడ ద్దానిని గైకొనలేదనియు, బలిచక్రవర్తి స్వీకరించినట్లును మూల భాగవతము.

"తతఉచ్చైఃశవా నామ్నా యో భూచ్చందపాండురః
తస్మిన్ బలిః స్పృహాంచక్రే నేంద్ర ఈశ్వర శిక్షయా" 8-8-3.

శాస్త్రివారిందుద్రేగ్రహించినట్లుతమయనువాదమున నుడివిరి.

ఉ॥ సుశ్రవణంబుపోనటులుతోయధి దచ్చ సుధారసంబును
చ్చైశ్శ్రవ మచ్చరల్ రమయు జందుడుగోలనేకవస్తులం
భశ్శ్రధనంబునుండి వెరవార లెఱంగుచు వెల్వడంగ నా
స్వాశ్రితులందు మేటులగు వారు గ్రహించిరివాని వానినిన్.
8-120

ఇందు దేవతలను నర్థమున స్వీకరించినట్లు చెప్పుటయే కాక పిదప స్వయముగ శాస్త్రివారు,

సీ॥ ఇచ్చ నైరావణ ముచ్చై శ్శ్రవంబును
హరిహయునకును వాహనములయ్యె" 8-124

అని "హరిహయుడనుచు" నింద్రునే చెప్పిరి. దేవగజము, దేవ హయములనియే ప్రసిద్ధియును. ఆకారణముగ శాస్త్రివారు వాని నిందుడే గ్రహించెనని చెప్పియుండవచ్చును. ఇతరత్రను బలిచక్రవర్తి యుచ్చైశ్శ్రవమును గ్రహించినట్లు కానుపింపదు. ఈ భావమే శాస్త్రివారినావిషయమున నట్లనువదింపజేయ కారణమై యుండును.

పిమ్మట "వారుణి" జనించినట్లును కోణపులు నారాయణునను మతంబున గ్రహించినట్లును మూల భాగవతము.

"అథాసీత్ వారుణీ దేవీ కన్యా కమలలోచనా
అసురా జగృహుస్తాంవై హరేరనుమతేనతే" 8-8-30.

ఈ విషయము శాస్త్రివారి యనువాదమునగానరాదు. వారు దీనిని విడుచుటకేమి కతమో? వారి యాధార మూల ప్రతియం దీవిషయము లేదో! సప్తవ్యసనములందొకటియైన దీనినివర్జించుటయే యుచితమని యెంచిరో యూహ్యము.

అటులనే విష్ణువు మోహినియైన పట్టున రక్కసులాశ్చర్యముతో బలికినట్లు నామెయు బ్రతిభాషించిన విషయము మూలమున తొమ్మిది శ్లోకములలో 18-9-2 నుండి 10- నున్నది. మోహినీ వర్ణనమును మూలమున నాలుశ్లోకములలో విపులముగ నున్నది, అట్లవతరించుటకు హేతువు మూలమున,

"ఏతస్మిన్నంతరేవిష్ణుః సర్వోపాయవిదీశ్వరః

యోషి ద్రూపమనిర్దేశ్యందధారపరమాద్భుతమ్." 8-8-41
అని యున్నది.

శాస్త్రివారి యనువాదమిప్పట్టున మూల కుంచనమై కాన వచ్చును. సర్వోపాయ విదిత్వమునకు జక్కగ,

వ॥ పుండరీకాక్షుండగునజితుండు రాక్షసులకమృత మిడుట పాములకుం బాలు వోయుటయని నిశ్చయించి.... 8-128

అని తెలుగు జాతీయము విరిసౌరభముగ, సందర్భోచితముగ, నన్యథాకరణముగ దోచునట్లు మూల వివరణమొనర్చుట మిగుల సొగసుగ నున్నది.

"ప్రేక్షణీయోత్పలశ్యామమ్...." ఇత్యాదిగ నాలు శ్లోకముల నున్న వర్ణనమును మిగుల సంగ్రహముగ నొక్క మత్తేభ విక్రీడితమున నామోహినీ మత్తేభయానను దీర్చిదిద్దుటలిటుల గానవచ్చువచ్చును.

మ॥ తళుకుంబంగరు డాలు డీల్పడుగతిం దైవారు నెమ్మేనును
న్నెలనాముద్దులు మూటగట్టి మిగులన్వెల్గొందు నెమ్మోమును
న్గులుకుంగుబ్బలు వాలు గన్నులును విన్నుంబోలు లేగౌను నుం
గల నారీమణియైరమాధవుడటన్ గన్పట్టెనప్పట్టునన్. 8-129

ఈ వర్ణనము సంగ్రహమైనను మోహనముగనే యున్నది. మూలము నందున్న యంత యనవసరమని శాస్త్రివారు భావించి యుందురు. అటులనెంత్తైనను వర్ణింపవచ్చును. కావున నౌచిత్యవంతముగ దగు మాత్రము శాస్త్రివారీ పట్టున గ్రహించిరి. పిదప రక్కసులా స్వరూపమునుగాంచి యిట్లు భావించి భాషించినట్లు మూల భాగవతమున నిటులున్నది.

"అహోరూపమహోధామ అహో అస్యా నవంవయః
ఇతితేతామభిద్రుత్య పప్రచ్ఛుర్జాతహృచ్ఛయాః

కస్యాసి వదవామోరు మధ్నంతీవ మనాంసినః" 8-9-2,3
ఇత్యాదిగ భాషించుట లాఱు శ్లోకములలోనున్నది. శాస్త్రివారిది యంతయు ననవసరమని పరిహరించి సంగ్రహముగ నిట్లనువదించిరి.

తే॥ ఇట్లు మోహినియై విష్ణువెసగినల్ల
దాృవుడుల నెల్ల వంచింప దలచి వారి
కెలన బ్రత్యక్షమగుటయు గెరలి వారు
మోహ పరవశులై యుండి రూహము చెడ.

వ॥ ఇట్లు మేను మఱచి తన్నుం జూచుచున్న దానవుల చెంతకా దైత్యాంతకుండు తక్కుచుందారుచుంజని మీలో మీరిట్లేల వాదు పెట్టుకొనియెదురు. నేను మీ యిరుదెఱంగులవారికి నమృతంబు పంచి యిచ్చెద.... 8-130,131

ఇట్లు స్త్రీరూపధారియైన విష్ణువే వారినొడంబఱచినట్లు శాస్త్రివారను వాదము చేసిరి. మూలమునను వారి భాషణమైన పిదపనిటులే కలదు. శాస్త్రివారి యీ కుదింపువలన కథాగమనమునకేయాటంకము లేక నిరాఘాటముగ సాగుటకు దోడ్పడి యౌచిత్యవంతమైనది.

17. వైవస్వతసుతుడైనసుద్యుమ్నుడు సపరివారముగ నాఖేట మునకు వనమున జొచ్చి యశ్వసహితముగ స్త్రీత్వమునందును. దీనికి హేతువు హారు కుమారవనమున బ్రవేశించుటయని మూల భాగవతము.

"సకుమారోవనం మేరోరధస్తాత్ ప్రవివేశహ" 9-1-125.
దానిని ప్రవేశించిన పురుషులు స్త్రీలగుదురని పరమశివుడు ప్రియ కామ్యముచే నియమమొనరించినట్లు

"తదిదం భగవానాహ ప్రియాయాః ప్రియ కామ్యయా
స్థానం యః ప్రవిశేదేతత్ సవైయోషిత్ భవేదితి." 9-1.32.
యని మూల ప్రవచనము.

మూలమున నీ పట్టున సుద్యుమ్నుడందు బ్రవేశించి స్త్రీ యయ్యెనని దానకి హేతువు శివుని నియమమని శుకుడన బరీక్షిత్తు శివుడెందులకట్లు నియమ మొనరించెనని యడుగ దానికి ఋషుల యాగమనాదిక వృత్తాంతము మరల విపులముగ జెప్పును.

శాస్త్రివారిటుల రెండు పర్యాయములు విషయ ప్రవచన మనవసరమని సంక్షిప్తీకరించి,

వ॥ "…. ఉత్తరదిశాభిముఖంబుగ బోయిపోయి.

ఉ॥ గౌరియు శంకరుండు కుతుకంబునగాముని బెల్చ గెల్చు చం
దేరొరు లేగుదెంచిన నొకించుక లోపల స్త్రీత్వమొందనై
పౌరుషముజ్జగింతురని పల్కిన దాన నెవండునచ్చొటన్
జేరరరణ్యావృద్ధి విలసిల్లుచునుండును గౌరిపేరుతోన్.

వ॥ అట్టి గౌరీవనంబునందడుగుపెట్టినంతలో…." 9-11నుండి13.

అని యనువదించినారు. ఇందు బరీక్షిత్ప్రశ్నము మరల శుక వివరణము పరిహరింపబడినవి. ఆకారణము ముందే మూలమునందు వలెనే చూపబడినది.కారణము చూపబడిన పిదప మరల నట్లేల జరిగినది యని ప్రశ్నించుట యనవసరము. దానికి ఋషులు దర్శనార్థము వచ్చినవిషయమంతయు వచ్చినది. ఇది యంతయు ననవసరము. పైవిషయముననున్న హేతువునకే మరల సందేహము జనింపదు. కావున శాస్త్రివారు దీనినంతయు నౌచిత్య దృష్టితో బరిహరించిరి. మఱొక యౌచిత్యవంతమైన మార్పు జేసిరి. మూలమున,

"తదిదం భగవానాహప్రియాయాః ప్రియకామ్యయా"

అని శివుడు పత్ని ప్రియార్థమట్లొనరించెనని, యున్నది. అపుడా వనమునకు కుమారవనమని పేరు కలిగినదిట. ఇది యంత సమంజసముగా లేదు. ఆమె ప్రియమునకై యటులొనరింపబడినది కాన యామె పేరు మీదుగ నా వనము ప్రసిద్ధి కెక్కుట భావ్యము.

కాని యసందర్భముగ కుమార వనమనబడుట యుచితముగ దోపదు. ఈభావముకలవారు కనుకనే శాస్త్రివర్యులు "అరణ్యమద్ది విలసిల్లుచు నుండును గౌరి పేరుతో" సని గౌరీవనమని మార్పు జేసినారు. ఇది వారి సునిశిత పరిశీలనకు, నౌచిత్య దృష్టికి నికషదృషత్తు.

పిదప సుద్యుమ్ననకు స్త్రీత్వము వచ్చుట కడు సొగసుగ జూపినారు,

సీ॥ పేరురంబున యందు సౌరుమీఱగనయి
లికుచకుచంబులు లేవజొచ్చె
బెడగొండెముడితోడ గడునొప్పు నొదల
వేణీభరంబది వ్రేలనయ్యె
గాసెతో గత్తి చేకట్లతోనగు కౌను
మిన్ను కన్నను గడు సన్నమయ్యె
సింగంబుతోనైన జెంగలింపగ జాలు
గమనంబు మందమై కానవచ్చె

తే॥ జఘన మెంతయు ఘనమయి జగతినిండె
గనుల గాటుక కాంతులు వనులనిండె
దొండపండనగెమ్మోవి తులకరించె
జిలుకులకుదోడు సూపెడు బలుకుబడులు. 9-14.

ఈ శాస్త్రివారి యనువాదము స్త్రీయయిన సుద్యుమ్నుని మన కనుల ముంగిట నిల్పుచున్నది. పోతన్న యనువాదమున నిటునీ రామణీయకము కానరాదు. ఇది శాస్త్రివారి ప్రతిభకు గీటురాయియై మిక్కిలి యౌచిత్యముగ నున్నది.

ఇట్లు స్త్రీయైన సుద్యుమ్నుడు విచారించినట్లు మాత్రము మూల భాగవతమున,

"సా చానుచర సంయుక్తా విచచారవనాద్ వనమ్" 9-1-33.

అని యున్నది. ఇట "విచారా" యనియే యున్నది. కాని యెట్లో యనునది లేదు శాస్త్రివారది యెట్లో యిట్లు సొగసుగ జెప్పినారు.

సీ॥ నా కీర్తి యంతయు నవ్వుల పాలయ్యె
నా ప్రతాపంబోష్ఠనటనమొందె 9-16.

ఇందలి శ్లేష పరమరమణీయము. ఇది శాస్త్రివారి వర్ణనా పాండితీ శేముషీధిషణకు బరమ నిదర్శనము. ఇట మూలమును మించి శాస్త్రి వారి యనువాదమలరారుచున్నదనవచ్చును.

18. మూల భాగవతమున నవమస్కంధతృతీయాధ్యాయమున సుకన్యాచ్యవనుల వృత్తాంతము ప్రవచింపబడినది. శాస్త్రివారు మిగుల నౌచిత్యముతో తమయనువాదమున నించుక మార్పు చేసి చూపిరి.

మూలమున సుకన్యాచ్యవనులు దాంపత్యమొనరించుచుండగ కొంత కాలమునకు నాసత్యులు వారి యాశ్రమమునకు వత్తురు. అప్పట్టున నిటులున్నది.

"కస్యచిత్ త్వథకాలస్య నాసత్యావాశ్రమాగతౌ
తౌపూజయిత్వా ప్రోవాచ వయోమేదత్త మీశ్వరౌ,
గ్రహం గ్రహీష్యే సోమస్య యజ్ఞే వామప్య సోమపోః
క్రియతాం మే వయోరూపం ప్రమదానాం యదీప్సితమ్."
9-3-11,12.

ఆశ్రమాగతులైన యశ్వినీదేవతలను చ్యవనుడర్చించి, తాను వారిని గ్రతువులందు సోమపానార్హులుగ జేయుదుననియు దన జరాభారము డుగించుమని పై విధముగ కోరును. అప్పుడు వారు,

"బాఢమిత్యూచతుర్విప్రమభినన్ద్యభిషక్తమౌ
నిమజ్జతాం భవానస్మిన్ హ్రదే సిద్ధ వినిర్మితే" 9-3-13.

అనుచు వాని నటనున్న సిద్ధవినిర్మితమైన సరోవరమున మునుగుమని

సత్యులబోలి వెలుగొందును. మునితోపాటు వైద్యద్వయము నట్లొ నర్చును. ఈ కారణముగ మూవురును తుల్యాకృతులై సుకన్యకు కానవత్తురు. సుకన్య తన పెనిమిటిని గుర్తింపలేక భిషగ్వరులను శరణువేడును. మూలమున నిప్పట్టున,

"తాన్ నిరీక్ష్యవరారోహా సరూపాన్ సూర్యవర్చసః
అజానతీ పతిం సాధ్వీ అశ్వినౌ శరణం యయౌ
దర్శయిత్వా పతింతస్మైపాతి వ్రత్యేన తోషితౌ
ఋషిమామన్త్ర్యయయతుర్విమానేన త్రివిష్టపమ్. 9-3-16,17.

అని యున్నది. నా సత్యులు నామె పాతివ్రత్యమునకు సంతసిల్లి చ్యవనునామెకు జూపి యామంత్రించి విమానయానులై స్వర్గాభి ముఖులైరి. ఇది మూల భాగవత కథ.

శాస్త్రివారు దీనిని మార్పుజేసి సుకన్యాచవనుల పాత్రలను మిగుల నుదాత్తముగ దిద్ది తీర్చిరి.

సరస్సున జలకమాడి గమించుచున్న సుకన్యను జూచి దేవ వైద్యులు పరవశులై యామె వివరములనడుగుదురు. ఆమెయు దాను చ్యవనుని యర్థాంగినని ప్రత్యుత్తరమిచ్చును.

ఆ॥ అంత గొంత కాలమరిగిన యప్పుడు
వేల్పు వెజ్జులటకు వేడ్క వచ్చి
జలకమాడిపోవు జలజాక్షినీక్షించి
రమరకన్యబోని యట్టి దాని.

ఉ॥ క్రాంచి తదంచితద్యుతికి గౌతుకమందుచు మెచ్చి వచ్చియో
చంచలనేత్రి గాత్రరుచి సర్వదిశల్ వెలిగించుచుంటిసీ
వెంచగ నేరిదానవగుదెవ్వనిపంపుబొనర్చు చుంటివో
కొంచక మాకు వాకొనుము కోరిక లీరకలెత్త నిత్తటిన్.

తరు॥ అని సుకన్య యిట్లనియెనోదివ్యు

లార॥ నే శర్యాతి యనురాజపుత్రి
ననఘుడు భృగు పుత్త్రుడగు చ్యవనునకు
ననుగుబత్ని సుకన్యయనుదాననను చు
దనయుదంతము సవిస్తరముగా దెల్ప
దగనవ్వి దసుర్లు తమ్మొటింగించి
వనితా శిరోమణివలను మోముగుచు
వగదోపనిట్లని పలికిరిమఱియు. 9-43నుండి45.

ఇట్లు సమాధానించిన చ్యవనుదయితతో దసుర్లు చ్యవనుని గూర్చి మిగుల విపరీతముగ బలికి వేఱు వానిని వరింపు మందురు. మచ్చునకు కొంత పరికింపుడు,

ఉ॥ "కాటికి గాళ్ళుసాచు కొనికాటియనొందుచునున్న వానికి
వేటికి నాలుగావలయు నిక్కము వచ్చెను గన్నతండ్రితా
నేటికి బ్రేవులందుదయయింతయు నేమియు లేకయిచ్చెనో
బోటిరొ॥ నిన్ను విన్న వగపుట్టక పోవునె యెట్టి వారికిన్.

మ॥ అసమర్థుండగు వీని బాసి జలజాస్యా॥ నీవు వేఱొక్కనిన్
బ్రసమీక్షించి నీ సొగసు నీ కాయమున్
బ్రసవాస్త్రు ప్రీతి పాదకంబులగుచున్ భాసిల్లుచందంబునన్
బొసగంజేసికొనంగ జూడుమనుచున్ మోదంబునంబల్కుడున్.
9-46,50.

ఇట్లు వారు సోపపత్తికముగ బల్కగా సుకన్య ప్రతిభాషించిన విధమామె పాతివ్రత్యమునకు నిర్మలముకురమై యా పాత్రి యున్నతిని మేరు శిఖరమును మించినట్లొనర్చినది.

ఆ॥ ఆ సుకన్య కవలకనియె నోయయలార।

మీరలిట్లు తలప మేరగా దనుడునా
సత్యు లిట్టులనిరి సతికి మఱియు. 9-51.

ఆ బోటి సూటిగ మెత్తగ కత్తి వలె తన నిశ్చితాభిప్రాయ మును ఖండితముగ మర్యాదకే మాత్రమును లోటురానీయక యల్పా క్షర సంఘటనముననల్పార్థమును బ్రకటించినదో। ఇది శాస్త్రివారి పాత్ర మటి. కవి ప్రతిభ యెంతటిదో నిటను మనకు స్పష్టమగును. తరువాతి పద్యము చూడుడు,

సీ॥ వనితరో। మేము దేవభిషగ్వరులమునీ
పతినవరూప సంపన్ను డగుచు
నలర జేయుదు మేము నతడును ముప్వుర
మగుదు మందొకని నీకగును బొంద
ననుడు నాయమ చనివినిపించి పతికిద
దనుమతి గొనివచ్చి యశ్వులగని
మీనొడివినయట్లుగా నొనరింపుడు
నా గవల్ వెండియునాతి గాంచి

తే॥ తరుణి నీమగడీ సరోవరమునందు
జొచ్చునది యన్న రూపుపై నిచ్చ జేసి
చ్యవనుఁడటు చేసె దస్రులున్ జలములందు
మునిగి తేలిరి మునితోడ మూర్తమునను. 9-52.

అశ్వినీ దేవతలు చ్యవనుని సురూపుని జేసెదమనియు, దాము మూవురిలో నొకనిని యామె వరింపవలెననియు షరతుబెట్టి యడుగ నామె భర్త్రధీన కావున నీవిషయమంతయు బతికి వినిపించి తదను మతి గైకొని పతిని దోడ్కొని వచ్చును. ఇది పతివ్రతా ధర్మము. పిదప నియమానుసారము ముప్వురు నా హ్రదముఁన మునిగి తుల్యా కృతితో నలరుదురు. చూడుడు,

మ॥ పడుచుంబ్రాయము సోయగంబు గలుగన్ భాసిల్లి తుల్యాకృతిన్
జడజాతేక్షణ చెంత జేరి ముగురున్నాలోన నొండొక్కనిన్
దడయంబోక వరింపుమంచు బలుకం దన్వంగి వొంగారుచున్
వడినా భార్గావునిన్ వరించెను మనో వాక్కాయకర్మంబులన్.
9-53.

మూలమున దమలో నొకనిని వరింపుమని నియమముంచుట లేదు. శాస్త్రిగారి యనువాదమున గల్పింపబడినది యీ యగ్ని పరీక్ష. సరియ. అమె యీ షరతున కెందుకంగీకరించినది? తన భర్తను దాను పొందగలనను విశ్వాసము. అదియే పద్యాంతమున "మనో వాక్కాయ కర్మంబులన్" అని నిష్కర్షగ నుడువ బడినది. సుకన్య పతీవ్రతా శిరోమణులకు బుట్టినిల్లయిన భారత భూమిని జన్మించి నట్టిది. కనుక నామెకు అనసూయాది మహా పతివ్రతల సరసన శాస్త్రిగారు బెద్ద బీటవైచి కూర్చుండ బెట్టి హిందూ స్త్రీ పాతివ్రత్యము ను దిగంతములకు జాటినారు. శాస్త్రిగారి యుహ ఎంత యౌచిత్య వంతము. మూలమునుబరమ రమణీయముగ జేసి తమ యనువాదమున నిట్టుల చిత్రించిన వారి పటిమ యనితర సాధ్యము. చ్యవనుని పాత్రనెంత యుదాత్త భాసురముగ శిల్పీకరించిరో చూడుడు. మూలమున మొదటనే చ్యవనుడు వచ్చిన నాసత్యులనర్చించి తాను వారికి సోమ పానార్హతను గలిగింతుననియు, దన జరాభారము నుడుపుడని యర్థించును. ఇది ఋషి పాత్రకు న్యూనముగ నున్నది. శాస్త్రిగారి యనువాదమున చ్యవనుడేమియు నర్థింపడు. అట్లని కృతఘ్నుడు కాడు చూడుడు,

వ॥ ఇట్లు రూప యౌవన సంపన్నుండైన చ్యవనుండు పరమ హర్షంబున
నా సత్యులంగని మీకతన గన్నులు గలిగి రూప వంతుడనైతి గావున

నోపిన కొలంది మీకు ప్రత్యుపకారంబు గావింపనుంటి నేటికిం బోయిరండని యంపివుచ్చె ...." 9-54.

ఎంత వినయముగ తన కృతజ్ఞతా ధర్మమును చ్యవనుడు నిర్వర్తించినాడో! ఇట్లు పలికి వీరిని బంపి పబ్బముగడచినదికదాయని యూరకున్నాడా? ఏమిచేయునో చెప్పలేదు. చేతుననినాడు. అదికార్య సాధకుల లక్షణము. వారు చెప్పరు. చేసి చూపింతురు. ఇటు చ్యవనుడటులనే చేసినాడు. శ్వశురునిచే యాగమొనరింపజేసి యింద్రుని నిలువరించి నాసత్యులకు సోమపానార్హతను గల్పించినాడు. ఈ విధముగా సుకన్యా చ్యవనుల పాత్రలు రెండును ధర్మబద్ధములై విధి నిర్వహణమున నొకదానికి దీటుగా మఱియొకటి వర్తిల్లి శాస్త్రివారి చేతిలో బరమ రమణీయ భాసురమలై యౌచిత్యవంతములై మూలమును మించి తమ ప్రత్యేకతను నిలుపుకొన్నవి. అదీ శాస్త్రివారి ప్రతిభా సముపేత పాత్రౌచితీ పాటవము.

19. నవమస్కంధమున దశమాధ్యాయమున శ్రీరామచరితమును మూలము ప్రవచింపు చున్నది. సీతాపహరణమును గూర్చి మూల భాగవతమున నిటులనున్నది.

"రక్షోఽధమేన వృకవత్ విపినే సమక్షం
వైదేహరాజ దుహితర్య పయా పితాయామ్! 6-10-11.

పిదప,

భ్రాతా వనే కృపణవత్ ప్రియయా వియుక్తః
స్త్రీసంగినాంగతి మితి ప్రథయంశ్చ చాత. 9-10-11.
అని రాముని స్థితి చెప్పబడినది.

శాస్త్రివారిప్పట్టున సీతా ప్రలాపములను గడునుచితముగ జూపి యా కరుణ రసాత్మక సన్నివేశమును గనులగట్టించినారు.

"అర్థి వేషమునన్ సీతనపహరించె."

వ। అప్పుడు సీతాదేవియు

ఉ॥ హా రఘురామ। హా త్రిజగదంచితసువ్రతకామ। హా మహో
దారగుణాభిరామ। యిదె దైత్య కులాధము డొక్కరుండు నీ
దారననున్ గ్రహించుకొని దక్షిణమార్గము పట్టిపోయెడిన్
గారుణికత్వ మేర్పడగ గ్రన్నననన్ విడిపింపరాగదే॥

సీ॥ "వేల్పులారా॥ నేల దాల్పులారా॥ మీరు
నా వెతల్ దెల్పరే నావిభునకు...."

9-231 నుండి 234.

మొదట సీతాదేవి భర్తనుద్దేశించి పలవించి పిదప సకల దేవత లను బ్రార్థించుటలో నామె దయనీయ పరిస్థితి చక్కగ జిత్రింప బడినది. ఇట్లు చిత్రించుట సందర్భోచితమైన శాస్త్రివారి ప్రతిభా పాటవమునకు నికషోపలమై యున్నది.

౬0. మూలమున నవమస్కంధమున బదునెనిమిదవయధ్యాయ మున యయాతి చరిత్రమున్నది. శర్మిష్ఠ సఖీ సహస్రముతో గురు పుత్రియగుదేవయానిని దోడుకొని విహారార్థమునొక యుద్యానవన మున బ్రవేశించును. అచట నొకజలాశయమునుగాంచి వినోదార్థము వారు జలక్రీడలొనర్పగట్టుపుట్టములు పీడి యందు జేరుదురు. ఆ సమయమున నందివాహనముపై బార్వతీ పరమేశ్వరులు రాగా లజ్జితులై వడివడిగ దీరము జేరి యాహడావుడిలో శర్మిష్ఠ దేవయాని పరిధానము కట్టును. ఇటుల భాగవతము నుడువుచున్నది.

"ఏకదాదానవేంద్రస్య శర్మిష్ఠానామ కన్యకా
సఖీ సహస్ర సంయుక్తా గురుపుత్ర్యాచ భామినీ"
శర్మిష్ఠా జానతీ వాసో గురుపుత్ర్యాః సమవ్యయత్."
9-18-6 నుండి 10.

ఈ విషయమును శాస్త్రివర్యులు శ్రీకృష్ణభాగవతమున నిటుల ననువదించిరి.

వ. "........వృషపర్వుని కూతురు శర్మిష్ఠ యొక్కనాడు

ఉత్సాహ. కన్యకా సహస్రమంతుగదలి దేవయానితో
వన్యమౌసరోవరంబుపజ్జ బెట్టి పుట్టముల్
కన్యలాడి నీట వచ్చి గాలిగలియువానిన
న్యోన్య వినిమయంబుగాగ నవధరించిరత్తఱిన్.

వ. శర్మిష్ఠ దేవయాని పరిధానంబు గట్టిన" 9-329 నుండి 328.

ఇందు మూలకుంచనము, మార్పును గానవచ్చును. ఉద్యానసౌందర్యమును మూలము చక్కగ వృత్త్యనుప్రాస రామణీయకమునజూపినది. శాస్త్రివారు మిక్కిలి సంగ్రహించి విషయమును గథా కథనమునకనుకూలముగ నొనర్చిరి. మఱియును వృషభ వాహనులై గిరిజా రమణులు వచ్చినట్లు మూలమున నుండగా నా హేతువును మార్చి, "కన్యలాడి నీటవచ్చి గాలి గలియువాని" యని చూపినారు. జగజ్జననీ జనకులు మూలమున నున్న రీతిగ బ్రతివారికిని కానవచ్చుట శాస్త్రివారికి సమంజసముగ నన్పించి యుండదు. మహాభారతమునను సురకరువలికి వస్త్రములేకమైనట్లు గానుపించును. ఇదియే యౌచిత్యవంతముగ నున్నదని శాస్త్రివారు భావించి యుండి యీ మార్పొనరించి యుందురు.

పిదప శర్మిష్ఠ దేవయానిని నూతద్రోసి మరలి పోవును. ఆ ప్రాంతమునకు నహుష పుత్రుడునయినట్టి యయాతివచ్చి నూతను దేవయానింగాంచును. తన యుత్తరీయమును జాపి దక్షిణహస్తమున నామెను వెలి దీయును. దేవయాని నూయి వెడలి వచ్చి దక్షిణ కరగ్రహణ హేతువుచే యయాతిని దన భర్తగా బల్కును. పిదప తన వృత్తాంతమంతయు జెప్పును. ఈ విషయము మూల భాగవతమున నిటులున్నది.

"ఏవం విధైః సుపరుషైః క్షిప్త్వాఽఽచార్య సుతాంసతీమ్

శర్మిష్ఠా ప్రాక్షిపత్ కూపే వాస అదాయ మన్యునా”
“మనస్తు తద్గతం బుద్ధ్వా ప్రతి జగ్రాహ తద్వచః
గతే రాజని ....” 9-18-17 నుండి 23.

శాస్త్రివారి యనువాదమున నించుక మార్పు పాత్రోచితముగ గోచరించును.

“అనుచు నెగ్గులాడి యా దేవయానిని
బడగ ద్రోచి నూత వెడలె నంత”

వ॥ అంతలో యయాతి మృగ యార్థమరుదెంచి నూతిలో బడియున్న కన్యకామణింగనియె” 9-330, 331.

మూలమున నేమియు బ్రశ్నింపక యయాతి దేవయానిని ప్రోక్షిప్తను జేయును. శాస్త్రివారి యనువాదమున నాతడామె వివరమడుగ నామెయు తగినరీతిగ సమాధానించి తననుద్ధరింపుమని వేడ నాతడటులొనర్చును. పిదప నిరువురును వారి వారి మార్గముల బోదురు.

మ॥ కనినీవెవ్వరిదాన వెవ్వతివి యీ కాంతారమధ్యంబునం
జనుదే నేమి తృణావృతంబును భయస్థానంబునిన్నూతిలో
వనటంగుందగనేల జెప్పుమన నవ్వామాక్షి పెన్నిద్దురం
గను వారిన్ బ్రదికించు భార్గవునకే గన్యంజగన్మాన్యకా.
9-332.

ఇటు నౌచిత్యమున్నది. ఎంత స్త్రీయయినను గాఱుటడవి నొంటిగ తృణావృతమై భయమును గొల్పు నూతి యందు గానవచ్చుట యేమి? ఈ సందేహమెవ్వరికైనగలుగును. పిశాచాదుల చేష్ట కావచ్చును. మఱియు నామె యన్యస్త్రీ. పాత్రమౌచిత్యవంతమో॥ కాదో ఇంత భావము హృదయమున నాతనికి గలిగి యుండవచ్చును. పైగానతడు ధర్మవర్తి కనుక నతడట్లామెను బ్రశ్నించెను. ఆమెయు దక్షిణవ

తిన్నదా? తాను శుక్రుని బుత్రినని చెప్పి యింకను నిటులనుచున్నది.

వ. ప్రమాదవశంబున నిందు బడి కుందుచున్న దాన నీ వార్త్త్రాణ పరాయణుండవుంగులీనుండవని నేనెఱుంగుదునను గ్రహించి నన్నుద్ధరింపుమని ప్రార్థించి తన దక్షిణహస్తంబెత్తుటయు నత్తాపస శరణ్యుండును దత్తఅంబున దానిం గ్రహించి నూయి వెడలందిగిచి తలోదరి నామంత్రిణంబు చేసి తాను తన రాజధానికిం జనియెనిట దేవయాని శర్మిష్ఠ చేతకు జేతంబున సంజాత జాతవేదో నిభంబగు కోప తాపంబున ఘూర్ణిల్లుచు దన్ను రోయవచ్చు ఘూర్ణిక యనుదాని వలన దన యవమానంబు తండ్రికిం జెప్పి పుచ్చి తానప్పురంబు సొరనొల్ల కున్నంత———" 9-333.

అట్లనిన పిదప కథ యిట్లు పై విధముగ కొనసాగినది. ఇందు "బ్రమాదవశమున నింగు బడి కుందుచుంటినని తననుద్ధరింపుమను చున్నది. ఇటు నవమానింపబడిన యాత్మాభిమానవతి ఘనస్తత్వము స్పష్టమగును. ప్రతీకారమొనర్చిన దాక నాప్తులకు దప్పనితరులకు దనస్థితి వివరింప నిచ్చగింపకుండుట వారి లక్షణము. కావున బ్రమాద వశమున నిందు బడితిననినది. ప్రథమము ప్రతీకారము ముఖ్యము. ఆయవమాన భారముపై వచనాంతమున స్పష్టముగ జూపబడినది. ఇట నప్రకృతమైనశ్లేష ధ్వనించును, ఆమెకు బ్రకృతముకూడ. చూడుడు.

ప్రమాదవశంబున నిందుబడి కుందుచున్నదాన. నీవార్తత్రాణ పరాయణుండవుంగులీనుండవని నే నెఱుంగుదుననుగ్రహించినన్నుద్ధ రింపుము" అనుటలో తన యవివాహితస్థితిని జూపుచున్నది. ప్రమాద వశమున అనగా తండ్రికి శష్యుడయిన కచుని మోహములోబడుట. తండ్రికి శిష్యుడు సోదరతుల్యుడు. ఈ భావము నే కచుడును తరువాత వ్యక్తమొనర్చును. సరియ. అట్లు మోహవశ ప్రమాదమున గచుని శాపకారణముగానని భావము. ఇందనగా నీ యవివాహితాస్థితి

యందుననని భావము. కచ శాపకారణముగ బ్రాహ్మణవరుడామెకు లభింపడు. ఇటు వచ్చినవాడు రాజ లక్షణుడు. పై భావమంతటిని దేవయాని ధ్వనింపజేసినది. దానికుపబలకముగ "నను గ్రహించి నన్నుద్ధరింపుమ" ని ప్రార్థించినది. ఉద్ధరింపుమనుటలో నీ నూతి నుండి యని సామాన్యార్థము. ఈనాయవిహితా స్థితినుండి యుద్ధరింపు మనుట ధ్వని. ఈభావమున్నది కనుకనే పిదప నామెయే మొదటుగా "దన దక్షిణహస్తమెత్తినది." ఇది శాస్త్రివారి ప్రతిభా శాలిత. పై విధముగ దేవయానికి మనసునందాభావమున్నదనుట స్పష్టము. రాజును "నీవార్త త్రాణపరాయణుండవుంగులీనుండవని నే నెఱుంగుదున" ని పలికినది. వినియుండవచ్చునదుకొందము. వినినవాడు వీడే యనుటకు బ్రమాణమేమి? ఇదంతయు దికమకగానున్నది యనిపించును. దానినిట్లు బరిష్కరింపవచ్చును.

ఆమె ప్రస్తుతమాసంకటు స్థితినుండి బయటపడవలెను అప్పుడు తనకు జరిగిన యవమానమునకు దగిన ప్రతీకారమొనరింపవచ్చును. కావున దానానూతినుండి యెట్లయినను వెలువడుట ముఖ్యాతి ముఖ్యము. వచ్చినవాడు రాజలక్షణచిహ్నితుడు. తన పూర్వాశ్రయస్థితి యెట్టిదో యేమిటో తనకు దెలియును. కావున బ్రాహ్మణేతరుడెవడయిన నేమి? ఆమెయు సామాన్యకాదు. శుక్రునంతటి వానికి బుత్రి. చూపు తోడనే యెదుటి వానిని గూర్చి సరియైన యంచనా వేయగల సామర్థ్యము కలది. వచ్చిన యయాతిని యోగ్యునిగ భావించినది. కార్య సాఫల్యార్థమేకాక వానిని యోగ్యుడని భావించి సరియైన నిర్ణయము మనోగతముగ దీసికొనినది. కనుకనే ప్రథమముగా "జగన్మాన్యకా"యని సంబోధించినది. వాని రాజలక్షణములను సక్రమముగ గుర్తించి ఆర్తత్రాణపరాయణుడవని, కులీనుడవని" తనకు దెలియునని చెప్పినది. ఇది

సమయోచితముగ బలికినది. ప్రథమమము ప్రతీకారవాంఛ. పిదపనే వివాహము. అందులకే మనోగత భావము ప్రస్తుతమున కణచి యుంచినది. ఈ ప్రతీకార స్వభావము కలది కనుకనే వివాహానంతరము శర్మిష్ఠను భర్త కూడుట గ్రహించి సహింపక యయాతి యెంత బ్రతిమలాడుచున్నను వినక తండ్రికి నివేదించినది. అది యటులుంతము. ఆవిధముగ దేవయాని తన దక్షిణహస్త మెత్తగ నత్తాపస శరణ్యుండును దత్తఅంబున దానిం గ్రహించి" నూయి వెడలించినాడు. దీనినిబట్టి నతనికి వివాహ భావము కలుగలేదని స్పష్టమగును.ఎట్లుకలుగును? దేవయానియే యతనికి తనను గూర్చి సమాధానించుచు "బెన్నిద్దురంగను వారిని బ్రదికించు భార్గవునికే గన్యనని పలికినది. ఇటుఇట్లు మృత సంజీవినీ విద్యకలవాడైన శుక్రుకన్యనుటపైన నేనువివరించినదానికిని బ్రబల ప్రమాణము. ఈ విద్యను గూర్చియే కదా కచుడు శుక్రునకు శిష్యుడయినాడు. అట్లు బతీ్రకార వాంఛచే దేవయాని తనను వెదకుచు వచ్చిన ఘూర్ణికయను దాని ద్వారా తన యవమానమును దండ్రికి జెప్ప బుచ్చి పుర ప్రవేశము నొనరింపక భీష్మించి నది.

మూలమున తండ్రి వద్దకు బోయి వాని పౌరోహిత్యమును గర్హింప శుక్రుడును గూతును గైకొని పురము వెడలివచ్చినట్లున్నది.

> "దుర్మనా భగవాన్ కావ్యః పౌరోహిత్యం విగర్హయన్
> స్తువన్ వృత్తించ కాపోతీం దుహిత్రాసయయౌపురాత్"
>
> 9-18-25.

శాస్త్రివారి యనువాదమున దేవయాని తండ్రికి వర్తమానమంపి పురమున నడుగిడనని యట్లు జూపబడుట యాపాత్ర మనస్తత్వమున కద్దము పట్టుచు బాత్రోచితమై యున్నది.

పిదప శుక్రుడా వార్త విని త్వరితగతిని గూతు జేరి సాంత్వన

పఱుప బూనుట. దేవయాని ప్రతిభాషణా వేదనము మూలమున లేకున్నను సందర్భోచితమై రమ్యముగ నెనిమిది గద్యపద్యములలో నలరారుట ప్రశంసనీయము.

పిదప వృషపర్వుడు వచ్చి శరణువేడి దేవయాని యీప్సితమును దీర్చును. యయాతితో నామె వివాహమును శుక్రుడా నరించును.

"స్వానాంతత్ సంకటం వీక్ష్య తదర్థస్యచ గౌరవమ్
దేవయానీం పర్యచరత్ స్త్రీ సహస్రేణ దాసవత్
నాహుషాయసుతాందత్త్వా ...." 9-18-29,30.

శాస్త్రిగారిట్లనువదించి తన రచనకొనసాగించి తన మార్పునకు లోపము రానీయక యౌచిత్యముతో నిట్లనువదించిరి.

వ॥ ....దేవయాని కోరినట్లు కన్యాద్విసహస్రంబుతో శర్మిష్ఠం దెచ్చి దానికి దాసిత్యంబున నియోగించి శుక్రునకు మనః ప్రియం బాపాదించె." 9-346.

మూలమునగన్యాసహస్రమనియుండ శాస్త్రివర్యులంతటి జాణయయిన దేవయానికి వేయిమంది ననుట తక్కువ యని యెంచిరి కాబోలు "కన్యాద్విసహస్రంబుతో శర్మిష్ఠను దానవపతి యిచ్చినట్లుగ" చెప్పిరి.

ఇంతకు మున్ను దేవయానినియును,

క॥ కన్యాసహస్రయుతనీ
కన్యక దాసి యగుచు గడు భక్తిన సా
మాన్యక్రియ గొలువగనిడు
మన్యాయముగాని పగిది నమర విరోధీ." 9-345.

అన్యాయము కాని విధముగ గన్యా సహస్రయుతయగు నీ కన్యక చాలుననియన్నటులేకలదు. పైగా మూల భాగవతమున శుక్రుడే ... ... శాస్త్రివర్యులు చక్కగ నౌచిత్యముతో

దేవయానిచే గోరించి పాత్రను దిద్ది తీర్చుట స్తుతి పాత్రము. మఱి వృషపర్వుడు "కన్యాద్విషహస్రంబునేల నొసగవలెననిన గోరిన నానికంటె నధికముగ నచ్చినచో దనలోటును గణింపరనియేకాక, గారాముచేయు పిన్నవారికి నడిగినదానికంటెను మఱికొంత యిచ్చి యూరకుండబెట్టినట్లు దేవయాని యలుకమానుట కట్లు రాక్షసరాజు చేసెనని భావింప వలెను. ఈ మార్పు మిగుల సొగసుగ నున్నది.

పిదప శాస్త్రివారి యనువాద కథాకథనమిటుల కొనసాగినది.

వ॥ అంతనొకనాడు దేవయాని చెలికత్తియలతో నుద్యాన వనంబున విహరించుచుండ వెండియయాతి వచ్చి దేవయానికి దర్శనంబిచ్చిన నామెయు ...."

శా॥ నాపాలింటు శుభావహుండవినుమానా ప్రార్థనా వాక్యమా
కూపంబున్వెలలించునాడగ్రహముఖ్యుండర్కుడేనాక్షిగా
నాపాణిగ్రహణంబొనర్చితివిగానన్ భర్తనీవైతి దే
వా। పెక్కేటికి బెండ్లియాడి దయ దైవారం గటాక్షింపుమా.

వ॥ శర్మిష్ఠందొట్టి వీరందఱును దేవకన్యలంబోనివారు నా వెంటన వచ్చి దాస్యంబుసేయ నీవు దేవేంద్ర వైభవంబనుభవింప వచ్చు ననిన నతండును" 9-346 నుండి 348.

యయాతి పునర్దర్శన మీయ దేవయానియు నాటి వనోగత విషయము సమయమును గమనించి యిప్పుడీవిధముగ బయట పెట్టినది. ఎంతో కృతజ్ఞతతో "నా పాలింటు శుభావహుండ" యని సంబోధించి విషయ ప్రారంభమొనరించినది. అవును మరి. అతడానాడు నూతి నుండి యుద్ధరింపక పోయినచో నీ శుభములన్నియు నెట్లు గలిగెడివి? ఆ సంబోధనమీ విధముగ సాభిప్రాయము. అనువదించినది శాస్త్రివారు మఱి.

యయాతి తక్కువ వాడా? చూడుడు. ధర్మ సంకటమును వివరించుచున్నాడు.

క। క్షత్రియుడ నేను బ్రాహ్మణ
పుత్రికవీవెట్లు పెండ్లి పొసగెడుమనకున్
ధాత్రిన్ సంభృత ధర్మ
క్షేత్రంబుగ నేను నేసు చెడుటుచితంబే. 9-349.

ఇది యనుచితమని నిర్ధారించినాడు. ఇంకను,

వ॥ ఇదిగాక నీతండ్రి ప్రళయాంతక ప్రతిమానుండీ ధర్మ వ్యత్యయంబు వినెనేని నన్ను నారాష్ట్రంబుభస్మావశేషంబుగావించెడు........9-350.

అని రాబోవు చేటును స్పష్టముకావించినాడు. ఇది యయాతి ధర్మ వర్తనకు శీల నైర్మల్యమునకు, రాజ్య క్షేమ దృష్టికియయి అపాత్రకు మిగుల వన్నెగూర్చినది. ఇదియేకదా పాత్రచిత్రణౌచితీ యను సరణము. అప్పుడే దేవయాని

వ॥ ఆమె యప్పుడు తండ్రినటకుం దెప్పించి........"

ఉ॥ నేర్పున దేవయాని గురునింగని యిట్లను నాహుషుండితం
డేర్పడెనట్టిపీనివిడి వేనిని గైకొనబోవనీతనా ...
గూర్పవె నాకు ధర్మవిధి గోరిక లీరికలెత్త భర్తగన్."
9-350, 351.

యని సప్రమాణముగ పలుకుచు పితరుని వేడుకొనినది. పిదప,

వ॥ అనిన శుక్రాచార్యుండు నమస్కరించుచు నిల్చియున్న యయాతింగని,

ఉ॥ నాహుషరాజ। నాసుతనునాడలనూతవెలార్చునప్పుడే
బాహువుసాచి తత్కరము బట్టితి కావున భర్తవైతి సం
దేహము లేదు ధర్మనిహతింగల దోషముపోవరంబు హ్రా
ద్గాహము దీఱనిచ్చితినిదన్విని గైకొను ధర్మపత్నిగన్. 9-35

ఈ విధముగ శుక్రుడు యయాతినొడంబఱచి పలుకును. ఇట నొక విషయము గమనింపవలసియున్నది. శుక్రుడు "ధర్మ నిహతిం గల దోషము పోవరంబు హృద్దాహము దీఱ నిచ్చితి" నని పలుకును. అసలు ధర్మనిహితికిట దావులేదు. కచ వృత్తాంతము రాజునకు దెలియదు. కావున నట్లుతడు తలచుట యుక్తమే. మఱి శుక్రుడిటు లనుటలో సామంజస్యము లేదు. కావున నెఱిగియు రాజు మనస్తృప్తికి నటులనినాడు. దీని వలన ననర్థమేదియు లేదు. మఱియు భావినీ విషయము తెలియుట ద్వారా నేర్పడు ప్రతిష్టంభనాది యాపదనర్థములకు నానకట్టు. అసత్య మందురా? ఇది శుక్రనీతియే.

వామన చరిత్రమున బలిచక్రవర్తితో,

తే॥ సత్యవాక్యములందును నాతులయెడ<br>పరిణయములందు నిజవృత్తి పరుగు పొంటె<br>ప్రాణసంకటమప్డు గోబ్రాహ్మణార్థ<br>మనృతమాడి జనుడు దోషమందబోడు. 8-227.

అనిన మాటలు స్ఫురణకు దెచ్చికొనవలెను. ఇది పరిణయ సమయము కదా! అసలు నిశిత పరిశీలన మొనర్చిన యయాతికి వరమిచ్చినాననెనే కాని యేవిధమైన యసత్యమునాడలేదు. ఒకవేళ పరోక్షముగనైననట్లు ప్రవర్తించెనని భావించినచో పై వివరణము ప్రమాణము.

పిదప శుక్రుడు,

వ॥ అని వానినొప్పించి వారిరువురకుం బాణిగ్రహణోత్సవంబు గావించి శర్మిష్ఠం జూపి యిది వృషపర్వుని కూతురు. దీనిని శయనమ్మునకు దక్క దక్కునుంగల సర్వ విషయంబులందు నా కూతుంబలె జూచునది యని యంపి వుచ్చుటయు ...." 9-354.

ఈవిధముగ పరిణయమొనరించి పంపినటుల గానుపించును. ఇందలి శయన విషయము మూలముననే యున్నది.

"నాహముపాయ సుతాందత్త్వా సహశర్మిష్ఠయోశనా
తమాహరాజం శర్మిష్ఠా మాధాస్తల్పేనకర్హిచిత్." 9-18-30.

మిగిలినదంతయు శాస్త్రివర్యులు కూర్చినట్టిది. శుక్రునికిరీతి శర్మిష్ఠ యందు పుత్రికా భావము కలిగి యెంతో వాత్సల్యముతోనటుల చెప్పినట్లుగ చెప్పుటచే శుక్రపాత్రకు మిక్కిలి యున్నతి చేకూరినది. శయన నియమమైనను దేవయాని సంతోషము కొఱకు మాత్రమే తప్పక విధించినటుల దోచును. ఈ విధముగ నీపాత్రనుగూడ శాస్త్రి గారు మిక్కిలి చాతుర్యముతో తీర్చిదిద్దిరి. మిగులిన కథ యంతయును సమానముగానే నడుచును.

ఈరీతిగ నిందు దేవయాని పట్టుదల, కృతజ్ఞత, సమయ స్ఫూర్తి, వాదనాపటిమకలదిగను, యయాతి దయాపరుడు, ధర్మవర్తి, రాజ్య క్షేమంకరుడుగను, శుక్రుడు పుత్రికా వాత్సల్య పూర్ణుడు, సమయజ్ఞుడు, సమభావుడుగను మిగుల నౌచిత్యవంతముతో చిత్రింప బడినారు.

21. శ్రీకృష్ణావతార ఘట్టమున బాలరోదన ధ్వని నాకర్ణించి కారాగార పాలకులు కంసుని జేరి తద్వార్త వినిపించిన విధమిటుల మూల భాగవతమున నున్నది.

"తతో బాలధ్వనిం శ్రుత్వా గృహపాలః సముత్థితాః
తేతు తూర్ణము పవ్రజ్య దేవక్యా గర్భజన్మతత్
ఆచఖ్యుర్భోజరాజాయ యదుద్విగ్నః ప్రతీక్షతే". 10-4-1,2.

ఇందు నావార్త తెలియజేయబడిన విధము మిగుల సంగ్రహముగ నున్నది. అంతవరకునేపరిమితమైయుండగ శాస్త్రివారి యనువాదమున వారు చెఱసాలను గాచిన విధము వివరించి చెప్పుట కంసుని యందు

వారికి గల స్వామిభక్తి పరాయణతతోపాటు తమవిధి నిర్వహణ మందలి యప్రమత్తతయు జూపబడి సందర్భౌచిత్యముతో సొగసుగా నీ సందర్భము రక్తి కట్టినది.

వ. ఆగృహపాలకులు బాలరోదనంబువిని లేచివచ్చి చూచి యేచిన భయమ్మున జరీలునంజని కంసుగాంచి యిట్లనిరి.

శా. స్వామీ! నీకతిభీతిదంబయిన గర్భంబౌటు నానాడునున్
మేమెస్డున్ విడనాడకుండ బురిటిల్ మేల్కొంచు వీక్షించుచున్
జీమంజేరగ నీనివారమయి వాసిన్గాచి యున్నారమి
ట్లీ మాపాయమ వేదనన్ గొనగ నెంతే జాగరూకస్థితిన్.

ఉ. అప్పలు విప్పుకొంచచట తేపగునంతకు వేచియుంటిమో
యప్ప! కుమారుగాంచెనిపుడా వసుదేవ సతీవతంసమా
చొప్పు వచింపవచ్చితిమి చూచి భవన్మతమైన రీతిగా
నొప్పుఘటిల్ల జేయుటకు నోపు మటంచు వచింతుమో ప్రభూ!
10-పూ. భా. 1-93 నుండి 95.

ఈ యనువాద విషయమున శాస్త్రివర్యులలొనరించిన మార్పు పరమరమణీయమై యనౌచిత్యాదులు పరిహరింపబడి మిక్కిలి సొగసుగ నుండి యనితిరసాధ్యమై శాస్త్రిగారి శిల్పీకరణ పాటవమునకు నికషోపలమైయున్నది.

ఈకమనీయ రచనా పాటవము మూలమును మించి యలరారుచున్నది. కడుసొగసైన పద ప్రయోగములు చేయబడి తెలుగుదీయదనముచవిచూపించుట కవి నైపుణ్యమునకు గీటురాయియే.

"చీమంజేరగనీనివారమయి"

"తొసగులు విప్పుకొంచచటతేపగు నంతకు వేచియుండు"

కవి యనుభవైక వేద్యము. పోతన్న యనువాద మందు కానుపింపదు.

౭౨. యశోదకు బుత్రోదయమయ్యెనను మంగళవార్త వినిన గోపస్త్రీల సరంభమును మూల భాగవతమిట్లు వర్ణించినది.

"గోప్యశ్చా కర్ణ్యముదితా యశోదాయాః సుతోద్భవమ్
ఆత్మానం భూషయాం చక్రుర్వస్త్రా కల్పాంజనాదిభిః
నవ కుంకమ కింజల్క ముఖ పంకజ భూతయః
బలిభిస్త్వరితం జగ్ముః పృథుశ్రోణ్యశ్చలత్కుచాః"
గోప్యః సుమృష్ట మణికుండల నిష్కకంఠ్యశ్చిత్రాంబరాః
పథి శిఖాచ్యుత మాల్యవర్షాః
నందాలయం సవలయా వ్రజతీర్విరేజుః
వ్యాలోలకుండల పయోధర హార శోభాః"  10-5-9,11.

శాస్త్రివారిటనువాదము చేయుచు స్వీయ కపోల భాసురమైన భావములను జోడించి పసిడికి తావి గూర్చిన విధమునొనర్చిరి.

మ॥ వినిగోపీజన మయ్యశోదకపుడా విర్భూతుడయ్యెన్సుతుం
డనివించున్ జలకంబులాడి వసనాద్యాకల్పముల్ దాల్చిక
న్గొనలం దోకలు దేరనంజనము గైకొంచుం జపాసూనదా
మనిబద్ధోన్నత కేశపాశముల శుంభత్కాంతి భాసిల్లుచున్.

మ॥ పసపుంబూతల భాసమానమగుచున్ బంగారమోనాగనై
మిసిమింగాంచెడు మోములన్ మిగుల బేర్మింగూర్చు కస్తూరిబొ
ట్లొసగం దాలిచి మారుదీములొయనన్ హేమించుచున్ వేత్రితలం
బ్రఘి సరోజంబులబూజసేయుచు ధరిత్రిన్ గాన్కలంబూనుచున్.

ఉ॥ కమ్మలుగాజులున్మఱియుగంకణముల్ మణి కుండలాదులున్
గమ్మనిపూలదండలును గాసుల పేర్లు వరాల పేర్లు నె
త్తమ్ముల పెద్దమాలలను దాల్చి చలత్కుచభారలై ప్రమో
దమ్మున నంద గోపవనితామణి పాలికివచ్చిరిచ్చమై.

10-పూ. భా 1-౧౭౩నుండి౧౭౫

మూలమున "భూషయాం చక్రుర్వస్త్రకల్పాంజనాదిభిః" యని యున్న విషయము శాస్త్రివారి యనువాదమున విపుల వివరణముతో జెలువారు చున్నది. "అంజన" విషయము "కన్గొనలందోకలు దేర సంజనము గైకొని" రని సొగసు జూపబడినవి. "ఆదిభిః" యనునది "జపాసూన ధామనిబద్ధోన్నత కేశపాశముల" యిత్యాదిగ జెన్నారినది. "నవకుంకుమ కింజల్కముఖ పంకజ భూతయః" అని మూలమున నుండగా "కస్తూరిబొట్టెసగం దాలిచి యనుచు నించుక మార్పుతో ననువదింపబడినది. "కస్తూరీ తిలకం లలాటఫలకే" యనికదా కృష్ణ మూర్తి వర్ణనము. శాస్త్రివారికి యనువాద సందర్భమున నీ విషయము హృదయమున స్ఫురించి యుండును. మిగిలిన వర్ణనమంతయు వారి స్వీయమై వారి ప్రతిభకద్దము పట్టుచున్నది.

గోపికల యాభరణాదికాలంకరణము స్త్రీ స్వభావోచితముగ "రమణీయముగ "కమ్మలు గాజులున్" ఇత్యాదిగజెప్పుచు కాసులపేర్లు, మొదలగు రీతిని యందము చిందించిరి.

ఇక యీ క్రింది సీసపు సోయగము విలువ కట్టలేనిదై యద్భుతముగ శిల్పీకరింపబడినది.

సీ॥ అంచనూలున నేయనమి చంద్రధవళమై
మృదులంబులగు చీరలొడుగ గట్టి
నెమలి యీకలతోడ నెటిమీఱనల్లిన
నిగనిగమను రైకలగునన దొడి
ననువు దేరియు మెత్తనను బొల్చు పులితోలు
మిసిమి బాలలు దేర మెడల జుట్టి
గురివింజ పూసల వరుసలో మగణాలు
గూర్చిన దరడలు కొన్ని దాల్చి

ఇట్లు మూల విషయమొకక్రొత్త సొబగుతో శాస్త్రివారి ద్వారా యవ తరించినది. ఈ విధముగ గొల్లభామలు చిత్రవిచిత్రలంకృతలై కట్టెదుట గోచరించిన సౌందర్యమును జక్కగ శ్రీకృష్ణభాగతాను వాదము ప్రదర్శించినది.

23. బాలకమారక గ్రహముగ బూతన నందవ్రజమును జేరి నంద గృహమున లీలా బాలక విగ్రహుడైన కృష్ణుని జూచినది. అప్పుడు మూల భాగవతమున నిటుల జెప్పబడినది.

"బాలగ్రహస్తత్ర విచిన్వతీ శిశూన్ యదృచ్ఛయానందగృహేఽ
సదన్తకమ్
బాలం ప్రచ్ఛన్న నిజోరుతేజసం దదర్శతల్పేగ్ని మివాహితం
భసి "10-6-7.

శాస్త్రిగారు శ్రీకృష్ణభాగవతాను వాదమున నిటుల నా విషయ మును బ్రదర్శించిరి,

తరు॥ .... సరగున నందుని సతి యింటి కేగి."

వ॥ ప్రాంగణంబునంగల పర్యంకంబున బొత్తిళ్ళలోన బూదిం గప్పువడిన నిప్పుపోలె బత్రిచ్ఛన నిజోరు తేజుండైయున్న బాలుం బ్రభా విశాలుంగాంచి సమీపించునంత 10-పూ భా. 1-154,155. ఇట్లనువదించి పిమ్మటనొక చక్కని యుత్పలమును తమ ప్రతిభా చంద్రికచే వికసింపజేసి పోతన్నను దలపించినారు.

ఉ॥ బాలుడు దుష్ట రాక్షస నిబర్హణ శీలుడు పాపతూలవా
తూలుడు లోకపాలుడు ప్రతుష్ట మనస్సువిశాలుడున్ జగ
న్మూలుడు కాల కాలుడు సమున్నతశీలుడు సృష్టి చక్రసం
చాలన లోలుడుక్త గుణ జాలుడు సంభరితేంద్రజాలుడై.
10 పూ భా. 1-156.

శాస్త్రివారి యీ రచన పోతన్న ప్రభావమున ననుసరించి భాసురమై చవులూరించును. మూలమునగానరాని యొక సోయగమిటుల శ్రీకృష్ణభాగవతమున నిక్షిప్తమైనది. ఇందు చివరగా "సంభరితేంద్ర జాలుడ" ను ప్రయోగము సార్థకతతో సందర్భౌచిత్య భాసురమై యున్నది. ఇప్పుడా బాల కృష్ణుడు దొంగనిద్ర నటించి ప్రాణహ రణమున నింద్రజాలము చేయును. అది సూచితమైనది. ఇట్లు శాస్త్రి వర్యులీయెడ కమనీయ రచనా పాటవమును బ్రదర్శించినారు.

**24.** యశోద యొకనాడు బాలకృష్ణునకు జన్నుగుడుపుచు నాతడావులింపనాతని వదనమున సమస్త.... మూల భాగవతమున నీవిధముగ నున్నది,

"ఏకదార్భకమాదాయ స్వాంకమారోప్య భామినీ
ప్రస్నుతం పాయయామాస స్తనం స్నేహ పరిప్లుతా"
"ముఖం లాలయతీ రాజన్ జృంభతో దదృశే ఇదమ్
ఖం రోదసీ జ్యోతిరనీకమాశాః సూర్యేందువహ్నిశ్వసనాంబు ధీంశ్చ
ద్వీపాన్నగాంస్తద్దుహితౄర్వనాని భూతాని యాని స్థిరజంగమాని
సావీక్ష్య విశ్వం సహసా రాజన్ సంజాతవేపథుః
సమ్మీల్యమృగ శావాక్షీ నేత్రే ఆసీత్ సువిస్మితా"
10-7-34నుండి 37.

పిదప గర్గాగమనము, జాతకర్మాదికములొనర్చుట మొదలగునవి యష్టమాధ్యాయమున బ్రారంభమగుట యిత్యాదిగ గానవగును.

'గర్గః పురోహితో రాజన్ యదూనాం సుమహాతపాః
వ్రజం జగామ నందస్య వసుదేవ ప్రచోదితః' 10-8-1.
శాస్త్రివారి యనువాదమీరీతి గానుపించును.

సీ॥ 'ఒకనాడు బాలకునొడిలోన నిడికొని
నంద భామిని మహానందమునను....'

ఆ॥ "అట్లు విశ్వమెల్ల నాస్యంబునం జూచి
కంపమొంద నొడలు కన్నుమూసి
విస్మయంబునొందె వెలదుక తనలోన
గొడుకు చందమునకు గడునడరుచును" 10 పూ.భా. 1-197,198

ఇది మూలాను సారమై చక్కగ నున్నది. పిదప శాస్త్రివారు మూలమున లేకున్నను బాలకృష్ణుడు వర్ధిల్లిన విధమును క్రమపరిణతి యందు గమనీయముగ నిటుల జెప్పుట మిగుల నొప్పుగ నున్నది.

వ॥ అంతనక్కుమారుఁడును శుక్లపక్ష క్షపాకరుని చందంబున దినదిన ప్రవర్ధమానుండై,

సీ॥ తలయెత్తి చూచుచు లలినొత్తగిలుచును
గొన్ని నాళ్ళకు దానె కూరుచుండె
నడయిది చేనూని పదిలంబుగా లేచి
క్రమముగాదుదకు విద్దెములు చేసె ..."
10 పూ.భా.1-199,200.

ఇందు శిశువు క్రమక్రమముగ దలనెత్తి చూచుట, ఒత్తిగిలుట, కూర్చొనుట, ఆసరాజేసికొని లేచి నిలబడు ప్రయత్నమును జేయుట, పడుచు లేచుచు దప్పటడుగులతో నడుచుట కలవాటు పడుట, ముద్దముద్దగ నున్న మాటలు క్రమక్రమముగ ముద్దుముద్దుగనగుట, ఆటపాటలదేలుటతో నెట్లు పెరుగునో కనులకు గట్టినట్లు చూపబడినది. ఇది శాస్త్రివారి నిశిత పరిశీలనమునకు దారకారణము. ఈ విషయమును జెప్పుటలో శాస్త్రివారి యౌచితీ దృష్టి యద్భుతమని భావింపవచ్చును.

25. యజ్ఞభోక్త యయిన శ్రీకృష్ణుడు గోపబాలకుడై తోడి గోపాలురతో గూడి చల్దులారగించిన సన్నివేశమొక యద్భుతరస రామణీయక గుంఫితము మూల భాగవతమున నీరీతిగ గానవచ్చును,

"అత్ర భోక్తవ్య మస్మాభిర్దివారూఢం క్షుధార్దితాః

వత్సాః సమీపేపః పీత్వా చరన్తు శనకైస్తృణమ్
తథేతిపాయయిత్వార్భావత్సానారుధ్య శాద్వలే
ముక్త్వాశిక్యాని బుభుజుః సమం భగవతాముదా"
స"ర్వే మిథో దర్శయన్తః స్వస్వ భోజ్య రుచిం పృథక్
హస్తనో హాసయన్తశ్చాభ్యవజహ్రుః సహేశ్వరాః"

10 - 13. 6 నుండి 10

ఇత్యాదిగ విదితమైన కమనీయ విషయము శాస్త్రిగారి శ్రీకృష్ణభాగవతమున దెలుగు వెలుగుదనమున జెలువారుచు నిటుల గానుపించును.

చ. పగలరుదెంచె సామగుచు బాలకులార, క్షుధార్దితాత్ములీ
రగముల నీడలన్నిలచి యందఱమున్ భుజియింతమింతలో
దగసన నీ సరోజలముదాగి తృణంబులు వేయుచుం జరిం
పగ నగువత్సముల్ గలవు పచ్చికపట్లువె చూపుమేరలోన్.

సీ॥ "అనినవౌ గావుత మని గోప బాలకుల్
వడిగ "ట్ఠుర్రోయి" శబ్దములు వలికి—"

తే॥ వృక్షముల నీడల సమాశ్రయించి చలిది
చిక్కములు విప్పి పూవుల జిపురులందు
బత్రముల ఱాల దృణముల ఫలములపయి
నిలుపుకొని భుజించిరి వారు చలిది బువ్వ.

ఉ॥ "వారలు వారి భోజ్య రుచి....................

............ భుజించిరి గోపబాలకుల్" 10-పూ.భా

1-332 నుండి 340.

ఈ యనువాదమున దేట తేట తెలుగు నుడికారములు సొగసుగ బ్రయోగింపబడి స్వీయతాముద్రనునిలబెట్టుకొనుట కడు కమనీయము. పచ్చిక పట్లు, చూపుమేర, "ట్ఠుర్రోయి", మేయదోలి, చలిది చిక్కము, చలిదిబువ్వ; మేలమాడు, సారెకు, ఊఱుగాయ రసనందగు

ంచుచు ననునది పోతన్న ప్రిభావముచే బ్రియోగింపబడుట నిస్సం
పము. పోన్న యీ సందర్భమున,

"మాటి మాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరుగాయలు దినుచుండు నొక్కడు"

పోతన భాగ. 10-494.

యూఱుగాయ విషయము రెండు భాగవతాను వాదములందును
ండు విధములనేక భావద్యోతముగ గోచరించును.
ట్లగుట నా మహాకవుల కమనీయ భావనా పథము లు స్పష్టమగును.

పోతన్న "వ్రేలు మడచి యూరించి" చెప్పగా శాస్త్రివర్యు
కముగ "రసనమునకే తగిలించి" రుచి చూపినారు. ఇదియే సొగసైన
లుగు దనము.

ఇక కృష్ణుడు భుజించుటలో మూల భాగవత సుభగత్వము
గాడుడు,

"బిభ్రద్వేణుం జఠరపటయోః శృంగ వేత్రే చ కక్షే
వామే పాణౌ మసృణకవలం తత్ఫలాన్యంగులీషు
తిష్ఠన్ మధ్యే స్వపరి సుహృదో హాసయన్ నర్మభిః స్వైః
స్వర్గే లోకే మిషతి బుభుజే యజ్ఞభుక్ బాలకేలిః" 10-13-11.

ఈ రమణీయ దృశ్యము శాస్త్రివారిచేత గమనీయముగ నిటుల
ర్చబడినది.

:॥ మొలకుంజుట్టిన దట్టిలో దురిమి యింపున్నింపున వ్వేణువున్
గలశృంగంబును వేత్రదండమును జంకంబెట్టి మేల్మీగడల్
గలదధ్యన్నపుముద్ద బట్టి వలకేలన్ వేళ్ళులీక్షింపస్ని
ఘ్ధులనవ్వించుచు యజ్ఞభోక్త మెసవెన్ గోపాలుడై కేళిమై"

10 పూ. భా. 1-341.

"మసృణకవలము" "సొగసుగ మేల్మిగడల్గల దధ్యన్నపు ముద్ద"యయినది. యజ్ఞభుక్ 'యజ్ఞభోక్త' గా నయినది. 'బాలకేళి' 'బుభుజే' యనునవి గోపాలుడై కేళిమై మెసవెనని యవతరించినవి. ఈ విధముగ శాస్త్రివారి యనువాదము మూల విధేయమై తెలుగు ముద్రతో శోభిల్లినది.

26 శ్రీకృష్ణుడు గోవత్స, గోపాలకాది రూపుడై యొకవత్సర కాలము చరించునెడ బలరాముడు విస్మయచలితుడై యిటుల సందేహించును.

"కిమేతదద్భుతమివ వాసుదేవేఽఖిలాత్మని" 10-13-36.

ఈ మూల శ్లోకములోని" అఖిలాత్మని" యనునది శాస్త్రివారి యనువాదమున సవిస్తర రామణీయకముతో శ్రీకృష్ణ స్వరూపుడైన విష్ణు తత్త్వమును జూపుట యిటుల గాననగును.

శా। సర్వవ్యాపియు సర్వ సాక్షియు జగత్సర్వజ్ఞుడున్ విజ్ఞుడుం
సర్వేశుండును సర్వరక్షకుడు సాక్షాద్విష్ణుడే కృష్ణుడీ
యుర్విం బుట్టెను లోక రక్షణములో నూహించి చేయంగనై
సర్వం విష్ణుమయం జగత్తనుట నీ చందంబునం బొల్చునో.
10. పూ.భా. 1-358.

ఆయన సర్వజ్ఞత్వము "సర్వ" శబ్ద పూర్వకమైన ప్రయోగములతో సరళ మాధుర్యముతో సుస్పష్టము చేయబడినది. మఱియును "సర్వం విష్ణుమయం జగత్త" నునది ప్రమాణ పూర్వకముగ నటులే ప్రయోగింపబడి సౌందర్య ప్రీతి పాదకమైనది.

27. కాళియుని గర్వ భంజనార్థము లీలా మానుష విగ్రహుడై నటించు బాలకృష్ణుని జూచి తలిదండ్రులు విలపించిన విధము మూల భాగవతమున సంక్షిప్తముగ నిటుల చెప్పబడినది.

తుల్యవ్యథాః సమనుగృహ్య శుచః స్రవంత్యః
తాస్తా వ్రజప్రియకథాః కథయంత్య ఆసన్
కృష్ణప్రాణాన్ నిర్విశతో నందాదీన్ వీక్ష్య తంహ్రదమ్
ప్రత్యషేధత్ సభగవాన్ రామః కృష్ణానుభావవిత్"

10-16-21,22.

ఇట్లు రెండు శ్లోకములలో మిక్కిలి సంక్షిప్తమైన విషయమును శాస్త్రివారు సందర్భోచితితో పుత్ర శోకార్తులైన జననీ జనకుల ప్రలాపాధికమును వ్యక్తీకరించుచు తొమ్మిది గద్య పద్యములను వ్రాసినారు. ఇవి రసవంతములై సందర్భమును కనుల ముందట కనుపింప జేయును. మచ్చునకు కొన్ని పరికింపుడు.

మ। నడికిన్గాలముదాటిపోయినపయిన్ మాకైతివో బిడ్డ! ని
న్నొడికం బేర్పడ బెంచుకొంటి మధికోద్యోగంబుసంధిల్ల మా
కిడుదం చిన్నినివాపమల్ దలపనయ్యెల్లన్ వృథాయయ్యె మా
కిడుముల్ గూర్చితి చిచ్చు వెట్టితివి నీవిట్లైతి కట్టా! కటా!

చ॥ "పుడిసెడు నీళ్ళు పోసి .... పాల్పడజేసె నయ్యయో"

మ॥ "హ్రదవాతంబది .... వారీశ్వరుల్"

ఉ॥ "అల్లరి సేయువాడు .... నోప మీ పయిన్"

10. పూ. భా. 2-45 నుండి 50.

ఇందు తల్లిదండ్రుల మనోవిశ్లేషణము కడు సహజముగ గావింపబడినది. దానికితోడు సమర్థవంతమైన పదప్రయోగము జరిగి యధికతర స్ఫూర్తి కలుగుజేయబడినది. "మాకిడుదం చిన్ని నివాపముల్," "చిచ్చు వెట్టితివి, పుడిసెడు నీళ్ళు, పున్నె పుదారికి మెట్లుగట్టి, పాపపు దైవము, కొండంత వాడ, నీవెళ్ళిన త్రోవ బట్టెదము, మొదలగునవి మన తెలుగుల స్వంతము. ఈ జాతీయతా ప్రయోగములు శాస్త్రి

దండ్రులుకొడుకును "తండ్రీ"యని సంబోధించుటలోని సౌందర్యము, తీయదనము హరి వాత్సల్యమునకు బ్రతీక. ఈ రీతిగ శాస్త్రీవారు చిత్రీకరించుట మిక్కిలి యౌచిత్యవంతమై యున్నది.

28. గోపికలంతర్హితుడైన శ్రీకృష్ణుని నన్వేషించుచు గాన వచ్చిన యాయా వృక్షములను సంబోధించుచు బృచ్ఛించినట్లు మూలమున నిటుల చెప్పబడినది.

"దృష్టోవః కచ్చిదశ్వత్థ ప్లక్షన్య గ్రోధనోమనః
నందసూనుర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః
కచ్చిత్ కురవకాశోక నాగ పున్నాగంచపకాః
రామానుజోమానినీనాంగతదర్పహరస్మిత"
"యేన్యే పరార్థ భవికా యమునోపకూలాః
శంసంతు కృష్ణపదవీం రహితాత్మనాంనః" 10-30-5 నుండి9.

ఇందు వివిధ వృక్షముల నామములు- అశ్వత్థప్లక్షన్యగ్రోధా దికముగ ననేకములు కానవచ్చును.

ఈ పట్టున శాస్త్రీవారి యనువాదౌచిత్య సౌందర్యము ప్రసంశ నీయము.

సీ॥ మాచిత్త చోరుడై మామనోనాధుడు
కనుగప్పెవనులార కాంచినారె
మాబహిః ప్రాణమై మన్ననలిచ్చిన
పతిచనెంగనినారె పక్షులార
మధువుట్టి పడబల్కి మమ్మేలు వల్లభుం
డరిగెనోగిరులార యరసినారె
మాతోడనాడుచు మరగించు ప్రియుడెటో
చనియె నారసి నారె సరసులార

తే॥ మాకు నెన్నెన్నియో ప్రియ వాకు లొసగి
వేణుగానము మా చిత్త వీధి నెఱపి
మమ్ము నేలెదనని చెప్పి మా విభుండు
విడచి పోయెను గంటిరే జడధులార! 10 పూ.భా.2-372.

మూలమునందనేకానేక వృక్షములనామములొక జాబితావ నుండి కొంచెము విసువు జనింప జేయును. శాస్త్రివారా లోపము బరిహరించి కథకనుకూలముగ నౌచిత్య దృష్టితో "కనుగప్పె వ లార కాంచిహారె" అని యల్పాక్షర సంఘటనమున మూల భావవ నంతటిని ద్యోతకము కావించిరి. మఱియు బ్రకృతిలోని ప్రతి ప ర్థమును కృష్ణుని గూర్చి ప్రశ్నింపజేసి మూలమునకే వన్నె పెట్టి పక్షులను, గిరులను, సరసులను, జడధులను వానిని గూర్చి ప్రశ్ని చుట మూలమున లేదు. ఇట్లు సందర్భౌచిత్యముతో శాస్త్రివారి య వాదము మూలమును మించి యలరారుచున్నది. అంతియకాక యె రమణీయ నిక్షిప్త భావమిటు గాననగును. పద్యమందంతటను "మ శబ్దము ప్రయోగింపబడినది. సంస్కృతశబ్దముగ గ్రహించినచో ల దేవి యని యర్థము. అనగా నిక్కడ గోపికలు తాము లక్ష్మ్య గంభూతులమని చెప్పక చెప్పుచున్నారు. లేనిచో నారీతి కృష్ణ స సత్యము వారికి లభింపను. శాస్త్రివారి ప్రతిభ యమోఘమని ల రచనమును జూపుచున్నదనుట నిస్సంశయము. పిదప మూలవ "మాలత్యదర్శివఃకచ్చిత్ మల్లికే జాతి యూథికే" అని యున్నది. శాస్త్రివారు పోతన్నచే ప్రభావితులై రచించి రనుట నిస్సంశయ యీ క్రిందిపద్యము ఋజువు చేయును.

చ॥ తొలకరి మబ్బుతోడదులదూగెడు నల్లని మేని వాడు త
మ్ములకెనవచ్చు కన్నుగవ బొంపెసలారెడు వాడు నెవి
[illegible]

వలనికి రాదుగా దెలియ బల్కడు మల్లికలార మక్కువన్.
10-పూ. భా. 2-373.

ఈ సందర్భమున బోతన్నచే రచింపబడిన పద్యము మిక్కిలి ప్రసిద్ధము.

ఉ॥ నల్లనివాడు పద్మనయనమ్ములవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వురా
జిల్లెడు మోమువాడొకడు చెల్వలమానధనంబు దెచ్చెనో
మల్లియలార। మీ పొదలమాటున లేడు గదమ్మ చెప్పరే.
పోతన భాగ. 10-1010.

రెండు నించుమించు సమాన భావమునే చూపుచున్నవి. కాని పోతే శాస్త్రివారిది చంపకము, పోతన్నది ఉత్పలము. పోతన్న పద్యమును జూచి శాస్త్రివారు నిటుల సందర్భౌచిత్యమే కనుక తాము నను వ్రాయవలెనని మక్కువపడి యుందురు.

ఇక మూలములోని "కచ్చిత్తులసి కళ్యాణి" యనునది "యో తులసీ యెఱిగెనొగదే వీక్షించితే జెప్పవే" యనియు ననువదింపబడినది. మఱియు

"మాకందమా। కుందమా। క్రముకంబానుముఖంబ"
చెప్పగదరే కంజాక్షుడెందేగెనో"10. పూ. భా. 2-374,375.

యనుచును ననువదింపబడుటలో నొకటి రెండు భూజముల నామములు కానుపించును. ఈ రీతిగ నౌచిత్యముతో నీసందర్భము శ్రీకృష్ణభాగవతమున నగుపించును.

29. అక్రూరుడు కంస సందేశహారుడై కృష్ణ భావనలచే దన్మయత్వమున రథారూఢుడై వచ్చుచు సాయం సమయమునకు గోకులము జేరి యచట శ్రీకృష్ణుని పాదముద్రలను హలకులిశాది రేఖా సంచిత సహితముగ గాంచును. అప్పటి వాని భక్తి భరిత మనస్థితిని మూలమిటుల వర్ణించినది.

"ఇతి సంచిన్తయన్ కృష్ణం శ్వఫల్క తనయోఽధ్వని
రథేన గోకులంప్రాప్తః సూర్యశ్చాస్తగిరింనృప
పదాని తస్యాఖిలలోకపాల కిరీట జుష్టాఽ మలపాదరేణోః
దదర్శ గోష్ఠే క్షితి కౌతుకాని విలక్షితాన్యబ్జ యవాంకుశాద్యైః"
"సందేశాత్ యోహరేర్లింగ దర్శనశ్రవణాదిభిః" 10-38-24నుండి27.
శాస్త్రివారి యనువాద రామణీయకమిది.

వ. అని యిట్లు శ్వఫల్కతనయుండగు నక్రూరుండధ్వమధ్యంబున దనలోదాను బలుకుకొనుచు ననేక విధంబుల నాలోచించు చున్నంతలోనలోకబాంధవుని రథంబస్తాద్రి దరియం జేర నక్రూరుని రథంబు గోకులంబు దరియం జనియెనంత నా ప్రాంతంబున,

చ. సలలిత గోష్ఠభూనికట సన్నుతభాగ సమాహితంబులున్
హలకులిశాది రేఖలసమంచితమున్ హరిపాద చిహ్నముల్
ఫలక వినిర్మితంబులయి భాసిలు చిత్రములో యనన్ధరా
కలిత విభూషణంబులయి కానగవచ్చెను వాని కచ్చటన్.

క॥ కని రథము డిగ్గి సంభ్రమ ........... నానందమునన్.

క. చేమోడ్చి మోడ్చి వానికి
వేమాఱశ్రువుల దడిపి వెసనద్దానిన్
మోమున దాలిచి వెనుకం
బ్రేమాంచిత భక్తి నెత్తి మెత్తుకొనెనోడల్.

వ. మఱియునా స్థలంబుపై దలపెట్టి పండుకొని పొరలి లేచి మఱియు నరదంబెక్కి సరయంగంజను. 10. పూభా. 3-105 నుండి109.
ఇటు మూల విషయము యథాతథముగ గన్నుల గట్టినట్లు శాస్త్రివారు చెప్పినారనుటలో సందియమందబనిలేదు. అంతటితో వారూరు కున్నచో కవిగా మాత్రమే యుండి యుందురు. ఇంకను నిటుల జెప్పి తాము మహాకవి యని నిరూపించుకొనివారు. అక్రూరుడు భక్తి

పరవశుడై వాని వానిని ప్రశ్నించుటలో గోపికలు కానరాని శ్రీ కృష్ణుని వెదకులాడుచు వృక్ష గుల్మ లతాదులను ప్రశ్నించిన తత్వము గోచరమగును.

సీ॥ గోపాలురార। మీ గోపతులగు వారు

బలకృష్ణులెందున్నవారో చెపుడ....'

తే॥ మార్గ వృక్షములార........

పూత వాయువులార యోపుణ్య జనము

లార బలకృష్ణులెందున్న వారో చెపుడ" 10 పూ.భా.3-110.

ఇందకూ్రురుని భక్తి భరిత హృదయము రామకృష్ణులను చూడవలె ననియెడు యాతురచి చక్కగ నిరూపింపబడి సన్నివేశౌచిత్యముతో నుండి మూలమునకు మెఱుగు పెట్టుచున్నట్లున్నది.

30. ప్రద్యుమ్న జననమును గూర్చి మూల భాగవతమున నొక రెండు శ్లోకములందు మాత్రము మిక్కిలి సంగ్రహముగ నీ విధముగ నున్నది.

"కామస్తు వాసుదేవాంశో దగ్ధః ప్రాగ్ రుద్రమన్యునా

దేహోపపత్తయే భూయస్తమేవ ప్రత్యపద్యత।

సఏవ జాతో వైదర్భ్యాం కృష్ణవీర్య సముద్భవః

ప్రద్యుమ్న ఇతి విఖ్యాతః సర్వతో నవమః పితుః"10-55-1.2.

శాస్త్రివారీ విషయమును కడు సొగసుగ దెలుగుదనముతో నీరీతి కించిద్విస్తరించుట కాననగును.

వ॥ అక్కాలంబున నిక్కడ రుక్మిణీదేవి గర్భవతియై.

కం॥ కనియె గుమారున్ మారున్

మునివర వైరున్ సమస్త భువనాధారున్

ఘనరుచిరాకారున్ స

జ్జనసుత సుకుమారు ధీరు సాధువిహారున్.

చ॥ నెటిలగనంబునం బొడమి ........ ... బాడిరూచుమున్.

ఆ। గాలి దూలి సోకి కందుసెడక యుండ
........................ ........వేరుకొనగ.

క। నంద కుమారుండపు డా .... దీనారములన్.

తే। "కొడుకు కుఱ్ఱ జనించిన గడియ యందు
నభ్రవాణి జగంబెల్ల నాలకించు
నటులు ప్రద్యుమ్నుడని పల్కనదియె నామ
కరణముగ జేసె గృష్ణుండు కౌతుకమున"

10.ఉ.భా. 1-174 నుండి 178.

అనువాదమున బై మొదటి పద్యమునందలి ఛేకాను ప్రాసము యమకములు మిక్కిలి సొగసుతో నౌచిత్యముతో సందర్భమును వెలార్చుచున్నవి. పిదప మంత్రసాని తనచే సురియితో "బొడ్డుగోయుట" గరితలు "లాల" పోయుట, ఆ వెనుక సాంబ్రాణి పొగవేయుట, ఉయ్యేలలో నుతిమెత్తని మెత్తలుపఱచి పండబెట్టి జోలపాటలుపాడుచు నూచుటలోని తెలుగు దీయదనము వర్ణింపనలవికానిది. మఱియును గాలి ధూళులు సోకకుండ విభూవి జల్లుటు, వేర్లుళ్ళు, ఏలకులు మొదలగు వానిని నూరి పొగవేసి దృష్టి దోషము తగలకుండ నాచారాదికములొనర్చుటలు మధురాతి మధురముగ జెప్పబడి తెలుగువారి పురిటింటిని చక్కగ శాస్త్రిగారు చూపి సందర్భౌచిత్యమును బాటించినారు. పిదప కృష్ణుడు జాత కర్మాదికమొనర్చి విప్రులను భూరిదక్షిణాదికముచే దృప్తులనొనర్చినాడు. పిదప మూలమున "ప్రద్యుమ్న ఇతి విఖ్యాతః" అని మాత్రమున్నదానిని శాస్త్రివారు తమ యనువాదములో నభ్రవాణిచే నామకరణము జేయించినారు. ఇటులొనర్చుట మిక్కిలి చక్కగ నున్నది, భావిని శంబరాసురభంజనుడగునుకదా ప్రద్యుమ్నుడు. అంతటి శక్తివంతుడగును కనుక నానికి నటుల చపల వాతచే బేరు బెట్టించి వాని యున్నత స్థితికి దగినటుల నను

వదించుటలో శాస్త్రివారి యౌచిత్యదృష్టి ప్రశంసా పాత్రము. ఈ రీతిగ నీ విషయము మిక్కిలి యౌచిత్యవంతమై యొప్పుచున్నది.

31. బాల ప్రద్యుమ్నుని మ్రింగిన ఝషమును కైవర్తుడొకడు పట్టికొని శంబరునకు గానుకగానీయగా నాతడు వండి తెండని మహానస గృహమునకు బంపును. అచటి వారు దానిని భేదించి బాలసుందరు నొకని కన్నులవిందుగా గాంచి యధికారిణియైన మాయావతిగనున్న రతీదేవికి నా విషయమును నివేదింతురు. ఇటుల మూలముననున్నది.

"తం శంబరాయకైవర్తా ఉపజహ్రురుపాయనమ్
సూదా మహానసంనీత్వావద్యన్ స్వధితినాద్భుతమ్
దృష్ట్వా తదుదరే బాలం మాయావత్యైన్యవేదయన్
నారదోఽ కథయత్ సర్వం తస్యాః శంకిత చేతసః
బాలస్య తత్త్వముత్పత్తిం మత్స్యోదరనివేశనమ్"

10-55-5,6.

దీనికి శాస్త్రివారియనువాదము సొగసుగ నించుక మార్పుతో నౌచిత్య వంతమై కానవచ్చును.

వ॥ "…. మత్స్యంబులందుత్తమంబునగు వాని నేరి మత్స్య ఘాతుకులు వాని శంబరునకుం గానుక వెట్టిన వాడు వాని దన మహానసంబునకుం బుచ్చెనంత నచ్చట,

శా॥ ఆయామీనుల వంట యింటి …. విడ్డూరమున్.

వ॥ అట్లు విస్మయంపడుచు వారందఱును బరీక్షించి చూచుచు

సీ॥ "రంగారు బంగారు రంగులీనెడు మాంస
ఖండమిా చేపలో గలుగు నొక్కొ—"

తే॥ కాకయుండిన కలదె యీ కాంతిమేన

దయ్యమిటు భూతమో యిదితరుణులార।
కోసి చూతము కడముట్టజేసి దీని.

10.ఉ.భా. 1-186 నుండి 189.

ఇందు వంటలక్కలు మత్స్యమును సగముకోసి యందా యుష్మంతుని తేజమరసి మాయావతికి జెప్పినట్లు సొగసుగ మార్పు చేయబడినది. పూర్తిగ దరిగినచో నందున్న బాలుడు కూడ ఖండిం పబడును కదా। కావున నిది యౌచిత్యవంతముగును. పిదప వారంద అను బరీక్షించుచు తత్కారణము నూహించుట కడు రమ్యము. ఇంకను రమ్యమైన భావనము కలకంఠు సెగకంటి కడిదికి వెలచి సిడంబని మరుడిందుడాగెనొక్కొ "యనునది. నిజముగ నందున్నది మరుడే. కాని వారూహించిన కారణము వేరనుకోండి. ఇట్లనుట మనకతడెవరైనదీ తెలియును. కాని యా పరీక్షకులకు మాత్రము తెలియదు. దీనివలన మనకు కలుగు చమత్కారానందమవధిలేనిది. పిదప,

క॥ అని మాయావతి యాజ్ఞం
గొని తెలవలు చుట్టు వాలుకొని చుట్టు దెగం
బనివడియల్లన గోసిరి
కనబడు నాసత్వదార్ఢ్యము చెడ కుండన్.

10.ఉ భా.1-209.

ఈ రీతిగ నాస్త్రీలు లోని పదార్థము పాడవకుండ నతి జాగ్రత్తగ నా మీనమును గోసిరి. పైన నేను జూపిన కారణము దీనితో సరిపడినది కదా! పిదప నందు దోచిన ప్రద్యుమ్నుని యతిలోక సౌందర్య మిటుల ననన్య సామాన్యముగ శాస్త్రివారు చిత్రీకరించిరి.

వ॥ అంతలోనందు

సీ॥ పాలబుగ్గలవాడు పసపు నిగ్గులవాడు
పున్నమనెలబోలు మోమువాడు

వాలుగన్నులవాడు వ్రేలు చేతులవాడు
చుట్టువాటిన లేత చుంచువాడు

10-ఉ-భా-1-192.

ఇట్లు బాల ప్రద్యుమ్నుని రూపు రూపు కట్టించినారు శాస్త్రివారు మఱి మారుడే కదా యా బాలుడు, ఇంత సొగసుగ వర్ణించి చూపుటలో నింత యౌచిత్య భావనమున్నది.

ఇక నీతని యావద్వృత్తాంతమును దివిజమునియైన నారదుడప్పుడచటికి వచ్చి చెప్పి పోయినట్లు మూలము. ఇది యౌచిత్యవంతముగ గానరాదు. అప్పుడు పనికట్టుకొని వచ్చి నారదునకు జెప్పనవసరమున్నదనుట యసమంజసము. కావున శాస్త్రివారు మున్నె యిట్లు జరుగుననినారదుడాడిన మాటలను స్మరణకు దెచ్చుకొనినట్లు మార్చి యౌచిత్యమును బాటించినారు.

———— మాయావతి తొల్లి తనకు నారదుండా వృత్తాంతం బంతయు నెఱింగించి యుండటంజేసి క్షణార్ధంబులో నా సర్వంబును స్మరణంబునకు దెచ్చుకొని —— 10-ఉ-భా-1-194.

అంతమంది స్త్రీలు చుట్టుముట్టి యాశ్చర్యముతో బరికించుచుండగ నారదుడేగుదెంచి యా వృత్తాంతమునామెకు నెఱిగించెననుటలో గానుపించిన యట్టి యనౌచిత్యమును శాస్త్రివారు మిక్కిలి సమర్ధవంతముగ బై రీతిగ బరిహరించియౌచిత్యమును జూపుమార్పును ఒనరించుట యద్వితీయము.

పిదప నా వృత్తాంతమంతయు బరమ రామణీయమై శాస్త్రివారి యనువాదమున నీషద్విపులీకరణముతో మూలమును మించి కానుపించును.

మచ్చునకు నీ పద్యము జూడుడు,

క॥ తల్లియని హరి సుతుండును
వల్లభుడని రతియులోన భావించుచున
త్యుల్లాసంబున గాలం
బల్లన వెళ్ళించిరంతనా సమయమునన్. 10-ఉ.భా.1-209.

ఇంత చిన్న పద్యమున వారి మనో భావములను కడు సొగసుగ శాస్త్రిగారు కనుకనే చూపించగలిగినారు.

32. బాణాసురుని తనూజ యుష స్వప్నమున ననిరుద్ధుని గవిసి మేలుకాంచిన పిదప చెలి చిత్రలేఖకు మనోహరుని గూర్చి యిటుల వివరించినట్లు మూల భాగవతము.

"దృష్టః కశ్చిన్నరః స్వప్నే శ్యామః కమలలోచనః
పీతావాసా బృహద్బాహుర్యోషితాం హృదయంగమః
తమహం మృగయే కాన్తం పాయయిత్వాధరం మధు
క్వాపి యాతః స్పృహయతీంక్షిప్త్వా మాం వృజినార్ణవే.
10-62-16,17.

శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతానువాదము నందలి సొగసు జిగి బిగి కలిగి నెగడుట కనుగొనుడు,

సీ॥ పున్నమ చందురుబోలు మొగమువాడు
కలువలకెనవచ్చు కన్నులవాడు
10 - ఉ. భా. 2-14.

మన్మథుని యాత్మజుడయిన నీ యనిరుద్ధుని రూప వర్ణనము మూలమును మించియున్నది. చక్కని యన్త్యప్రాసము మఱింత యందము నిచ్చినది. మదనావేశమున నుషాకన్యక యిటుల విపుల ముగ వివరించుట సమంజసమే. మఱియు రెండవ శ్లోకమునకను వాదము_

చ॥ అతడధరామృతంబు దనివారగ ద్రావగనిచ్చి ముచ్చటల్
కుతుక మెలర్ప జేయుచును గొంచెమునే గృపలేక కోరున
న్నతగుడువోలె దుఃఖమున యందు బడల్ పడజేసి వీడియే
గతి నెటుపోయెనో యనుచు గాంతుని రోయుచున్నుంటిగంటివే.

10 – ఉ. భా. 2-15.

అంతయును జెప్పి చాని "నతగుడువోలె" యని చక్కని విశేష ముత్తో జెప్పుటయేకాక "కంటివే?" యని ఏదో ఫిర్యాదు చేపినట్లు పల్కినది. చెల్లి చిత్రరేఖ యంత కంటను చమత్కారి చూడు డేమనినదో,

క॥ కనలేదుగాని సీవా
తని జెప్పితి వేని నేను దత్తయుక యెందుం
తీన వెదకి తెచ్చి నీమన
మున యుందగువ్యసనమెల్ల బోకార్తుజెలీ. 10-ఉ. భా. 2-17.

వెంటనే "కనలేదు కానీ"యని సొగసుగ మొదలిడి యామెను నన్వించి యోదారుచునభయమిచ్చి తన సఖీత్వమును ఋజువొనర్చు కొనినది. అనినటులే పిదప కార్యమును సాధించి యనుగు జెలి ప్రాణములను నిలువబెట్టినది.

ఇది శాస్త్రివారి చవులూరించే రచనా వైశారద్యము.

33. ధర్మరాజు రాజసూయాధ్వరమున గృష్ణునర్చింపగ శిశుపాలుని యనౌచిత్య భాషణము మూలమున నిటులున్నది.

"తపోవిద్యా వ్రతధరాన్ జ్ఞాన విధ్వస్త కల్మషాన్
పరమర్షీన్ బ్రహ్మనిష్ఠాన్ లోకపాలైశ్చ పూజితాన్
సదస్పతీనతిక్రమ్య గోపాలః కులపాంసనః
యథాకాకః పురోడాశంసపర్యాం కథమర్హతి-
వథా పానరతం శశ్వత్ సపర్యాం కథమర్హతి"

10-74-33 నుండి 36.

దీనికి శాస్త్రిగారు భారతమున ననుసరించి,

సీ॥ గుణవృద్ధు వృద్ధని కొలవంగనెంచితే

............ ఖలునిపీని" 10-ఉ.భా. 2-245.

అని యుచితముగ ననువదించి మూలములోని, "యథాకాకః పురోడాశం సపర్యాం కథమర్హతి"యనుదానిలోని యనౌచిత్యమును బరిహరించుటకు దాని ననువదింపక విడచిరి. ఇటు నౌచిత్యమును ననుసరించి మూలత్యాగము. పిదప,

తే॥ కులము వర్ణము నాశ్రియ మెలమి విడచి
స్వైర వృత్తిని విహరించు జాతివాడు
మును యయాతి శపించె సీతని కులమ్ము
నట్టి యితడెట్టులర్హుడౌ నర్హణకును. 10-ఉ.భా.2-246.
అని మూలానుసారముగనే యనువదించుట కలదు.

34. కుచేలోపాఖ్యానమున కుచేలుని సాంసారిక దారిద్ర్య స్థితి మూలమున నిటులున్నది.

"తస్య భార్యాకుచైలస్య క్షుత్క్షామాచ తథా విధా
దరిద్రాసీదమాసావేవ మానా భిగమ్యచ" 10-80-7,8.

శాస్త్రివారా కుచేలుని దారిద్ర్యమును, వాని భార్య పాతివ్రత్యము నెటుల దమయనువాదమున గన్నులకుగట్టించిరో పరికింపుడు,

సీ॥ అమ్మ బువ్వ యటంచు నాకటుంగటుకటు
వడు బిడ్డలంగని కడుపు కాన
కనికరంబున బిండిగలిపిన నీళ్ళన్ని
త్రావంగ నిచ్చును బ్రత్యహంబు"

తే। గుడిసె కురిసిన జేట పై నిడికొనుచును
జలికి కుంపట్ల బ్రిక్కల నిలుపుకొనుచు

గాపురము చేయునా యమ్మ కాటకమున.

10- ఉ. భా. 2-314, 315.

ఇంతకంటెను భరింప శక్యముకాని పేదరికము వేఱుండనివిధముగ శాస్త్రివారు చూపుట మిక్కిలి స్తుతిపాత్రము. ఇది కుచేలుని దయనీయ స్థితిని రూపు కట్టించుచు నౌచిత్యమైనదనుట సుస్పష్టము.

35. శ్రీకృష్ణుడుద్ధవునకు నొక లోభి వృత్తాంతమును వినిపించును. ఆ సందర్భమున నొకచో మూలమున నిటుల గానవచ్చును.

"తస్యైవం యక్ష విత్తస్యచ్యుత స్యోభయలోకతః
ధర్మకామ విహీనస్య చుక్రుధుః పంచభాగినః" 11-23-9.

దీనికి శాస్త్రివారి యనువాదము కడు సొగసుగ వివరణముతో గానవచ్చును. మూలమునందలి "యక్షవిత్త"మనుదానికి జూడుడు,

సీ॥ కవిలె కట్టులు విప్పి గడియగడియ జూచు
బొతులపై బూలు పత్రివెట్టు
గాబుల యింటిలో గస్సుమంచు డాచు
నడయాడుచున్నది నలుగడలును
బోరాదనుచు నింటివారితో బలుకును
దినవెచ్చ మొనరింప దిగులు గుడుచు
తోటాకు గొనితెచ్చు మేటి శాకంబంచు
నెఱుగరాద్యంతములింటివారు
తే॥ భూత వేతాళ పూజలు ప్రీతి జేయు
గుక్కలను బెంచు బవలు రేల్ కొంపగాయ
దనదు కన్నెప్డు ధనమంద తవుల నిలిపి
రేబవల్ దాని రక్షించు దేబెవాడు. 11-294

మూలమునందలి "యక్షివిత్తమ"నువాదమున నింతైనది. వాని స్వభావమును సుంతైనను వీడక వ్యక్తీకరించినది, పిదప

తే॥ పొట్టకుదినందు పరులకు బెట్ట డెపుడు
ధర్మకామములవి లేనిదాన బాప
డుభయలోకములకు గాక యుత్త యగుచు
వసుధ కుంభారమై కానవచ్చువాడు. 11-295.

ఈరీతిగ మూలములోని "మృతస్యోభయలోకతః" యనునది కను
పించును. ఉభయభ్రష్టుడైనాడు.

ఇక,

"ధర్మకామ విహీనస్య చక్రుభుః పంచ భాగినః" యనునది,

క॥ పంచమహాయజ్ఞములే
పంచలనోపట్టి వాని పథమెఱుగడు వా
డెంచంగ బిసిడి యెంగిలి
కొంచెము గలచేతగాకి గొట్టండెవ్వుడున్.

తే॥ యజ్ఞభాగములెప్పుడయ్యజ్ఞునింట
దొరకకుండుట దేవళ్లు ధరణిసురులు
క్రుద్ధులైరోయుదురు వానికొంపదరికి
గాకులును కుక్కలును రావు కన్ను దప్పి. 11-296,297.

యనుచు గనుపించును. పంచమహాయజ్ఞములే పంచలనో పట్టినవట.
ఎంగిలి చేతితో గాకిని కూడ గొట్టడను తెలుగు జాతీయము సందర్భో
చిత్యముతో నొప్పుచున్నది. కుక్కలు, నక్కలు కనుదప్పి యెప్పుడును
వాని కొంపదరికి రావుట. ఈరీతిగంశాస్త్రివారి యనువాదము సహజ
సుందరముగ, రసవంతముగ గానసగుచు మూలమును మించినదన
వచ్చును.

36. మార్కండేయ చరిత్రమున మార్కండేయుడు మృత్యుంజ
యుడగు విషయము బహు సంక్షిప్తముగ నొక శ్లోకార్థ భాగమున
నిటులున్నది.

"వ్యతీయాయ మహాన్కాలో మన్వంతరషడాత్మకః" 12-8-14. ఇందు మఱియును "వ్యతీయాయ మహాన్కాలో" యనునదియే పై విషయమును జెప్పుచున్నది. ఇది శాస్త్రివారి యనువాదమున నేడు గద్య పద్యములలో వివరముగ జూపబడినది.

మార్కండేయుని యసువులు గ్రసించుటకు వచ్చిన భీకర కాలుని వర్ణనము మచ్చునకు జూడుడు.

మ॥ గళగర్తప్రతిపాదితాస్య వివరోద్గాంతోగ్రనిధ్వానని
స్తుల శబ్దీకృత రోదసీకుహరుడస్తోకాగ్ని భీముగ్గదా
చలిత వస్ఫుట హస్తు డత్యధిక దుష్ట భ్రూయుగుండుజ్జ్వల
జ్వలన జ్వాలనిభాభనేత్రముఖుడావైవస్వతుండుగ్రుడై.

12-103.

ఇందలి పదగుంఫనము సమాసయుక్తమై గంభీరత్వముతోనుండియుగ్ర దక్షిణాశాధినేతృ రూపమును బట్టి యిచ్చునదై యౌచిత్యముతో నలరారు చున్నది. శాస్త్రివారి రచనా పాటవమునకు, పాత్ర చిత్రణా నిపుణతకు, పాండిత్య శౌండీర్యమునకు నిది నికషదృషత్తయి వన్నెల నింపికొనినది.

ఈవిధముగ శాస్త్రివారి శ్రీకృష్ణభాగవతము సుందర నిష్యంద భాసురమై యౌచిత్య శోభితమై యలరారుచు మూల భాగవతమున కతి సన్నిహితముగ గానవచ్చును. ప్రతి మూలకమునకును బరి శీలించుట యసాధ్యముకావున స్థాలీపులాక న్యాయముగ సాధ్యమై నంతలో సవివరముగను, సప్రమాణముగను శ్రీకృష్ణ భాగవతా నువాదమును బైరీతిగ బరిశీలించి యుంటిని.



# చతుర్థ కళిక

## శ్రీకృష్ణభాగవతము - శైలీ విన్యాసము

"యా పదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే" (ప్రతాపరుద్రీయ కావ్యప్రకాశము) అను అలంకారిక లక్షణమునను సరించి పదముల వినిమయాసహిష్ణుత్వము విశేష గుణముగ చెప్పబడుచున్నది. అట్లే 'విశిష్ట పద రచనా రీతిః యని, రీతిరాత్మా కావ్యస్య (కావ్యాలంకార సూత్రవృత్తి 1-1-,67.) మొదలగు అలంకారిక వచనములు విశిష్ట పదరచన రీతి యన్ని, ఆరీతియే కావ్యాత్మయని నిరూపించుచున్నవి. ప్రాచీనులు నిర్వచించిన శయ్యా, రీతియను వాని కలయిక వలన నేర్పడినది యీ శైలి. పాశ్చాత్యులు పేర్కొనిన "స్టైల్"యను పదమునకుశైలికిని దగ్గర సంబంధము కలదని భావింపవచ్చును. ఆప్టే పండితుడు సంస్కృతాంగ్ల నిఘంటువులో శైలీ పదమునకు

A' mode of expression'

(సంస్కృతాంగ్లనిఘంటువు ఆప్టేపండితుడు) అని అర్థమిచ్చి దానికి ప్రమాణముగ మనుస్మృతి వ్యాఖ్యలో కుల్లూకభట్టు రచించిన "ప్రాయేణాచార్య వర్యాణామియం శైలీ యత్స్వాభిప్రాయమపి పరోపదేశమివ వర్ణయతి" అను వాక్యము నుదహరించినాడు. శ్రీనాథుడును శృంగారనైషధమున "ఒప్పిదపుశైలి బఠింతురు ప్రౌఢ భామినుల్" (శృంగారనైషధము 7-157 ) అని శైలీ పద ప్రయోగము

కావించినాడు. 'Style is the man' అను ఆంగ్ల సామెతనీసందర్భమున గమనింపవలెను. కవి శైలియే యాతన వ్యక్తిత్వాదులకు దర్పణమని యెల్లరకును విదితమే. తెనుగున ఆదికవి నన్నయ భట్టారకులు తన కవితా గుణములలో "అక్షర రమ్యత" ను ఒక విశిష్ట లక్షణముగ పరిగణించుట గణనీయ విషయము.

"శీల" ధాతువు నుండి నిష్పన్నమైన "శైలి" కవి రచనా ఫణితిని గణన చేయునదిగా పరిగణింపవచ్చును. ప్రతికవికిని తనదగు నొకా నొక శైలి యుండుట సామాన్యము. ఆ కవియే సన్నివేశమును బట్టి శైలీ భేదమును పాటించుటయు పరిపాటియే. 1. రసానుగుణమగు పద ప్రయోగము, 2. అక్షర యోజన, 3. పాత్రౌచిత్యమునకు తగిన సంభాషణ, 4 సంస్కృతాంధ్ర పద ప్రయోగ నైపుణి, 5.వృత్తౌచిత్యము మొదలగునవి స్థూలముగ నీశైలికి లక్షణములని చెప్పవచ్చును. ప్రసిద్ధ కవి పద్యములు ఒండు రెండు వినినంతనే ఆ పద్యములు ఫలానా కవివని గురుతించుట అనుభవ సిద్ధము. అట్లు జరుగుట వారి వారి శైలినిబట్టియే సాధ్యము.

శ్రీకృష్ణభాగవతకర్త సంస్కృతాంధ్ర సాహిత్య ప్రపంచ సారమును ఆకళించుకొని తడనగు ప్రత్యేకత నిలుకొనుటకు "స్వకీయతాముద్ర" ప్రస్ఫుటమగునటుల రచన చేయుట జరిగినది. అటనట సందర్భాను గుణముగ నించుక ప్రౌఢమైన క్లిష్ట పథము గోచరించినను సరళసుభగమైన విధానమే అంతటను దర్శనీయమగుట నీ భాగవతమును పరిశీలించిన తోచును. అందులకు స్థూలముగ కొన్ని యిట చూపబడును.

## 1. రసానుగుణముగ పద రచన గావించుట:-

అయా రసములకు ఉచితమైన పద ప్రయోగములు చేయుట ద్వారా తత్తద్భావ వ్యక్తీకరణ కావించుట సుకవి సంప్రదాయము.

ఆ సంప్రదాయమునాలంకారికులు రీతులు, వృత్తులు అనుపేర శబ్దార్థ రచనా సౌందర్యమును నిశ్చయించిరి. అందునతికోమలములగు శృంగార కరుణ భావములు వర్ణింపబడు సందర్భమున కైశికీవృత్తి నిర్దేశింపబడినది.

"అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీ మతా॥
అత్యంత సుకుమారౌద్వౌ శృంగార కరుణౌ మతౌ॥"
ప్రతాపరుద్రీయకావ్య ప్రకాశము - 15,17.

ఈ సందర్భముననే గుణాశ్లిష్ట పద సంఘటనారూపమునగు రీతియు చెప్పబడినది. అందు బంధ పారుష్యము, శబ్ద కాఠిన్యమును లేక నాతి దీర్ఘ సమాసయుతమునైనది వైదర్భీరీతియని వేర్కొనబడినది.

"బంధ పారుష్య రహితాశబ్ద కాఠిన్య వర్జితా
నాతి దీర్ఘ సమాసాచ వైదర్భీరీతి రుచ్యతే" కావ్యప్రకాశము 87.

శ్రీకృష్ణభాగవత పంచమస్కంధమున అగ్నీధ్రుడు తనముందుకన్నుపండుగ చేయుచు కనిపించిన "పూర్వచిత్తి" అను అచ్చరమచ్చెకంటి పై మరులు కలుగగ భావించిన సొగసు శృంగార రసానుగుణముగ, మృదుల పదబంధముతోముక్తపదగ్రస్త విలాసమున వర్ణింపబడినది.

సీ॥ కనుపండువై మది గరచుచుండెడునిది
పొంగారు బంగారు బొమ్మయేమొ
బంగారు బొమ్మకీ పసతావి గల్గునే
పసిమించు జాజిపూబంతి యేమొ
జాజిపూబంతికీ సరితళ్కుగల్గునే
సరికొత్త మెఱపుల జంటయేమొ
మెఱపుల జంటకీ మెలకువల్గల్గునే
చెలరేగు మరునిరాచిలుక యేమొ

తేటగీతి॥ మరునిరాచిల్కకీచిన్నెలరయగలవె

యలరు నలరువిల్తునిప్పు ములికి యేమొ
యెసగు పువుముల్కికివన్నె లెన్న గలవె
కోర్కులీడేర్చు ముద్దుల గుమ్మ యేమొ. 5-55

ప్రథమస్కంధమున ద్రౌపది తన పుత్రులను అశ్వత్థామ వధింపగా నార్తయై దుఃఖించిన విధము కరుణ రసానుగుణమున వర్ణితము.
1-205

సప్తమ స్కంధమున ఉశీనరుడు గతాయువుకాగా వాని భార్యలు దుఃఖార్తలై శోకించుట స్వభావోచితమై యలరారును.

చ॥ ఉరములు మోదికొంచు గడునున్నత కేశ కలాపముల్ విడన్
విరులవిరాలి నేల బడ వెల్లువలట్లయి పాఱ నశ్రువుల్
ధరణియు నాకసంబులు విదారితమయ్యెడినో యనన్ రవం
బరుదయిపర్వ నేడ్చిరి గతాయువు భూపతిమీద వ్రాలుచున్.
7-55.

ఇటు రాణులు భర్త శరీరముపై వ్రాలి దుఃఖించినయప్పటి సందర్భము మృదుల పదబంధముతో నిటుల కనుల కట్టింపబడినది.

ప్రథమస్కంధమున శ్రీకృష్ణనిర్యాణమును ధర్మజున కెఱిగించుచు నర్జునుడు దుఃఖాతిశయమున పలుకుకొనిన విధము కరుణ రస భూయిష్ఠమై పాఠకులను సైతము కనులనీరుదిరుగ ద్రవీభూతులను చేయును.

సీ॥ ఏ నెవ్వని వియోగ మెపుడు గల్గిన గాని
జీవచ్ఛవమ్మనా జెప్పనగుదు
మనల విడనాడిపోయె నేమనెడు వాడ. 1-342.

అత్యుద్ధతార్థసందర్భము గలది ఆరభటీ వృత్తి. రౌద్ర బీభత్సము లుద్ధతరసములు. ఈయెడ నోజః కాంతి గుణములుగల గౌడీరీతి.

శ్రీకృష్ణభాగవతమున అష్టమస్కంధమునందు నమృతోత్పాదనానంతరము దేవ దానవుల నడుమ జరిగిన యుద్ధ సందర్భ వర్ణనము పరుష బంధము, దీర్ఘసమాస రచనము కలిగి రౌద్రముట్టిపడునట్లు సాగినది. 8-133.

ఆ సందర్భముననే జంభద్వేషి జృంభణము రసపుష్టితో నిటుల సాక్షాత్కరింపజేయబడినది. 8-137.

శా॥ జ్యాఘోషంబున నాకసంబు వగులన్ సంధించి కోదండమున్
మాఘాదిత్యునిరీతి దొల్తనయి గ్రీష్మబ్రధ్నుడై యంత బా
ణౌఘోసగ్రంబుల దైత్య వాహినుల మాయంజేసె నుగ్రప్రచా
రామాటంబినుమంతలేక నరుడత్యంతప్రతాపంబునన్. 8-138.

అను నీ పద్యమున నరుని యుద్ధతి రస పద్ధతితో చెప్పుట రామణీయకతను సంతరించుకొన్నది.

దశమస్కంధోత్తరభాగ ప్రథమాశ్వాసమునగల శంబరాసురవధ ఘట్టమున యుద్ధ వర్ణనమునగల బీభత్స స్థితి వర్ణనము మిగులహృద్యమైనది.

సీ॥ గంధ దంతావళ గర్జితంబుల నశ్వ
హేషితములు రథ ఘోషములును

10-ఉ-భా-1-౬౭4.

నాతి సుకుమారమగు పద సంఘటనము భారతీ వృత్తి. హాస్య శాంతాద్భుతములందీ వృత్తి ప్రయుక్తమగుట ఆలంకారిక సమ్మతము. (ప్రతాపరుద్రీడు కావ్యప్రకాశము 16,18.) ఈసందర్భమున వైదర్భీ, గౌడీ రీతులు రెండును గూడిన పాంచాలీ రీతి కాననగును.

నవమ స్కంధమున వైవస్వతమను పుత్రుడైన సుద్యుమ్నుడు పరివారముతో గౌరీ వనమున ప్రవేశింప పరమేశ్వర వాక్యానుసారము అందఱును స్త్రీత్వమునొందుట జరిగినది. ఆ సందర్భమున నాతని

స్త్రీత్వోదయముకడు సొగసుగ వర్ణింపబడి హాస్య రస స్ఫోరకముగా నిటుల నున్నది.

సీ॥ పేరురంబున........ జొచ్చె. 9-14.

అష్టమస్కంధమున వామనుని విశ్వరూపమద్భుతమై శోభించుచున్నది.

సీ॥ శీర్షమాకాశము చివర కొమ్మలు దాటె
పాదముల్ బాతాళ భాగమందె 8-242

దశమస్కంధమున నక్రూరుడు రామకృష్ణులను గొనిపోవుచు మధ్యే మార్గమున కాళిందీ హ్రదమున స్నానమాచరింపజని జలంబుల మునిగి యందు రామకృష్ణులను చూచిన పట్టుననుద్భుతముల రారుచున్నది. 10 పూ.భా.3-141.

నాతి ప్రౌఢ సందర్భ నిర్భరమగు రచనము సాత్వతీ వృత్తి అనబడును. ఇందు వీర భయానకములు వర్ణింపబడుచుండును. ఇదియు పాంచాలీ రీతిగనే పరిగణింపబడును. ప్రతాపరుద్రీయ కావ్య ప్రకాశము. 16, 18.

దశమస్కంధమున శ్రీకృష్ణుడు పౌండ్రిక వాసుదేవునితోడ యుద్ధము చేయు సందర్భమున శ్రీకృష్ణుని పరాక్రమమును వర్ణించు నీపద్యము వీర రసాత్మకము.

మ॥ అనినోనాడి శితాస్త్ర శస్త్రముల వాహంబుల్ దెగం జేసి సూ
తుని జక్కాడి ధ్వజంబు ద్రుంచి ధనువుల్ ద్రుంగించి
తచ్ఛిరమున్
ఘనచక్రంబున జేసి త్రెస్సిపడగా గావించి కాశీపతిన్
జనునపౌండ్రకు తోడునీడయగు వీకంజేయగా నెంచుచున్.
10.ఉ.భా.2-111.

షష్ఠ స్కంధ మున వృత్రాసురుని వర్తనము వర్ణించుట భయా

సీ॥ అడుగుపెట్టిన నేల నదరంగ జేయుచు
నాల్కచే జుక్కల నాకికొనుచు 6-180.

## 2. అక్షర యోజనము:-

మాలాకారుడు పూవులను సంపాదించి యేయే వర్ణములగు పూవులవెంట నేయే పూలు గూర్చిన మనోహరాకృతి సిద్ధించునో యోజించి మాలా నిర్మితి జేయునట్లు కవి రమ్యాక్షర పదావళి చేర్చి కూర్చును. దానినే అక్షరయోజనమందురు. పద్యము మొదట నుండియు తుదిదాక యొకే పద్ధతిని సమతూకముగా నడపుట పద్యరచనాశిల్పము. అట్టి యీ కళ శ్రీకృష్ణభాగవతమునందనేక పట్టుల కన్పట్టును.

నవమస్కంధమున శ్రీరామచరిత్రను ప్రస్తావించుసందర్భము. రావణాపహృతయైన సీత పలవించుటలో యీ సొగసు కానుపించును

సీ॥ వేల్పులారా..............విభునకు. 9-234.

అక్రూరుడు రామకృష్ణులనుగూర్చి వారివారినిప్రశ్నించుటలో
"గోపాలు లార!మీ గోపతులగు వారు
బలకృష్ణులెందున్న వారో చెపుడ...."

10.పూభా. 3-110.

అనుటలోను పిదప రామకృష్ణులను చూసిన పట్టున
"నీల పీతాంబర నిభృత దేహము హరి
ధృతబర్హి పింఛదీధితులవారి...."

10.పూ.భా. 3-12.

అనుటలోను అక్షర యోజనా శిల్పము ద్యోతకమగును.

## 3. పాత్రోచిత సంభాషణము:-

పాత్రకుతగిన సంభాషణము కావ్యాదుల ప్రయోగించుట ప్రాచీన కవుల సంప్రదాయము. సంస్కృత కావ్యాదులలో సుత్తమ

పాత్రలకు సంస్కృతము, నీచ పాత్రలకు ప్రాకృతము ప్రయోగించుటలు దీనికి తార్కాణము. తెనుగు కావ్యములందు గ్రామ్య వినియోగమును గూర్చి చెప్పుచు "గ్రామ్యం తత్త్వద్విధాసాధు" (వికృతివివేకము సంజ్ఞా పరిచ్ఛేదము) అని అధర్వణుడు నిర్దేశించుట జరిగినది. ప్రతాపరుద్రీయ, కన్యాశుల్కాది ఆధునికములందు నియ్యది ప్రచురముగ ప్రయోగింపబడి కావ్య శోభా హేతువుగ పరిణమించుచున్నది. శ్రీకృష్ణభాగవతమునందిట్టి పాత్రోచితమగు భాషాభావముల ప్రయోగించుటవలనను, వర్ణ్య వస్తు సందర్భ విశేషములబట్టియు నౌచిత్యము సంపాదింపబడినది. అట్టి ప్రసిద్ధౌచిత్యబంధము రసాస్వాదన హేతువగుట ప్రయోజనము. (ధ్వన్యాలోకము 4. ఆ.)

బహువిధ గుణ శీలములుఁగల పాత్రల నడుమ సంభాషణము చతురతతో నడుపుటకు లోకానుభవమత్యంత ప్రధానము. రచనా సంవిధానమున నాటకీయ ప్రజ్ఞ ఇందులకు తోడ్పడునని తద్విషయ విదితులుభావింతురు. శ్రీకృష్ణభాగవతమున వివిధపాత్రలను చిత్రించు పట్టున శాస్త్రిగారు తమ యనుభవములను పురస్కరించుకొని నైపుణ్యము ప్రదర్శించుట కాననగును.

భాగవతారంభమున శౌనకాది మహర్షులు విజ్ఞాన ఫణిత నిఖిల పురాణవ్రాతుడగు సూతుని హరికథలు చెప్పుమని కోరుట గలదు. ఏ విషయమునైనను పూజ్యుడగు నొక వ్యక్తి నర్థించినప్పుడాతనిని గౌరవ పురస్సరముగ స్తుతించుట కార్యసాధకుల ప్రధాన లక్షణము ఆ లక్షణము ననుసరించి యే విధముగ నర్థించిన యా పెద్దవాని మనస్సనుకూలముగ ప్రవర్తించునో ఆపద్ధతిలో శాస్త్రిగారా మహర్షులనోట పలికించిరి.

సీ. "సూత! విజ్ఞాన సమేత! పురాణేతి

ఇత్యాదిగ పలికి మునులు సూతుని యాభిముఖ్యమును పొందిరట.

పుత్రశోకమున దురపిల్లుచున్న ద్రౌపది నూరార్చ నర్జునుడు వాని శిరము ఖండించి తెత్తునని,

క. కడకాల దన్ని దానిని
జడములలో దానమాడి సాధ్వీమణి నీ
యెడ గల్గు దుఃఖ మిగ్గతి
వెడలంగా జేసికొమ్ము వెలదులతోడన్ 1-207.

ఇత్యాదిగ బల్కుట వాని శౌర్యతకును, సందర్భమునకు దగిన రీతిగ దుఃఖోపశమనమునకు "కడకాలదన్ని ........" అనుచు పల్కుట యౌచిత్య శోభితము.

ద్రౌపది తన ముంగిటికి నశ్వత్థామను బంధించితేగా స్త్రీ జనోచిత మార్దవముతో "గురు పుత్రుండును బ్రాహ్మణుండితని" 1-237. అన్పల్కుట హృదయంగమమే. అతడు బ్రాహ్మణుడు. "బ్రాహ్మణోన హంతవ్యః "యను ప్రమాణ వాక్యము నామె తెలియనిది కాదు. పైగా గురుపుత్రుడు. గురువు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే. అందులకే చివర "నీతండెన్న ద్రోణుండెకా! అని పలికినది. ఇట్టి సంభాషణా వైఖరి యౌచిత్య శోభితమే.

సర్వకాల సర్వావస్థలయందు శాంతుడు, శాంత్యభిలాషి ధర్మమూర్తియు నయిన ధర్మరాజు భార్య పలుకులకు మిక్కిలి సంతోషించి,

శా. నీ వాక్యంబులు న్యాయమార్గమునకున్ వేలంతయుందూరమై
పోవెంతో కరుణారసంబుకలవై పూజ్యంబులై యొప్పెడిన్
నీ విట్లాడుదువంచు నేననుకొనన్ లేదెంతయో పుత్రదుః
ఖావేశంబున నున్న యిప్పుడును నీ స్వాంతంబు శాంతంబహో
1-240.

ఇట్లు పలుకుట యెంతయు పాత్రోచితమై అలరారుచున్నది.

ఈ సందర్భముననే మహోగ్రుడైన భీమసేనునిచే "ద్రోవది ధర్మ ప్రశ్నములు", పాము ను "జంపరాదనుచు", "వేదము జెప్పెను గీతము జెప్పె" (1-242 నుండి 244.) ఇత్యాదిగ పలికించుట యాతని రౌద్రావేశములకు తగినరీతిగ నౌచిత్యవంతమై యొప్పుచున్నది.

ఇదే సంర్భమున జగన్నాటక సూత్రధారి, ధర్మజ్ఞుడు, సర్వజుడునైన శ్రీకృష్ణునిచే,

సీ॥ బ్రాహ్మణుండనుట జంపగరాదనియునాత
తాయిగావున జంప దగున యనియు.... ...."1-245.

ఇత్యాదిగా పలికించుట, ఆ ధర్మ సూక్ష్మత సూచింపజేయుట రమ్యమనోహరము.

ద్వారకాగమన ప్రయత్నమున పాండవులను వీడ్కొని రథారోహణము చేయు వాసుదేవునకు నుత్తర యడ్డము వచ్చి తన గర్భస్థ శిశువును రక్షింపుమని వేడుకొన్నది. ఆమె పలుకులు పాత్రోచితమై సందర్భానుసారమై యొప్పుచున్నవి. ఏదో యగ్నివలె మండుచు వచ్చుచున్నదని పలుకుచు శ్రీకృష్ణుని "ఓకారుణ్యపయోబ్ధి" యని సంబోధించుచున్నది. కారుణ్యముననాయన సముద్రుడుపు. ఇట "అబ్ధి" యను దానిచేతనే కావలసిన యర్థము సిద్ధించుచుండగ "పయోబ్ధి" యనుచు జలార్థకముగ పయస్ శబ్దము నధికముగ చెప్పుట జరిగినది. అట్లు ప్రయోగించుటకు నా సందర్భమున నుత్తర మనోగత సంఘర్షణము కారణమనవచ్చును. అట్టి స్థితిలో నెవరైనను ఏమి మాట్లాడుచుంటిరో తెలియని అయోమయ స్థితికి లోనగుట సూచింపబడినది. మరియు నాయధిక ప్రయోగముచే నాతడార్తరక్షణయందు సర్వసమర్థుడనియు, నాయన నెవరును రక్షింప జాలలేరనియు, మేనగోడలు గావున బంధుత్వముచేనైనను రక్షింప నా ప్రయోగము

సోపబలకమై నొక్కి చెప్పదగినదిగ నౌచిత్యవంతమై యున్నది. మఱి యును ఆ వచ్చునది యగ్నివలె దహింపనున్నది. ఆ ప్రయోగముచే నా శరజృంభణము ద్యోతకమగుచున్నది. అట్టి తీక్ష్ణతకలదానికి ఒక ప్రయోగము శాస్త్రిగార్కి సరిపోవునని పించక పునఃప్రయోగము చేసి యా యవుసరము సూచించిరి. ఈవిధముగ సొగసు రాణించినది. లేదా ఇటు క్షీరార్ధము గ్రహించిన విప్రతిపత్తియే లేదు.

అట్లే "రక్షింపుము రక్షింపుము రక్షక" (1-253) ఇత్యాదిగ పరికరగర్భితముగ పలికించుట "నాగతికిన్ వగవను (1-254) మొద లగురీతిగ మాటలాడించుటలోని మాతృమూర్తి యావేదన కడు రమణీయము.

సప్తమ స్కంధమున దేవతలు వైకుంఠమునకరిగి విష్ణువును,

సీ॥ హంసాయ వాఙ్మనసాతీతరూపాయ
నిర్గుణాయ గుణాత్మనే నమోస్తు. 7-119.

ఇత్యాదిగ నాద్యంతము స్తుతించుట, ఆగీర్వాణులచే గీర్వాణ భాషా త్మకముగ స్తుతింప జేయుట అతి మనోహరము.

ఈ విధముగ ప్రతి ఘట్టమున పాత్రలచే నౌచిత్య మనోహర ముగ సంభాషింజేయుట శాస్త్రిగారి నాటకీయతా నైపుణ్యమునకు నిదర్శనము.

## 4. సంస్కృతాంధ్ర పద ప్రయోగ నైపుణి:-

కావ్యాదుల తెనుగు పదములు, సంస్కృత పదములు, ముత్య ములు, ప్రవాళముల వలె గూర్చి సమంజసమగు శైలి పాటించుట పండితామోదయోగ్యమగుచున్నది.

ఉ॥ అచ్చ తెనుంగు శబ్దములు నచ్చుట నచ్చుట దత్సమంబులున్
వచ్చుచునున్న యట్లునుడువంబడి ముత్యములుంబ్ర
వాళముల్

గుచ్చిన పేరు తీరుగను గూర్చి సమంజస శైలితోడవా
క్రుచ్చిన కైత మంచిదనుకొందును మెచ్చుచునుండ్రు
కోవిదుల్.

—శ్రీమదాంధ్ర చంపూ రామాయణము. 1. అవతారిక.

అందును గొందఱకు దెనుగు, మఱి కొందఱకు సంస్కృతము, ఇంకను కొందఱకు రెండును ప్రియములగు చుండును. పోతన తన కృతిలో నిట్టి వారినందఱనయ్యెయెడల మెప్పింతుననినాడు.

పోతన భాగ. 1-18.

శ్రీ శాస్త్రిగారు పాండితిని సంస్కృతాంధ్రోభయ భాషాధిషణు లనుటు జగద్విశ్రుతము. అద్దాన శ్రీకృష్ణభాగవతమ్మునసంస్కృతాంధ్ర పదములాయా ఘట్టములందు ప్రచురముగ ప్రయోగింపబడి, యా భాషాద్వయమున గృతపరిశ్రమములగు వారికిగల చోరవను, నిర్దిష్టా ధికారమును నిరూపించు చున్నవి. సంస్కృత కావ్యమైనచో నొక్క సంస్కృతమునసపరిశ్రమమున్న చాలును. కానితెలుగగుచో రెండింటను గృషి మెండుగ నుండవలయునన్న చెళ్ళపిళ్ళవారి మాట సర్వథా సూనృతము.

తే॥ తెలుగు తెలుగుని యద్దాన దిగులెకాదు
సంస్కృతంబున కన్న కష్టమ్ము హెచ్చు
ఒక్కదాన పరిశ్రమమున్న జాలు
దానికిద్దానికో రెండు దగులవలయు.

అట్టిదానికి నీ పొత్తమంతయు ప్రమాణమే. అయినను మచ్చునకొందు రెండుదాహరణములు చూపబడుచున్నవి.

## ఆంధ్ర పదములు:-

పంచమస్కంధమునగల అగ్నీధ్రచరిత్రనుట్టంకించు పట్టున నాగ్నీధ్రనిగూర్చి

శా॥ తన్నుంగన్న ప్రియవ్రతుండు చననా తర్వాతనాగ్నీధ్రుడున్
- - - - - - విన్నాణమౌనేండ్లుదా
గన్నాక్లైయెకిమీడులందునసముంగాటంబుగా బెంచుచున్',
5-32.

ఇత్యాదిగ చెప్పుట గమనింపదగును. ఇందు "కన్నాక్లైయెకిమీడులం" దనుట అత్యంత సహజమై తేట తెనుగు మాధుర్యమును చవి చూపించుట నిదర్శనము. తేనె। అసు-తెనుగు యని కదా యొక వాదము. అట్లే,

ఆ॥ అతని వేలుపన్న ననవచ్చు గొనముల
- - - - - - - - - - వన్నె కెక్కె (5-33) అనునధియునా ఘట్టముననే కలదు.

వసంతమున కంతుని రంతు వర్ణింపుచు,

మ॥ చలువల్ గ్రిమ్మెడు తీవ పందిరుల పజ్జన్ జాజి పూదోటలో
- - - - - - - - - - - - -యామనిన్. 5-46.

ఇత్యాదిగ రచించుట వారి కౌశలమునకు నికషోపలము.

నాభి వైష్ణవయాగముచేయ యజ్ఞ పురుషుడైన విష్ణువు సాక్షాత్కరించిన తావున వర్ణితమైన ఈ క్రింది పద్యము శుద్ధాంధ్ర పదయుక్తమై పోత పోసిన సీసమై అలరారుట హృదయంగమము.

సీ॥ జేజేల రాజాల జిగిడీల్ప జాలుమై
హొంబట్టు రెంటెంబుడంబుమీఱ
- - - - - - - - - - - - - - - - - - - - దనర గొలువ.

తే॥ నెల్ల వేల్పులు దబుసులు నెఱగు చుండ
- - - - - - - - - - - నక్కటిగ మొప్పు. 5-68.

సప్తమ స్కంధమున ప్రహ్లాద చరిత్రలో హిరణ్యకశిపుని పత్ని లీలావతి గుర్వి జియైన విషయమును చిన్ని కందమున,

క॥ నెలదప్పె గోర్కు లొప్పెను
బలుకులు నడకలును జాల బడలిక జెప్పెన్
బలువేవిళ్లొగి గప్పెను
వెలవెలనై మోము కళల విప్పుగుప్పెన్. 7-131.

ఈరీతిగ నంత్యప్రాసలో చెప్పుట యనల్పార్ధదాయియై కవిబ్రహ్మను స్ఫురింపచేయుట అతిరమ్యము.

## సంస్కృత పదములు:-

ద్వితీయస్కంధమున వైకుంఠమున విష్ణుభక్తులను
మ॥ కుల............పురిన్. (2-108.) అనుచు వర్ణించుటలో ధారాళమైన ప్రవాహము, భాషాధిపత్యము, మనోహర కవన చాతురి నిరుపమానములు.

అష్టమ స్కంధమున గజేంద్రమోక్షణ సందర్భమున త్రికూట పర్వతమును

సీ॥ చిత్ర చిత్రోన్నత— — — —
—————— పవనగతము,
తే॥ దేవతావార కలితమప్పర్వతంబు(8-21) అని అంత్య ప్రాసాదిగ వర్ణించుట సంస్కృత రామణీయకము.

దశమస్కంధమున మాయావతి ప్రద్యుమ్నునితో పల్కిన ద్వారకానగరము కడు సొగసైనది.

సీ॥ కాలాంబుదశ్యాము గాంతిచ్ఛటాధాము
నాజాను బాహు దివ్యాభ్ర దేహు
సింహమధ్యు,
తే॥ వినుతపుండ్రేక్షు కోదండ వనజ కాండు
మరుని రాచ కొమరుని నమ్మగువలెల్ల
నరసి యే మఱుపాటు నా హరి యటంచు

సిగ్గునండాగిరందందు శీఘ్రగతిని. 10. ఉ.భా. 1-237.

శ్రీకృష్ణుడును సఖుడైన అర్జునుడును కలసి యొకనాటి రేయి యమునానదీ తటమున విశ్రమించి "కాళింది" ని కాంచిన పట్టున వర్ణనము,

మ॥ కనిరాకృష్ణుడు - - - - - - - - - - - - - లోకత్రికన్.
10.ఉ.భా. 1-313.

ఇత్యాదిగసాగి పోతన్నను స్ఫురింపజేయుట గమనార్హము.

ద్వాదశస్కంధమున మార్కండేయ చరిత్రమునగల వైవస్వతుని యుగ్రరూపము,

మ॥ గళగర్త ప్రతిపాది - - - - - - - - - - - - ఉగ్రుడై. 12-103

ఇత్యాదిగ గంభీరముగ స్వభావోక్తియుతమై అలరారుటకు నా సంస్కృత పద సంఘటనా కౌశలమే. ఈ విధముగ వర్ణించుటలు శాస్త్రిగారి సమ సంస్కృతాంధ్ర పద ప్రయోగమున కుదాహరణము లుగనెన్నదగియున్నవి.

## 5. వృత్తౌచిత్యము:-

వర్ణ్యముయొక్క స్వభావమునుబట్టి తదుచితమగు వృత్తము పాటించుట వృత్తౌచిత్యముగ భావింపబడును.

జగదద్భుతములగు వస్తువులను, నూత్న విషయములను పరిచయము చేయునప్పుడును, సందర్భము మాఱినప్పుడును వృత్తము మార్పు చెందుట ప్రాచీన కావ్యాదుల కానవగును. శ్రీకృష్ణభాగవత మున నిట్టి సంప్రదాయము బహుధా దర్శనీయమగును. ఇందు శాస్త్రి గారు వివిధములైన, అపూర్వములైన అనగ నాంధ్ర సాహిత్యమున ప్రయోగింపబడని వివిధ వృత్తములను ప్రయోగించి తమ ఛందశ్శా స్త్రపారీణతను ప్రదర్శించిరి. అకూలంకషత్వము విపులముగ ఛందో

విన్యాస పరిచ్ఛేదమున వివరింపబడును. ఇచట సందర్భానుసారముగ స్థూలముగ స్పృశింపబడును.

శ్రీ శాస్త్రిగారు భాగవత రచనా సందర్భముగ "శ్రీ మీఅస్ గిరిజా సమేతుడగుచు - - - "(1-1.) ఇత్యాదిగా శార్దూల కాశీ విశ్వేశుని సంస్మరించి వ్రాయగడంగిరి. శ్రీకారముతో ప్రారంభించుట శుభ ప్రదమని విశ్వశ్రేయముగ ప్రారంభించుట సంప్రదాయము. ఛంద శ్శాస్త్రమునననుసరించి "మ" గణము సర్వ శుభప్రదము. పార్వతీ స్వరూపాంతరమైన దుర్గ శార్దూల వాహిని. శివపార్వతులేక శరీరులు కావున శివుడును సి హ వాహుడే. ఈశ్వరుడు శ్రీకరుడు. అందులకే ఆయనకు శంకరుడని నామాంతరము. ఆభావముతోనే పార్వతి సర్వ మంగళయనియును శాస్త్రిగారు ప్రారంభించి ఈశ్వరుడు గిరిజా సహితుడై భక్తతతికిపూర్ణార్థ సంసిద్ధి యనగ చతుర్విధపురుషార్థ సిద్ధిని క్షేమమును ప్రసాదించి రక్షించుగావుతయని మంగళానుశాసనము గావించిరి. "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథన్తే" యని ప్రమాణము. ఇంత భావమునిమిడ్చి ఈ భాగవతము భక్తులైన సర్వులకు మోక్షదాయకమని సూచ్యార్థ సూచనము. భాగవత మున భక్తులందఱును మోక్ష సామ్రాజ్య పట్టాభిషిక్తులే!

మఱియును గ్రంథాదిని శివ ప్రార్థనము గ్రంథము విష్ణుభక్తి ప్రతిపాదికము.

విచిత్రమా! కాదు.

"శివాయ విష్ణు రూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః"

అని శ్రుతి ప్రమాణము. అదియే అద్వైతము. భాగవతము అద్వైత ప్రధానమైనది. ఎడనెడ సందర్భానుసారము ద్వైత, విశిష్టాద్వైతాదులు ప్రస్తావింపబడినను భాగవత తత్త్వమద్వైత ప్రధానము. సృష్టిని యెన్ని జరిగినను గమ్యమద్వైతమును సాధించుటే జీవులలక్ష్యము.

కావున దానికుపబలకముగ ననేక కథలు, చరిత్రలు మనము గమనింపవలసియున్నది. అదియే భాగవత ప్రధానధ్యేయము. అదియే శ్రీకరము. అటులనే శ్రీధరులును వ్యాసభాగవతమునకు ప్రసిద్ధమైన వ్యాఖ్యనద్వైతపరముగనే రచించుట జగద్విదితము. ఈయద్వైతతత్త్వ సూచనకే శ్రీకరమగు శివస్మరణ. ముఖ్యముగ ఇంత భావ సముదాయమును ప్రతిక్షేపించి విశ్వేశుని స్మరించి నడిపించుటలో నీ మహాకవి "నద్వితీయో" యనురీతి చూపుట చూడ వృత్తౌచిత్యముగనే భాసించును.

ప్రథమ స్కంథమున అశ్వత్థామ తనవైపునకుగ్రుడై వచ్చు నర్జునుని జూచి యేమియు తోచనివాడై యుండ వాని మనస్సంఘర్షణకు దగినట్లుగ మహా స్రగ్ధరలో (1-209) అస్థితి వర్ణింపబడుటయౌచిత్యవంతము. అట్లే అర్జునాశ్వత్థామల యౌద్ధత్యమును వర్ణించు పట్టున తదుచితము, భావస్ఫోరకమునగు మహా స్రగ్ధరా వృత్తము ప్రయోగింపబడినది.

మహా। ధరగంపించెంబయోధుల్తరలి కలగె భూధ్రంబులుల్కాతలూగెన్
సురమార్గంబందు మంటల్ సొరిదిగ గవిసెన్ సూర్యతేజంబు మాసెన్
గురిసెం బాషాణ ధారల్ కొఱవులు వడియెంగూలె నిర్ఘాత పంక్తుల్
గురు శబ్దంబుప్పతిల్లెంగు తలమున బ్రజా కోటికిన్
భీతియయ్యెన్. 1-220.

వారి యుద్ధ సంరభము బ్రహ్మాస్త్రద్వయ విజృంభణమున నేర్పడిన కష్టదశ వివరణకీ వృత్తము సహజమై ఔచిత్యముతో నలరారినది.

ప్రథమ స్కంధముననే గాంధారీ ధృతరాష్ట్రులు మహా ప్రస్థానము చేయవారుగానమి ధర్మజుడు దుఃఖించుచుండగ తుంబురనా

రదు లేగుదెంచిరి. ఆ సందర్భమున నారదుడు వానికి కర్తవ్యోపదేశము చేయుచు శ్రీకృష్ణుని గూర్చియు వాని లోకోద్ధరణాదులను పల్కునెడ "ఉత్సాహ" వృత్తము (1-325) చెప్పబడినది. ఇది యెంతయు నౌచిత్యవంతము. దుష్టుల గూర్చి శిష్ట జనుల రక్షణములు చేయుట యందు పరమాత్మునకు నెప్పుడునుత్సాహమేకదా!

అటులే ద్వితీయస్కంధమున శుకమహర్షి పరీక్షిత్తునకు భక్తులైన మానవులగూర్చి వారు భగవంతునెల్లవేళల స్మరించుచు, తచ్చరితలను తలచుచు గొలువవలెననుచోట నుత్సాహ వృత్తము (2-7). వర్ణింపబడినది. ఇచట భక్తులకు భగవంతుని తెలియగల్గు నుత్సాహమే కాక, పరీక్షిత్తుకు భగవత్ గాథలు వినిపింప శుక మహర్షి యుత్సాహము కూడ ద్యోతమాన మగుచున్నది. ఈ రీతిగ నీ వృత్తమిచటనౌచిత్యశోభితమై యొప్పుచున్నది.

ప్రథమస్కంధమునర్జునాశ్వత్థామల యుద్ధ సందర్భమున నారద వ్యాస మునీంద్రులాగమింప నర్జునుడు వినయ సంతోషములతో నమస్కరించి సంభాషించెను. అప్పట్టున పంచచామర వృత్త ప్రయుక్తి (1-224) జరిగినది. అట్లగుట యర్జునుని మనస్సంతోషమునకు దగినటుల నీ పంచచామరవృత్త ప్రయోగమౌచిత్య శోభావహమైనది.

దశమస్కంధమున శ్రీకృష్ణుని వీర విహారములను వర్ణించు పట్టున తృణావర్తుని సంహార వర్ణనమున నీయౌచిత్యము మనోహరము. తృణావర్తుడు సుడిగాలి రూపమున మహోద్ధృతమున నేతేర శ్రీకృష్ణుని ప్రభావమును "భుజంగప్రయాత" (10.పూభా. 1-192.) వృత్తమున రమ్యముగ చెప్పబడినది. వాయువు భుజంగజేయముగదా! మఱియు భుజంగము వాయువును భక్షించి జయించినట్లు నీ బాలుడును వాని మర్దించునని సూచనము.

ఈ విధముగ ననేక పట్టుల వివిధములైన మత్తకోకిల, తరళము, స్రగ్ధర, మహాస్రగ్ధర, తరువోజ, హంసగతి, ఉత్సాహము, పంచచామరము, భుజంగప్రయాతములే కాక శారద, మంజుల, వంశస్థ, ఉపేంద్రవజ్ర, సుముఖి, పద్మనాభ, వల్లి, క్రౌంచపద, సువృత్త, మత్తమయూర, కళ్యాణి, రుక్మవతి, స్వాగత, మానిని, మాలిని, తోదకాది వృత్తములను మనోహరముగ ప్రయోగించుట జరిగినది.

ఇక కావ్యమంతటను ప్రసిద్ధములగు చంపకోత్పల మత్తేభ శార్దూలములు, సీసము, కందము, ఆటవెలది, తేటగీతులు మొదలగు వృత్త జాత్యుప జాతులేకాక తరువోజాది దేశ చ్ఛందస్సును ప్రయుక్తము.

యుద్ధాది వచనమున సుదీర్ఘ వర్ణనలు గంభీరముగ సాగినవి. ఎడనెడ నౌచితంవంతముగ సంస్కృత శ్లోకములును ల్లేఖింపబడినవి. మాహాత్మ్యములు, తీర్థ యాత్రాదికములు వర్ణింపబడుచో నోజోగుణ ప్రధానమగు "దండకములు" ప్రయోగింపబడినవి. మఱియు సొగసుగ నూత్న పద్ధతిగద్విపదలు ప్రయోగింపబడుట విశేషము.

ఆయా వివిధ రీతులతో స్కంధాంతముల హంసగతి, ఉత్సాహ, మాలిని, వల్లివృత్తములతోబాటు నుత్పలాదులు, కందమును ప్రయోగింపబడినవి.

ఈరీతిగ బహు విశేష వృత్తాదులను విశేషముగ సమర్థతతో ననన్య సామాన్య ప్రతిభతో ననర్గళమగు కవితా ధారా ప్రవాహమున నురక లెత్తించుట, ఛందశ్శాస్త్రముపై శాస్త్రిగారికి కల యప్రతిమానాధిపత్యమును ప్రస్ఫుటీకరించును.

ఇవి యన్నియు నాయా సందర్భములకు దగిన శైలీ సంవిధానమును ప్రదర్శించును. అంతియకాక స్థూలముగ 1. కథాకథన

శైలి, 2. సంభాషణాత్మక శైలి, 3. వర్ణనాత్మక శైలియని మూడు ప్రధాన రీతుల బరిశీలించుటయు సాధారణముగ జరుగుచుండుట కద్దు. అటుల పరికించిన ఇట్లు గ్రహింప వచ్చును

## 1. కథాకథన శైలి:-

ప్రసన్నముగ ఇతివృత్తమును వివరించుచు కథ నడుపు విధానమున చూపబడునది. ఇట్టి కథాకథన శైలికి నన్నయగారు సుప్రసిద్ధులు.

భాగవతమున నారదుడు తన పూర్వ జన్మము చెప్పుటయందును, పురంజనుని కథ, సుయజ్ఞోపాఖ్యానము, ముచికుందుని వృత్తాంతము, నృగ మహారాజు చరిత్ర, అవధూత యదు సంవాదమునకల గువ్వల కథ, పింగళయను వేశ్య కథ, శ్రీకృష్ణోద్ధవ సంభాషణగత విప్రలోభి వృత్తాంతము, యాజ్ఞవల్క్య చరిత్రము మొదలగువానియందీ కథాకథన శైలి గోచరించును.

పతి పరలోకగతుడు కాగా తమ గతికివిలపించు సుయజ్ఞుని సతులకు కాలుడు బాలుడై యరుదెంచి కలవింకముల కథ వినిపించిన పట్టున నీ కథాకథన శైలి హృద్యము.

తే॥ కలడుమున్నొక వ్యాధుండు కాఱుటడవి
నాలుబిడ్డలతోనుండు నాకుటిల్లు
గట్టికొని కాపురంబుగా బిట్టలకును
మృగములకుగాలయముడయిమెలగువాడు.

ఉ॥ వాడొకనాడు జాలమునువైచి పతత్త్రులబట్టుచుండగా
నాడు తదంతికంబున దినన్విహరించు కుళింగి యొక్కడా
గోడగు వాగురంబడియె గ్రూరకిరాతుడు దూరవర్తియై
చూడడు దానినయ్యడియు శోకము పాకముగాగ నేడ్చుచున్.

7-63,64.

## 2. సంభాషణాత్మక శైలి:-

దీనినే నాటకీయ శైలి అనదగును. సందర్భము ననుసరించి పాత్రలచే మాటాడించు విధము చక్కగ మలచుట యందిది కనుపించును. ఇట్టి నాటకీయ శెలికి తిక్కనగారి నెన్నుదురు.

వివిధ వృత్తాంతములు గల ఈ భాగవతమంతయు నిట్టి శెలికి కాణాచియే!

అగ్నీధ్రుడు వలరావాని ములికియై చెలులతో విలాస మొలక జేయుచు విహరించు పూర్వచిత్తిని చూచి విరహ పీడితుడై ఆమెతో పలుకుటలో నీ నాటకీయత సొగసై అలరించును.

మ॥ వెలదీ!యెవ్వరిదాన వెవ్వతెవు నీ పేరేమి యెందుండి యీ
పొలతుల్ గొల్వగ వచ్చితీవలరునిప్పుదోటకున్మేటివై
వలఖేనిన్గికురించి వచ్చురతివో వాడంప నిందున్నవా
రలనేచం జనుదెంచు పూములికివో రారమ్ము వాకిమ్మొగిన్.

5-61.

ఇందాగ్నీధ్రుడాయచ్చరరోయింతిని వెలదీయని సంబోధించుటలోను, రతివా, రతిరాజు పూములికివాయనియడుగుటలోను ఈ నాటకీయత మిగుల హృద్యమై సందర్భౌచితితో విందు చేయుచున్నది. అటులనే తరువాతి పద్యమును రమణీయ సంభాషణా శైలికి నికష దృషత్తుగా నెంచవచ్చు.

## 3. వర్ణనాత్మక శైలి :-

వర్ణనా సందర్భము ననుసరించి రమణీయమైన పదములను ప్రయోగించుచు భావస్ఫోరకముగ ముత్తెములు గుదిచూర్చినటుల మలచుటయందుద్యోతకమగుశైలి వర్ణనాత్మక శైలి. ఇద్దానికి ఎఱ్ఱనగారి యగ్రాసనాధిపత్యము జగద్విదితము.

శంబరారాతి రతీ దేవితోగూడి మెఱుపు చెంగటనున్న మేఘంబు రీతిగా రాచమేడ దరిజేర నచటి మగువలవ్వానిని జూచిన తీరు రమణీయమైన వర్ణనాత్మక శైలికి నికషోపలము.

సీ॥ కాలాంబుదశ్యాముగాంతిచ్ఛటాధాము
నాజానుబాహు దివ్యాభ్రదేహు

తే॥ వినుతపుండేక్షుకోదండువనజకాండు
మరునిరాచకొమరుని నమ్మగువలెల్ల
నరసి యేమఱుపాటునాహరియటంచు
సిగ్గునండాగిరందందు శీఘ్రగతిని. 10 ఉ.భా.2-237.

హరినే మఱపించు హరి పుత్రుడు మరుని శ్రీ రూప వర్ణన మిటనౌచిత్య పద భూయిష్ఠమై, శబ్దాలంకారయుక్తమై లయ విభూతితో భాసించుటకు హేతువీ వర్ణనాత్మక శైలియే యనుట నిజము.

ఈ భంగిని రమణీయమైన శైలి వివిధరూపముల సందర్భ శుద్ధితో శ్రీకృష్ణభాగవతమందంతటను ప్రదర్శితమై అలరారుచున్నది. ఆద్యంతము పరికించిన నీ శైలి సారళ్య మాధుర్యమనుటకీ పొత్తమే సాక్షి.

..../*/....

# ఇతి వృత్త నిర్వహణము

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్" అని భరత మహర్షి వచనము. కథా నిర్వహణమే కావ్యముకు శరీరముగ గుర్తింపబడు చున్నది, ఇతివృత్తమునకే మరియొక పేరు వస్తువు. ఇద్దానిని గూర్చి ధనంజయుడు తన దశరూపకమునందిట్లు చెప్పినాడు.

"రమ్యం జుగుప్సితముదారమథ్యాఽపినీచ
ముగ్రం ప్రసాదిగహనం వికృతంచ వస్తు

యద్వాప్య వస్తు కవి భావక భావ్యమానం
తన్నాస్తియన్న రస భావముపైతి లోకే" (దశరూపకం-4-85)
వస్తువెట్టిదైనను కవి భావనా శక్తిచే రసవంతమై జీవశక్తితో తాణికిసలాడును! అందులకే "జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః" అనియు,

"ఋషీణాంపునరాద్యానాం వాచమర్థోనుధావతి
లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే॥

అనియును మహాకవులు నీరాజనములనందుకొనిరి. సకల సంస్కృతులకును శిరోధార్యమైన భారతసంస్కృతికి హేతుభూతమైన వేదత్రయి వలెదేవభాషయందపరనారాయణుడైన వ్యాసమహర్షిప్రోక్తము, వేదాది కావ్య దక్ష వాల్మీకి వనప్రియ కూజిత మధురాక్షరమునుగ నోజబంతి యయిన భారతభాగవత రామాయణ కావ్యత్రయి నవనవోన్మేష శాలితతో సకల భాషల ప్రభూతమయి వెలుగుట యార్ష వాఙ్మయ ధర్మ సంబద్ధతకు గీటురాయి.

అపరరీతి ద్వితీయరూపనుయిన ఆంధ్ర భాషా సాంస్వతమున ఋషితుల్యుర యెపరమ పూజ్యులయిన కవిత్రయాదుల కృతములలో భాగవతమున కొక ప్రత్యేక స్థానముండుట సహజ పుణ్య విశేషము. అదియే తేనెలొలుకజేయు తెలుగన్న పోతన్న వైశిష్ట్యము. కవిత్రయము రీతివలె పోతన్న రీతియు రసావిష్కరణ స్వాతంత్ర్యాతా భూయిష్ఠము. వ్యాస హృదయమందంతర్భూతము చెంది "యుండు నేకాని యథాతథముకాదని సాహిత్యజ్ఞులకు విదితమే.

అట్టిస్థితిలో మిత్రప్రోత్సాహముచే వ్యత్యయ విరహితముగ వ్యాస హృదయము తెలుగుల కందించవలెనను ప్రగాఢ వాంఛా వృతులై యనన్యసామాన్య కార్యదీక్షాపరులై శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు చాతుర్మాస్య కాలాంతరముననే శ్రీకృష్ణభాగవత నిర్మాణదక్షులగుట యూహకందని విషయము.

"లోకో భిన్న రుచిః" యను ప్రమాణము కావ్య రసజ్ఞ సహృదయుల పట్లనసంభావ్యము. ఏలన ప్రతి కావ్య స్థిత రసానుభవైక వేద్యతా లక్షణుడే నిజమునకు సహృదయ శబ్ద వాచ్యుడనబడును. ఇందభిమాన ప్రసక్తి సుంతయు పరిగణింపబడరాదు. అంధ్రమున పోతన్న మాధుర్యమున కలవడన వారితరములను గణింపకుండుట వాస్తవము. అది సహృదయతా లక్షణము కాజాలదు. పోతన్న భాగవత వైశిష్ట్య తుల్యత్వమన్యములందు లేక పోవచ్చునుగాక। ఎద్దాని మాధుర్యమద్దానిది. రసాస్వాదన యోగ్యతా సామర్థ్యమున్న యపుడు కవి ప్రసక్తికంత తావీయక ప్రధానమౌ కావ్యగత రసమునకే ప్రాధాన్యమొసగుట లాక్షణికత. దురదృష్ట వశమున గొన్ని కావ్యాదుల కంత ప్రసిద్ధి విశిష్టతాయుతములైనను రాకుండుట అనునది కవి దోషము కాని, కావ్యదోషము కాని కాజాలదు. అది ముమ్మాటికిని రసహృదయులైన సహృదయుల దోషమే. అట్టివానిలో ప్రకృత "శ్రీకృష్ణ భాగవతము" కూడ చేరుట చింత్యమే.

ఈ దురభిమానముచే కొందఱు సాహిత్యనిష్ణాతలయ్యును శ్రీ శాస్త్రివారు కౌశిక గోత్రోద్భవులనియు, నక్కౌశిక నామాంతర విశ్వామిత్ర సృష్టివలె నీయనయు నన్నయాదుల భారతాదుల సృష్టి కపవాదముగ పునః సృష్టిచేసిరనియు కించపఱచుట వారి కుంచిత మనోదృక్పథమును ప్రదర్శించును కాని కవి కావ్యాదులకే లోటునురాదు.

"బ్రహ్మ సృష్టి కూరగుమ్మడి. విశ్వామిత్రుని సృష్టి బూడిద గుమ్మడి పచ్చగుమ్మడితో వడియములు పెట్టరు. అటులనే బూడిద గుమ్మడితో రసాదులు చేయరు. వాని వాని కృతములు, వడియములు, రసాదులు రెండును సూపమున రుచ్య భక్ష్యములే. ఇంతకును దేని విలువ దానిది.

ప్రసిద్ధత, రసావిష్కరణములను బట్టి పోతన్న భాగవతమునకు శ్రీకృష్ణ భాగవతము తులతూగదనుట సత్యదూరము కానప్పటికిని

ఇదియు పరిహరణీయము కాజాలదు. తనకవితా విషయము పోతన్న గారికే మాత్రము సాటిరాదని స్వయముగ శాస్త్రిగారి వినయాం కారము వారి భాగవత ప్రారంభముననే గోచరించును. అది ప్రధా ముగ గమనింపదగినది. మఱియు శాస్త్రిగారి దృష్టివ్యాస భాగవ మును యథాతథముగ త్రిలింగ జనులకందీయ వలయుననున భాగవత పునర్నిర్మాణమునకు ప్రముఖ హేతువు. దానికిని వారి శ్రీ కృష్ణభాగవతమే ప్రత్యక్ష ప్రమాణము. అయినచో విమర్శకుల అస బద్ధ దృష్టి లోప భూయిష్ఠమనియే వచింపవలసియున్నది.

ఇక ప్రస్తుతము శ్రీకృష్ణభాగవతేతివృత్త నిర్వహణము ప మర్శింపవలసియున్నది. భాగవతమన భగవంతునకు చెందినద భావము. భగవంతుని సృష్టి మొదలగు పురాణ లక్షణములతో, భ వంతుని అవతారాది విశేషములతో, భక్తుల చరిత్రలతో నిండి ఈ "భా వతము" పురాణమై ప్రకాశించుచున్నది. ఇందనేక విషయ ప్రస్తావ కారణముచే వస్త్వైక్యమనునది బాహ్యమునకు గోచరింపదు. క పురాణ లక్షణము భగవత్ప్రధానతత్త్వమునయిన భక్తియు న సూత్రముగ నిక్షిప్తమైయుండును. అది యెందులకటులుండవలె ననిన అది యంతియ. అది యటులే యుండ వలయును. అది పురాణ ధర్మము. ధర్మబద్ధముకానివాని కాస్తిత్వాదులుండవు. ఇదిల ధర్మము.

శ్రీ కృష్ణభాగవత ప్రథమస్కంధమున శాస్త్రముననుసరి అవతారికాదులు కూర్చబడుట జరిగినది. సూత శౌనక సంవాద భాగవత రచనా విచారము, నారదుడువ్యాసుని కడకు వచ్చు నారదుని పూర్వ జన్మ వృత్తాంతము, నారదోపదేశమున వ్యాస భాగవతంబొనర్చుట, భారతార్థ కథా ప్రశంస, అశ్వత్థామ కు కృత్యము, కృష్ణుడశ్వత్థామను శపించుట, భీష్మోపదేశ, నిర్యాణమ

పరీక్షిత్తు జననము, గాంధారీ ధృతరాష్ట్రుల మహా ప్రస్థానము, కృష్ణ నిర్యాణము, ధర్మరాజు పరీక్షిత్తునకు బట్టము గట్టి పోవుట, పరీక్షి ద్రాజ్య పాలనము, పరీక్షిత్తు కలినిగ్రహించుట, పరీక్షిచ్ఛాపాదికము, శుకమహర్షి పరీక్షిత్తు వద్దకు వచ్చుట మొదలగునవన్నియు ప్రథమ స్కంధముగ రూపొందినవి.

ద్వితీయ స్కంధమున ఖట్వాంగుని ముక్తి ప్రకారము, శుకుడు విరాట్స్వరూపముం దెలుపుట, యోగులు కావింపదగు కార్యములు, యోగాను సంధాన కార్యము, కామ్య ఫల స్వరూప నిరూపణము, శ్రీ శుకుడు భగవంతుని బ్రార్థించుట, బ్రహ్మనారదునకు బ్రపంచ బ్రకారము దెల్పుట, భగవంతుని లీలావతార కథనము, భాగవతోత్తములు, భగవత్స్వరూపము, బ్రహ్మదేవుని తపః ప్రకారాదికము, శ్రీహరి బ్రహ్మదేవునకు వరంబిచ్చుట, బ్రహ్మ సృష్టి క్రమాభి వర్ణనము, మొదలగునవి వివరింపబడుట జరిగినది.

తృతీయ స్కంధముగ - కురుపాండవ వైరాదికము, విదురోద్ధవుల కలయిక, విదురుడు మైత్రేయుని దర్శించుట, మైత్రేయుడు సృష్ట్యాది క్రమంబెఱింగించుట, తత్త్వవిచారము-భగవత్తత్త్వ నిరూపణము, పద్మజుస్తుతి, సర్గకాలాది నిరూపణము, నీలలోహితుల జననము, స్వాయంభువుని ప్రజా సర్గము, ఆదిరాజ చరిత్రము, యజ్ఞ వరహావతార ఘట్టము, జయ విజయుల శాపాదికము, స్వాయంభువమను వంశావతారము. కర్దముని విష్ణువనుగ్రహించుట, కపిలోదయము, సాంఖ్యతత్త్వ ప్రదర్శనము, కర్మఫల బ్రవచనాదులు రూపమందినవి.

స్వాయంభువమను సంతానము, అనసూయాత్రులకుం ద్రిమూర్తులు జనించుట, దక్షయజ్ఞ ధ్వంసాదికము. ధ్రువోపాఖ్యానము, వేనుని వృత్తాంతము, పృథు చక్రవర్తి జన్మాదికము, ప్రచేతసుల తపః ప్రకారము, పురంజనోపాఖ్యానము, దేహాత్మ స్వరూప నిరూప

ణము, ప్రచేతసులకు హరి ప్రత్యక్షమై వరంబొసంగుటలు చత
స్కంధమైనది.

పంచమస్కంధ స్వరూపముగ అగ్నీధ్రుని చరిత్ర, ప్రి
వ్రతుని రాజ్యపాలనము, మేరు ప్రదక్షిణాధికము, ఋషభోద్భవవ
భరతోపాఖ్యానము, భూగోళ ద్వీప స్వరూపాది నిర్ణయము, భారత
వర్షములు, హయగ్రీవ వృత్తాంతము, ఖగోళ స్వరూపాది నిర్ణయవ
సూర్య రథ వర్ణనము, చంద్ర సూర్యగ్రహ నక్షత్రాది సంచారవ
పాతాళాదిలోక ప్రస్తావము నరకలోకము - శిక్షాస్మృతులనునవి.

షష్ఠ స్కంధమునందజామిళోపాఖ్యానము, మన్వంతర
సృష్టిక్రమము, దక్షుని హంసగుహ్యాకస్తవ రాజము, భగవద్దర్శన
దక్షుడు నారదుని శపించుట, బృహస్పతి యింద్రునిత్యజించి పోవు
దైత్యులిందునిపై దండెత్తి యోడించుట, విశ్వరూపుని పౌరోహిత్య
నారాయణ కవచ ప్రభావము, బ్రహ్మహత్య యింద్రుని దఱుము
బ్రహ్మ యింద్రుని విముక్తిసేయుట, వృత్రాసురుని జననాదిక
చిత్రకేతూపాఖ్యానము, మంత్రోపనిషద్విద్య, దైత్య దానవ
పత్తి, పుంసవన ప్రభావ కథనము, పరమేశ్వరుని సర్వసమత్వ
మొదలగునవి స్థాన సంపాదన మొనరించినవి.

వైరాగులును ముక్తిహేతువులనుట, హిరణ్యాక్ష హిర్యకశి
వృత్తాంతము, సుయజ్ఞోపాఖ్యానము, కలవింకముల కథ, హి
కశిపుని విజృంభణాదులు, భక్త ప్రహ్లాద చరిత్రము, నృసింహావ
ఘట్టము, త్రిపురాసుర సంహారము, వర్ణాశ్రమ ధర్మకథనము, ప
దాజగర సంవాదము, గృహస్థాశ్రమ విశేషములు, నారద పు
జన్మాదికమనునవి సప్తమ స్కంధావతారమెత్తినవి.

అష్టమస్కంధముగ స్వారోచిషాది మనుచరిత్రము, గజే
... చరిత్రము, క్షీరసాగర మథన

క్రమము, కూర్మావతార ఘట్టము, హరుని హాలాహలపానము, మోహి న్యవతారము, దేవదానవ సంగ్రామము, బలిచక్రవర్తి చరిత్రము, మత్స్యావతార కథ రూపొందినవి.

నవమ స్కంధమున వైవస్వమను వంశ వృత్తాంతము, సుకన్యా చ్యవనుల చరిత్రము, పరశురాముని చరిత్రము, నాభాగుని చరిత్రము, అంబరీష చరిత్రము. సౌభరివృత్తాంతము, హరిశ్చంద్రుని చరిత్రము, సౌదాసుని శాప ప్రకారాదికము, శ్రీరామచరిత్ర, నిమిచరిత్రము, పురూరవుని చరిత్రము, యయాతి చరిత్రము, దుష్యంతునిచరిత్రము, భరతోపాఖ్యానము, భరద్వాజుని జన్మ వృత్తాంతము, రంతి దేవుని చరిత్రము, చంద్రవంశాభివర్ణనము, యదువంశ చరిత్రము మొదలగు విషయములు అందల మెక్కినవి.

దశమ స్కంధము పూర్వోత్తర భాగములుగ ద్విధా విభజన మొనర్పబడినది. మఱియు నొక్కొక్కటి మూడు చొప్పున ఆశ్వాస ములుగ విభజింపబడినది. ఈ స్కంధము మిగుల బృహత్తగుట నీ విభజనము సరియైనదనియే చెప్పుట సముచితము.

దశమ పూర్వభాగ ప్రథమాశ్వాసమున వసుదేవుని వివాహము కంస ప్రయత్నము, వసుదేవుడనునయించుట, దేవకీ వసుదేవుల చెర శ్రీకృష్ణావతార ఘట్టము, దేవకీ వసుదేవుల పూర్వజన్మ వృత్తాంతము యోగమాయా విధానము, పూతన సంహారము, శకటాసుర, తృణా వర్తుల సంహారము, రామకృష్ణుల జాత కర్మాదులు, బాల క్రీడలు, కృష్ణుని కొంటె పనులు, మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాదికము, యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము, ఉలూఖల బంధనము, యమళార్జున భంజనము, వత్సాసుర, బకాసుర సంహారము, చల్ది లారగింపు, వత్సాపహరణము, బ్రహ్మ బాల కృష్ణుని స్తుతించుట, శ్రీకృష్ణుడు బ్రహ్మ హరించిన గోపాలాదులదెచ్చుట మొదలగు వాని రూపాకృతి కలదు.

ద్వితీయాశ్వాసము - శ్రీకృష్ణుడు బృందావనమున విహరించుట ధేనుకాసుర వధము, కాళీయ మర్దనము, దవాగ్ని వర్ణనము, గ్రీష్మర్తు వర్ణనము, ప్రలంబాసుర వధ, శ్రీకృష్ణుని వేణుగానము, గోపికవస్త్రాపహరణము, శ్రీకృష్ణుడింద్రయాగము మాన్పించుట, గోవర్ధనోద్ధరణము, శ్రీకృష్ణ లీలా ప్రదర్శనాదికము, గోపికాగీతలు, రాసక్రీడలు, జలక్రీడలును, తృతీయాశ్వాసమున శ్రీకృష్ణలీలా పరిభ్రమణాదికము, వృషభాసుర సంహారము నారదాగమనము, వ్యోమాసుర సంహారము, అక్రూరుడు వ్రజమునకరుదెంచుట, అక్రూర స్తవము, సోదరుల మధురా విహారము, కుబ్జననుగ్రహించుట, యాగధనుర్భంగము కంస వధ, సాందీపనికి సోదరుల శిష్యరికము, నందోద్ధవుల సంవాదము, భ్రమర గీతాములు అక్రూరుడు ధృతరాష్ట్రాదులతో ప్రసంగించి వచ్చుటలు చెప్పబడినవి.

దశమోత్తర భాగ ప్రథమాశ్వాసము - జరాసంధుడు మధురపై దండెత్తుట, ద్వారకా నిర్మాణము, ముచికుందుని కథ, జరాసంధుడు ప్రవర్షణగిరిని దహించుట, రుక్మిణీకళ్యాణ కథాఘట్టము, ప్రద్యుమ్నోపాఖ్యానము, శంబర కథ, సత్రాజిత్తు - శ్యమంతకమణి, జాంబవతి సత్యబామలను శ్రీకృష్ణుడు పరిణయమగుట, శతధన్వుని వధ, కాళిందీ పరిగ్రహణము మిత్రవిందానాగ్నజిత్యాదులను పరిణయమగుట, నరకాసుర సంహారము శ్రీకృష్ణుని పుత్రపౌత్ర ప్రపౌత్ర వర్గాదులను సంరించుకొనినది.

ద్వితీయాశాసము - ప్రద్యుమ్నుని వివాహ ఘట్టము, బాణాసురుని వృత్తాంతము. ఉషా కన్య స్వప్నము, కృష్ణుడు బాణునిపై దాడి వెడలుట, యుద్ధము, నృగమహారాజు చరిత్రము, బలభద్రుడు వ్రేపల్లెకుంజనుట, పౌండ్రిక వాసుదేవుని వధ, ద్వివిద సంహారము, బలుడు హస్తినను గంగలో ద్రోయబోవుట, శ్రీకృష్ణుని ప్రభావము నారదుడెఱుగుట, జరాసంధవధ, ధర్మరాజ రాజసూయాధ్వరము

శిశుపాల వధ, సాళ్వుని వధ, దంతవక్త్రి విదూరాదుల వధ, కుచేలో పాఖ్యానములుగ ద్యోతకమగును.

తృతీయాశ్వాసమున గ్రిహణస్నానము, నారదాది మహర్షులు శ్రీకృష్ణ దర్శనము సేయుట, వసుదేవుని జన్నము, సుభద్రా పరిణ యము, శ్రీకృష్ణుడు ఋషులతో మిథిలకరుగుట, శ్రితిగీతాసారము, విష్ణసేవా ప్రాశస్త్యము, వృకాసురుని వృత్తాంతము, భృగుమహర్షి త్రిమూర్తులం బరీక్షించుట, శ్రీకృష్ణుడు మృత విప్రసుతులను బ్రది కించుటలు గోచరించును.

ఏకాదశ స్కంధమున నారద వసిష్ఠాది ఋషులు పిండారక తీర్థమునకు వచ్చుట, ముసలోద్భవము, విదేహార్షభ సంవాదము, కవ్యాదుల పరమార్థోపదేశము, భాగవత స్వరూప నిరూపణము, విష్ణ మాయా వ్రిభావము, ప్రిబుద్ధుని పరమార్థోపదేశము, భక్తిలక్షణములు పిప్పలాయనుడు చెప్పిన బ్రిహ్మ స్వరూపము, కర్మయోగ నిర్వచ నము, ద్రిమిళుని భగవదవతార విశేషములు, భగవంతుని దివ్యావతా రములు, యుగభేదముల భగవంతుని రూప భేదములు, బ్రిహ్మాదుల ప్రార్థనము, ఉద్ధవ శ్రీకృష్ణుల భాషణము, శ్రీకృష్ణుని పరమార్థోప దేశము, అవధూతయదు సంవాదము, గువ్వల కథ "పింగళ" యను వేశ్య కథ, బంధమోక్షతత్త్వము, శ్రీకృష్ణుని తత్త్వోపదేశము, హంసో పాఖ్యానము, ఈశ్వర ధ్యాన లక్షణము, అణిమాది సిద్ధులు, ఆశ్రమ విధి ప్రిసంగము, భక్తి యోగ ముఖ్య కారణములు, యమ నియమాది నిర్వచనము, తత్త్వ నిర్ణయము, లోభియగు నొక బ్రాహ్మణుని వృత్తాంతములు వ్యక్తీకరింపబడినవి. మరియు సాంఖ్య యోగోపదే శము, ఈశ్వరారాధన విధానము, యోగసాధన సంపత్తి, ఉద్ధవుడు శ్రీకృష్ణుని వీడ్కొనిపోవుట, యాదవుల పరస్పర నాశము, బలరామ కృష్ణులు వైకుంఠమున కరుగుటలు కలవు.

ద్వాదశ స్కంధము - భవిష్యద్రాజుల వృత్తాంతము, కలికాల ధర్మ ప్రకాశిక, "కల్కి" అవతారము, కృతాది యుగధర్మ నిర్వచనము, యుగాది ప్రమాణ కథనము, శుకుడు రాజునకు చావు లేమి నెఱింగించుట, పరీక్షిత్తు సర్పదష్టుడై మృతినొందుట, జనమేజయుని సర్పయాగము, సూతుడు శౌనకాదులకు జెప్పిన వేదభాగ క్రమము, యాజ్ఞవల్క్యుని చరిత్రము, పురాణనామ సంఖ్యా పరిగణనము, మార్కండేయ మహాముని చరిత్రము, నరనారాయణుల దర్శనము, ప్రళయార్ణవ విహారము, పార్వతీ పరమేశ్వరుల దర్శనము, పంచమాత్రాదికము, ఆదిత్యాది దేవతా ప్రత్యధి దేవతాకథనము, భాగవతకథానుక్రమణిక, భాగవత ఫల శ్రుతుల సమైక్యము

ఈ రీతిగ శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున నొక క్రమ ఫణితి నితివృత్త నిర్వహణముగావించుట జరిగినది. ఇది కథా సూత్రమున కాటంకరహితముగ నుండుట ప్రకృత గ్రంథమున కానవగును.

..../*/....

## రస పోషణము

"రస్యతే ఆస్వాద్యతేఽయం రసః" రుద్రటుని కావ్యాలంకారము.
"రసనాద్రసః" భోజుని శృంగార ప్రకాశము.

మొదలుగాగల ఆలంకారికుల లక్షణముల ననుసరించి కావ్య ప్రతిపాదితార్థముననుభవమునకు దెచ్చునది రసము. అట్టి రసము కావ్యాదుల యందు మిక్కిలి ప్రధానమైనది. వస్త్వలంకార రస ధ్వనులలో రసధ్వని ప్రథమగణ్యమని సాహిత్యవేత్తలందఱు నంగీకరించిరి. అట్టిదే ఉత్తమమైనదని కీర్తింప బడుచున్నది. "వాక్యం రసాత్మకం కావ్యమ్"

సమర్థించుచున్నది. కావ్యాదులబ్రహ్మానంద సబ్రహ్మచారియగురసానందము సర్వులకు ననుభవ యోగ్యమనుట ప్రసిద్ధము. అవికల్పమగు బ్రహ్మానందముకంటెసవికల్పమై తనను దాదెలిసి యనుభవించు కావ్యాదుల యానందమే గొప్పదని అలంకారికుల మాట. ఈవిషయమునే "శ్రీరామకథామృత" కర్తలలో నొకరైన శ్రీ తాడేపల్లి వెంకటప్పయశాస్త్రిగారు తమ పీఠికలో "బ్రహ్మానందాదప్యతి రిచ్యతే కావ్యరసః"అని నుడివిరి. వేదశాస్త్రాధ్యయన యోగాభ్యాసములయందలసులైన సుకుమార బుద్ధులకు కావ్యము ముక్తి హేతువగునని భరత మహర్షి నాట్య శాస్త్రము వక్కాణించుచున్నది.

"రసోవైసః" తైత్తిరీయోపనిషత్-(7-6.) అను నుపనిషద్వాణిని "భగ్నావరణ చిద్విశిష్టమగు రసము" రసగంగాధరము (1-96.) గ నాలంకారికులు నిర్వచించిరి.

తిక్కనభారతమున "నానారసాభ్యుదయోల్లాసి"విరాటుపర్వము (1-7.) మొదలగు రీతిగ రస ప్రశంసగావించుట సాహిత్యలోక విశ్రుతము. మఱెందరో ఘనరస పాత్ర శోభితముగ దమ కావ్యముల నలంకరించిరి.

శ్రీరామ కథామృతమున వసంత వర్ణన సందర్భముగ,

క॥ అప్పటికప్పుడు సౌఖ్యం
బుప్పతిలుంగాక కొఅతలుండునె యదియే

చిప్పిలు రసవైభవమన ...." శ్రీరామకథామృతము.బాల.2-71.

అని రసవైభవము గూర్చి ప్రశంసించుచు నయ్యది "సద్యఃపర నిర్వృతి" కి హేతుభూతమగుట నిరూపింపబడినది. "నవకథాదృతిని మించి రసము వేయిరెట్లు గొప్పది" రామాయణకల్ప వృక్షము - బాలకాండము అని ప్రాచీనార్వాచీన ప్రాచ్య పాశ్చాత్య కవులభిప్రాయపడినట్లు విశ్వనాథవారు వాకొనుట గమనార్హము.

ఈనాటి పరిశోధనలకందినంతవరకు నాట్యశాస్త్రకర్త భరత మహర్షియే ప్రథమ రస సిద్ధాంత కర్త. ఆయన రచించిన "విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః" అనుసూత్రము తరువాతి రస చర్చలన్నింటికిని మూలమైనది. భట్టలోల్లటుడను పండితుడు సంయోగమనిన నుత్పాద్యోత్పాదక భావమనియు, నిష్పత్తి యనిన నుత్పత్తి యనియు పలికెను. ఈతని మతమున రసము నాయక నిష్ఠము. దీని నుత్పత్తి వాదమందురు. శ్రీశంకుడను మరియొకవిద్వాంసుడు సంయోగమనిన జ్ఞాప్య, జ్ఞాపక భావమనియు, నిష్పత్తి యనిన ననుమితి యనియు జెప్పెను. దీని ననుమితి వాదమందురు. ఈమతమున రసము నట నిష్ఠము. భట్టనాయకుడను నాతడు సంయోగమనిన భోజ్యభోజకత్వమనియు, నిష్పత్తి యనగ 'భుక్తి' యనియు బలికెను. దీనిని భుక్తి వాద మందురు. ఈతని మతమున రసము సామాజిక నిష్ఠము. ఈ వాదములన్నియు లోప భూయిష్ఠములు. వీనినన్నిటిని దోసిరాజని అభినవగుప్తుడు ప్రతిపాదించినఅభివ్యక్తి వాదము ప్రామాణికమై నిలిచినది. పూర్వజన్మ సంస్కార వశమున వాసనారూపమున మానవ హృదయమునగల రత్యాది స్థాయీభావములు విభావాదుల సాహాయ్యముచే వ్యక్తమగుననియు నపుడురససిద్ధి గలుగుననియు నీతని సిద్ధాంతము. భట్టనాయకుని వలె నీతడు రసము సామాజిక నిష్ఠమని యంగీకరించినను నాతడు జెప్పని 'వాసన' నీతడు ప్రవేశ పెట్టుట జరిగినది. వాసనారూపమున రత్యాదుల సంస్కారము లేనిచో రసమనుభూతము కాదని యీతడు జెప్పెను.

భరతుడు 8 రసములను బేర్కొనెను. నాట్యశాస్త్రము-(6-15.) విక్రమోర్వశీయములో కూడా ఈప్రసక్తి కనుపించును. విక్రమోర్వశీయము 2-17.

వాల్మీకి రామాయణము మహాకావ్యమగుట నందన్ని రసములు సుసంపన్నములై పోషింపబడినవి.

"రసైః శృంగార కరుణ హాస్య రౌద్ర భయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేతదగాయతమ్"
వాల్మీకిరామాయణము- బాల. 4-9.

భరతుడు చెప్పినవి శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర భయానక బీభత్సాద్భుతములు. ప్రత్యక్షముగకాక పోయినను పరోక్షముగ భరతుడు శాంతమును రసముగ నంగీకకరించెనని, తదనంతరాలంకారికులు పలికిరి. ఆనందవర్ధనాభినవగుప్తాదులు శాంత రసమునంగీకరించిరి. రుద్రటుడు ప్రేయో రసమును,మధుసూదన సరస్వతి భక్తిరసమును ప్రతిపాదించిరి. కాని యివేవియుతరువాతికాలపు పండితుల విమర్శలకు నిలువలేదు.

కొందఱు పండితులొక్కొక్క రసమును ప్రత్యేకముగ నభిమానించి యదొక్కటే రసమని ప్రతిపాదించిరి. శృంగార రసమునకు భోజుడును, కరుణమునకు భవభూతియు, శాంతమునకభినవగుప్తుడును, నారాయణధర్మదత్తుడద్భుతరసమునకుప్రధానప్రతిపాదకులు.

ఈ రీతిగ ననేక వాదములు చెలరేగినను శాంతపూర్వక నవ రసములే అంగీకార్యములైనవి. ఇవి పెక్కురాలంకారికులచే నవవిధములుగ నుక్తములగుట కనుపించును.

శృంగార హాస్య కరుణా రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యే రసస్మృతాః -భరతుడు
శృంగారః కరుణః శాంతః రౌద్రో వీరోద్భుతస్తథా
హాస్యోభయానకశ్చైవబీభత్సశ్చేతితేనవ"అని రసగంగారము.

భాగవతమునందన్ని రసములు పరిపుష్టములై యుండినను అంగిరసమును గూర్చి భిన్నాభిప్రాయములు ప్రతిపాదింపబడినవి. భాగవతము భక్తి ప్రధానమైనట్టిదను కతమున ఇందు మధుసూదన

సరస్వతి చే ప్రతిపాదింపబడిన భక్తి రసము అంగిరసమని భావించుటయు జరిగినది. కాని యిది లాక్షణిక ప్రామాణికము కాలేదు. శాంత రసయుక్త నవరసములే యంగీకరింపబడి ఆమోద యోగ్యములైనవి. నిజమునకు భక్తి భావము శాంతమునందే యంతర్భవించును ఈ భక్తి వలన జనించు నిర్వికార వైరాగ్యాదులు శాంతమునందు స్థిరీకరింపబడును. కావున శాంతరసమునకు భక్తిభావము కారణభూతము. గజేంద్రమోక్షణ, ప్రహ్లాదచరిత్రాది వృత్తాంతములు భక్తియుక్త విశిష్టములు. ఐనను శాంత రసప్రతిపాదకములే యనదగినవి. గజేంద్రుడు కావించిన స్తుతి నరయుడు,

సీ॥ అఖిల జగద్బహిరంతరాత్మండగు
నా భగవంతు నేరరయజాల
- - - - - - - - -వర్గమందుండువాడు
తే॥ అఖిలమునకును నాధాతమైన వాడు
....బ్రార్థింతు గరము భక్తి. 8-55.

ఇందు గజరాజు సర్వభూతుడైన పరబ్రహ్మను ప్రార్థించుట కలదు. అట్టి యనుభూతి శాంత తత్త్వమే. ఒక రూపమును భావించి యద్దానినే చూచుచుదానియందే ప్రవర్తిల్లుటకాక నిర్గుణ స్వరూపైక భావనుని భావించుట శాంత తత్త్వమే యగును.

ఇట్లు ప్రతి భాగవతుని చరిత్రయందును భక్తిభావనోపదిష్టమై శాంతరసమే ప్రతిపాదింపబడుట దర్శనీయము. పై విధముగా నిర్వేదయుక్తమయిన శాంతమునందు భక్తి అంతర్భవించును.

అటులకాక భక్తియనిన తనకిష్టమైన భగవద్రూపమును కొలచుట. అనగా నాస్వరూపమును ప్రేమించుట. కనుక ప్రణయమగును. అదియే వృద్ధియయి మధురభక్తికి దారితీయును. స్నేహము, ప్రేమ మొదలగు పేర్లతోనుండు సమరస భావమునకే ప్రీతి, ప్రణయమను

నవి మారు పేరులు. ఈ రీతి భక్తిలో ప్రేమ మిళితమై శృంగారముగా పరిణమించును. గోపికల విషయముననిదే జరిగినది.

ఈరీతిగ భక్తియనునది శాంత రసముననో లేక శృంగార రసముననో యంతర్భవించును. గోపికలు శ్రీకృష్ణుని ప్రాణులకాత్మ వగుటచే నీవే మా సర్వస్వమనుటలో శాంతము భాసించును. కావున శృంగార యుక్తమైన భక్తియైనను శాంత రసమునకే ప్రాధాన్యము. కావున భాగవతమునందు శాంతరసమే యంగిరసమని యెంచదగును. తక్కిన రసములన్నియు నంగరసములుగ నౌచిత్యవంతమై పరిపుష్టతనంది యున్నవి. ఆయారసములెట్లు సందర్భోచితితో పరిపోషితములైనవో పరికింపబడుచున్నవి.

## 1. నవ విధ రసములు - శృంగారము:-

వీరాద్భుతాదులు రసములే కావను భోజుని వాదమంగీకరింపకపోయినను శృంగారము రసరాజమని యొప్పుకొనక తప్పదు. ఈ చరాచర జగత్తు శృంగారము లేక వృద్ధిపొందదు. సృష్టి హేతువగు మైథునమునకు మూలము శృంగార భావమే. కావుననది జగత్కారణమును, జగదానంద హేతువునగు రసము. రెండు జీవుల యేకత్వ సిద్ధియిందుదప్ప మరియొక దానిలోనసాధ్యము.

కావున, స్త్రీ పురుషుల యన్యోన్యాలంబనమగు ప్రేమాఖ్య చిత్త వృత్తి విశేషమైన రతి స్థాయి భావముగ గలది శృంగారము. "స్త్రీ పుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషో రతిఃస్థాయి భావః" రసగంగాధరము_ 1 ఆ. అనునది యాలంకారికలక్షణము.

శృంగారమున ప్రేమ, కామము రెండు భావములు. స్థాయి భావమగు రతిలో లౌకికమగు కామ వాసన కొంతయుండక తప్పదు. అది పరిక్షాళితమైనకాని రసానందమనుభూతముగాదు. లౌకిక రతిలో సుఖమేగాని ఆనందము లేదు. ఆనందము తదతీతమైనది. కావ్య

గత శృంగార రసానుభవముగనది కామ కాలుష్యరహితమై, లౌకిక
వాసనాతీతమై, యత్యంత స్వచ్ఛమై, బ్రహ్మానంద సహోదరమై యు
రాదునని విబుధ ప్రోక్తము. ఆ శృంగారము భగవత్పరమయినచో
కామవాసన వచ్చుటకు నీషదవకాశముండదు. భక్తిభావాన్వితమగ
శృంగారమతిమానుష భావహారీ సమన్వితము, దివ్య ప్రేమ పరిమ
భరితమును.

ఈ శృంగారము సంభోగము, విప్రలంభమునని ద్వివిధము
చెప్పబడుచున్నది. స్త్రీ పురుషుల సమాగమునకు పూర్వమునగల య
రాగము "నభిలాష శృంగారము" గ నుక్తమయినది. సంభోగానం
రము నాయికా నాయకులకు గలిగిన యెడబాటు విప్రలంభము. విప
లంభమున నీర్ష్యాసూయ, ప్రవాస, శాపాది కారణములచే పెక్కవా
తర భేదములు వర్ణితములైనవి. పర ప్రహ్లాదన సమర్థమగునీశృంగారవ
మధురమనుట నిక్కము. సృష్టి సమస్తమునకు శృంగారము మూ
మగుట దాని ప్రాధాన్యము తెలియుచున్నది.

భాగవతములోని శృంగారమునకు శిఖరాయమాణమగు గోపి
కృష్ణ క్రీడా ఘట్టము భక్తిభావాశ్రితము. భక్తిభావరహితమగు శృ
గారమునకు భాగవతమున భగవత్పరముగ స్థానము లేదు. అట్టి భగ
త్పర భాగవత శృంగారము లౌకికమగు దాంపత్య శృంగారము కా
అది భగవన్నిష్ఠమగు ప్రేమ శృంగారము మాత్రమే. భగవంతు
నాయకుడైయుండు పురాణములలో నేరసమైనను పరమేశ్వర పర
వధిగ పోషింపవలసి యుండును. ప్రథానగాథకు నానుషంగికమ
వచ్చునితరములైన యాగ్నీధ్రుని చరిత్ర, పురంజయోపాఖ్యానమ
పురూరవుని కథ మొదలగువానియందు నీ శ్రీకృష్ణభాగవతమున లౌ
శృంగారము పోషింపబడిననునది సందర్భానుసారమువనేయని భా

శృంగారము ప్రధానముగ పోషింపబడి ఆనుషంగికమగునితర శృం గార కథలు స్పృశించుట మాత్రముచేతనే విడచిపెట్టబడినవి. భారతా దులలోవలె నీ కథలకు భాగవతమున ప్రాధాన్యతలేని హేతువున పోతన విడచియుండనోపును. ఇట్టి వానిని సహితము మిగుల రసవం తముగ తీర్చిదిద్దగల నేర్పు యున్నను పోతన దృష్టి యెల్ల వేళల నా పరమాత్ముడైన శ్రీకృష్ణుని మాత్రమే ప్రధానముగ ననుసంధించు ననుట జగద్విదితమే! అట్టి పరమోత్కృష్టమగు గోపికా ప్రణయము ప్రత్యేకముగ పరామర్శించుట సముచితము. ప్రస్తుతము శృంగార భేదముల పరిపుష్టిని గమనించినపిదప నా గోపికా శృంగార ఘట్టము పరిశీలించుట జరుగును.

## అభిలాష శృంగారము:-

శ్రీకృష్ణభాగవత చతుర్థస్కంధమున పురంజయోపాఖ్యాన సందర్భము పరిశీలింపదగినది. ఉద్యానమునపురంజయుడు ఒకానొక స్త్రీనిగాంచి మోహితుడై యామె వివరముల పృచ్ఛించుచు తన యిచ్ఛ తెలయబరచి ప్రార్థించుటలో,

వ॥ "నీ కటాక్ష వీక్షణములచే గలంగిన చిత్తవృత్తిం గలిగి మదన బాణానల
సంతప్యమాన మానసుండనై విరాళింబడు నన్ననుగ్రహించి నీ
మధురాధర సుధారసంబున విగతజ్వరుంగావింపుమని"

4-327.

అని వర్ణింపబడినది. ఇందు పురంజయుడా చామనభిలషించుచున్నటుల గందు. పిదప వారి సమాగమముచే నీ శృంగారము రస సిద్ధినందినది కావున నిది యభిలాష శృంగారమే యగును.

అటులే పంచమస్కంధమున నాగ్నీధ్రుడు పూర్వ చిత్తినిచూచి మన్మథ మథితుడై,

సీ॥ కలువ కంటీ! నీవు కనుబొమలనువిండ్లు
కనుచూపులను ముల్కులను ధరించి. 5-62.

అని పలుకుట వాని యభిలాషకుపబలకమే. మఱియునిందు భావకవిత్వ పోకడ కడు రమ్యముగ గోచరమగుచున్నది.

ఆ విధముగనే నవమస్కంధమున పురూరవుని వాంఛితము విని యూర్వశి,

మ॥ అవురా! నీదు మనోహరాంగకములే యబ్జాక్షి కందోయికిన్
దవులన్గామశరాహతింబడక యేదారిం బ్రవర్తిల్లగా
నవు నీ వక్షమునొందగల్గినది మోహావేశ యుక్తాత్మయై
నవయంబోవక యుండునిన్గలియనేవాంఛించి యేవచ్చితిన్.
9-269.

అనుచు తన అభిలాషమును జూపుటయు గమనింపదగినది.

ఈ రీతిగ రుక్మిణీ కళ్యాణ ఘట్టమున రుక్మిణి శ్రీకృష్ణునభిలషించుట 10.ఉ.భా.1-91. యందును, ఉషా పరిణయ ఘట్టమున నుష ప్రద్యుమ్నునభిలషించి తన చెలియైన చిత్రరేఖతో తన యవస్థ దెల్పుకొనుటయందును 10 ఉ.భా. 2-20. మొదలుగగల సందర్భములనిది పోషింపబడినది.

## సంభోగ శృంగారము: -

నాయికా నాయకులు ప్రీతితోగలిసి యొక్కయెడ సుఖముగ నుండుట సంభోగ శృంగారము.

పురంజయుడా మృగాక్షినికోరగా నామెయునంగీకరించినది. అప్పట్టున

వ॥ "- - - - - - - -వారు బరస్పరాను రాగంబులం దెలుపు
కొనుచు నా పురంబునంబ్రవేశించి నూఱు వత్సరంబులు జెల్లు
దాక సర్వ సుఖంబులనుభవించిరి.

యందునందును గ్రిడించె 4-329,330. - - - - - -" అని వారి సమాగమము నసభ్య స్పర్శలేక చెప్పుట మనోహరము.

మఱియు పూర్వచిత్తియాగ్నీధ్రుల సమైక్యమును,

వ॥ "- - - - - - అదియునట్టిపనికే వచ్చినదిగావున నానికియ్యకొని వాని యిచ్చ వచ్చినమచ్చున మెలంగెనతండు నయ్యచ్చరమచ్చెకంటింగూడి భూలోక స్వర్గంబులైయున్న నవ ఖండంబులందు సమస్త సుఖంబులనుభవించుచు 5-65. - - - -" అనుటయందును

యోగశక్తిచేనుసాసఖి చిత్రలేఖ అరుద్ధునికొనిరాగా నుషనామెనంపివుచ్చి,

ఉ॥ నిద్రితుడైనవాని వరునిందనచేతుల నంటిలేపి యో
భద్రమణి! త్వరంపడక వాకులు విన్మవి సర్వవృత్తమున్
మాద్రికి మీఱు చందమున మాటికెఱుంగగజేసి వాసిమై
ఛిద్రమొకింతలేదనుచు జెప్పి మనోహరునొప్ప జేయుచున్"

అని నాతనినొప్ప జేసి,

వ॥ "కలియవచ్చి గాఢాలింగనంబు జేసికొనియె నతండును గన్యాపహృతేంద్రియుండును విస్మృత సర్వ వ్యాపారుండునై రాత్రియుంబవలు నాకాకడగన్నెమిన్నతోడంగలసి మెలసి మెలంగుచుండె 10.ఉ.భా.2-23,24. - - - - -"

అనుట యందును నీ సంభోగ శృంగారము వర్ణితము.

## వియోగ శృంగారము:-

ఏదేని కారణముచే నాయికా నాయకులకు వియోగము సంభవింప వారనుభవించు విప్రలంభమే వియోగ శృంగారము.

సమయభంగమగుటచే నూర్వశి పూరూరవుని వీడి కానరాక

పోవుటచే నతడామె వియోగముచే దుఃఖించు పట్టున వర్ణితమగుటనిది గాననగును.

వ॥ – – – – – – పురూరవుండును దల్పంబున నూర్వశిం గానం
ఔలక వెట్టి యెత్తినవాని చందంబునం బరిభ్రమించుచు– – –"
సరస్వతీ తీరమున సఖీ పరివృతయగు నామెనుజూచి

చ। నిలునిలుమే బురూరవుడ నీరజలోచన నీకు గానిటుల్
పొలములరణ్యముల్ గిరులు పుంతలు గంతలు రోసికొంచు ని
ట్టులుదిరుగాడుచుంటినిగడుంగడు వేసటుకైతి నక్కటా
నిలుపుము నాపయింగరుణ నీదు ననుగ్రహమాస్త పేసిల్తిన్.
9-277,278.

అని పలుకుటలో నాతని విరహాతిశయము గాననగును. అంతటితో నాగక నాతడు,

తే। నన్ను గరుణింపకుంటివే సన్నుతాంగి
యింతలోపల బ్రాణము లింద విడుతు
నా శరీరము తోడేళ్ళు నక్కలు దిన
జూడగలదీవు నీ కంటితోడ నిపుడ.

అని దీనాతి దీనంబుగా పలుకుటలో (9-279,280.) నాతని విరహము పరాకాష్ఠ దశ గోచరించును.

శ్రీకృష్ణుడు రుక్మిణితో విరసోక్తులాడగ నామె దుఃఖించిన స్థితి నిజముగ వియోగము సంభవింపకపోయినను నటుల భావించి దుఃఖించుట యామె భర్త్రనురాగాతిశయమును జూపును.

వ। "– – – – – – పలుకులు విని గడగడ వడంకుచు మాటలేక
గాలిం గూలిన
యనంటి వోలె నేలంగూలి యొడ లెఱుంగక కంట నీరు
గార్చుచుండె

రురు తేజో విభవాంచితుండవిక నేనోజ్ఞాన లేశంబు నే
దొఱయం జాలనిదాననెట్లెఱిగియుండున్నిన్ను సర్వేశ నీ
చరణాబ్జంబులు నమ్మియున్ననను గారుణ్యంజేసి రక్షింపవే.

10.ఉ భా 1-368, 371.

అని దుఃఖించుటలో వియోగము ప్రాపించి యా కష్టదశను తానను భ
వించుచున్నట్లె భావించి తీవ్ర వేదన నొందుట కమనీయము.

అట్లే యుష స్వప్నమున దాననిరుద్ధునితో రత్యాది సుఖంబుల
దేలినట్లు కాంచి యనంతరము విరహము ననుభవించు పట్టున నీ
భావము కనుపించును. నిజమునకు భౌతికముగ నిట నుష యని
రుద్ధుని గవయలేదు. కాని యా విషయమామె యెఱింగియు దుఃఖిం
చుటలో నావేదన శిఖరములందు కొనుట గోచరింపదగినది.

సీ. "యీయమ యెుక్క నాడనిరుద్ధనిన్ స్వప్న
మున గూడిరతి సౌఖ్యమున మునింగి
స్వప్నాంతమున నాయుషాకన్య వరునందు
నెందునుంగానక కుందికుంది

తే. నా మనోహర యెందుంటివో మనోజ
రావెనాతాప మార్పవే రాజపుత్రి
నేను నిను బాసినిముసమే నిలువ జాల
జాలు పరిహాసమిక వచ్చియేలు నన్ను.

మఱియు చెలియైన చిత్రలేఖతోనుష తన వేదన ప్రకటించు సందర్భ
మున నీ విరహము పరిపుష్టమై అలరారినది.

చ. "అతడధరామృతంబు తనివారగ ద్రావగనిచ్చి"

10 ఉ.భా. 2-9.16.

అనుచు నామె యాతని రూపు చిత్రించి చూప

మ॥ ఇతడే నాదు మనోహరుండు జలజాక్షీ। వీని బొందంగ లే
నితఱిం బ్రాణము లీలమై విడవగానే నుంటి నాకే మహో
న్నతియుం బొందెడు కోర్కి లేదు. "(10.ఉ.భా.220.)——"

అనుచు విలపించుచు పలవించుట జూడ నిది యప్పటికినయోగ శృంగారమైనను వియోగావస్థతో తీవ్రతరమై ద్యోతకమగుచున్నది.

## గోపికా ప్రణయ ఘట్టము:-

భాగవతమునందు గోపికా ప్రణయము విశిష్టమైనదని విజ్ఞులందఱునెఱిగినదే. గోపికలు శ్రీకృష్ణుని కోరి తమ సర్వస్వమును సమర్పించి యాయనయందు దగిలిన బుద్ధిగలవారై తరించిరనీ భాగవత వచనము. మూలమున వ్యాస మహర్షి "గోప్యః కామాత్" 7-1-33. ఇత్యాదిగ చెప్పుట జరిగినది. ఈ భావమునే పోతన "కామోత్కంఠత గోపికల్" (7-18.) అనియు "కామమునన్ గోపికాస్త్రీలు"(7-25.) అని శాస్త్రిగారును మూలానుసారముగనే పలికిరి.

ఈ సందర్భమును పోతన బహు రసవంతముగ తీర్చి దిద్దిన విషయ మందఱెఱిగినదే. కాని యటనట నాయన విధానమీషన్న్యూనముగ గలదనుట విమర్శకుల యభిప్రాయమే కాక నందఱను నాలోచింపజేయునది యనుట వాస్తవమేయనిపించును. శ్రీకృష్ణభాగవత పీఠికలో పీఠికాకారులు పోతన భాగవతమును గూర్చి ప్రస్తావించుచు " - - - - - గోపికా కృష్ణులకు గల సంబంధము జీవ పరమాత్మైక్యానుసంధానము వంటిదనియు, వారు మహా పవిత్రులనియు జెప్పుచుండ వారిని పచ్చి భోగము వారిగాను గృష్ణుని విటునిగాను చేయుట యుక్తముగా దోపదు. భాగవతదశమస్కంధములో,

ఈ పొదరింటిలో నిందాక గృష్ణుండు
నాతోడ మన్మథ నటనమాడె '...............' ఈ

శృంగారము కాదనుటకు వీలులేదు "(పీఠిక.పుట.7.) ఇత్యాదిగ పలు కుట గమనింపదగినది.

శృంగార రస సాధనమున భగవంతుని చేరుకొనుటకు మార్గము తీసిన వైశిష్ట్యము ప్రప్రథమముగ గోపికలదే. లౌకికములైన దర్శన స్పర్శనములవలన నెట్టి యనుభూతి కలుగునో యట్టి మధురపారవ ర్యము నిత్య ధ్యానములో వారికి లభించునని కృష్ణ సందేశము. అనగ వారి శృంగారము లౌకికస్థితి నుండి యలౌకికస్థితిలోనికి పయనించు చునన్న మాట. అలౌకిక శృంగారమున నిరంతర ధ్యానముచే నెట్టి దివ్యానుభవము కలుగునో వారికొక్కసారి రాసలీలాదులలో కృష్ణుడ నుభవపఱచినాడు. ఆ మహానుభవ మితర సుఖములను కాంక్షింపనీయ కది. ఆ స్థితిలో గోపికలు దాని పునస్సిద్ధికై తపము చేయుట సులభము. లోకాతీతమునగు పరమానంద మెట్లుండునో యొక్కసారి తెలిసి యను భవించిన దానిని పోగొట్టుకొన్న వ్యక్తి దానికై కృషిచేయుట వేరు. అదెట్లుండునో తెలియక నేదో యూహించుకొని దానికై సాధన చే యుట వేరు. మొదటిదానిలో గురి కుదిరినట్లు రెండవ దానిలో కుదు నిదు. గోపికల పూర్వపుణ్య పరిపాకముచే నా గురి కుదురగల యవ కాశాము వారికి లభించినది. రాసక్రీడలోని పరమ రహస్యమిది.(ఆంధ్ర భాగవత విమర్శ. పుట 388.) అను ప్రసాదరాయకులపతిగారి భావము ముమ్మూర్తుల వమ్మగానిది.

భాగవతమున ఈ ఘట్టము మిక్కిలి విమర్శలకు లోనైనది. అట్ల గుట వాస్తవమే. శుకమహర్షి చెప్పునపుడు పరీక్షిత్తునకే కలిగినది. తద న్యులకు నాశ్చర్యమా! ఆ తాదాత్మ్యస్థితి అనుభవైకవేద్యము. భాగ వతతత్త్వమే యలాటిది. "భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా నటీ శయా" అను ప్రామాణిక వాక్యము యథార్థము.

శుకమహర్షి రాజు సందేహము విని "---కామక్రోధ స్నేహ

సౌహృదాదులందెద్దానసైన భగవంతుండగు నాకృష్ణునందు జిత్తంబు లగ్నంబు గావించిన వానికి మోక్షంబు కరతలామలకంబు గావున నిట విస్మయంబున కవకాశంబు లేదు - - - -" అనియును నీకే కా ధిది యెల్లవారికిని సందేహింప నౌనంశచే అని సమాధానింధుచు

తే। ఏ వనెడు భావ మేరికి లేనిదగునొ
వారు భగవంతులగుదురవ్వారు ధర్మ
మాచరించినచో నర్ధమరయలేదు
వ్యత్యయమొనర్పగ ననర్ధమదియు లేదు.

"ధర్మాధర్మములరయగ నీశ్వరునకున్న వన లేరేరున్" అనుచు సర్వ భక్షకుడగు అగ్నికి బలె ఈశ్వరునకే దోషమునుండదనియు

చ। వినుము నరేంద్ర చెప్పెదను విష్ణుడు రాఘవుడైననాడు స
న్మునివరు లేగుదెంచి రఘుపుంగవ మమ్ము బ్రియాప్రసంగతిన్
బ్రిణయమునన్ గనుంగొన వరంబిడుమంచననాతడవ్వలిన్
దనరెడునంచు బల్కె యిటుదాన జనించెయదూద్వహుండునై.

తే। శౌరి యస్ఖలిత బ్రహ్మచారి తొంటి
మునులె గోపికలై యట్లు జననమంది
రెట్టి ప్రణయమునన్ వారి నేల వలెనొ
తెలిసి క్రీడించెనని నీకు దెలుపు చుంటి.

అని అసలు విషయమును చెప్పి యంతకు ముందే,

క। లీలా మానుష విగ్రహు
డాలకీశ్వరుడు తనదు నాతులకు నే
లీలల భక్తి జనించెడు
నా లీలల వారిదేల్చునని యెఱుగనగున్.

10.పూ.భా. 2-340 నుండి 447.

యనియు నాయనకేచెల్లుననియుపలికినాడు. అదియేభాగవతతత్త్వము. ఆ తత్త్వము ద్వారా మాత్రమే అది బోధ్యమానమగును. కాని ఎవరి తత్త్వమును బట్టి వారు ప్రయత్నించిననది దురవగాహమే. కావున పై తత్త్వము భక్తితత్పరులకేకాని మనలాటి అతి సామాన్య వ్యర్థ జీవులకు చెల్లదనుట భాగవత ప్రతిపాదితము. అంతియకాక గోపికల చేతనే

"తలవంపుల్నగుబాట్లువచ్చుననుచున్ ధర్మంబులెవ్వేవొ మాకు - - - - - కులటా ధర్వములవ్వి మేము వినమాకుంజెప్పగా నొప్పునే పలుకుల్ సేసితి భక్తురాండ్రము వమున్ బాటింపవే వల్లభా!"

అని స్పష్టముగ భక్తురాండ్రమని పలికించుట ముఖ్యము. మఱియు,

చ॥ ప్రియులను దల్లిదండ్రులను బిడ్డల దొడ్డల బాసి యుండుటల్
జయమునుగోరునారులకసమ్మతమంటివి మేలు మేము నా
నయమునె దెల్పుచుంటిమిజనార్దన ప్రాణులకాత్మ వౌటచే
బ్రియులును దల్లిదండ్రులును బిడ్డలు దొడ్డలు నీవెమాకిలన్.

అని సప్రమాణముగ,

క॥ కావున ధర్మగ్లానికి
నేవిధమునగానిసందొకింతయు నేనిం
దేవారు చూపనోపరు
దేవా మాపై బ్రసన్నధీనిడ వలయున్ అని సమర్థించి,

తే॥ భక్తుల ననుగ్రహింతువో భక్తవరద
బ్రహ్మ వేత్తలు నీ యందరతి యొనర్తు
రిట్టి నీవుండ నార్తుల కిక్కలైన
పతి సుతాదులతో నేమి పని ముకుంద!

10.పూ.భా. ౭-౩౯4 నుండి ౩౯7.

అని ఖరాఖండిగ పలుకుచు భక్త రక్షణుడైన కృష్ణుని నిలదీయుట కాంచ

దగినది. అట్టి గోపికలు కేవల స్త్రీలా! వారు కులటా ధర్మములననెంతో నొచ్చుకొని యిట్లు పలుకుట పాడియాయని పలుక సాహసించిరి అది భక్తులకే చెల్లును! అంతియ కాక బ్రహ్మవేత్తలు నీయందరతి యొనర్తురనిరి. మరి వారుతత్తుల్యులేగా! కృష్ణునాత్మరూపుడవనిరి. జనార్దనయని సాభిప్రాయముగ సంబోధించిరి. జనాని అర్దయతీతి జనార్దనః జనులను(భక్తులనుప్రస్తుతము) రక్షించువాడని దానియర్థము. అంత తాత్త్వికులు కనుకనే "ధర్మగ్లానికి తావెక్కడ?" యని ప్రశ్నించి సహేతుకముగ పలికిరి. మఱి వారధార్మికులా? చివరగా పతిసుతాదుల తోనేమి పనిముకుంద! యనిరి. ముకుందయనగ మోక్షమునిచ్చువాడని యర్థము. బ్రహ్మవేత్తలు రతియొనర్చుట లేదా రమించుట యనగా మోక్షగాములై భగవదైక్యత చెందుటే! అట్టిచో వారు పాడిదప్పి ప్రవర్తించిరని పల్కు సాహసమెవరికెవరిచ్చిరి? కావున ఆతత్త్వ మార్గము ద్వారా యన్వేషించిన మాత్రమునవే యర్థమగుననుట నిర్వివాదాంశము. కావున నెవరైనను ననవసర ప్రసంగములచే నా పరమ భక్తురాండ్రయన గోపికలను తప్పువట్టిననటులొక్క యజ్ఞానులకు మాత్రమే తగి యున్నది. పైగా గోపికలు పరమాత్ముడైన శ్రీకృష్ణునే వరించి తమ సర్వస్వమునర్పించిరి కాని దారినబోయే ప్రతివ్యక్తితోను వర్తింపలేదు! ఇటుల స్పష్టముగనున్నను నా భక్తురాండ్రను, సర్వ జగదంతర్యామి యయిన కృష్ణ పరమాత్మను విమర్శలకు గురిచేయుట దురదుష్టకరము, అతి విచారకరమునై యున్నది.

ఇక కృష్ణ సమర్పితమగు మధురభక్తి సమన్వితమైన మహాద్భుత భాగవత శృంగారము రసపుష్టితో నెంత మనోహరముగ తీర్చ దిద్దబడినదో యనుశీలనము జేయుటకు మరికొన్ని సందర్భములు స్పృశింపబడుచున్నవి. గోపికల విరహ తీవ్రత యిటులే యున్నదిట.

దవు. వాచామృత సంప్రసారమున జల్లార్పంగటాక్షింపుమో
భువనాధార! పౌనర్భవేనియటులీ మూర్తంబునందెప్రిళ్ళియో
గి వరేణ్యుల్గాను నీ పదంబుగొని ముక్తింగాంతు మొక్కింతలోన్.

10.పూ.భా. 2-359.

కృష్ణునకు సర్వ సమర్పణము కావించుకొని యా ప్రేమ తీవ్రతచే విరహమున మరణమును పొందు స్థితికి వచ్చిన గోపికల భావౌత్కట్య మును సర్వ సమగ్రముగ తీర్చిదిద్దిరి.

యోగివలె బ్రహ్మానందమును పొందుగోపిక పారవశ్యమునుచిత్రించు నీ పద్య రామణీయకముహృద్యమైనది.

తే॥ ఒకతె నేత్రరంధ్రంబుల నుల్లమందు
బొదివికొని ప్రాణనాధుని మూసి కనులు
కౌగిలింత లొనర్చుచు యోగివరుని
చాడ్పునంబోల దోచె నా సమయమందు.

10.పూ.భా.2-412.

ఇది సీసపద్యమొకదానికిగల యెత్తుగీతి. ఈపద్యము పోతనదైన
"ఒక్క లతాంగి మాధవుని యుజ్జ్వల రూపము చూడ్కి తీగెలన్.

10-1061.

ఇత్యాది పద్యమునకు తుల్యముగనుండుట చూడదగినది.

రతి యనిన శారీరకమగు సంయోగమనియే భావముకాదు. పై పద్యగత బ్రహ్మానందానుభవము గోపికలు గాంచిన శృంగార రసా నుభూతికి సముచిత తార్కాణము. ఇదియేనిజమైన రత్యనుభవము.

శ్రీకృష్ణుడు గోపికా కాంతలకు లోచనగోచరముగానియప్పుడు వారతి దుఃఖితలై మూఢత్వమున ఆయావానిని ప్రశ్నించుటలోగల మనోహరత యిటుల చెల్వారినది.

సీ॥ మా చిత్తచోరుడై మా మనోనాథుడు
కనుగప్పెవనులార గాంచినారె
10 పూ. భా. 2-3

ఇందారగాగమముతోడి ప్రయోగముతో నతిమనోహరముగ
మనోహరుని యడుగుటలో వారి పరాకాష్ఠకు జేరిన ప్రణయము
నీయ మగుచున్నది. తరువాతిదైన,

చ॥ తొలకరిమబ్బుతోడ దుల దూగెడు నల్లని మేనివాడు
10.పూ. భా. 2-

ఇత్యాది పద్యము పోతనదైన "నల్లనివాడు పద్మనయనంబ
వాడు" (10-పూ-భా-1010.) అను పద్యమునకు దీటుగ సాగుట
నింప దగినది.

శ్రీకృష్ణుని దర్శనమైన పిదప వారి బహువిధ శృంగార క్రీ
విలాసము లెంత రమ్య వర్ణితములోనిది చూడ తెలియ గలదు.

సీ॥ చెలువ యొక్కతె చెక్కు చెక్కుతో మోపిన
విభుడు తాంబూలి చర్వితము పెట్టె
10-పూ-భా-1

ఇత్యాది పోతన పద్యమును తలపింప జేయుచు,

సీ॥ హరికరాంబుజ యొక్క తరుణి దోయిట బట్టె
నొకతె తద్బాహువునూనె మెడను

తే॥ ఒకతె నేత్ర రంధ్రంబుల నుల్లమందు
బొదివికొని ప్రాణనాథుని మూసికనులు
కౌగిలింతలొనర్చు యోగి వరుని
చాడ్పునం బోలదోచెనా సమయమందు.
10-పూభా-2-

ఇందలి యెత్తుగీతి యితః పూర్వమే వారి ప్రణయాతిశయమును

ఇట్లు విరహముననుభవించిన గోపికా శృంగారము రాసక్రీడకు ముందటిది కావున నీ వేదన యయోగశృంగారముగాని వియోగ శృంగారము గాదు. నిజమగు వియోగ శృంగారము భ్రమర గీతలలో గోచరించును. శ్రీకృష్ణునితో శృంగారానుభవములను పొందినబిదప గోపకాంతల వియోగ వేదనలను వర్ణించిన ఘట్టమిది యొక్కటియే. ఆ వియోగమును పరిశీలించుటకు ముందు వారి రాసకేళి నొకమారు పరికించుట సముచితము.

సీ॥ తనమీఁదవైచిన వనజనాభుని చేయి
 ముద్దుగొనియె వలపుననొకర్తు

తే॥ చెమట చిత్తడి నంటులుగొమరు మిగులు
 నెఱికురులతోడ మోములు గరిమ మీఱ
 రవల యొడ్డాణములు మ్రోయ రమణులట్లు
 రమణునింగూడి సలిపిరి రాసకేళి. 10.పూ.భా.2-432.

ఇట్లు సంభోశృంగారమును స్పష్టముగ వర్ణించుట నీ భాగవతమున నిదియే.

మఱియు వారి పలువిధములయిన విలాసములు కడు రమ్యముగ వర్ణింపబడినవి.

ఇక నుద్ధవునితో తమ వియోగ దుఃఖమును గోపికలు వెళ్ళబోసికొనిన సందర్భమున వారి విప్రలంభతీవ్రత శిఖరాయమాణము.

సీ॥ మాస్మితేక్షణముల మన్నింపబడు కృష్ణు
 డామధుర స్త్రీల ప్రేమికగునె" 10.పూ భా. 2-367.

ఇందు దూరదేశగతమగు కారణముతోపాటు పల్లీయులైన ఆ స్త్రీ సహజమైన యీర్ష్యా గతమగు విప్రలంభము వర్ణింపబడుట అతి

ఉ॥ ఆ లలితావలోకనము లామృదు మాధురిమోక్తి యుక్తులా
బాల విలాస హాసముల భావము లాగమనోత్సవంబులా
యాలఘులాలన ప్రతిభలా చిఱునవ్వుల పువ్వులా కళా
లీలలు మామదిం దగిలె లేమల మేమెటు కృష్ణువీడుటల్"
10.పూ.భా. 2-371.

అని యద్వేగ వేగధారతో పల్కుట వారి వియోగ తీవ్రతను స్పష్టము చేయుచున్నది.

కృష్ణుని చూచుటకు వాని ధర్మ భాషలు వినుటకు, డాసి కౌగిలించుటకు, ప్రణయ కలహములాడుటకు వారనుక్షణము నెదురు చూచెదరు. ఇట్లు వగచెడి గోపికలకు కృష్ణ సందేశముచే విప్రలంభ వ్యథ దూరగతమైనదట. శ్రీకృష్ణుడు,

శా॥ నేనెట్టిండనొ చెప్పె దన్వినుడునన్ సేవించుచున్నట్టి వా
డైనన్ వానికి నెప్పుడున్విడని ధ్యానంబు నేకూర్పనై
నేనెవ్వానికి దర్శనంబిడనిలన్ నిస్పృండు ప్రాప్తార్థమె
ట్లో నష్టంబుగ దగ్గతాత్ముడగునట్లుండున్ననుంగొల్చుచున్
10.పూ.భా. 2-420.

క॥ దూరంబున నుండుటచే
మీరు ననున్మనమునందు మెలపుచునెపుడున్
గోరిక ధ్యానించెద రా
కారణమున జెంతనున్న కరణియ కాదే. 10.పూ.భా.2-362.

అని యూరార్చుటలోనితత్త్వము గమనింపవలసియున్నది. దూరభేదము చేతనే కదా ప్రేమ యినుమడించుట. ఈ రీతిగ నెల్లవేళల ధ్యానించుట జరుగును. అదియే గదా పరమాత్మునకిష్టమట. ! దగ్గర నున్నచో విలువ దెలియదు! ఆహేతువుచే నాయన త్వరగ గనపడడుట! భక్తులైనవారికి తన కిటుకును జెప్పి వైచినాడు.

మఱియును చేసిన మేలుమఱచి కృతఘ్నులగుట సాధారణముగ మానవ నైజము. శ్రీకృష్ణుడు తనకు సర్వ సమర్పణముగావించుకొనిన యాగోపికలకు సందేశమును,

చ॥ నెలతలు మీరు నా పయిని నిల్పి మనంబు సమస్తమున్ సదా
తలచుచు నన్ని వృత్తులను దత్పరతన్నను గొల్చుచుండుటన్
గలుగును మీకు నాదయిన గారవమింతటిలోన నేను మీ
పొలములు కూటముల్ మఱచి పోయెడి వాడనుగా నొకప్పుడున్.

ఈ రీతిగ పంపుటలో కృతజ్ఞతా లక్షణమును స్వయముగ నెఱపి లోకమునకెటుల మార్గ దర్శకుడయినాడో! మఱియు నిందొక విశేషము కన్పట్టుచున్నది. సర్వదా తలచుట యేకాక నన్ని వ్యాపారములను నాయనకే సమర్పించి సేవించుట చెప్పబడినది. ఆ పరమాత్మునకు భక్తులపై నెంత కనిరమో!

ఈ విధముగ శ్రీకృష్ణ భాగవతమున శ్రీ శాస్త్రిగారు మనోహరముగ గోపికా కృష్ణులకుగల సంబంధము జీవపరమాత్మైక్యానుసంధానమువంటిదను భావమును నిరూపించుటకు ప్రయత్నించి కృతా కృత్యులగుట పేర్కొనదగినది. శాస్త్రిగారు భాగవతమును పునర్లిఖిత మొనర్చుటకు నిదియొక హేతువన వచ్చును.

## ఇతర రసములు :-

## 2. హాస్యము :-

వాగంగాది వికార దర్శనమున జూపఱకు గల్గు చిత్త వికాసమను హాసము స్థాయి భావముగ గలది హాస్యము.

"వాగంగాది వికార దర్శన జన్మా వికాసాఖ్యో హాసః" 1-18 అని రసగంగాధర లక్షణము.

రుక్మి పరాభవము, సుద్యుమ్నుడు స్త్రీగ మారుట మొదలగు సందర్భములందిది పోషింపబడినది.

శ్రీకృష్ణుని చిలిపి చేష్టలలోను, గొల్ల పిల్లలలతో కలిసి చల్దు లారగించుటలోను విశ్వ సాహిత్యములోనే అద్వితీయ మగు హాస్య రసోదాహరణములు కలవని "తెలుగు హాస్యము-భాగవతము" యను దానిలోని శ్రీ ముట్నూరి సంగమేశము గారి మాట చూడదగినది.

నవమస్కంధమున సుద్యుమ్నుడు గౌరీవన ప్రవేశ కారణమున నశ్వపరివారాదులతో స్త్రీత్వమునొందిన సందర్భముగమనింపదగినది.

సీ॥ పేరురంబున యందు సొరుమీరగనయి
లికుచకుచంబులు లేవజొచ్చె 9-14." ఇత్యాది విధముగ వర్ణింపబడుట జూచిన నెంతవారికైనను నవ్వుపుట్టక మానదు. ఈ పద్యము శైలిని గూర్చి వివరించుచు రసానుగుణమైన పద రచనగా వించుట అనుదానిలో హాస్యమునకు హృదయంగమమయిన యుదాహృతమైనది.

సుద్యుమ్నుడు స్త్రీగ మారిన పిదపదన కర్మమునకు చింతిలుచు

సీ॥ నా కీర్తియంతయు నవ్వులపాలయ్యె
నా ప్రతాపంబోప నటనమందె
నా ఖడ్గ విభవమంతయు జడగట్టెనా
సత్ప్రభుత మహాస్య సరణి జేరె
నాకువలయ శోభ నయనంబులనుబడె
నాగభీరత యెల్ల నాభిదూరె
నాధనుః ప్రాజ్ఞత నలిగి కన్బొమలంటె
నాగొప్ప బొమ్మెక్కియూగులాడె

తే॥ నా సువర్ణ సమృద్ధి యంతయు దనుత్వ
మందెబోమత్పురార్జితమైన యట్టి
పౌరుషము జెడి స్త్రీత్వంబు వచ్చెనాకు

ఈరీతిగ భావించుట జాలితోపాటు హాస్యమును సమ్మిళితమై రసాను భూతి కలుగును. అంతియకాక నిందలి "శ్లేష" అతి రమణీయమై సహజత్వమును సంతరించుకొని యలరారినది.

దశమస్కంధమున బాలగోపాలుడు చెలికాండ్రతో చల్దినారగించుచు గోవులుకానరామి గోపాలురుకు జెప్పి స్వయముగ తాను వానినరయుటకు బయలు వెడలిన సందర్భమున బాల చేష్టత్వము గమనింపదగినది.

క॥ అని పలికి దరులు గిరులన్
వనులన్ వనములను గుహల వత్సములగతుల్
గనుగొనువాడై శ్రీహరి
జనియెన్ విడబోక బాణి సక్తకబళమున్. 10 పూ.భా. 1-344.

బాలుడైన గోపాలుడన్నంపుముద్దను వీడని హస్తముతో బయలు దేరుట యెంతయు సహజ రామణీయకమై హాస్య రస స్ఫోరకముగ నున్నది.

ఏకాదశ స్కంధమున సాంబునికి తోడివారు కొంటెదనముతో నంతర్వత్నీ వేషము వైచిన సందర్భమునగూడ నియ్యది సుపోషకమైనది. పిండారక తీర్థమునకు మునులు రాగ వారినిచూచి కొందఱు గోవులు కృష్ణపుత్రుడై సాంబునకు గుర్విణి వేషము వైచి శిశు జననముగూర్చి కొంటెదనముతో వారినడుగబోయిరట. అప్పట్టున నా వేష వైచిత్రి యెంతయు హాస్యయుతమై యలరారుచున్నది.

సీ॥ గుంటలుబడి కనుల్గొనబుదప్పగ వెల
వెల బాఱు నెమ్మోము వెలయుచుండ"

ఆ॥ జాకిబానబోలి వ్రేకనై యుదరంబు
కాయమెల్ల దానుగాగ నిండ
నిమ్నతలము లెందు నేగానరాక చూ
లాలు గాగనయ్యె సాంబుడపుడు. 11-14.

ఈ రీతిగ యాదవనందనులు సాంబునకు నంతర్వత్నీ వేష మును సంబరమున నచ్చు నల్పినరీతి (11-13.) గాంచిన నవ్వుకొనని వారెవరుందురు?

## 3. కరుణము :-

పుత్రాది వియోగ మరణాదులవలన నేర్పడిన వైక్లబ్యమను చిత్తవృత్తి విశేషము శోకము. అట్టి శోకము స్థాయి భావముగ గలది కరుణము. ఆది పదముచే స్నేహ బంధుత్వాదులు చెప్పబడుచున్నవి.

"పుత్రాది వియోగ మరణాది జన్మా వైక్లబ్యాఖ్య చిత్త వృత్తి విశేషః శోకఃరసగంగాధరము" (1-73.) అనునది యాలంకారిక లక్షణము.

కృష్ణ నిర్యాణాది ఘట్టములలోనీరసము సముచితముగ పోషింప బడినది.

ప్రథమస్కంధమున ద్రౌపది బంధితుడైన అశ్వత్థామను చూచి తానెంత శోకముతో కష్ట దశననుభవించుచున్నను కరుణామూర్తియై భర్తతో

మ॥ గురుపుత్రుండును బ్రాహ్మణుండితనినిగ్రోధంబునంజేసి యి
క్కరణింగొట్టను బోలె గట్టుటలునేగానంగ లేకుంటినో
కరుణాళూ! విడిపించు బంధనములన్ గందెన్ శరీరంబయో
తరలుంబో దుఃతంబు వచ్చెడిని సీతండెన్న ద్రోణుండెకా.
1-237.

అని పల్కుటస్త్రీ హృదయ మార్దవమునై కరుణ రసోచితమై యున్నది.

గర్భవతి యుత్తర దనవైపు వచ్చుచున్న అశ్వత్థామ యస్త్రా నలమునకు వెఱచి

మత్త॥ వెట్టనూర్చుచు నూర్పులెంతయు వింట బర్వెడునట్లుగా

బిట్టుగా మెయి జెమ్మటల్ ధరణింబడంగనుదోయినీర్
పుట్టి కాలువగట్టనుత్తర పొక్కుచుం బరువెత్తుచున్. 1-251.

ఈ రీతిగ ప్రవర్తించుట "నాగతికిన్ వగవను (1-253." ఇత్యాదిగ విల పించుటలో మాతృమూర్తి వేదన ద్యోతమానమై కరుణ రసము చిప్పిలుచున్నది.

కృష్ణనిర్యాణము సందర్భముగ ధర్మరాజు విషయము తెలియక నర్జునునితో,

తే॥ నీకు గుశలమె కదవోయి నిన్ను జూడ
దేజమఱి యున్నయట్టులుదెలియవత్తు
కారణంబేమి తమ్ముడా కడుపు చెఱువు
గాగ నగుచుండెజెప్పుమాకల తెలుంగు 1-340.

కడుపు చెఱువగుచున్నదనుట యందును నర్జునుడు,

సీ॥ ఏ నెవ్వని వియోగ మెపుడు గల్గినగాని
జీవచ్ఛవమ్మునా జెప్పనగుదు

తే॥ అతడు మన ప్రాణ బంధువు సతతరక్ష
కుండు మనపాలిభాగ్యము దండి తారి
శ్రీరమాధవుడయ్యాయో చెప్పలేను
మనల విడనాడిపోయె నేమనెడువాడ. 1-342.

అనుట యందును కరుణ రస దృశ్యము కన్నులగన్పడును. ఈ సందర్భముగ పోతన "మన సారథి మన సచివుడు" ఇత్యాదిగకడు మృదువుగ రసోద్వేగముతో పలికించెను.

ఆ తారస్థాయి యీ భాగవతమున ఈ సందర్భమున రాలేదనియే చెప్పనగును. కాని యిచటను కరుణము సముచితముగ పోషింపబడినది.

సప్తమస్కంధమున సుహాజ్ఞోపాఖ్యాన ఘట్టమున నుశీనర

ప్రభువు యుద్ధమున గతాయువుకాగా నాతని పత్నులు భర్తృ వియోగమున నతివిదారకముగ విలపించుటయందు నిది పోష్యమాన మైనది.

శా॥ హా ప్రాణేశ్వర!మమ్ము గాదనుచితుల్ ప్రాణంబులం బాయుటల్
మా ప్రాణంబులు వోయినట్టివ యగున్ మావల్లభా మాపయిన్
నీ ప్రేమంబది యేమి సేసితివయో నీ పిల్లలుం జెల్లలున్
నీ ప్రాపుంగొనువార లెట్లుమనగా నీవెంచితో చెప్పుమా! 7-57.

అట్లు వారు విలపించు టెంతయు కరుణరస భరితమై యున్నది.
నవమస్కంధమున హరిశ్చంద్రుడు తన పుత్త్రునకై వరుణుడురాగా

సీ॥ అనిశంబు నీ మీద బ్రాణంబులుంచిన
తల్లిదండ్రులగోడు దలఁగవైతి

"యేమిసేయుదునెట జొత్తు నేది దిక్కు" (9-180.) ఇత్యాదిగ వేడుకొనుటయందును నీకరుణరసము కడు రసవంతముగ కాననగును.

ఇంకను కాళియమర్దనమునకై కృష్ణుడు హ్రదమునదూక నందాదులు దుఃఖించు పట్టునను కంసుని కృష్ణుడు వధింపనతని పత్నులు "తలయున్ వక్షము మొత్తుకొంచు" శోకించుటయందును నీ కరుణ రసముకడు పుష్టిగ ప్రదర్శింపబడుట కాననగును. 10 పూ. భా. 2-45 నుండి 52.

## 4. రౌద్రము :-

గురు బంధు వధాది పరమాపరాధ జనితమగు ప్రజ్వలన మగు క్రోధము స్థాయి భావముగ గలది రౌద్రము.

"గురుబంధు వధాదిపరమాపరాధజన్మా ప్రజ్వలనాఖ్యః క్రోధః" రసగంగాధరము-1 అ. అనునది ఆలంకారిక లక్షణము.

వీరభద్ర నృసింహావిర్భావాదులందీ రసము బాగుగపోషింప బడినది.

పుత్రఘాతియగు నశ్వత్థామను బంధించి తెచ్చినపుడు కృష్ణుని పలుకులందలి యీ రౌద్ర రసస్ఫూర్తి.

శా॥ రక్షింపందగదీద్విజాధముని నిద్రాసక్తులైరాతిరిన్
క్షేత్రజ్ఞానము లేని బాలకుల గోసెం గుత్తుకల్ మేకలన్
భక్షింపంగ గిరాతజాతిబలె నోపార్థా క్షణార్థంబులో
సుక్షాత్రంబది జూపుచుం దునుములోఁజూడంగ బోకింతయున్.
1-233.

శ్రీకృష్ణుని క్రోధ పరమావధియందు యీ రౌద్రరసము కాంచ వచ్చును. మఱియును భీముని పల్కులలోను (1-242నుండి244.) ఈ రసము పోషింపబడినది.

పరీక్షిత్తు ధర్మదేవతనుద్ధరించి కలినిగర్హించుటయందు "ఓరీ క్రూరుడ ధర్మ పౌత్రుడను" (2-359.) అను పద్యమందును నిది ద్యోతమానమగును.

చతుర్థస్కంధమున దక్షుడు శివునుద్దేశించి సభ్యులతో గన్నుల నంగార కణములురాల పలుకుటు వర్ణితమైన సందర్భమున "వినుడో సభ్యులు సాధుసజ్జనుల- - - -", "బ్రాహ్మణులగ్నిసాక్షులుగ- - -" (4-23 నుండి 25.) అను పద్యములనిది కాననగును.

వీరభద్రుని రౌద్రావతారము వర్ణితమైన పట్టున,

సీ॥ అగ్నికుండంబుల నరకాళ్ళ జమరుచు

జల్లార్చె ఋత్విజుల్ దల్లడపడ". 4-62.

ఈ రీతిగ ప్రవర్తించి దక్షాధ్వరధ్వంసమునర్చిన ఆతని ఆగ్రహాతిశయమున నీ రౌద్రోద్ధతి సహజ రామణీయకము.

షష్ఠస్కంధమున నింద్ర వృత్రాసురుల యుద్ధ సందర్భమున

వృత్రుడు క్రోధముతో నింద్రుని దూరుచు “ఓరీ! నీవొక జీవి వంచు మదిలో” (6-339.) అనుటలో ఈ రౌద్రము భాసించుచున్నది.

హిరణ్యకశిపుని యుగ్రక్రోధమును సూచించు నీ యొండు రెండు ఉదాహృతములు రౌద్రమునకు నిదర్శనములు.

వ॥ అది కల్పానల్ప గభీరభైరవ సవృక్షుండై రాక్షసేంద్రుండు దక్షిణంబ
రాక్షసులంబంచి ప్రహ్లాదుని రప్పించి రూక్షేక్షణంబుల నిరీక్షించి
ధిక్కరించి యిట్లనియె” 7-184.

క్రోధోద్రిక్తుడగు దైత్యేంద్రుని స్వరూపమీరీతి భీషణముగ వర్ణింపబడినది. ప్రహ్లాదునితో నాతడు పలికిన క్రోధభాషణము,

శా॥ ఏరా రాక్షస వంశనాశకుడ! నీవేకాక నీతోటి పా
టారక్షస్సుతులంజెడంగ అపితేయన్యాయ మార్గంబునం
జేరం దుర్మతమెంత జెప్పినను నీ చిత్తంబు దుర్వృత్తిమై
జారంబందుటలేదు నీవు బ్రదుకన్ వాంఛింపవా దుర్మతీ!
7-185.

“ఏరా రాక్షసవంశనాశకుడ, బ్రదుకన్వాంఛింపవా దుర్మతీ!” అనుటలో నా రక్షోనాథుని క్రోధ పరమావధి సువ్యక్తమై యలరారు చున్నది. మఱియు “ఎందుంజూచిననందు నిందిర విభుండింపొందు- -” (7-218) ఇత్యాదిగ ప్రశ్నించుచు కులాశపద యప్పందన్ మ్రిందింతు నను మాటలలోని రౌద్రరసౌచిత్యము శిఖరాయమాణమైనది.

నవమస్కంధమున దుర్వాసోమహర్షి అంబరీషుని వారి పారణము తెలిసి,

- - - - -దేదీప్యద్రుస్సామూర్తియై
చలియింపందనువెల్ల బొమ్మముడి యాస్యంబందుబి బింపగన్.
[illegible] పతాకసాయినందినది. మఱి

యు నతని పలుకులలోను (9-102,103.) ఈ రౌద్రము పోషింపబడు చున్నది.

కార్తవీర్యుని యపచారము తెలిసి పరశురాముడు,

తే॥ రాజ దౌర్జన్యమంతయు రాముడెఱిగి
దండతాడిత భుజగంబు దారి రోజు
చును ధనుర్బాణ తూణీర శోభితుడయి
గండ్రగొడ్డలి చేగొని గండు మిగిలి. 9-299.

ఈరీతిగ దండతాడిత భుజగంబు దారిరోజు కొనినట్లు వానిని వర్ణించుటలో రౌద్రజృంభణము జాలువారినది.

దశమస్కంధమున గృష్ణుని వెంటబడిన కాలయవనుడు గిరిగుహలో ప్రవేశించి కృష్ణుడదృశ్యుడుకాగా తానందు జొచ్చి దీర్ఘతల్ప నిద్రితుడైన ముచికుందుని చూచి కృష్ణుడే యిట్లు నటించుచుడెనని క్రోధ ఘూర్ణితుడై పలికిన పలుకులివి.

శా॥ ఓరీ! నీవిటువన్ను గన్గొనగి యెంతో దూరమౌచోటికిన్
జేరం దెచ్చితి సాధుమూర్తివలె నీ క్షేత్రంబునంబండితే
పోరంజాలక పాఱు బోతువయినన్ బోనిత్తునేయంచు".

10ఉ.భా.1-34.

ఇందలి రౌద్ర రస స్ఫురణము విస్పష్టమే.

ఈ రీతిగ నింకను ననేక ఘట్టముల సందర్భోచితముగ నీ రౌద్రము పరిపుష్యమాణమయినది.

## 5. వీరము:-

పరపరాక్రమదానాది స్మృతి విశేషముల వలన కలిగినయౌన్నత్యమను నుత్సాహము స్థాయిభావముగ గలది వీరము 'పరపరాక్రమ దానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య ఉత్సాహః'(రసగంగాధరము. 1అ.) అనునది ఆలంకారిక లక్షణము. ఈ వీరమును ధర్మవీర, దయావీర,

దానవీర,యుద్ధ వీరములను 4 విధములుగ కొందఱు ప్రధానముగ విభజించుట కలదు. ఇవి యన్నియు నౌచిత్యవంతముగ ప్రదర్శింప బడినవి.

## 1. ధర్మ వీరము:-

ధర్మ వర్తనమందు మిగులనుత్సాహము కలిగియుండి ప్రవర్తి లిన పాత్ర చిత్రణమున నీ ధర్మ వీరము పోషింపబడును. ఇందు బలి చక్రవర్తి వితరణశీలియై ధర్మ వీరుడగుట హృద్యము.

బలి చక్రవర్తివామనునకు దానమొనర్చు తరుణమున శుక్రుని వాక్యములు వినియు తన స్థిర నిశ్చయము వినిపించి దాత వైశిష్ట్య మును, తన భాగ్యమును పలికి సంతోషముతో దానము చేయనుత్స హించిన సందర్భము,

చ॥ నరసకువచ్చి యాచకుడు చాచికరంబులు దేహి యన్న నే
పురుషుడు లేదుపొమ్మనగ బోవునొవాడుపినుంగుబోలనై
భరమగు బెద్ద వృక్షములు పర్వతముల్ గుడిగోపురాలు సా
గరములు కానవంబులనుగావుభరంబులు భూమిదేవికిన్.

(8-233).

ఇందు బలి శుక్రునితో పలుకుచు దానము కోరి వచ్చినవానికి లేదను వాని స్థితి స్పష్టముగ చెప్పిదానగుణౌన్నత్యమును చాటినాడు. అట్లనుటలో అతని ధర్మ వీరము స్పష్టము. మఱియు అసత్యముకంటె వేఱే అధర్మములేదనుచు తాను ధర్మము తప్పి చరించననియు విప్రుని వంచింపననియు పలికిన పలుకులు.

శా॥ ఆధివ్యాధులకేనుజంక నిరయంబౌనంచు జింతింపనే
బాధల్ వచ్చిన నించుకే వగవ నాస్వారాజ్యముంబోయినన్
నాధిష్ట్యంబును దేహముందెగిన సుందన్ విప్రువంచింపనొ

గాథల్ వింటకు నెంత యేనియును దుఃఖంబందుదున్ భార్గవా.
8-230.

ఇందు బలి ధర్మ వర్తనము మిగుల ప్రశంసాపాత్రము. దీనిని బట్టి బలిచక్రవర్తి ధర్మ వీరుడే. అసత్యమాడుమనియు, తన్ను మాలిన ధర్మము లేదనియు, రక్షించుకొమ్మనియు గురువైన శుక్రుడెంతచెప్పి నను తన ధర్మముతప్పివర్తిలలేదు. ఇచట ధర్మవీరము పరిపుష్టమైనది.

భావి తనకు, తనస్థితికిని భంగము వాటిల్లునని తెలిసియు తను దాన మొనర్తునని పలుకు బలి ధర్మ వీరము గణనీయము.

## 2. దయా వీరము:-

తనస్థితికి వగవకుండ దయ చూపుట దయా వీరమగును. రంతి దేవుడు దయావీరమునకు నిదర్శనము.

శా॥ శేసాహారముదాన్ గుటుంబమునుప్రాశింపంగనున్నంతలో
భాషల్ సేయగ శక్తి లేమిని క్షుధా భారంబునం దోగుచున్
వైషమ్యంబున నోరు జూపుచును నిల్వంజాలకుండంగసం
తోషంబేర్పడనన్న మందుసగ మార్తుండంచిడెన్ రాజటన్. 9-383.

తన క్లిష్టదశలోనొక యతిథితృప్తిగ జనగ వెనువెంటనే ఒక యార్తుడు క్షుద్బాధతో నిలువలేనివాడై మాటలాడుటకునైన శక్తిలేనివాడై యరుదేర రంతి దేవుడు దయాగుణము కలవాడయి సంతోషముతో నున్న యన్నము నాతనికిడుటలోనాతని దయావీరము ద్యోతకమే!

ఇక నీరము మిగుల, వానిచేనైన నసువుల నిల్పుకొనదలచిన వాడై యుండనొక్కమాలడు వచ్చి

"సుజనవరేణ్య, నీళ్లిడగ జూడుము ప్రాణమునిల్పుమియ్యెడన్."
(9-385.)

అనుచు తన ప్రాణములు నిలుపు మనినాడు. వెంటనే రంతిదేవుడు,

తే॥ అనిననాతడు దీనము లైనవాని
వాక్యముల జాలిగలడయివానికున్న

జలములన్ని యునర్పించె సంతసమున..... 9-387.

ఇందు జాలిగలవాఁడయి రాజు తనవద్దనున్న జలములన్నిటివిడి సంతసమున నుండినాడు. ఇదియేకదా దయావీరుల యప్రతిమాన సద్వర్తనము.

## 3 దానవీరము :-

తనకు చేటు కలుగునని తెలిసియుండియు మాటఇయ్యనప్పటికిని పరోపకారార్థమిదం శరీరమ్మనుచు దానమొనర్ప నుత్సహించుట దానవీరము. దధీచి విషయమున నీదానవీరము చక్కగ పోషింపబడినది.

తనను వేడ వచ్చిన త్రిదశులతో విష్వక్సేనుడు దధీచిని గూర్చి,
"కలడుదధీచినాముని జగత్త్రియ విశ్రుత దానకంకణో

జ్జ్వల జపమాలికా కలిత దక్షిణదోషుడు" 6-198. అని చెప్పుటలోనే దధీచి దానగుణమెట్టిదో చెప్పబడినది. అధోక్షజుని ప్రేరణతో సుపర్వాణులు దధీచిని శరీరముకోరగానాతడు వారితో మేలమాడి పిదప తన సంతసాంగీకారముదెల్పుట,

ఉ॥ ఊరక యిట్లుమీవడ హుహూయనుచుంగనుచున్విలాసవా
గ్ధోరణినాచరించితిని కోరిక లీరిక నెత్తుచుండినన్
మీరు మహానుభావులరు మీ కొడలిచ్చుటకంటె నొండొకం
డీరవ బుణ్యకార్యమొకడేని యునుండుటజెప్పవచ్చునే! 6-215.

ఇందు తన ఆమోదముదెల్పుచు తన యొడలిచ్చుటకైనను వెనుకాడని దధీచి దానవీరము మిగుల అద్భుతము.

## 4. యుద్ధవీరము :-

యుద్ధ సందర్భమున పరాక్రమముతో వెన్నుజూపక పోరొనర్చుటలో నున్నతమైన మధురభక్తికాధారమగు శృంగారము పిదప భాగ

వతమున ప్రధానమైనది వీరము. భగవన్మహాత్వము ప్రకటించుటకు నాయన రాక్షసాదుల దుష్టనిర్మూలనలో పరాక్రమమును చూపుట పురాణ ముఖ్యవిషయము. అట్టిది భక్తజన విశ్వాసాభివృద్ధికి నెంతైన పోష్యమాణమగును.

ప్రథమస్కంధమున నర్జునాశ్వత్థామల యుద్ధ సందర్భముగ నీ వీరరసము పోషింపబడినది.

తృతీయస్కంధమున హిరణ్యాక్షమర్దనమున నాదివరాహమూర్తి పరాక్రమమున నిటుల నిది పోషింపబడినది. హిరణ్యాక్షుడు గదా దండము విసర,

ఉ॥ డాపలి కాల దానిని బడంబొనరించియు వైనతేయుడెం
తోపగ బాపజేని బలె ద్రొక్కియు గాళుల జెక్కలైచెడం
గోపమెసంగ జేసినను గోయని యార్చుచు దైత్యుడాగ్రహం
బీపథమంచు జెప్పుట కొకింతయు శక్యముకాని చక్కిమై.
(3-178.)

ఈ రీతి డాపలికాల దానిని పడవైచి జృంభించుటలో నీ వీర రసము రమ్యముగ వ్యక్తము చేయబడినది.

షష్ఠస్కంధమున దైత్యులిందుని పై డి వచ్చి యోడించు పట్టున వారి పరాక్రమము.

మ॥ కరవాలంబులు భిందివాలములు ఖడ్గంబుల్ సహస్రఘ్నులున్
బరశువ్రాతములుం బరశ్వథములున్ బహ్వాస్త్ర శస్త్రంబులున్
సురసైన్యంబులమీద నేసి దనుజుల్ శుంభన్మహారంభముల్
పరగన్నొంచికలంచిరెల్లరు భయభ్రాంతాత్ములై పాఱగన్.
(6-150)

ఇంద్ర వృత్రాసురుల పోరులో వృత్రుని సంరంభమున నీ వీరము వ్యక్తమైనది.

ఉ॥ శూలము ద్రిప్పికొంచు లయశోభితకాలయముండునాగనై
కాలము దీఱెనీకనుచు గట్టిగ నార్చుచు బెద్ద పెట్టునన్
వేలుపుఱేని శీర్షమున వ్రేకగునట్టులు వేసె వేసినన్
జ్వాలలు గ్రక్కుకొంచునది వచ్చి పడెన్ వడినుల్కయో యనన్.
(6-231.)

"ఇందు కాలము దీఱె" నిత్యాదిగపల్కుట, కాలయముని వోలె జృంభిచుట ఇత్యాదులు వీర రస పోషకములై యలరారినవి.

సప్తమస్కంధమున హరుడు పురహరుడైన సందర్భముగ తమ శక్తింజేసి కానవచ్చు ధరణీతలంబును (7-315.) ఇటుల వీరరసయుక్తముగ వర్ణితమగుట కానవచ్చును.

అష్టమస్కంధమున సురాసురల పోరులో జంభద్వేషి జృంభించి పట్టు

శా॥ జంభద్వేషియు భూరి భూమిధర పక్షచ్ఛేద దక్షోచ్చల
ద్దంభోళింగరమందమర్చి నిజ దోర్దర్పంబు దీపింపన" 8-137.

రసపుష్టికి ధారాళ శైలి, పద ప్రయోగ దక్షతయే కాక పాకరుచి, ప్రయోగ చమత్కృతి కడు రమ్యములై వీరమౌచిత్యవంతమగుటకుపబలకములైనవి.

దశమస్కంధమున బకాసురవధ సందర్భముగ కృష్ణుడు చంచువులు పట్టి

తే॥ రెండు చేతుల పట్టి యుగ్రుండొనాగ
వీరణస్తంభమును జీల్చు విధము దోప
జీల్చె బాలకు లెల్లరు చేర చూచు
చుండ నాకంస సఖు బకునుక్కుమిగిలి 10.పూ.భా. 1-303.

వీరణ స్తంభముననగ నవురుగడ్డికాడను చీల్చిన విధముగ వధించుటలో నీ వీర రసము సంపోష్యము.

శంఖ చూడుడను గుహ్యకుడు వ్రేతలనుగొనిపోవుచుండ వారి యార్తనాదములు విని రామకృష్ణులు ధైర్యము పల్కుచు వానితో "- - - - ఇచ్చటితో సరినీదు ముచ్చటల్" 10.పూ.భా. 2-24 అని పల్కుటలో వీరరసము కడు సుందరముగ సువ్యక్తమైనది.

కువలయాపీడనమను గజమర్దనమున కృష్ణుడు "నాగముతోక బట్టుకొని (10.పూ.భా. 3-226.) ఈరీతిగ పరాక్రమము చూపుటయందును వీరము వ్యక్తమైనది.

శంబరవధలో ప్రద్యుమ్నుని పరాక్రమ వర్ణనము దీనికి స్థానమైనది.

చ॥ అలిగి మనోజుడంత బ్రశయాంతకుడట్టిడియై కరంబులం
బలుకయు వాలునుంగొని జవంబున వైరులనెల్ల నూచకో
తలుగను గోసికోసి బలదర్పము సూపిన నంత సోకుమూ
కలువెఱగందెగుండె గడు గందెను డిందెను మ్రిందెనెంతయున్.
10 ఉ.భా. 1-౭౭6.

బాణునితో యుద్ధ సందర్భమున "అరపదిమార్లకార్ముకములంత నొకింతన రెండు రెండుగా విరిగిపడంగ...." చేసిన హరి పరాక్రమమునను, "ఓరీ పౌండ్రక। మూఢచిత్తుడ ." ఇత్యాది పౌండ్రక వాసుదేవ మర్దనమునను, "యుద్ధంబిచ్చెద మీకు నట్లయిన...." అను జరాసంధుని పల్కులలోను, "నిలునిలు మోద్యమంత। యిదె నే నరుదెంచితి" (10. ఉ భా. 2-4౯, 104,౭17,౭81) అను ప్రద్యుమ్నుని పలుకులనీవీర రసము కడునుచితమై యొప్పుచున్నది.

## 6. భయానకము :-

వ్యాఘ్ర దర్శనాదులవలన నేర్పడిన పరమానర్థ విషయకమగు వైక్లబ్యమను భయము స్థాయిభావముగ గలది భయానకము.

"వ్యాఘ్ర దర్శనాది జన్మా పరమానర్థ విషయకో వైక్లబ్యాఖ్యః సభయమ్"(రస గంగాధరము 1 ఆ.) అనునది యాలంకారిక లక్షణము.

నరసింహావిర్భావమున బాణాసుర యుద్ధాదులనీ భయానక రసము దృశ్యమానమగును.

ప్రథమస్కంధమున నుత్తరయశ్వత్థామ ప్రయోగాస్త్రానలమునకు వెఱచి శ్రీకృష్ణుని భయార్తితో వేడుకొనుటలో నీరసము దృశ్యమానమగుచున్నది.

శా॥ "ఓకృష్ణా। మధుసూదనా। - - - - - - ప్రభూ" 1-252

ఇందామెయార్తితో గూడి భీతి చూపబడుటలో రసౌచిత్యము రమ్యతరము.

చతుర్థస్కంధమున దక్షయజ్ఞమున సతీదేవి యోగాగ్ని నుద్భవింప జేసికొని తనువు వీడిన సందర్భముగ నచటి భయానక వాతావరణ వర్ణన మిట్లున్నది.

సీ॥ గడగడలాడెడు - - - - - - -

- - - - - - - భయమెంచుచుండె.

తే॥ నచటు గుండెలతో - - - - - -

- - - - - - యున్నయపుడు. 4-60.

ఇచటి భయావహ వర్ణనము సముచితమై, రసోద్దీపనమై యచటివారి క్లిష్టదశను వ్యక్తము చేయుచున్నది.

షష్ఠస్కంధమున త్వష్ట వృత్రాసురుని బుట్టింప నా వృత్రుని భయంకర రూపము వర్ణితమైన పద్ధతి,

సీ॥ ప్రళయకాలానిల ప్రజ్వలదగ్ని నా

వెలుగు చుండెడు మేని తళుకువాడు. 6-179.

ఇందాతడు కన్నులకు గట్టినట్లు భయంకరరూపముతో మాన

సాక్షి గోచరుడగుట రసవంతము. ఇందర్థముతోబాటు శబ్ద సంఘటన మును రసస్ఫురణకు తోడ్పడినది.

స్తంభోద్భవుడగు నృసింహుని విజృంభణమీ రీతినున్నదట.

వ. .... ఆ సభా భవనస్తంభంబు భీషణవేషంబును. (7-219.)

ఇందలి యొక్కొక్క దృశ్యమునుగుండెలు ఝల్లుమనిపించును. భయానక రసపోద్బలకమగు పద ప్రయోగ దక్షత యిందు గోచరించుచున్నది.

అట్లే "అతని జటాచ్ఛటులంత రిక్షమ్మున" (7-228.) అను పద్యమున నృసింహుని యార్భాట మెంతయు భీతిదమై యొప్పుచున్నది.

గజేంద్రమోక్షణ కథా సందర్భమున నేనుగుల గుంపులజూచి ప్రాణభీతితో నితర జంతువులు పరుగు పెట్టుట భయానక రసమునకు జక్కని యుదాహరణము.

తే. లేళ్ళును - - - - -

- - - - - - జొచ్చెనపుడు. (8-23.)

ఈ సందర్భముననే పోతన "పులులు మొత్తంబులు పొదరిండ్ల లోదూరు" (8-29.) అని మృగ యూథములతో వ్యాఘ్రములు సైతము పాఱెనని వర్ణింపబడినది. కాని మృగేంద్ర యూథముల మాట లేదు. ఇందు శాస్త్రిగారు సింహములు గూడ పాఱి వనని వర్ణించి యా లోటు తీర్చిరి. ఇట్లగుట కలలో కనబడిన మాత్రముననే సింహములకు వెఱచి గజములు గుండెలాగునను కారణమున నిద్రనుగూడ పోవవుట. అట్టి యేనుగులకు సాంద్రత ద్యోతకమై కడు రసవంతమై యొప్పినది. పాలకడలిని చిలుకు పట్టున గరళము పుట్టుటచేతను వృక్షపాషాణముల రాయిడిచే జనించిన నగ్ని చేత నచటి భయానక వాతావరణము వృక్ష పాషాణఘర్ష జాతాక్షయాగ్ని (8-107.) యని వర్ణించుటలో నీ భయానకము గోచరించును.

హాలహాలము పుట్టిన వర్ణనమునను "ప్రళయకాలాభీల పావక సాహస్రి (8-110.) ఈరీతిగనిది పోషింపబడినది.

నవమస్కంధమున నంబరీషోపాఖ్యానమున దుర్వాసుడు చక్రమునకు భీతిల్లి సకల లోకములు పాఱుటలోను, దశమ స్కంధమున కంసుడు 'కూరుచున్న బండుకొన్నను - - -' కృష్ణుని తలచి భయపడుట యందును, కొండ చిలువ "భీషణ రూపమై" గోపులకు కానవచ్చుట యందును నీ భయానక రసము పరిపుష్టమైనది.

## 7. బీభత్సము:-

కదర్య వస్తు విలోకనముచే నేర్పడిన విచికిత్సయను చిత్తవృత్తి విశేషము జుగుప్స. ఇది స్థాయి భావముగ గలది బీభత్సము.

"కదర్య వస్తు విలోకనజన్మా విచికిత్సాఖ్యశ్చిత్తవృత్తి విశేషో జుగుప్సా" (రసగంగాధరము 1 ఆ.) అనునది ఆలంకారిక లక్షణము.

రుక్మి పరాభవమునను అనేక యుద్ధ వర్ణన సందర్భములందును ఈ రసము పరిపోష్యమైనది.

చతుర్థస్కంధమున ధ్రువుడు యక్షులతో నాజియొనర్చిన పట్టు నగల వర్ణనము.

సీ. ప్రళయ గర్జారవ ప్రతిమానిమైనంగి
ఘోరారవంబొండు గూడనయ్యె 4-191.

ఇందు బీభత్స రసముతోపాటు భయానకమును సహజరీతిలో ద్యోతక మగుచున్నది.

నరకలోక శిక్షాస్మృతులందును నీ బీభత్స రసము వర్ణింపబడినది. షష్ఠస్కంధమున నింద్రుడు విశ్వరూపుని వధింపగ బ్రహ్మ హత్యా పాతకము వెన్నంటితరుముట 'అతిఘోరరూపమత్యతిరౌద్ర నేత్రముల్ (6-172) ఈరీతిగ వర్ణితమైనదానిలో ఈ బీభత్సము పోషింపబడినది.

సప్తమస్కంధమున నృసింహుడు హిరణ్యకశిపుని వధించు సందర్భమునను బీభత్స రసము తారస్థాయినందినది.

సీ॥ బాహు పాశంబుల - - - - - -

- - - - - - అస్త్రమునుగాని గోళ్లనయ్యసుర

జించె. (7-286.)

అష్టమస్కంధమున దేవదానవ భీషణ సంగ్రామమున "అత్తఱి దేవ దానవులు [8-144.] అను పద్యమునందును, నవమస్కంధమున పరశురాముని విజృంభణ యందును బీభత్సము రసోచితముగ వర్ణింపబడినది.

దశమస్కంధమున శ్రీకృష్ణుడు వృషభాసురుని వధింపనాతడు'

ఉ॥ "మూత్రపురీషముల్‌రుధిరమున్‌గడువిడ్చుచు(10.పూ.భా3-48.)

మరణించుటలో ఈ బీభత్సము సువ్యక్తమైనది.

జరాసంధుని విజృంభణమున యుద్ధములో గలిగిన బీభత్సము,

సీ॥ కుంజరంబులు- - - - -

- - - - - -వ్యక్తమయ్యె.

తే॥ భుజములను - - - - రక్త స్రవంతి. 10. ఉ. భా. 1-16.

ఈ విధముగ నెంతయు జుగుప్సావహమై రసోచితమై పోషింపబడినది. మఱియు నెత్తుగీతి యంతయు రూపక యుక్తమై బీభత్సము చివరలదాకుట సముచితమై యొప్పినది.

మఱియు శ్రీకృష్ణుడు రుక్మిని

చ॥ "పఱియలువాఱ శస్త్రమున వాని శిరంబును శ్మశ్రుకేశముల్

గొఱిగి విరూపు ..." (10.ఉ భా. 1-152.) చేసి పరాభవించుటలో జుగుప్సావహమగు బీభత్సము రసోచితమై యొప్పినది.

"కృష్ణ బాణాసురుల యుద్ధమున బాణుని తల్లి కోటరపుత్ర రక్షణార్థము దిగంబరయయి చనుదెంచు పట్టు"న వర్ణితము జుగుప్సావహము.

కృష్ణుడు పౌండ్రక వాసుదేవునితో పోరునప్పుడు "తేరులశ్వ ములుష్ట్రముల్- - -" అని వర్ణించుటలోను ద్వివిదుడను వానరుని చేష్టలు "నరకసఖుండువానరుడు" ఇత్యాదిగ జెప్పుటలోను, బలభద్రుడు వాని గూలనేయ వాడు "అదిశిరమందు గొండపలె )10 ఉ భా. 2-47, 109,124,130 ) మరణించు సందర్భమునను ఈ బీభత్సరసము సరసముగ చూపబడినది.

## 8. అద్భుతము:-

అలౌకిక వస్తు దర్శనాదుల వలన పుట్టిన వికాసమను విస్మయము స్థాయి భావముగ గలది యద్భుత రసము.

"అలౌకిక వస్తు దర్శనాది జన్మా వికాసాఖ్యో విస్మయః" (రస గంగాధరము 1.ఆ) అనునది ఆలంకారిక లక్షణము.

నృసి హావిర్భావ, వామన విజృంభణాదుల నీ యద్భుత రసము పోషితమైనది.

తృతీయ స్కంధమున భూమి నుద్ధరింప నాలోచించు విరించి నాసావివరంబుననుండి యాదివరాహమూర్తి యుద్భవించినపట్టున నెల్లరును దాని విధంబెరుంగక నివ్వెఱంపడిరని వర్ణించుటలోను,

మ॥ "అవురా!యేమిది- - - - - - - బొందుచున్." 3-136,137·

అనివిరించి భావించుటలోను అద్భుతము స్పష్టమగుచున్నది.

పంచమస్కంధమున భరతోపాఖ్యానమున భరతుడు లేడియై జనించి విచిత్ర ప్రవర్తన యొనరించు పట్టునను (5-135.) ఈ అద్భుతము దర్శనీయమగుచున్నది.

సప్తమస్కంధమున ప్రహ్లాదుని ప్రవర్తనయందును, నృసింహావిర్భావమున ఈ యద్భుతము రసవంతమై బిగి సూపినది.

అష్టమస్కంధమున వామనావతార ఘట్టములోని త్రివిక్రమో

సీ॥ శీర్షమాకాశము చివర కొమ్మలు దాటె
పాదముల్ బాతాళభాగమందె - - -'

అను పద్యము పూర్వోదాహృతమే. మఱియును
"ఒక పాదంబున మీది లోకములు వేఱొండైన పాదంబునన్
గకుబంతంబుల తోడి క్రింది తలముల్" (8-245..) సమస్తము నాక్రమించిన విశ్వరూపమద్భుతావహమై విరాజిల్లుచున్నది.

మత్స్యావతార ఘట్టమున సత్యవ్రతుడా వింతయైనచేపనుగాంచి యచ్చెరువందిన సందర్భమున నీ యద్భుతము కలదు. (8-281.) అంబరీష చరిత్రయందు దుర్వాసోమహర్షి చక్రభీతిచే లోకములు తిరుగాడుట యందును అద్భుతము కానవచ్చును.

దశమస్కంధమున యశోద బాలకృష్ణునకు చన్నుగుడుపుచు నాతని ముఖమును వీక్షింపుచుండగ నాతడావులించెను. ఆపట్టు నామె వాని నోట బ్రహ్మాండంబు నీక్షించుటలోను, మన్నుదిన్న కృష్ణుని మందలింపుచున్నపుడు "కనియెన్నందుని సుందరాంగి- -" ఇత్యాదిగ జూచిన పట్టున నీ యద్భుత రసము పోష్యమైనది.

చిన్ని కష్ణుని లీలలందు నీ యద్భుతము కడు రసవంతమై తోచును.

బ్రహ్మ గో గోవత్స గోపాలురను దాచివైచి లీలగ క్రీడించుచున్న కృష్ణునిచే మోహితుడై యద్భుతానుభవమున నచ్చెరువొందుటలో ఈ రసము దృశ్యమానమగును.

శ్రీకృష్ణునిరాసక్రీడ మహాద్భుతమైనది. ఆయన ప్రతి యంగనాద్వయ మధ్య సంగతుడయి నాట్యమొనర్చుట ఆయనకే చెల్లునుగాని తక్కొరులకసాధ్యమే!

శ్రీకృష్ణుని మధుర వేణుగానమునకు పరవశతచే సారంగాదులు బొమ్మలవలెనగుట, హంసాదులు వచ్చి కనులు మూసికొని మది

గొల్చుట మొదలగు చోట్ల నీ యద్భుత రసము దృశ్యమానమగును.

అక్రూరుడు యమునానదిలో రామకృష్ణులను కాంచిన పట్టునను అద్భుతమలరారినది. దశమస్కంధోత్తరభాగమున బాల ప్రద్యుమ్నుడు మత్స్య గర్భమున దోపగ నచటి స్త్రీలు,

ఆ॥ ఇట్టి సోయగమున నెసగెడు మగ బిడ్డ
చేప కడుపులోన జేరు టేమొ
చచ్చె జేపలోన జావక యుంటేమొ
దైవచిత్రమెడద దలప వశమె 10. ఉ.భా. 1-193.

అని భావించి యాశ్చర్యమొందుటలో నద్భుతముగలదు.

నారదుడు శ్రీకృష్ణుని పరీక్షింపగోరి పదియారు వేల గృహముల నాలీలామానుష విగ్రహుని దర్శించుటలోను, ద్వాదశస్కంధమున మార్కండేయుడు ప్రళయార్ణవమున నారాయణుని లీలగాంచిన పట్టునను సందర్భానుసారముగ నీ యద్భుత రసము వెల్లి విరిసినది.

## 9. శాంతము:-

నిత్యానిత్య వస్తువిచారము వలన సిద్ధించిన విషయవిరాగమును నిర్వేదము స్థాయి భావముగ గలది శాంతము.

“నిత్యానిత్య వస్తు విచార జన్మా విషయ విరాగాఖ్యో నిర్వేదః” (రసగంగాధరము 1 ఆ) అనునది ఆలంకారిక లక్షణము.

బలి చరిత్ర, ప్రహ్లాదచరిత్ర మొదలగు ననేకఘట్టములు శాంత రసప్రధానమైనవి. ప్రథమస్కంధమున ధర్మజాదులు భీష్ముని జూడ బోవ సకల ధర్మములు వివరించి భీష్ముడిట్లు పలుకుట శాంత రసోచితమై విలసిల్లుచున్నది.

క॥ దైవాధీనము సర్వము

గావునదేనికి వగవక
భూవలయంబేలు కొనుము పురుషలలామా, 1-271.

రాగద్వేష రహితుడై శాంత స్వరూపుడుగాని యీ రీతిని పలుక లేదు! శ్రీకృష్ణునెదనుంచి

క॥ సర్వంబెవ్వని యందగు
సర్వం బెవ్వానివలన సంభవమగు నీ
సర్వము దానగు నెవ్వడు
సర్వాత్ముండైనవాని స్మరియంతునెదన్. (1-283.)

అని భావించుటలోనీ శాంత పరమావధి గోచరించును.

"పదియార్ శరత్తుల ప్రాయంబుగలవాడు. [1-401.]" ఇత్యాదిగ శుకమహర్షి వర్ణనమున శాంతము పరిఢవిల్లినది. ఇంతకు పూర్వము పరీక్షిత్తు బ్రాహ్మణ శాపమువిని సమర్థుడయ్యునుదాను ప్రతి శాపము వెట్టక కర్మఫలమనుభవింపవలసినదియే యని పశ్చాత్తప్తుడగుటలో నీ శాంతము గోచరించును.

ద్వితీయ స్కంధమున ఖట్వాంగుని వర్తనమందును (2-14.) శాంతము గాన వచ్చును. చతుర్థమున నీశ్వరుడు దక్షుడెట్లు దూషించినను ప్రశాంతచిత్తుడై యుండుట కమనీయము.

పంచమస్కంధమున సాలగ్రామ క్షేత్రముననున్న పులహ మున్యాశ్రమము సకల మృగములును వైరాదులు లేక మెలగనలరారినదనుటలోని శాంతరస మాధుర్యము రసవత్తరమైనది.

చ॥ "కులుకున నేన్గు లేనుగుల గొంగలు గోరికనాలు నాలదిం
- - - - - - - - - - - బ్రహ్మకున్. [5-103.]

పరస్పర విరోధి జంతువులన్నియు లోనెడలేక ఒకే గొంతుగా శాంతమున ప్రవర్తిల్లనాయా శ్రమములరారునట. అట్టిదానిని బ్రహ్మకూడ బొగడుటకు జాలడట. శాంతరస తత్త్వమే యంత!

భరతుడు రహూగణుడు తనను పరుషముగ పలికినను "దొర గరువంబు నన్నిలిచి [5-173.] అని పలుకుటలో శాంతరసము చిప్పిలుచున్నది.

షష్ఠస్కంధమున చిత్రకేతుని వర్తనము శాంతయుతమై యొప్పుచున్నది.

వ॥ "జీవులకు సుఖదుఃఖరూపకమగు సంసారమును మోక్షమును జనన మరణంబులు గలిగించుటకు కర్మమే కారణమగుచుండును. (6-305.) ఇత్యాదిగ పలుకుచు గౌరీ శాపమునకు ప్రతిస్పందుడుగాక నిశ్చలమగు చిత్తవృత్తితోనుండుట యీ శాంతమునకు పతాకస్థాయి.

సప్తమస్కంధమున హిరణ్యాక్షమరణమునకెల్లరు చింతించుచుండ నోదార్చుచున్న హిరణ్యకశిపుని

"తెలియంగ సంసృతి చలిపందిరినిబోలు" (7-49) ఇత్యాది మాటలలో శాంతము తొంగి చూచుచున్నది. ప్రహ్లాదుడు గురువుతో.

తే॥ తాను వేరొకవాడు ననుబుద్ధి మానసమున
భ్రాంతునకు గల్గుచుండును వాడు నేను
నొండుగాదీశ్వరుని రూపమొక్కడనగ
నిట్టిచో నిట్లు ప్రశ్నించు టేటి మాట (7-164.) అని పలుకుటలోని యద్వైత స్థితి పరమ శాంతునకుగాని తక్కొరులకసాధ్యమే.

ప్రహ్లాదుడత్యంతప్రశాంతుడు. సుఖదుఃఖముల కతీతుడు. భక్తిభావము గోపికలలో శృంగారమునకు ప్రోద్బలకముగాగా నితని విషయమున శాంతమునకుపస్కారమైనది. ఈ కథలోని రౌద్రరసము శాంతరససముల్లసనమునకు నంగభూతమైనది భయంకర బాధా మధ్యమున ప్రహ్లాదుని భక్తియుత శాంతస్థితిని వర్ణించుట.

చ॥ కలగడు వెచ్చనూర్చడు వికారమునొందడు భీతుజెందడె
వ్వలనను గంటనీర్వడడు వాఋడు చేరడు దండ్రిచేతకే

యలమటయుంగొనండెడదహా! పరమేశ్వర! హా!రశమే! హా!
సలలితమూర్తి। హా। సుగుణసాగర యంచువచించునెంతయున్.
7-202.

అష్టమస్కంధమున బలి సర్వస్వము కోల్పోయి, వారుణపాశ బద్ధుడైనను నిశ్చలమనస్కుడై వామనునితో,

తే॥ నీవు ధన దైత్యవంశమునెగులు గుడుప
జేయువాడవయైన లక్ష్మీ కళత్ర
సర్వ రక్షకుండని నిన్ను శరణు జొచ్చె
తాత నేనట్టులే కొల్తు దైవతముని (8-254.) అనుటలోని శాంత రసౌన్నత్యము కీర్తనీయము.

బలి భార్యయైన వింధ్యావళి పలుకులు

క॥ లోకత్రయ మిచ్చితి నే
గైకొనుమని నా మగండు గానక బలికెన్
నీకిచ్చు టేమి నీయది
యేకదెయీవెడగు గావవే పరమేశా (8-259) అని యామె పలికినది. ఒక్క మాట మాత్రమైననేమి, బలికంటె నున్నతరీతిగ పలుకుటలోని శాంతరసౌచిత్యము దిక్కుల విరిసినది.

అటులే నవమస్కంధమున రంతిదేవుని పలుకులలో "శేషాహారముదాన్ గుటుంబమును" (9-383.) ఈ రీతిగను శాంతరసము విరియుచున్నది.

మాలాకారుడగు సుదాముని యభ్యర్థనలో శాంతరసోల్లసన మిట్లు విస్ఫురితమగుచున్నది.

క॥ మీపై స్థిరమగు భక్తియు
నాపై నీ భక్తులందు నతి సౌహార్దం
బేపట్ల భూతదయయును
బ్రాపించెడునట్లు సేయ బ్రార్థింతు మిమున్ 10.పూ.భా.3-197.

ఈ పద్యము పోతనచే నిదే సందర్భమునవర్ణింపబడిన "నీపాద కమల సేవయు - - - -" (10-1268.) అను పద్యమును తలపించు చున్నది. మఱియు కుచేలోపాఖ్యానాది వివిధ ఘట్టములలో నీశాంత రసము భాసమానమై వెలుగొందినది. ఈరీతిగ శ్రీకృష్ణభాగవతము ప్రతి స్కంధమును నవరస భరితమై శాస్త్రిగారి సహజ ప్రతిభా విశేషముచే తీర్చిదిద్దబడినది.

ఇక రసాభాసమును కొంచెము పరిశీలించెదను.

## రసాభాసము :-

ఆ ఈషత్ భాసతే ఇతి ఆభాస:, రసస్య అభాస: రసాభాస:' అని నిర్వచనమును గ్రహింపవలెను.

లేనిది యున్నట్లు భావించుట ఆభాసము. రస సంబంధమున కావ్యాదులందాభాసము కలుగును. దానినే రసాభాసమందురు. అలంకార శాస్త్రములందు శృంగార భాసమే చెప్పబడినది.

"అనుచిత విభావాలంబనత్వమ్ రసాభానత్వమ్"అని. (రసగంగాధరము. 1.అ.)

ఉచితముకాని విభావముల అలంబనత్వమే రసాభాసమని దాని భావము.

తదాభాసా అనౌచిత్య ప్రవర్తితా:

తదాభాసా రసాభాసా భావాభాసౌశ్చ అని కావ్య ప్రకాశము.

అనౌచిత్య ప్రవర్తితములచే ఆభాసము కలుగుననియు, అది రసాభాసము, భావాభాసము కూడ యగునని తద్భావము.

"అనౌచిత్య ప్రవృత్తత్వే ఆభాసో రసభావయో:
ఉపనాయక సంస్థాయాం మునిగురు పత్నీగతాయాంచ
బహునాయక విషయాయాంరతౌ తదానుభయ
నిష్టాయాం ప్రతి నాయక నిష్టాయాం తద్వథమ పాత్రి

తిర్యగాదిగతే శృంగారేఽనౌచిత్యం"
అని సాహిత్యదర్పణము రసాభాస హేతువులనుటంకించినది.

"ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోపి వా
యోషితో బహుసక్తిశ్చేద్రసాభాసస్త్రిధామతా అని ప్రతాపరు

ద్రీయము. ఒకరియందే యనురాగముండుట, తిర్యక్కులు, మ్లేచ్ఛులు వీని యనురాగాదులు, ఒక స్త్రీయందనేకుల శృంగారము అను మూడు హేతువులు శృంగార రసాభాసమునకు జెప్పబడినవి.

రస భంగము దోషము కాని రసాభాసము దోషముకాదు. కావున ఈ రసాభాసమును యథోచితమై యీ భాగవతమునందు కాననగుచున్నది. దశమస్కంధమున రుక్మిణి శ్రీకృష్ణుని వరించినది రుక్మి మిత్రుడైన శిశుపాలునికీయభావించినాడు. అప్పుడామె విప్రుని ద్వారాతన సందేశ మా శ్రీకృష్ణునకు పంపినది.

ఉ॥ కావున నేనినుంబతిగగాగలవంచువగందలంచుచున్
భావమునన్ వరించితిని నాదగు దేహము నీకు నర్పితం
బైవలఱుంద్వదీయధనమైననునున్ శిశుపాలుడక్షులుం
డావరసింహభోజ్యబలినామృగధూర్తముపోలెగోరెడిన్.

10 ఉ. భా. 1-93.

ఇందామెకు శ్రీకృష్ణునియందే భావమున్నది. అటులనే శ్రీకృష్ణునకు నామె యందదే భావమున్నది. కావున ఉభయ నిష్ఠమగుటచే రసమే యైనది. కావున శిశుపాలుని విషయమున రసాభాసమే.

అటులనే యుషాకన్య స్వప్నమున అనిరుద్ధుని కూడి మేల్కొంచిన పిదప విరహ వేదనమనుభవించినది. ఇది స్వప్న సంగమము. ఆ కారణముగ నామెకు ప్రణయము కలిగినది. ఇది అనుభయ నిష్ఠము. యథార్థ ప్రియ సంగమము కలిగిన పర్యంతమునిటు రసాభాసమే.

అదే రీతిని అష్టమస్కంధమున కల గజేంద్ర విహారము అధమ పాత్రగతమైనది కనుక రసాభాసమగుచున్నది.

సప్తమస్కంధమున కలవింకముల కథలో కుళింగము గూటి యందు కుళింగిని కానక విలపించుట వర్ణితమైనది.

సీ॥ ఎచటనుంటివొ చెలీ! యింత ప్రొద్దాక చోట
నను బాసి యుండుట న్యాయమటవె"

అని దిగులుతో చింతింపుచు కిరాతునికి చిక్కిన యాడు పక్షిని జూచి,

మ॥ నెత్తురు గ్రుడ్లు 7-67, 71 -'

ఈరీతి కరుణ యుక్తముగ విలపించుట కలదు. కాని ఇచట కరుణము తిర్యగ్గతమగుటచే రసాభాసమైనది.

ఈరీతి శ్రీకృష్ణభాగవతమున సమయోచితముగ రసాభాసము కూడ పరిపుష్టినందినది.

..../*/....

# పాత్రచిత్రణాపాటవము

మహాకవి ప్రతిభకు పాత్రచిత్రణమొక నిర్దుష్ట తారకాణమగును. కావ్యమున ననేక వైవిధ్య పాత్రలుండును. ఆయా పాత్రల నౌచితీ దృష్టితో, తగినరీతి చిత్రించుట యొక యసిధారా వ్రతము. అందున నిట్టి పురాణ గ్రంథమున పాత్రలు లెక్కకు మిక్కిలిగ నుండును. మహాకవి యెట్టి పాత్రములైనను తానందున జీవించి స్వకీయ తాముద్రతో భాసించును. కాని తొంగి చూడడు.

మహాకవి వ్యక్తిగతముగ నెట్టి మనస్థితిని కలిగియున్నను ప్రతిభా సామర్థ్యముచేతను, లోకజ్ఞతా నైపుణ్యము చేతను, నిర్వహించును. అయినప్పటికిని స్వీయమానసిక పరిణతి తప్పనిసరిగ నీషత్తయి

నను ప్రతిబింబింపక మానదు. అది సప్రయత్నముగనైన నప్రయత్నముగనైననుకావచ్చును. అదియే వ్యక్తిత్వమనిపించుకొనును.

మన పోతన్న స్వీయ కవితా ఝురీ మాధుర్యము వలె హృదయమును మిక్కిలి మెత్తనైనదని ప్రత్యేకముగా వక్కాణింప ననవసరము. ఆ మనోధార్మికతను బట్టియే కవితా కన్యకయును వెన్నెల చిన్ని నవ్వుల నర్తించి మన్ననలందుటయు నుండును. ఆ పోతన మెత్తనితనము దుష్టపాత్రలయందును నిక్షిప్తమై గూఢముగ గోచరించును. భగవన్నిందనాయన భరింపలేడు. దుష్టపాత్రలయందునది తప్పనిసరియ. అప్పుడు విచిత్రముగ నా సన్నివేశమును వ్యాజస్తుతి పూర్వకముగ తీర్చిదిద్దిసంతసించి తృప్తిపడును.

ఇక శాస్త్రిగారిది శాస్త్రదృష్టి. కవిత రసవద్దృష్టిలో తారస్థాయి చేరలేదనిపించినను శాస్త్రానుగుణముగ పాండిత్యస్ఫోరకముగనుండును. అయినప్పటికిని రచనము సారళ్యమునే సంతరించుకొనినది. ఆయా పాత్రలను తీర్చిదిద్దినపుడు సన్నివేశములకు తగిన మనోభావ వ్యక్తీకరణ చేయుటలో శాస్త్రిగారతి నిపుణులు. ప్రస్తుత "శ్రీ కృష్ణభాగవతము" పురాణసంబంధి కనుక భగవంతుడే నాయకుడు. నాయక పాత్రనతి వైశిష్ట్యముకలదిగ ధీరోదాత్తత్వముతో శిల్పీకరించుట యాలంకారిక లక్షణము. ప్రతి నాయక పాత్రలను సైతము మహోన్నత రీతిని ప్రాణశక్తితో నర్తించునట్లు రూపు కట్టించవలెను. అప్పుడే సర్వజయుడైన నాయక పాత్రకుత్కర్ష కలుగును. ఎంత స్వల్పమైనదయినను నే పాత్రయు దానికి తగిన రీతి నుచితత్వముతో చిత్రించినప్పుడే కావ్యాదులకు జీవము కలిగి చిరంజీవములగుట సంభవించును.

శ్రీకృష్ణభాగవతమున చిత్రింపబడిన వివిధపాత్రలాయా మనోధర్మానుకూలౌచితీయుతములునై సోయగములు చిందుటకాననగును.

మచ్చునకు తగినట్లుగ కొన్ని పాత్రలను పరికించుట జరుగును. ప్రస్తుతము పథ నిర్దేశము మాత్రమే కాని టిప్పణిగ టీకించుట కాదు.

## ప్రథమస్కంధము :-

మహర్షి రక్తుడైనను, విరక్తుడయినను తన దృష్టిని మాత్రము పరబ్రహ్మ స్వరూపమునందు మాత్రమే నిల్పును. అన్యములాతని కనావశ్యకములు. భగవత్కథలనే వినగోరును. వాని నిరంతర సాధనముచే 'విద్య' యనగ భగవంతుని తెలిసికొనుటయేనని స్వానుభవ మొందును. కనుక నన్య మార్గగాముల నాతడు గణింపడు. అది ఋషి ప్రాత్రౌచిత్యము.

శౌనకాది పరమర్షులు సూతునితో భాషించిన విధము.

మ॥ ఎవడో మూఢుడొకండు విష్ణుకథలందిష్టంబు లేనట్టిడై
భువి పైనుండిననుండు వాడు పసరంబుంబోని వాడెల్లరున్
జవులందేలెడు తత్కథామృతము నిచ్చంగ్రోల యత్నింతురో
శివతాతీ! వచియింపుమద్ది శ్రుతికింజేకూర్పుగా బర్వమున్. 124.

ఇందు విష్ణుకథలందిష్టంబులేని వాడు ఋషి పాత్ర మనస్తత్వమునకు వ్యతిరేకి. ఆ వ్యతిరేకత్వమును స్పష్టీకరించుటకై యట్టివానిని 'పసరంబుంబోనివాడ'ను పదప్రయోగము జరిగినది. అద్దానివలన ఋషి పాత్రౌచిత్యము బాగుగ నినుమడించి భక్తి ప్రాధాన్యావశ్యకము కలిగించినది. భాగవత పరమ ప్రయోజనము భక్తి విరహితులను నిరసించుట. అది జరిగినది. భాగవత వ్యతిరేకులందఱు నట్టి వారే యని నొక్కి, చెప్పక చెప్పుటజరిగినది. ఈరీతి ఋషిపాత్రచిత్రణమున నెంతో ప్రయోజన పూర్వకముగ నౌచితీ దృష్టితో వాక్ప్రవృత్తి బడినది.

ఈ భక్తిభావ ప్రాధాన్యము, భగవన్మహిమము రూఢియయి వ్యాసుని విచారము బాపుచు నారదుడు పలికిన పలుకులలో వెలుగుట.

క॥ ఆ పురుషోత్తము బేర్కొ
నోపని గ్రంథముల వెంత యొప్పిన గావ్యా
లాపాంశ్చ వర్జయేత్తను
వ్యాపనమున కైనవను వర్ణింపనగున్ 172.

ఈ విలువైన పలుకులు సామాన్యునివి కావు కదా! అద్వితీయ విష్ణుభక్తిపరుడైన నారదర్షివి. ఇది నారద పాత్రౌచిత్యముగ నుండుటయు గమనింపదగును.

పుత్ర వియోగ దుఃఖమున 'విన్న జనాళి గుండియలు వ్రీలెడినట్లు' రోధించు ద్రౌపది నోదార్చుచు నర్జునుడు పలికిన పలుకులు ధీరోదాత్తావక్రవిక్రమనాయకునివై పాత్రచిత్రణకు తగియున్నవి. పోడిమి చూపి గాండీవ సముద్ధత బాణ పరంపరాహతిచే ద్రౌణి శిరమును తెచ్చి యిచ్చెదనని,

క॥ కడకాలదన్ని దానిని
జడములలో దానమాడి సాధ్వీమణినీ
యెడ గల్గు దుఃఖమిగ్గతి
వెడలంగా జేసికొమ్ము వెలదుల తోడన్ 207.

ఇటు "సాధ్వీమణీ" పదప్రయోగౌచిత్యము ధర్మరాజు ద్రౌపది యశ్వత్థామ యెడల చూపిన కరుణ ప్రవర్తనమున కెంతో యుపబలకమై రాణించినవి.

శ్రీకృష్ణుడు గురుపుత్త్రునికి వధయే తగిన శిక్షయని నొక్కి చెప్పుచుండగ కిరీటి "గురునిదలంచుకొను వాడగుటంజేసి వానిం జంపనొల్లక" (1-226.) యని పలుకుట యా యుదాత్త చరిత్రకల పాత్రకు మిక్కిలి యౌచిత్యమే.

ఇక ద్రౌపదియు,

"గురుపుత్రుండును బ్రాహ్మణుండితనిసం క్రోధంబునంజేసి యి
క్కరణిం గోడ్డును బోలె గట్టుటలు నే గానంగ లేకుంటినో

కరుణాళూ! విడిపించు బంధనములన్ గందెన్ శరీరంబయో
తరలుంబోదురితంబు వచ్చెడిని నీతండెన్న ద్రోణుండెకా. 237.

అని పలుకుటలో పయికి కనిపించు స్త్రీసహజ కారుణ్యమతులుంతము, విశేషాంశమిది.

ద్రౌపది పాండవుల ధర్మపత్ని. "షట్కర్మ యుక్తా కులధర్మ పత్నీ" యని శాస్త్రము. అందిచట "కరణేషు మంత్రీ" యనునది యుపయుక్తమగు సందర్భము, ఆ యధికారము నామె వినియోగించుకొనుచున్నది. భార్య భర్తృ సేవా ధర్మపరాయణురాలగుట సంప్రదాయము. కావున నిట ద్రౌపది యా యధికారము నాధికారకముగా వినియోగించుకొనలేదు. అమె చాల తెలివైనది. సంప్రదాయజ్ఞ. కనుక వేడుకొనుచున్నది. మఱియు సలహా నెవ్వరడిగినారను ప్రశ్న ముదయింప వచ్చును. దానికి సమాధానమిది. అమె ప్రస్తుతము పుత్ర శోక సంతప్త. ప్రధానముగ మాతృమూర్తి పాత్ర. అమెకొఱకే అర్జునుడు వానిని బంధించి తెచ్చుట జరిగినది. మఱియు భార్య తన భర్తను పాప కర్మలనుండి నివారింపవలెను. అది భార్యా ధర్మము. ఇంకను గురుపుత్రుడనియును, ఈతండెన్న ద్రోణుండెకా" అనియు పలికినది. ఊరక నేపలికినదా! కాదు. అమె యట్లుపలుకదు. శాస్త్రిగారు పలుకనివ్వరు. మఱి "ఆత్మా వై పుత్రనామాసి" యని శాస్త్ర ప్రమాణము. కనుక నితడు పుత్ర రూపమున నున్న ద్రోణుడు కనక గురుహత్యా పాతకము కలుగును. అంతేనా? "బ్రాహ్మణుండను ప్రయోగము", "బ్రాహ్మణో న హంతవ్యః" యన్నియును శాస్త్ర ప్రమాణమే. కనుక బ్రహ్మ హత్యా పాతకము. గురు ద్రోహము. కనుక ఈ పాతకసమూహమునుండి భర్తను రక్షించుకొనవలెను. కనుక నిన్ని రీతుల మిగుల పకడ్బందిగ పలికి తన పత్నీ ధర్మమును నెరవేర్చుచున్నది. ఇది యంతయు నొక యెత్తు. "కరుణాళూ!" యను చిన్న సంబోధన

మొక యెత్తు. కార్య సాఫల్యము కోరినది. కావున భర్తనట్లు సంబో ధించినది. ఎంత క్రోధియైనను నీ రీతి పిలువ బడిన శాంతుడగును. అది పిలిచినవారి లౌక్యము. మఱి యీ సంబోధనమే యేలనననిన ముందే చెప్పితిని. ప్రస్తుత కార్యము కరుణించుట యనునది. ఇదియే సంబోధనౌచిత్యము. ఇది ద్రౌపది యొక్క కార్య సాధనా నైపుణికి నిర్మల ముకురము.

ఈ విధముగ తను చూపు ప్రమాణములన్నియు నొక్క "కరు ణాళూ" యను శబ్దమున నిగూఢముగ సంగమింప జేసినది. ఆ ప్రమా ణము లన్నియు నిది సాధించుటకే. ఈ రీతి భార్యగ ద్రౌపది తన సంప్రదాయజ్ఞత్వముతో కార్య సాధనోన్ముఖయైనది. ఈమె "తిక్కన ద్రౌపది వలె" శాస్త్రి వారి ద్రౌపది యనుటలో నతిశయోక్తి కాదు.

ఈ శాస్త్ర పారీణత శాస్త్రివారిదే కదా। ఆయన కనుకనే ద్రౌప దినిట్లు దిద్ది తీరుప గలుగుట జరిగినది.

సకల ధర్మజ్ఞుడైన ధర్మజుడు ద్రౌపదిని

శా॥ నీ వాక్యంబులు న్యాయ మార్గమునకున్ వ్రేలంతయుందూరమై
పోవెంతో కరుణా రసంబుకలవై పూజ్యంబులై యొప్పెడిన్
నీవిట్లాడుదువంచు నేననుకొనన్ లేదెంతయో పుత్త్రిదుః
ఖావేశంబుననున్న యిప్పుడును నీ స్వాంతంబు శాంతంబహో. 240.

అని మెచ్చుకొనుట జరిగినది. ఈ పద్య విశేషము చూతము. ద్రౌపదీత్వమును భర్తగ, ధర్మజునిగనెఱిగి యిప్పుడు నామె నవగాహ నము చేసి కొన్న వాడయ్యెను. కనుకనే యామె ధర్మజ్ఞతను "నీ వాక్యంబులు న్యాయ మార్గమునకున్ వ్రేలంతయుం దూరమై పోవ" నుచు న్యాయ మార్గానువర్తి కనుక నా మార్గమునకు బలీయముగ "వ్రే లంతయుందూరము కావనుట జరిగినది. అందులకే ఆపదము యతి స్థానమున గట్టిగ బిగింప బడినది. అవటు నైన నీ పలుకునందు పటిష్ఠత యుండును కదా। కరుణా మూర్తి కనుక పలుకులు కరుణా రస పూ

తము లే. ఇక నామె "మంత్రిత్వమును"గమనించినవాడు కనుక నే"పూ జ్యంబులై యొప్పెడిన్" యనినాడు. ఎందులకాపద ప్రయోగము? బాహ్యమున కతి స్యూనముగ నున్నది కదా। ధర్మజు పాత్ర కనౌచి త్యము కదా। ఎంత మాత్రమును కాదు. "మంత్రిత్వమును" గమనిం చిన వాడు కనుకనని మొదటనే చెప్పితిని సూక్ష్మాంశమిది. మంత్రి రాజునకుచితమైన సలహానిచ్చి రాజును, రాజ్యమును కాపాడ వలసిన బాధ్యత కలిగి యుండును. అది మంత్రి ధర్మము. అట్టి మంత్రి కెంత రాజయినను వివేకవంతుడై కృతజ్ఞుడై యుండును. అది కృత జ్ఞతా ధర్మము. రాజ ధర్మము. రాజనీతిజ్ఞత. ధర్మజుడంతటి వాడు కనుక నే యిటులు పలికినాడు. అంతియకాక "గుణాః పూజా స్థానం గుణిషు నచలింగం నచ వయః" యనుచు "నచలింగం" అను ప్రమా ణమును గూఢముగ నామెకు వలెనే చూపినాడు.

మఱి ద్రౌపదికాయన భర్త కదా। ఇంతవరకును బాగుగనే యు న్నది. "నీవిట్లాడుదువంచు నేననుకొనన్ లేదు." యని సందేహాస్పద ముగ పలుకుటతో ఇంతవరకునున్నది వీగి పోవుచున్నది కదా। అట్లు- నౌచిత్యముగ నంతటి వాడు పలుకునా। మఱి వెంటనే "ఎంతయో పుత్త్ర దుఃఖా వేశంబుననున్న" యని వాడు. ఎంతటి వివేకవంతుడై నను దుఃఖముచే, నావేశముచే జ్ఞానము నశించి యుక్తా యుక్త విచ క్షణా జ్ఞానము కోల్పోవుట యథార్థము. అందులకే పెద్దలు "కోపము నటింపుము. కాని కోపివి కాకుమ"ని పల్కుదురు. ఇచట ద్రౌపది పుత్ర శోక సంతప్త. ఏ మాత్రమావేశపడినను వివేకము నశించి కాత్య ముకాదు. కథ యిటుల నడువదు. ఎంతయైన నబల కదా। అందులకే ఎంతయో- - - - యిప్పుడును. యని ప్రయోగము. అనగా నీ సమ యమునందును ననుట. ఇంతటి క్లిష్ట పరిస్థితిలో నామె బహుశాంత

తంబు శాంతంబహో" యనిమెచ్చినాడు. అదీ రహస్యము. ఇది ధర్మజు పాత్రౌచిత్యము.

ధర్మజునభిప్రాయమునకు కృష్ణార్జున నకుల సహదేవులు తమ గొంతు కలుప నంతకాకారుండగు భీమసేనుడు మహా క్రోధమున మండి పడుచు,

ఉ॥ ద్రోవది ధర్మ పన్నములు దొర్లగ జేసె గృపీకృపాదులీ
చావునకుందపింతురట చాలు బురేనిదురించు బిడ్డలన్
వేపుర నూచకోతలుగ వీగక కోసిసనదాన నేరికే
నోవును లేదు లేదనుచు నువ్వచియింపగ వత్తురే మొకో 242.

అని భీషణ భాషణంబులు పలికినట్లు చెప్పుట యా పాత్రకు తగినట్లు చిత్రింపబడినది.

ఈ సందర్భమున జగన్నాటక సూత్రధారియు, లీలా మానుష విగ్రహుండును, రాజనీతిజ్ఞుడునయిన శ్రీకృష్ణపరమాత్ముడు సర్వజనామోద యోగ్యముగ నిట్లు పలుకుట పరమ రమణీయ రస వదౌచిత్య పాత్రముగ చిత్రితము.

సీ॥ బ్రాహ్మణుడగుట జంపగరాదనియు నాత
తాయిగావున జంపదగునయనియు
నేనంటి ద్రోవదితో నీవు తల గొట్టి
తెత్తునంటాయమ తెమ్మటనియె
భీమసేనుని వాక్య మీమేయనగుదాని
జెల్లించుటయు నీకు జేయనతగు
నిదిగాక ధర్మజుండీతని ప్రాణముల్
దీయంగ రాదని తెలియ జెప్పె

తే॥ నిన్ని విధముల కార్యమిప్డెన్న వచ్చె
బోలినట్టులు సేయు మో పురుష సింహ

నావుడును జిష్ణుడా కృష్ణు భావ మెఱిగి
చేత గరవాలమును బూని చేర వచ్చి. 245

ఇందు శ్రీకృష్ణుని రాజనీతిజ్ఞత యంతయు ప్రస్ఫుటమై యా పాత్ర
హజ రామణీయకతను సంతరించి పెట్టినది.

ఇక నశ్వత్థామ ధనుర్విముక్త ఘోరాస్త్రానలభీతికి తల్లడి
సర్వశరణ్యుడైన శ్రీకృష్ణుని ప్రార్థించు నుత్తర పలుకులలో న
మాతృమూర్తి యావేదన ప్రస్ఫుట మగుచున్నది.

క॥ నాగతికిన్ వగవను నే
నా గర్భము గతికి వగతు నళిన దళాక్షా
వేగమ వచ్చెడినిదిగో
లోగక యిచ్చిచ్చుటులుగు లోజాఱబాఱన్. 253.

ఇందు తన గర్భజునికై తనను సహితము త్యాగమొనర్చు భావ
మాతృమూర్తి మనస్తత్వమును చూపుచున్నది.

భీష్మస్తుతి యందు నాయన విజ్ఞానస్వభావమును ప్రస్ఫు
రించుటలో నా పాత్ర చిత్రణమమోఘము.

క॥ సర్వం బెవ్వనియందగు
సర్వం బెవ్వాని వలన సంభవమగునీ
సర్వముదానగు నెవ్వడు
సర్వాత్ముండైనవాని స్మరియింతునెదన్. 283.

ధృతరాష్ట్రుని యొద్దకేగి కర్తవ్యమును బోధించు పలుకులు పరి
విజ్ఞానఖని విదురుని పాత్ర చిత్రణము.

ఉ॥ కాలము తారసించెడిని గాన బ్రతికిప్రియ జూడ నొప్పు భూ
పాల। పురంబు వీడి వనభాగమునందపమాచరింపగా
బోలును నీకు మిత్రులును బుత్త్రులు వోయిరి వృద్ధువైతి నీ
కేల విరాళి నానుడి నొకింత విరాగము నొందుటొప్పెడిన్.

కృష్ణ నిర్యాణమును గూర్చి యగ్రజు కెఱింగించిన అనుజుడైన పార్థుని దుఃఖమున నాసమయమున నా పాత్రోచిత మనస్తత్వ చిత్రణము సహజ రమణీయము.

సీ॥ ఏ నెవ్వని వియోగ మెపుడు గల్గిన గాని
జీవచ్ఛవమ్ముగా నా జెప్పనగుదు 342.

కలి ప్రభావమున కుందువడు గో వృషభ సాంత్వనమున పరీక్షిద్రాజ పాత్ర చిత్రణము ధర్మయుతుడైన రాచ వాని మనస్తత్వముతో నలరారినది.

శా॥ ఏ దుర్మార్గుడు నీదు పాదములు మూడే రీతి బంధించెనో
యే దుర్మార్గుని కారణంబున నిటుల్ హేరాళమై వచ్చె కీ
డా దుర్మార్గుని బట్టి చీల్చెదను రాజైయుండి నే నిట్టివా
ఖేదంబుల్ దెగనేయకుండినను దుష్కీర్తింబడంబోవనే. 366.

పితృ పరిస్థితి చూచి 'శృంగి' సార్ధక నాముడగు నట్లుగ్రుడై పరీక్షిత్తుని శపించుటలో నాతని మనస్థితి, బాల్య చేష్టత్వము గోచరించు నట్లున్న యా పాత్రచిత్రణా ఫణితియిది.

ఉ॥ ఒండొకచో దపించుచు మహోద్ధతి నొప్పెడునా శమీక సూ
నుండది యంతయుం గృశుని నోటన వించు గలంగి శృంగినా
నుండిన పేరు సార్థముగనుగ్రుడయై జలమానితండ్రిపై
నెండువు సేయునీచుదెగు నేడవనాటను దక్షకాహిచేన్. 382.

శమీకర్షి పుత్రు శాపము విని యాతని గర్హించుటలో నుచిత పాత్ర చిత్రణము పతాక స్థాయినందినది.

క॥ సీ! సీ! దోసము చేసితి
భూసురుడవు మఱితపస్విముఖ్యుడవిదిసీ-
భాసురమతి ధర్మంబని
చేసిన యదియే ప్రకోపశీలుడవకటా। 384.

## ద్వితీయస్కంధము:-

పరమాత్ముడు ప్రత్యక్షముకాగా దుహిణుడు హర్ష పులకితగాత్రముతో మ్రొక్కిన యపుడా పాత్ర చిత్రణము.

తే॥ అట్టి భగవంతునిం గాంచి యబ్జభవుడు
గనుల నానంద బాష్పముల్ గాఱుచుండ
హర్ష పులకిత గాత్రుడై యట్టివంగి
పాద పద్మంబులకు మ్రొక్కె బ్రమనుడగుచు. 115.

ఆ పట్టున వత్సలత జూపుచు పరమ కరుణారస తరంగితుడైన పురుషోత్తముని పాత్ర చిత్రణము మేలు మేలు.

ఉ॥ మ్రొక్కిన పద్మ సంభవుని మోము పయిన్నిగిడించి చూపులన్.
మిక్కిలి ప్రేముడించుచును మెచ్చ గుదెంచెను నీదు నిష్ఠకున్
జక్కని తండ్రి। నీ వికను సల్పగ జాలుదు భూత సృష్టి నీ
కొక్కవరం బొసంగుటకు నుల్లము సేసితి వేదు విత్తతిన్. 116.

## తృతీయస్కంధము:-

వనచరుడైన శ్రీహరిగాంచి హిరణ్యాక్షుడు మిగుల నౌద్ధత్యముతో పలుకు తావున నా పాత్ర చిత్రణము తగిన రీతిని శోభించుచున్నది.

చ॥ వనచర। యెందు బోయెదవు వచ్చెను వీడు కృతాంతునట్టులీ
వననిధి మేఖలన్ విడుము వారిజ గర్భుడు దీని మాకుగా
బొనరగ జేసియిచ్చె. నిదిముట్ విడుమట్టులు వీడవేని నీ
తనువు సహస్రధాతునిగి ధారుణిపై బడకుండ దియ్యెదన్. 175.

## చతుర్థ స్కంధము:-

దాక్షాయణి దక్షుని యజ్ఞ సందర్శనోత్సుకయై పతితో పల్కుటలో స్త్రీ మనస్తత్వమతి సహజముగ చిత్రింపబడినది.

జన్మభూమి జూడ జతనించు స్త్రీ జాతి
గాన వాంఛ సేయగలిగె నాకు
జుట్టరికము లేని సురవల్లభలునదే
నిండి నింగి బోవు చుండిరటకు. 39.

సురుచి పరుష వాక్కులకు వెత చెందిన ధ్రువుని యూరార్చు
నునీతి పలుకులలో నప్పటి యసహాయస్థితి గోచరమై యా
త్రికు వన్నె కలిగినది. అచిత్రణమిది.

ఏడువకేడ్వ కిప్పుడిటు లేడ్చిననేమి ఫలంబు బిడ్డడా
నాడు సుదుఃఖ మెవ్వరి కొనాటు బొనర్చితి మందునంజుమీ
నేడిటు వచ్చె దుఃఖమిది నీవును నేనును జేసి కొన్నదే
యేడును దాను జేసినదియే మఱితానది పొందనుడెడున్. 100.

పురంజనుడొక యన్నునుగాంచి తిన్నగా పల్కుటలో కామా
ని స్వభావ చిత్రణము రమ్యము

పతి విశ్వేశ్వరు రోయుచున్న సతివో బ్రహ్మాన్వవిలోకించు భా
రతివో వెన్నుని తెన్నెఱుంగురమవో రమ్యాంగి వారైనచో
క్షితిపై కాలిడరీవు వెన్నుడనన్నై చెన్నొందు నాతోడగన్
వితతశ్రీ విభవాభిరామమగు నీపీటన్ రతిం దేలుమా. 326.

## చమ స్కంధము :-

కుమారులకు నీతులుపదేశించు ఋషభుని పాత్రచిత్రణలోని
డితనము కడు సహజము.

తన్ను మించిన యట్టి దాయతో నెదరింప
జన దెట్టులైన బొందొనరుపనగు
దనకన్న నల్పుడై తారసించిన జేని
గెలిచి వాని నిరులు వలయు గొనగ

దగునట్టులునిచిన దండులకెల్లనొ
క్కదళవాయి వలయుగండు మగడు
మనువు మాటలునేర్చి చనవు మీాటిన యట్టి
పెగ్గడ నుడియంద పెఱుగ నగును

తే॥ జెలగ పగినట్లు వెచ్చంబు సలుపవలయు
గొడుకు గుఱ్ఱలకే జను విడగ జెల్ల
వీడు చెడుగు పనుల నెప్డు వీడనొప్పు
బుడమి యేలిక యగు వాడు కొడుకులార. 80.

కృష్ణ శాబకము కన్నొ ఱగి పోయినయంతన భరతుడు మిగుల వగతో పొగులుటలో నద్దానిపై నాతని యాత్మీయతగూఢముగను,వాని మోహ విభ్రమమును గోచరించును. అప్పటి భరతుని పాత్రచిత్రణము కరుణరసోద్వేలమై, రసభరితమై మిగుల చెన్నొందినది.

మ॥ జలకంబాడగలేదు సంధ్యయును బెల్చన్వార్పగాలేదురే
పులుమాపుల్లగ వేల్వలేదు కరివేల్పున్గొల్వగాలేదునీ
ళులు నేర్ద్రావగలేదు నిద్దురది యెట్లో చూడగా లేదయో
యెలకూనా। నను వీడి పోయి యెటనో యీా వున్నయీా
యింతలోన్. 122.

## షష్ఠస్కంధము:-

అజామిాళుని అధర్మవర్తనమును గూర్చి వివరించు పట్టున నాతని మనస్తత్వము కట్టెదుట కదలాడు చున్నటుల చిత్రితమైన నైపుణ్యమద్వితీయము.

సీ॥ కూటు సాక్ష్యములిచ్చు గుఱసతులను బుచ్చు
గుజనులగని మెచ్చు గులము వ్రచ్చు
టాటోటులను బల్కు మాటల సుధ జిల్కు
బూటకంబున గుల్కు బున్నెమల్కు

బాటసారుల గొట్టు బోటుల జెఱబట్టు
మేటుల గొద గట్టు మిగుల దిట్టు
మధు మాంసములు మెక్కు మర్యాదలకు దక్కు
పోరాటములకెక్కు బొరిగనిక్కు

తే॥ బోతరించు బరార్థముల్ ప్రముచ్చిలించు
జూదములనాడు గులటుల సురతమాడు
సత్క్రియలరోయు దుష్క్రియల్ సలుప డాయు
దుర్జన వ్యూహమును గూడి దుర్జనుడయి. 27.

పశ్చాత్తప్తుడై యజామిళుడు తన దోష వర్తనమునకు వగచి కడు వేదనా భరితుడైనట్లున్న చిత్రణము సహజ సిద్ధమై, ఆ స్వభావము పాత్రోచితమై యున్నది.

మ॥ కలుదావంగలదాసితో గలియుటన్ గల్మద్యముందావి యున్
బలలంబుందిని క్రావ్యవన్యముల జంపన్నేర్చి పాపాత్ముడై
నలువుర్ నిందయొనర్చు బీనుగువలెన్నాయున్క్రియయ్యెంగటా
తలిదండ్రుల్ ననుగంటకెంత లఘుముల్దార్ సేసి యున్నా
రొకో. 75.

వృత్రాసురుని భయంకర రూప వర్తనము చదువరులకు సహితము భయము కలుగునట్లు రూపుకట్టించిన పాత్రచిత్రణమిది.

సీ॥ అడుగు వెట్టిన నేలనదరంగ జేయుచు
నాల్కచే జుక్కలనాకి కొనుచు. 180.

విష్ణు వచస్కులై దధీచి మహర్షిని దేహార్థులై వేడిన సుమనసుల సుమనస్త్వము, సత్య సంధత, వేదనాభరిత హృదయత కల బోసిన విచిత్ర ప్రవర్తనను జూపు చిత్రణము జూడ "నాహా" అనిపించును.

చ॥ వితరణలుప్త కల్ప పృథివీరుహ, నేమెయిబొల్చ శల్యశ
స్త్రతతుల శత్రుపింజమతి సత్వరమౌనని విందుమందునన్

యతివర। పాపమంచు నిసుమంతయు గొంకక మేను వేడవ
చ్చితి మిటులుండు నేభువిని సీ!యని రోయక దానమీయవే210.

"పరోపకారః పుణ్యాయ", "పరోపకారార్థ మిదం శరీరమ్" అను ప్రమాణ వాక్య సూనృతత్వము స్థిరీకరించుచు పలికిన దధీచి యుచిత పాత్రచిత్రణము.

ఉ॥ ఊరక యిట్లు మీకడ హుహూ యనుచుంగనుచున్విలాసవా
గ్ధోరణి నాచరించితిని గోరిక లీరిక లెత్తు చుండినన్
మీరు మహానుభావులరు మీ కొడలిచ్చుటకంటె నొండొకం
డీరస బుణ్య కార్యముకడేని యునుండుట జెప్పవచ్చు నే. 215.

తన ప్రవర్తనకలిగి యీశ్వరి శపింపగ కడు స్థిర చిత్తముతో వినయాఢ్యుడై మెలగిన చిత్రకేతునిలో విష్ణుభక్తుని ప్రవర్తనము మూర్తీభవించినట్లు రాగద్వేష రహితత్వతా చిత్రణము స్వభావసిద్ధము.

సీ॥ అరయ శాపానుగ్రహములన నేమి స్వ
ర్గ సుఖంబులెన్న నొక్కండుగాదె
సుఖదుఃఖములు రెండు చూపట్టు రెంటియం
దును రెండు నంటియుండును దెలియగ
స్వర్గమందినపయి వచ్చును దుఃఖము
నిరయాంతమున గొంత నెమ్మియునగు
గర్మాను సారముగా బంధ మోక్షము
లుత్తమాధమ జనులొందనగును

తే॥ వీడు ప్రియుడనియున్ వీడు సూడనియును
వీడు జ్ఞాతి యనియు వీడు వేఱనియును
రాగవిద్వేషములును లేవా గుణాఢ్యు

## సప్తమ స్కంధము:-

ఉశీనర దేశాధీశుడైన సుయజ్ఞుడు గతాయువు కాగా నాతని వల్ల భలు చెప్పనలవి కానిరీతిని రోదనంబొనర్చినయప్పటి పాత్రచిత్రణము దుఃఖోద్వేలమై హృదయమును ద్రవీకరించును.

చ॥ ఉరములు మోదికొంచు గడునున్నత కేశకలాపముల్‌విడన్
విరులవిరాలి నేలబడ వెల్లువలట్లయి పాఱనశ్రువుల్
ధరణియు నాకసంబులు విదారిత మయ్యెడినోయనన్ రవం
బరుదయి పర్వనేడ్చిరి గతాయువు భూపతిమీద వ్రాలుచున్.55.

భక్తప్రహ్లాదుని తన్మయతాస్థితిని మన కనుల యెదుట కదలాడించిన పాత్రచిత్రణా పాటవమిది.

సీ॥ కదలడు మెదలడు కమలేశ్వరునిలోన
సేవించుచున్నట్టి జీవిగాన. 136.

ప్రహ్లాదుని ప్రవర్తనకు విసివి వేసారి యెడద బుట్టిన పుండని నిశ్చయించుకొని రోషకసాయితాక్షుడైన కనకకశిపునిపాత్ర చిత్రణా వైశిష్ట్యమిది.

శా॥ ఎందుం జూచిన నందునిందిర విభుండింపొందునంచాడితీ
విందుం జూపుదు వేకులాశపదనేనీక్షింతు నీవన్న య
ప్పందం జూపకయున్న నీ శిరము నాబాహాసి ఖండించివే
మ్రందింతుంగనుమంచు వ్రేసె ఘనసంరభంబునన్‌స్తంభమున్
218.

ఓజోగుణ పద గుంఫనముతో కంఠీరవమునకు దీటైన వ్యాఘ్రరాజము గాండ్రించినట్లు నకలంకరీతి సందర్భోచితమైన పాత్రచిత్రణము ప్రశంసనీయమే.

నృసింహోద్భవానంతరము విశ్వాస పూరితమైన విష్ణు భక్తుని స్వరూపము ప్రహ్లాదుని పాత్ర చిత్రణము మహోచితమై యొప్పుచున్నది.

చ॥ సనక సనందన ప్రముఖ సంయమిచంద్రులకైన నెమ్మదిం
గనుగొనరాని వేల్పు మన కట్టెదుట న్నరసింహమూర్తియై
కనుగొనదయ్యె ధన్యులమికన్ గరువం బెడలన్ భజింపుమో
జనక। దయామయుండితడు శత్రువునైననుగ్రహించెడున్.221.

ఇందు ప్రహ్లాదుని శాంతము తారస్థాయినందనది. పితరునకు గురుత్వము వహించి "పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్" అనుదానికి ప్రమాణముగ నాచంద్ర తారార్కము నాదర్శప్రాయుడై యశో వైభవముతో చిరంజీవి యయినాడు.

అష్టమ స్కంధము :-

కరిణీవ్రజ సంయుతుడై సంతోషాంతరంగుడై జలక్రీడగావించు ద్విరదేంద్రుని చిత్రణము చూచుచున్నట్లే యనిపించును.

ఉ॥ చొచ్చి జలంబులన్ మునుగుచున్ వడిలేచుచు నీళ్ళుద్రావుచున్
హెచ్చిన తాపభారము నొకింతటిలో దెగిపోవ నీళ్ళలన్
గ్రిచ్చరబీల్చి తుండమున గాయము నిండగ జల్లుకొంచు నిం
పెచ్చ గరేణువుల్ దనపయిన్ వడి జల్లగ సంతసిల్లుచున్. 27·

మకరముతో సమరమొనరుపలేని తరుణమున కరివరుడు జ్ఞానోదయుడై భావనచేసిన ఫణితి యా పాత్ర మనస్తత్వమును చక్కగ చిత్రీకరించుట జరిగినది.

తే॥ గ్రాహపాశ బద్ధుని నన్ను గాచువారు
పెదలెవరు లేరు మృత్యువన్ విషధరంబు
వాత బడు వాని నేవిగా వంగ జాలు
వాడు పరమేశ్వరుడొకండు వఱలుగాని. 43.

తమోగుణావృతులైన రాక్షసులను మోహ విభ్రమాంభోధిని

మ॥ తళుకుం బంగరు డాలు డీల్పడుగతిం దైవారు నెమ్మేనును
న్నెలనాముద్దులు మూట గట్టి మిగులన్వొల్గొందునెమ్మోమును
న్గులుకుంగుబ్బలు వాలు గన్నులును విన్నుంబోలులేగౌనునుం
గల నారీమణియై రమాధవుడటన్ గన్పట్టెనప్పట్టునన్. 129.

పొందికై విందులుచేయుచు మందగమనమున సాగుచున్న పద్యపు హొయలు మత్తేభవిక్రీడితమున సహజ శోభావహమై మోహినీ మధుర మందగమనమును స్ఫురింప జేయుచున్న యీపాత్ర చిత్రణ మద్భుతమే.

మోహినీ రూప విష్ణుమాయనుబడి కైలాసాచలాధీశుడు తన వారిని తనను నగజను మఱచి యవస్థ పడిన చిత్రణమున ఎంత నేర్చినా యెంత చూచినా, యెంత వారలైనా కాంత దాసులే కదా। యను త్యాగయ్య సత్యోక్తియు "బ్రహ్మకైన గలుగు రిమ్మ తెగులు" అను సూక్తియు స్ఫురింపకుండునా?

తే॥ దాని కడకంటి చూపులు దవ్వులనగు
వామదేవునిపై బడ వ్యథిత చిత్తు
డగుచు దన వారినిందన్ను నగజమఱచి
పొలతి దిక్కునకుంబోవ మొగము వెట్టె. 152.

దేవతార్థము వటువై వామనుడు బలి దైత్యేంద్రుని యాచింప జనిన రూప చిత్రణము బుడి బుడి యడుగుల నడచుచున్నట్లే యగు పించును.

సీ॥ నీరాడి శుచియయి నీర్కావిరంగున
గొనబుమీఱెడు నట్టి గోచి వెట్టి. 201.

భార్గవుని పాటింపక బలిచక్రవర్తి వటునకు దాన మొనర్తు నని పలుకుటలో నాతని స్థిర నిశ్చయము, ఆత్మ విశ్వాసము ద్యోతక మయి ఆ పాత్రౌచిత్యము పటిష్ఠమగుట.

శా॥ ఆధివ్యాధుల కేను జంక నిరయంబౌనంచు జింతింపనే
బాధల్ వచ్చిన నించుకే వగవ నా స్వారాజ్యముం బోయినన్
నాధిష్ణ్యంబును దేహముం దెగిన గుందన్ విప్రు వంచింపనా
గాథల్ వింటకు నెంతయేని యును దుఃఖంబందుదున్ భార్గవా। 230.

ఈ చరిత్రమున బలి ధర్మపత్ని మిగుల జ్ఞానియై బ్రహ్మజ్ఞయై బలిని మించినట్టిదై కానవగును. ఆ పాత్రలో వింధ్యావళి తీర్చి దిద్దబడిన విధము,

క॥ లోకత్రయ మిచ్చితి నే
గైకొనుమని నా మగండు కానక పలికెన్
వీకిచ్చు టేమి నీయది
యేకదె యీ వెడగు గావవే పరమేశా 259.

## నవమ స్కంధము :-

అంబరీషోపాఖ్యానమున నాసిక మీద క్రోధము నర్తించు దుర్వాసో మహర్షి యంబరీషుని పారణము విని కన్నుల నిప్పుకలు రాల రుషధాత్వర్థమునకు ప్రతీకగా పలుకుటలోని సహజత్వము శోభించిన పాత్ర చిత్రణము

ఉ॥ చూచితిరే వ్యతిక్రమము నూనృత వాది వలెన్ నటించునీ
రాచకొలంబు మానికము రమ్మని భోజనమాచరింపగా
వాచకముం బొనర్చియిటు బ్రాహ్మణునిం బహివెట్టినట్లుగా
జూచుచు ద్రోసి రాజనుచు జుట్టి భుజించె నొకండ వింటిరే 102.

దుర్వాసుని రక్షింపుమని చక్రమును వేడుకొనుటలో అంబరీషుని సచ్ఛీలతా చిత్రణము రమణీయము.

వనమయూరం। ఈ ద్విజుని ప్రాణములనిచ్చి దయతోడన్
మద్వర కులంబునకు మచ్చయయిపాపం
బుద్వహము యట్లుగుచు నొడ్డగిలకుండన్
విద్వదధినాథ పాదలింపు మనుకంపన్. 125.

శ్రీరామ చరిత్రమున సీతాదేవిని రావణుడపహరించికొని పోవుచుండగా నామె ఆర్తురాలై రక్షింపుమనుచు, తన కష్ట పరిస్థితిని తన భర్తయైన రామునకు దెల్పుమని పరితపించుటలో నామె దయనీయ స్థితి కడు సహజముగ చిత్రింపబడినది.

సీ॥ "వేల్పులారా! నేలదాల్పులారా, మీరు
నా వెతల్ దెల్పరే నా విభునకు" 234.

పురూరవుని చరిత్రమున పురూరవుడూరార్వశిని జూచి నిజేచ్ఛ తెలుపగా నామె పలికిన పలుకులందు నమర వేశ్యా మనస్తత్వమునకు తగినట్లు చిత్రించిన ఫణితి గణనీయము.

మ॥ అవురా, నీదు మనోహరాంగకము లేయబ్జాక్షికందోయికిన్
దవులన్ గాను శరాహతింబడక యే దారిం బ్రవర్తిల్లగా
నవు నీ వక్షము నొందఁ గల్గినది మోహావేశ యుక్తాత్మయై
నవయంబోవక యందునిన్ గలియనే వాంఛించియేవచ్చితిన్.
269.

కామాతురునితెగింపు పురూరవుని మాటలందునంతము చూచుట ఆ పాత్ర చిత్రణమున కానవచ్చును.

తే॥ నన్ను గరుణింపకుటివే సన్ను తాంగి
యింతలోపల బ్రాణములింద విడుతు
నా శరీరము తోడేళ్ళు నక్కలు దిన
జూడగలవీవు నీ కంటితోడ నిపుడు.279.

పరశురాముని చరిత్రలో నాతని రౌద్రావతార స్వరూప చిత్రణమున క్రుథధాత్వర్థము రూపు కట్టును.

తే॥ రాజ దౌర్జన్యమంతయు రాముడెఱిగి
దండతాడిత భుజగంబు దారి రోజు
చును ధనుర్బాణ తూణీర శోభితుడగు
గండ్రగొడ్డలిచే గొని గండు మిగిలి. 299.

యయాతి చరిత్రలో దేవయాని యయాతితనను వివాహ మాడుమని కోరగా నాతడాడిన పల్కులలో నాతని ధర్మజ్ఞత చిత్రితమైనది.

క॥ క్షత్రియుడనేను బ్రాహ్మణ
పుత్రిక నీ వెట్లు పెండ్లి పొసగెడు మనకున్
ధాత్రిన్ సంభృత ధర్మ
క్షేత్రంబుగ నేలు నేను చెడుటుచితంబే. 349.

## దశమస్కంధ పూర్వ భాగ ప్రథమాశ్వాసము:-

తన భార్యయైన దేవకిని చంపనుంకించు కంసుని వారించుటలో వసుదేవునిప్రతిన మాపాత్రమునకు విశిష్టతతెచ్చిన చిత్రణము,

ఉ॥ శ్యాలక, నీకు నింగి నుడి సత్యమయైన భయంబుగల్గుటల్
పోలగ జూడ నీగరితమూలముగాదు భవిష్య కాలమం
దీలలనాశిరోమణికి నేర్పడు సంతతి మూలమౌటు నే
పోలిచి నీ కొసంగెదను బుట్టిన వారిని బుట్టినట్లుగన్. 31.

రామకృష్ణుల బాల్య క్రీడలు వర్ణించుటలో పసివారి మనస్తత్వము చక్కగ చిత్రించుట కానవగును.

క॥ పా్రకుచు జని చని లేగల
తోకలు గొని లాగి లాగి తొడిబడ బడుచున్
పీక మెయి నాడు బాలుర
పోకలు గనుచుంద్రు పనుల బోవన్టుల్. 214.

బాలకృష్ణుడు మన్ను తినెనని తోడి బాలకులు యశోదకు చెప్పగ నామె యాతని నడుగ దాను దినలేదనియు వారట్లు చెప్పుటకు తనపై యసూయ కారణమనియు బుడి బుడి దీర్ఘములు తీయుటలో బాల మనస్తత్వ చిత్రీకరణము సహజము.

ఉ॥ ఆటలలోన నేను దమకందటికంటెను మించి యుంటచే
మాటికి నా పయినన్ గినిసి మాతకు జెప్పెదమంచునన్న యున్
బాటి యొకింతలేక యిటు పల్కిరి నీ విట నన్ను గొట్టన
య్యాటగ జూచి నవ్వుకొనునట్టి రయైరిది సత్యమమ్మరో. 234

వివిధ క్రీడలలో నుత్సాహము చూపుచు నాడు సోదరుల క్రీడలలో వారి క్రీడాసక్తత కానుపించును.

సీ॥ ఉప్పట్టు లాడుచునుందు రొక్కప్పుడొ
కప్పుడు గొణిబిళ్ళలాడు చుండ్రు" 294.

ఇందు రామకృష్ణుల పాత్ర చిత్రణము కడు రమ్యము.

బ్రహ్మ వత్సాద్యపహరణము చేయ బాలకృష్ణుడే వత్సాదులయి లీలలు చూపుట మిక్కిలి యద్భుతము. లీలా మానుష విగ్రహుడైన ఆ పరమాత్మ పాత్ర.

శా॥ తానే క్రేపులు క్రేపు కాపరులునై తద్రూప లావణ్య శో
భానూనాంగవిలాస వైఖరుల నింతైన న్విభేదంబుగ
న్గానే వానికి దోప నట్లుసుచు విష్ణుండే జగత్సర్వమున్
సానందాఖ్యకునై చరించెనువసుదేవాత్మోద్భవుండయ్యేడన్.348.

## ద్వితీయాశ్వాసము :-

కాళియుని బంధనమొందిన బాలకృష్ణునికై చూచి పునర్జీవితులైన గోపాలురు కృష్ణునికై విలపించుటలో వారి అమాయకత గోచరించును.

చ॥ మనమిపుడేమి సేసి మన మానధనున్ బ్రదికించుకొందుమే
ఘనుడిట రక్షకుండగుచు గానగ వచ్చెడు లోక రక్షకుం
డనదగు మిత్ర రత్నమిటులై చనుచుండగ జూచుచుంటిమీ
తనువులు కాల్ప నే సుగుణ ధాముడు కృష్ణుడు పోయెనేనియున్.

క॥ చచ్చిన వారల మనలన్
గ్రచ్చర బ్రదికించెనతడు కరుణాళుండై
చచ్చిన యేమనకప్పుడీ
వచ్చిన దుఃఖంబు తెలియ బడ బోదు కదా। 37,38.

ఈ సందర్భముననే సర్వజ్ఞుడైన బలరాముని పాత్రను చిన్ని గీతమున స్పష్టముగ చిత్రీకరించిన విధము వర్ణనీయము.

తే॥ తమ్ముని ప్రభావ మెఱిగినదంటగాన
నట్లు కాతరులై పోవు నట్టి వారి
గాంచి రాముడునగుచుండె గాని యించు
కంతయైనను మాటాడడయ్యె నపుడు. 42.

కుమారుడు క్లిష్టదశలో నుండగ భరింపలేని దుఃఖమున వివశులై పలపించు యశోదానందుల పాత్రలచిత్రణమున తల్లిదండ్రుల మనస్థితి స్వభావోక్తిని కాననగును.

చ॥ పుడిసెడు నీళ్ళుపోసి మన పున్నెపుదారికి మెట్లుగట్టునీ
కొడుకని నీవు పుట్టినది గోలెగడుంగడు సంతసంబునన్
బడియెద మింత కిప్పుడలపాపపు దైవముసైపలేకపా
పడ। నినుమమ్ము బాపె యిటు బాముల పాల్పడజే
నయ్యయొ। 46.

కాళియుని దీనస్థితి జూచి వాని భార్యలు తాటుపాటుతో ప్రార్థింప వచ్చిన విధము వారి మనోగత ఘర్షణము చూపుచు నా పాత్ర చిత్రణమునకు తగినరీతి భాసించినది.

మ॥ అతి సంరంభమునన్ భయోద్ధతుల దేహంబుల్ ప్రకంపింపనం
చిత భూషల్ బృథు కేశపాశములు సుశ్రీహారముల్వస్త్రసం
తతులుస్వీడగ దొట్రుపాటు నడలం దర్శించుచున్ వచ్చి సం

కృష్ణ తత్త్వము తెలిసిన పిదప కాళియుడు కృష్ణపరమాత్ముని స్తుతించు పట్టున నాపాత్ర చిత్రణలో నాతని పరిణత మనస్థితి గోచరించును.

మ॥ వివిధాకార బలస్వభావగుణ సంవీతంబు గా నీవయీ
భువనంబుల్ సృజియించితందొకడ నైపుట్టుందితిన్‌బాము నై
భువనాధీశ్వర మన్యు వెచ్చగును నామోత్రిలన్‌భవన్మాయలో
దవులొందంగల వాడనైతి నెటులేదాటంగలన్ దానినిన్. 79.

భీకరమయిన దవాగ్నిని చిత్రించిన విధము చూచిన అది నలు దిక్కుల ప్రాణము కొనినట్లు ప్రత్యక్షముగ మనో నేత్రమునకు దర్శనీయమగును.

సీ॥ హోర్వారవంబు మహోగ్రమై బ్రహ్మాండ
మంత బలిల్చెదునట్లు తోచె" 100.

గోపికా వస్త్రాపహరణమునరించిన గోపాలుని గోపకన్నియలు ప్రార్థించుటలో వారి నిర్మలమైన ప్రేమ భావము ద్యోతకమగును. ఆ పాత్రౌచిత్యము,

మ॥ నిను మేమెల్ల నెఱింగి యుంటిమిగదే నీ వల్లనందాత్మజుం
డనియున్ వల్లవ సంస్తుతుండవనియున్ స్వాంతంబునందెగ్గియే
నిను వీక్షించునుంటి మోగుణనిధీ నీకేము దాస్యంబుచే
యనయున్నారముమాపటంబులిడిమమ్మాలించిపాలింపవే. 196

వేణు గోపాలుని వేణు గానమును విని గోపకాంతలెక్కడివక్కడ విడచి యెవ్వరి మాటలు లెక్కచేయక కృష్ణుని చేరనాతడిది మీకు తగునా యని పృచ్ఛింప నా కాంతలు కనులనశ్రువులురాల తమచే భావ్యమయిన భావమును వ్యక్తీకరించుటలో నా పాత్రల యకలంకత స్పష్టముగ చిత్రీకరింపబడెను.

మ॥ తలవంపుల్‌నగుబాట్లు వచ్చుననుచున్‌ధర్మంబులెవ్వేవొ మా

కెలనన్ ధర్మవచః ప్రసంగముననో కృష్ణా॥ వచింతెన్నియో
కులటా ధర్మము లవ్వి చేము వినమాకుం జెప్పగానొప్పునే
పలుకుల్ చేసితి భక్తురాండ్రము మముంబాటింపవే వల్లభా।

చ॥ ప్రియులను దల్లి దండ్రులను బిడ్డల దొడ్డల బాసి యుండుటల్
జయమును గోరునారులకసమ్మతమంటివి మేలు మేము నా
నయమునె తెల్పుచుంటిమి జనార్దన। ప్రాణుల కాత్మవౌటచే
బ్రియులును దల్లి దండ్రులును బిడ్డలు దొడ్డలు నీవెమా కిలన్.

క॥ కావున ధర్మగ్లానికి
నే విధమున గాని సందొకింతయు నేనిం
దేవారు చూపనోపరు
దేవా మాపై బ్రసన్నధీనిడవలయున్. 354 నుండి 356.

ఆభీరభామలు కృష్ణుని గానక నాయా వానిని గూర్చి ప్రశ్నించుచు వర్తించిన పట్టున వారి కృష్ణైక ప్రేమ భావన గోచరించును. ఆ పాత్ర చిత్రణము.

సీ॥ మాచిత్త చోరుడై మా మనోనాథుండు
కనుగప్పె వనులార। గాంచినారె. 372.

ఇంకొక విశేషమున్నది. గోపకాంతలు మా చిత్తచోరుడు, మా మనోనాథుడు, మా బహిః ప్రాణము, మాతోడనాడు, మా చిత్త వీధి, మా విభుండిత్యాదిగ ననుటలో మా యొక్క యనగ నా గోపకాంతల యొక్క యని బహిరర్థము. నిజమునకాయన 'మా' కు ననగ లక్ష్మీ దేవికి విభుడే. "ఇందిరా లోకమాతా మారమా మఙ్గళ దేవతా" యని యమరము. ఇది ధ్వని. అనగ లక్ష్మ్యంశము వారిలోనున్నదన్న మాట. లేనిచో నాయనతోడ సాంగత్యము కలుగదు. ఈ భావముసూచనము. దానికి ప్రమాణము "విష్ణ్వంశము లేనిదే ప్రభువు కాలేడను" నా విష్ణుః పృథివీ పతిః యను శాస్త్ర వాక్య. కనుకనే వారికంత యదృష్టము పట్టినది.

---

ఇదే సందర్భమున మల్లికల నడుగు పద్దెము పోతన్నగారి నల్ల నివాడు - - - - జెప్పరే యను ప్రసిద్ధ పద్యమును తలపించును.

చ॥ తొలకరి మబ్బుతోడ దులదూగెడు నల్లని మేనివాడు త
మ్ములల కెనవచ్చు కన్నుగవ బొంపెసలారెడువాడు నెమ్మిక
న్నుల నలరారు పింఛమున నూల్కొనువాడుమనోహరుండుమీ
వలనికి రాడుగా దెలియబల్కుడు మల్లికలార మక్కువన్. 373.

ఇత్యాది పద్యములందు వారి నిర్మల మనోభావము కడు సహజముగ చిత్రీకరింపబడినది.

## తృతీయ శ్వాసము:-

అక్రూరుడు రామకృష్ణుల గొనిపోవ వ్రజంబునకు వచ్చి రమ్య భావనా భరితాంతరంగుడయిన తావున నాతని పాత్ర చిత్రణమున రాశీభూత మయిన భక్తి భావమగపడును.

శా॥ ఏజన్మంబున నెట్టి భద్రములు నేనీక్షించి యున్నాడనో
యే జాడం దపమాచరించితి నొయేయేపుణ్య కార్యంబులన్
నే జేయంగల వాడనైతినొకడు న్నిష్ఠాగరిష్ఠుండనై
యీ జన్మంబుంగృష్ణ దర్శనము నాకీనాడు గానుంటకున్ 92.

కృష్ణుని గూర్చి గోపాలాదుల నడుగుటలో నాతని యుత్కంఠ ద్యోతకమగును.

సీ॥ "గోపాలు రార। మీ గోపతులగు వారు
బలకృష్ణులెందున్న వారో చెపుడ" 110.

రామకృష్ణులను చూచి వారి పాదములబడి తన్మయతనొందిన యప్పటి పాత్ర చిత్రణము రమణీయము.

ఉ॥ కాంచి రథంబు డిగ్గి వడిగా నడ సేయుచు రామకృష్ణపా
దాంచలమందు వ్రాలి పులకాంచిత నేత్రుడుస్విన్న గాత్రుడై
యించుక మాటలాడుటకు నేని సమర్థత లేనివాడయై

---

కొంచెము సేపు కొయ్యవలె క్షోణి పయింపడి యుండెన
యెడన్.114.

రామకృష్ణులు మధురానగర వీథిని జనుచుండగ పౌరకాంతలు వారిని జూడ జనిన సంరంభము మిగుల హాస జనకము.

సీ॥ మణి విభూషణ వస్త్ర మహిత వస్తువులు కొం
దఱు విపర్యయముగా దాల్చి మేన" 180.

రామకృష్ణులతో మదిరాపాన మత్తుడైన రజకుడు సావక్షేపముగ బలుకుటలో నాతని వివశమానభాషత స్పష్టముగ చిత్రీకరింపబడుట కాంచదగినది.

చ॥ ఆడవుల గొండలందిరుగునట్టిరు మీరెపుడేని యట్టి మేల్
దొడవులు చూచియుండరవిదోర్బలశాలి నరేంద్రువిత్తముల్
జడమతులై యొసంగుమని సాహసులైతిరి రాజభృత్యులే
నుడివిన మిమ్ము బట్టెదరు నొవ్వగ గొట్టెదరేగు డీరెటో. 187.

తనను గ్రహించిన శ్రీకృష్ణుని యందు సుదాముని భక్తిభావనా భరిత శాంతాగ్రసరత్వము తోచు పాత్రచిత్రణమిది,

క॥ మీపై స్థిరమగు భక్తియు
నాపై మీ భక్తులందు నతి సౌహార్దం
బేపట్ల భూతదయయును
బ్రాపించెడునట్లు సేయ బ్రార్థింతుమిమున్. 197.

ఈ పద్యము పోతన్నగారి నీ పాద కమల సేవయు - - - - తాపస మందార నాకు దయసేయగదే అను పద్యమును స్ఫురింప జేయును.

కంసుని దుర్నిమిత్తములను వర్ణించుటలో నాతని భీత మన స్తత్వమతి సహజముగ చిత్రింపబడినది.

సీ॥ "తన ప్రతి రూపమునను దలలేనట్లు - - - - - - - - -"

తే॥ నిద్ర జాగ్రదవస్థ నీ మాదిృయైన
దుర్నిమిత్తము లెన్నే నితోచుచుండ
భోజకుల పాంసనుడు చావు మూడుననెడు
భయమునను నిద్ర నొందని వాడయయ్యె.214,215.

మల్ల యుద్ధమునందు బల కృష్ణ చాణూర ముష్టికుల విన్యాస వైచిత్రి చూపు పాత్రచిత్రణమిది.

సీ॥ వారలొండొరులను బట్టి కాళుల గాళ్ళు
చేతులం జేతులు చిక్క గట్టి. 244.

దేవకీ వసుదేవుల చెర మాన్చి బలకృష్ణులు పలికిన పలుకులందు పితరులయెడ పుత్రధర్మము, వారి పశ్చాత్తాపములు నాదర్శప్రాయమై చిత్రింపబడినవి.

శా। తాతా। మాత। ఖలుండు కంసుని మహోదగ్రప్రకారంబునన్
జాతోర్వీవ్విడనాడి పోయి యితరస్థానంబునందుండుటన్
జేతోమోదముతోడ మీ పదములన్ సేవింపలేకుంటి మే
మాతప్పున్క్షమియింపవేడుదుము సంప్రార్థించిసేవించుచున్273.

వ్రజకాంతలుద్ధవునితో తమ పరితాపమును చెప్పు కొనుటలో వారి యమాయకత, స్త్రీ సహజమైన అసూయయు, కృష్ణునియంద పరిమితానురాగములు స్పష్ట చిత్రీకృతములైనవి,

సీ॥ "మాన్మితేక్షణముల మన్నింప బడు కృష్ణు
డా మధురస్త్రీల పేృమకగునె" 367.

## దశమోత్తర భాగ ప్రథమాశ్వాసము:-

కాలయవనుడు శ్రీకృష్ణునివెన్నంటి పోవునెడ నాయనచూపిన లీలతోనాతని యవస్థ కడు సుందరముగ చిత్రీకరింపబడినది.

చ॥ అడుగున నడ్డువేయగలడై యవనుండు కడున్వడిన్వడి
న్నడచుచు నంగవేయుచు క్షణంబున బట్టెదనంచు నెంచిలోన్
నెడమయి దూరదూరమయియింతటిలో నతి సన్నికృష్టమై
యొడిసికొనంగ నైనగతి నుండియుగొండొకదవ్వుపాటియున్30

రుక్మి త్రికరణ శుద్ధిగ శ్రీకృష్ణుని పతిగకోరి యర్థించుటలో నామె యాత్మ విశ్వాసము, స్థిరనిశ్చయము గోచరించుటలో పాత్ర నిర్మలతా చిత్రణము శోభావహము,

చ॥ ఏనఖిలేశ్వరేశ్వరు ననేక విధంబుల గొల్తు నేని నా
మానసమెప్పుడున్ సుకృత మార్గమునందగు నేనినన్నెవం
డేనియు నంటకుండ బరమేశ్వర। వచ్చి మదీయహస్తమౌ
నౌనన గైకొనంగనిదె ప్రార్థనముంబొనరింతు నెంతయున్. 94.

భ్రాతృవధకుద్యమించు పతిని చూచి రుక్మిణి యబలయై కడు వేదనాభరగ చిత్రింపబడుట,

తే॥ దేవ దేవ। జగన్నాథ। దీనవత్స
లా। మహాభుజ। నా భ్రాతయైన వీని
జంపుటుడుగుమునన్ గరుణింపుమితడు
తప్పుసేసెను క్షమియింపు మిప్పుడనుచు.

చ॥ పదముల వ్రాలి లేవకొక పల్కను బల్కగలేనియట్టిదై
వదవదలాడు మేని పయి వట్రుఱువాఱగ జెమ్మటల్గడున్
వదనము వెల్లబాఱ నయనంబులు మూతలుగల్గనూర్చుచో
సదయుడు లేవనెత్తి సతిసాంత్వన వాక్కుల నూఱడింపుచున్.
149,150.

ప్రద్యుమ్ను నపహరింపచనుదెంచినశంబరుని రూప చిత్రమా పాత్రకు తగినట్లుండుట కానదగును.

శా॥ మాయారూపముదాల్చి తన్నొరులు సంభావింపరాకుండ దా
నాయాచోటుల వింతలంగనుచు నయ్యాకాశమార్గంబునన్
రేయిం జిమ్మనుచీకటిందనదు మేన్వియ్యంబునందంగ సు
శ్రీయుక్తంబగు ద్వారకానగరికిం జేరెన్క్షణార్థంబునన్. 120.

ఇందా రక్కసుని మేను రేయి చీకటితో వియ్యమందుచున్న దనుట స్వభావోక్తి రమ్యము.

మత్స్యగర్భమున ప్రద్యుమ్న కుమారుని చూచి పూర్వమే నారదర్షిచే నెఱింగినదియై మోహ పరవశయై శరీరస్మృతి యెఱుంగ కూరక చిత్తరువట్లుండి కొంతవడికి తేరిన యామె పరిస్థితి రసభరిత ముగ చిత్రింపబడినది.

చ॥ కొలుకుల హర్ష బిందువులు కొల్లలుగా దిగజాఱ మేనబె
న్పొలకలుగా గగుర్పొడువ మోహములూరగ మాటిమాటికిం
దలచుచు బూర్వ వృత్తమును దైవ విలాసము సంస్తుతించుచున్
నిలిచినయట్లు నిల్చి యతనింగనుచుండెను ఱెప్పవేయకే. 194.

మాయావతిచే పెంచబడి ప్రద్యుమ్నుడామెను మాతృభావనతో జూచుచుండ నామె విరహమును జూచి పలికిన పలుకులాణిముత్తియ ములై ధర్మబద్ధతనలరారి యా పాత్రకు వన్నె గూర్చినవి.

తే॥ నీకుమారుడగాన నే నీకనైన
నాత్మ జాధుల నడగించి యలసి పోవ
దగునటంచును బలుకుట దగునుగాని
తెగువ వగచుచు నిట్లుంట దగునె చెపుమ. 211.

ఇటనొక రమ్యచమత్కారమున్నది. నీకుమారుడనుచో నీకుమారుడ నియు, నీకుమారుడని పద విచ్ఛేదము చేసిన రెండవది భావగర్భితమై ధ్వనించుచు సూచిత ప్రాయమగుచున్నది.

నిజము తెలిసిన ప్రద్యుమ్నుని విరహాతుర మనస్తత్వ చిత్రణము శృంగార సుభగమై యలరినది.

చ॥ అరయక దప్పు సేసితి మహావ్యథ దాపురమయ్యెనింక నే
నరగడె కాలమైన నిసుమంతయు దాళగలేను నీమహా
ధరమధురామృతంబొసగి దాసునినన్గరుణించి పోవవే. 219.
విగత కుమారుడు సంప్రాప్తుడు కాగా పేదకు పెన్నిధి లభించి

నట్లు కడుపు తీపితో పుత్త్రుని అక్కునజేర్చి యుపలాలించిన రుక్మిణి పాత్రచిత్రణ మసదృశము.

శా॥ నన్నుంగన్న కుమార। నాధననిధీ। నాతండ్రి। నాప్రాణమా।
కన్నుంగుట్టినదేమొ రాక్షసుడు నిన్ గైకొంచు గ్రొవ్యంబునన్
నిన్నున్ నన్నును బాపిచావుమని ముస్నిటంబడవ్ వైచి నా
డన్నా। యెట్లుసురూనితో యెటుల నీవైతోవెలంగయ్యెడిన్.250.

శ్రీకృష్ణుడు పరిహాసమునకు విరసోక్తులాడగా దైన్యమూర్తియై శోకోద్వేగముతో పలికిన రుక్మిణి చిత్రణము సహజ స్వభావముతో చెన్నారినది.

మ॥ అరవిందాక్ష। త్రిలోకవల్లభుడ వింద్రాదుల్నినుంబోల్పలే
రురుతేజో విభవాంచితుండవిక నేనోజ్ఞాన లేశంబునే
దొఱయుంజాలనిదాన నెల్లెటిగి యుందున్నిన్ను సర్వేశనీ
చరణాబ్జంబులు నమ్మియున్ననను గాంక్షంజేసి రక్షింపవే.371.

## ద్వితీయాశ్వాసము:-

బాణాసురుడు నిజ కన్యకా సుముఖాంచలమున నున్న యనిరుద్ధుని రూపమును చూచిన యప్పటి స్వరూపచిత్రణము వానిని పట్టియిచ్చునదై యున్నది.

సీ॥ భువనైక సుందరమూర్తి విశ్రుత కీర్తి
కాంతామనోహరాకారు వీరు - - - - "

తే॥ గుంకుమాంకిత - - - - ముఖాంచలమున. 28.

కౌరవుల ప్రవర్తనకు క్రోధియైన బలరాముని పాత్రచిత్రణము స్వభావయుక్తమై యున్నది.

శా॥ కానిమ్మిప్పుడకౌరవంబుగ ధరంగావింతునంచీసునన్
గానన్వచ్చి హలాయుధంబు గొనిగంగంగల్పెదన్ హత్తిప్రో
లీనాంటుగనుడంచు వప్రము పయిన్ వీక్షించి నాగేటిక

జ్ఞానంజేయుచు లాగె నొడ్డెగెడపై నాస్థాన మట్టిట్టుగన్. 152.

యదూద్వహుని సమైక్యమై యున్న కృష్ణ పత్నులకు కర్ణపుటమ్ముల నూదిపోట్లయిన కుక్కుట శబ్దము వర్ణింపబడిన పట్టున వారి మనోభావ చిత్రీకరణ రమ్యమై యున్నది.

ఉ॥ ఒక్క శరీరమే యనెడునోజ యదూద్వహు గౌగిలింతలం -

- - - - వియోగ వేదనన్.

ఆ. వె॥ కోళ్ళకేమి వచ్చె గొండ ప్రక్కంబడి
నిద్రపోవు నరుణు నిగిడి లేపి
మనకు విరహతాపమొనరించెడిన్ వీని
మొఱటు కూతమూడుముక్కలుగను. 171,172

జరాసంధుని జయించుటకు కృష్ణ భీమార్జును లేగగా కృష్ణునితో దేవవైరి పలికిన పలుకులలోని యుద్ధనీతి, అపహాస్యములాపాత్ర స్వభావ చిత్రణమునకు శోభదెచ్చినవి.

శా॥ యుద్ధం బిచ్చెద మీకునట్లయిన నోయీ నీవునుంజోదువో
క్రుద్ధున్నన్గని బీతునన్ జలధిదాకోపీడు గట్టించి యం
దిద్ధ ప్రజ్ఞను జాటు భీరుడవు కావే నిన్ను మార్కొగస
న్నద్ధస్వాండగాను చెప్పితిని గృష్ణా। చాలునీ బీరముల్.

ఆ। వె। సవ్యసాచి నాకు సవతురాడు వయస్సు
నను బలంబునన్ రణంబొనర్ప
దగిన యోధునాకు దలప భీముండగు
వాసితోడ బోర వాంఛ యగును.217,218.

ధర్మజు రాజసూయాధ్వరమున కృష్ణుడర్చింపబడగా పాండవాగ్రజుని నిందించిన శిశుపాలుని పాత్రచిత్రణ.

మ॥ విమలార్ఘ్య గ్రహణార్హ లక్షణలవాన్వితుండుగానట్టిదు
ష్టమతిం గృష్ణుని బెచ సేసియిటు యజ్ఞ ప్రాంగణంబందున

ర్ష్యము గల్పించుటు జేసి నీదయిన ధర్మజ్ఞత్వమొక్కింతలో
సమసెందప్పు ఘటిల్లె నింకిటనినున్ సమార్పిట్టునానొప్పునే. 247.

మయసభా భవనము చూచునిచ్చమై మసలు మనముతోడ కౌరవాగ్రజుడు పడిన యవస్థలో నా పాత్రచిత్రణము హాస సంవర్ధకమై యొప్పును

సీ॥ స్ఫటిక సంఘట్టిత స్థలము జలాశయ
మని వస్త్రు మెగదోచి కొనిగమించె" 262.

సాళ్వునితో సమర సందర్భమున మూర్ఛ మునిగిన ప్రద్యుమ్నుని సారథి రథముతో వెనుకకు త్రిప్పగ మూర్ఛ దేరిన ప్రద్యుమ్నుని మాటలలో వీరతా చిత్రణము తగిన రీతి ప్రకాశించుట కానవగును,

మ॥ అని వెన్నిచ్చి పరాఙ్ముఖుండనగుచున్ హాసౌతినీవేటికి
ట్లను మానింపక వచ్చితేమిపనిసేయం జొచ్చితాసాళ్వునిం
గని భీతిల్లితె వృష్ణి వీరులకు నీ కర్మంబు ధర్మంబుగా
దనుడున్ దారుకనందనుండు పలికెన్ న్యాయానుబంధంబుగన్.

ప్రద్యుమ్నుడుమరల ఇట్లనుట శూరత్వ నిదర్శనము,

ఉ॥ మా మలమందనింబడిన మానిసి చంపును జచ్చు గానితా
- - - - - - - - - - - సేయుదున్. 276,279.

కుచేలుని ధర్మపత్ని కష్ట కాపురమున నాయమస్థితి యా పాత్ర చిత్రణమునకు గుండెకాయయనదగును.

తే॥ గుడిసె కురిసిన జేట పైనిడి కొనుచును
జలికిగుంపట్లు బ్రిక్కల నిలుపుకొనుచు
గాలికిం దాటి జవరలు గప్పి కొనుచు
గాపురము సేయు నాయమ్మ కాటకమున. 315.

కుచేలుని జూచి సౌహార్దముతో వర్తించిన కృష్ణ వర్తనమున సన్మిత్ర పాత్రత చెప్పనలవికానిది.

---

చ॥ వడివడి లేచి చేతులను బారలుసాపుచుబోయిసందిటన్
గడువడి జేర్చి బ్రాహ్మణునిగాఢతరంబుగ గౌగిలింతలన్
బుడిబుడి మాటలందనిపి బుజ్జవమాఱగనజ్జలేయగా
నడపుచు దోడుకొంచు జనెనాతుకలుండెడునట్టి చోటికిన్. 231.

# తృతీయాశ్వాసము :-

కుహనాయతియై అతి సౌందర్యవతియు, సర్వభద్రయునైన సుభద్రను చూచి కృష్ణసఖుడు తదేకాగ్రచిత్తుడయి ఱెప్పవేయక చూచుచుండగ ప్రాణసఖత్వము పొంపిరిపోవ చనవుతో మేలమాడిన విజయసఖుని సంభాషణా చిత్రణము మురిపించునదై యలరారుచున్నది.

చ॥ అడవుల నాకలంబు దినునట్టి వనేచర నీకు నిట్టిచో
బడచుల జూచి మోహపడు భావము వచ్చెను జాలుజాలు నీ
నడవడి మాకునుండెలిసె నవ్వుదు రెవ్వరు విన్న నిన్నటం
చడరినమందహాసమునహాస్యముసేయుచునంతవెందియున్.110.

మూర్తి త్రయమును భృగుమహర్షి పరీక్షించునెడు విష్ణుని సత్వగుణ స్వభావదర్శనమున నాతని పాత్రచిత్రణము తగియున్నది.

మ॥ సిరితోడన్ శయనించియున్న హరినింజెంతంబ్రతీక్షించి పే
రురమందంఘ్రిని దన్నె దన్నిన నతండొక్కింతలో లేచిత
చ్చరణాబ్జంబుల వ్రాలి తప్పునయిపన్ స్వాతంబుగావింపుమీ
వరుదే జూడనివాడనైతి గృపనాయందుంబ్రతిష్ఠింపుమా.

తే॥ కర్కశంబైన నాదు వక్షంబు దాకి
పద్మకోమల మగు నీదు పాదమకట
నొచ్చెనోయని వగచెద సచ్చరిత్ర
పాదసేవౌషధము నేసి బాధపుత్తు. 192, 193.

విప్రుడు గతాయుష్కుడైన సుతునికై శోకించుచుండ, గాండీవి భావి రక్షణ చేతునని భాషించుటలో నాతని రాచ మనస్తత్వము, వీరత్వము పొడగట్టునట్లున్న చిత్రణము:

చ॥ వగవకుమేను నీ ప్రజలు: ప్రాణము గల్గి మెలంగునట్లు నా
దగు వరశక్తి జేసెద నటంచు ప్రతిజ్ఞ యొనర్చు చుంటిన
ట్లుగ నొనరింపకుండిన గడుంగడు మండెదునగ్ని జొచ్చి నా
కగు దురితంబు వాసెద మహాముని శేఖర నీవు చూడగన్. 199.

ప్రతినపొనర్చ వేరవి యర్జునునిచూచి బ్రాహ్మణుడు కొల్కుల నిప్పులొల్కించుచుండగ నీసడించుటలో వాని మనస్తత్వ చిత్రణము

ఉ॥ భూసుర పత్నికిన్ సుతుడు పుట్టియు బుట్టినయట్లు నింగికిన్
భాసిలుచున్ మెఱుంగనగ బాఱెక్షణార్ధములోనమేనితో
నాసమయంబునన్ జనులు హాయనిమ్రోసిరి బ్రాహ్మణుండునా
వాసవి గాంచి దూరుచును బల్కెను గొల్కుల నిప్పులొల్కుచున్.

సీ॥ కృష్ణ సన్నిధియందజిష్ణుని కడకేగి ....” 203,204.

## ఏకాదశ స్కంధము:-

జాంబవతీ సుతుడైన సాంబునకు గుర్విణి వేషము వైచికర్మవశమున మునుల కడకేగు సందర్భమున గోపబాలుర యసందర్భ వర్తనను చిత్రించిన విధము.

ఉ॥ కొంటెతనంబు క్రేళ్ళుఱుక కోయనియార్చుచు యాదవార్భకుల్
వెంటన సిందుచూల్ వనితవేల్పులుమ రామునులున్న చోటికిన్
గెంటసముల్ వచించుచును గెవ్వన నార్చుచు వచ్చి
మ్రొక్కిమేల్
దంటలు మీరు చెప్పుడునెలంతుక కూతునొ కొడుకునొ కనున్ 14.

ఉద్ధవుడు శ్రీకృష్ణుని పయన మెఱింగి పలికిన పలుకులలో నాతని యాత్మీయత ద్యోతకమగును.

ఉ॥ "ఓపురుషోత్తమా! ద్విజవరోన్నత శాపముకాదు పద్మభూ - -
- - - - - దోచెడిన్.

ఉ॥ "నీపదపంకజంబు విడి నేనిట నొక్కడ లిప్త మాత్రమే - - -"

మ॥ "నడగావించెదు నప్పుడొక్క కడ విన్నాణంబు నన్నిల్చిన- -

క॥ నాకాత్మ వైన నిన్ను
న్నేకరణిన్ విడచి యుండ నిపుడే నేతున్
నా కట్లుగాక యుండం
గైకొని పొమ్మనుచునిదిగొ కైమోడ్తునజా. 11 నుండి 121.

శ్రీకృష్ణుడుద్ధవునకు పరమార్థోపదేశము చేయుటయందతని తత్త్వము స్పష్టమై గోచరించును.

తే॥ తత్త్వమును విమర్శింప గదలచువాడు
మనము శిక్షితముగ జేసికొనియు విషయ
వాసనలవంక బోవక స్వాంతమందు
జగమునశ్వరమని యెన్న దగుననిశము. 128.

పింగళయను వేశ్య విరక్తిచెంది పరితపించుటలో నామె పశ్చాత్తప్తత స్పష్ట చిత్రీకరణము కావింపబడినది.

ఉ॥ నామది మోహ మగ్నమయి నాకు వివేకము బాయజేసెనే
నీ మెయిరిత్తగా జెడగ నిట్టి దురర్థమునాసజేసితిన్
గామము ప్రాణికోటులను గాలిచి పుచ్చెడి నక్కటక్కటా
యేమనుజుండొ వచ్చి ధనమిచ్చెడునంచిటు వెఱ్ఱి నైతిబో. 156.

లోభియైన యొక బ్రాహ్మణుని పాత్రచిత్రణ మాతని స్వభావమును రూపు కట్టించుచున్నది.

సీ॥ కవిలె కట్టలు విప్పి గడియగడియ చూచు
బాతులపై బూలు పత్రి వెట్టు" 294.

యాదవులు ప్రభాస తీర్థమున నొండొరులు యుద్ధమునకుదిగిన

స్థితి చిత్రణము వారి పరివర్తనను సుస్పష్టము చేయుచున్నది.

సీ॥ మైరేయకము ద్రావ మై మఱపుదయించె
సర్వాంగములకు జంచలత వొడమె" 379.

కృష్ణుని కఱకుటలుగుతో నేసిన శబరుని యావేదన చిత్రణ మైన ఫణితి యిట్లలరినది,

మ॥ అపరాధంబొనరించినాడను మహాత్మా। లేడియన్ భ్రాంతినే
నపమార్గంబున నుండి లోక జనకుండై యున్న నిన్నిట్లుపా
పపరీతాత్ముడనై యెఱుంగక వధింపంజాలితిన్ వ్యాధుడన్
గృపదళ్కొత్త ననుగ్రహింప వలెననున్ శ్రీవాసుదేవా।
హరి. 388.

## ద్వాదశ స్కంధము:-

శుకమహర్షి పరీక్షిన్నరేంద్రునకు చావులేమి నెఱింగించుటలో నాయన బ్రహ్మజ్ఞత స్పష్టమగుచుండుట కాంచనగును.

మ॥ అవనీనాథ। తలంపనీకు మరణంబాసన్నమై యున్న దం
చువనంటంబడి యున్న వాడవనుచుంజూపట్టుచున్నాడవి
ట్లువునే నేనను నాత్మ యెల్లపుడు నిత్యంబౌట నద్దానికిన్
దవునే చావు ఘటిల్లునంచు దలపోతల్ భ్రాంతిగాకింతయున్.44.

మార్కండేయుని కొనిపోవనే తెంచిన వైవస్వతుని యుగ్రభీకర స్వరూప మా పాత్రకు తగినట్టు గంభీరతద్యోతకమగుట,

మ॥ గళగర్త ప్రతి పాదితాస్య వివరోద్గాంతోగ్రనిధ్వాన ని
స్తుల శబ్దీకృత రోదసీ కుహరుడస్తోకాగ్ని భీముగ్గదా
చలిత ప్రస్ఫుట హస్తుడత్యధిక దుష్ట భ్రూయుగుండుజ్జ్వల
జ్జ్వలనజ్వాల నిభాభ నేత్రముఖుడా వైవస్వతుండుగ్రుడై. 102.

భీకరాకారుడైన నరకాధిపతిని చూచి యధిక సాధ్వస కంప్యమాన కాయుడయి గడగడ లాడుచు జడియక మృడుని నెడదనిడుకొని

మృకండుని సూనుడు ప్రార్థించుటలోని భావచిత్రణము గణింపదగినది.

ఉ॥ ఎక్కడ నుంటి వోయిపరమేశ్వర। గ్రక్కున రాగదోయి పీ
డెక్కడి వాడొ కాని యొకడే। కటిచీకటులీను మేనివా
డెక్కటి దున్న నెక్కికొని యెక్కడకుంజనుదెంచికంటునిన్
గ్రుక్కియ యున్ననన్ దిగిచె గుత్తుకకుం దగిలించి
పాశమున్. 106.

మార్కండేయునకు దర్శనమిచ్చిన నారాయణ నర మహర్షుల రాక చిత్రింపబడిన విధమిది,

తే॥ అఱుత యజ్ఞోప వీతము లమర వేణు
దండము కమండలువులును దర్భముష్టి
పొలుపు మీఱగ మెయికాంతి పొలమునిండ
జేయుచును వచ్చి రమ్మునిరాయు కడకు. 113.

ప్రళయార్ణవమున వర్తించిన మార్కండేయుని మోహ భయానకావస్థ చిత్రణము-

మ॥ విరియంబాఱ జటా కలాపము భయా విష్టుండు కష్టుండునై
పరివేష్టించిన నీరపూరములలో బభ్రామ్యమానుండుగా
కరిదిన్ భూరితిమింగిలంబులు మహా గ్రాహంబులుం బట్టుకో
దెరువుం దెన్నును దోప కార్తుడయి వర్తించెన్ భయ
భ్రాంతిమై. 126.

కరారవిందేన పదారవిందమ్
ముఖారవిందే వినివేశయంతమ్
వటస్య పత్రస్య పుటేశయానమ్

బాలం ముకున్దం మనసా స్మరామి (లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతము) అని వర్ణింపబడిన వటపత్రశాయి అయిన బాలముకున్దుని మార్కండేయుడు చూచిన యప్పటి చిత్రీకరణము,

సీ॥ మరకతమట్లు శ్యామల వర్ణమగు మేను
తామరపూవు నాదరరు మోము

తే॥ గలిగి చేతులచే నొక్క కాలునోట
బెట్టుకొని చీకు చుండె నప్పట్టునందు
దనదు బడలికలన్నియు దరలి పోవ
నోడలు పొంగగ ముని వాసి కడకునేగె. 129.

ఈ రీతిగ వివిధ పాత్రముల చిత్రణము శ్రీకృష్ణభాగవతమున కాననగును.

—[]—

# వర్ణనా వైదుష్యము

"లోకోత్తర వర్ణనా నిపుణః కవిః," కావ్యప్రకాశము-1ఉ. "దర్శనాద్వర్ణనాచ్చాథ రూఢా లోకే కవి శ్రుతిః" భట్టతౌతుని కావ్య కౌతుకము.

అనునవి ఆలంకారికోక్తులు. ఒకడు తాను దర్శించినట్టి దానిని సొగసుగ వర్ణింపగల సామర్థ్యముగలిగి అకారణముగ కవిగ పరిగణింప బడుచున్నాడు. ద్రష్టయగు వాల్మీకి రామాయణ గాథా వర్ణనము చేతనే కవిగా ఖ్యాతినందినాడు. ఛందోబద్ధమైన పద్యవిద్యకాతడు ప్రథముడు. వర్ణనా నిపుణత్వమే కవిత్వమునకు ప్రధానధర్మము. వస్తుస్వరూప స్వభావములు రెంటిని సూక్తి సుందరముగ ప్రవచించు టయే వర్ణన లక్షణము.

కావ్యమునవర్ణనలు కథాంశమునకు భిత్తికలవంటివి. కవి వర్ణ నల సాధారముగ నపూర్వములు నద్భుతములునగు వస్తుజాతమును ప్రదర్శించుటయందు సమర్థుడగును. ఈ వర్ణనములు కవి ప్రతిభకు నికషోపలములు. వర్ణనలవలనకావ్యమునకనిర్వచనీయమైనరామణీయ

కత సిద్ధించును. అట్టి వర్ణనలు ప్రకృత కథోపయోగ్యములై యున్న యెడల నితివృత్తమునకు పుష్టిని, చదువరికి తుష్టిని కలిగించును. అటులగాకున్న చో నయ్యవితీర్థమునకు తీర్థమును ప్రసాదమునకు ప్రసాదము నైవస్త్వైక్య భంజకములై కావ్యమున దోషములుగ పరిగణింప బడును.

కావ్యమున అష్టాదశవర్ణనములుండ వలయునని ఆలంకారికులు అందఱును వక్కాణించుట జరిగినది, అందు విద్యానాథుడు,

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్
ఉద్యాన సలిలక్రీనా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
మంత్రద్యూత ప్రయణాజి నాయకాభ్యుదయా అపి
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహా కావ్యముచ్యతే"

ప్రతాపరుద్రీయ కావ్యప్రకాశము 69-71.

అని నుడువగ సాహిత్యదర్పణ కర్త,

"సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభేచ మునిస్స్వర్గపురాధ్వరాః
రణప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయాః యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ"

సాహిత్యదర్పణము -322, 324.

అనియును వర్ణనములను గూర్చి వివరించి యున్నాడు. ప్రప్రథమాంధ్ర ప్రబంధ కర్తయని పేరువడసిన నన్నిచోడ కవిరాజ శిఖామణి.

క॥ వనజలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతిరతక్షితి వరణాం
బు నిధి మధుఋతుపురోద్వా

హానగ విరహ దూత్య వర్ణనాష్టాదశమున్
కుమార సంభవము 1-44.

అని తెల్పగ అప్పకవియు,

సీ॥ పురమును బుతుషట్కమును బ్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబుపిదపనద్భుతరణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వన విహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

తే॥ పద్మమిత్రోదయబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు బ్రబంధంబు శ్రీనివాస. అప్పకవీయము. 1-28.

అనియును కావ్యాదుల వర్ణ్యములగువానిని గూర్చి పలికెను. ఇందు కొన్ని వర్ణింపబడకున్నను కావ్యత్వమునకెట్టి లోటును వాటిల్లదు. సందర్భానును సారముగ మరికొన్ని విశేషాంశములును చోటునందుటయు పరిపాటి.

ఈ కారణముననే సంఖ్యావిషయికముగపలు అభిప్రాయములు పలువురచే నాపాదింపబడుటు జరిగినది వ్యాస భాగవతమునందీ వర్ణనములన్నియు సుమధురములు, స్నిగ్ధ సుందరములుగ చేయబడినవి.

శ్రీకృష్ణ భాగవతమున శ్రీ శాస్త్రిగారి ప్రతిభా పాటవముచే మలచబడిన యీ వర్ణనలు సర్వాంగ సుందరములై దీప్తి వంతములై ద్యోతకములగును. వీనియందు ప్రసిద్ధ కవి సమయములును పాటింపబడినవి. వీనిని చూచినచో శాస్త్రిగారి బహుముఖ ప్రజ్ఞ, లోకజ్ఞత,

అనుపమ కల్పనా సామర్థ్యమును తెలియును.

శాస్త్రిగారి వర్ణనా వైదుష్యమునకు ప్రస్తుతము స్థాలీపులాక న్యాయముగ కొన్ని మచ్చునకు పరిశీలింపబడుచున్నవి.

## పురవర్ణనము:-

శాస్త్రిగారు తృతీయస్కంధమున సనక సనందాది మహర్షులు శ్రీమన్నారాయణ దర్శనలాలసులై, విగత స్పృహులై నానాలోకములు సంచరించుచు వైకుంఠ పురమునకు వెడలిన సందర్భమున వారికి లోచన గోచరమైన ఆ పురమును మన మనోనేత్రములనిటుల ప్రతిభచే రూపు కట్టించిరి.

సీ॥ సంపత్సమృద్ధమై సర్వర్తులందును
దనరు చుండెడు నుపవనుల తోడ,
నిర్మలామృతముల నెగడొందు కమలాళి
రమణించెడు సరోవరముతోడ
బద్మ వనంబుల పయినుండి లేచిన
భ్రమరాళి సంగీతరవములతోడ
మాకంద ఫలముల మాధుర్యమున జొక్కి
కులికెడు చిలుకల పలుకుతోడ

తే॥ నలరి సతతము రాకపోకలు పొనర్చు
హర పితామహ శక్రాది సురలతోడ
స్వర్ణమణిగణాలంకృత స్థలులతోడ
బొలుపు మీరెడు వైకుంఠ పురవరంబు. 2-156.

సప్తమస్కంధము దేవతలు హిరణ్యకశిపుని వైకుంఠపురమును వర్ణించినరామణీయకమిటులున్నది.

మ॥ అరుదారస్మణి - - - - - - - - - - ప్రభావంబునన్.

తే॥ పొలవెల్లి నడుమ - - - - - - బుణ్యకాండమగుచు. 7-112,113.

అష్టమస్కంధమున బలి చక్రవర్తి యింద్రుని గెలువబోయిన తావున నా స్వర్గపురమైన యమరావతీనగరమిట్లు వర్ణింపబడినది.

సీ॥ పెట్టు చెట్టుతోడ - - - - - - -

- - - - - - - స్థలుల నెసగు

తే॥ విమల మందాకినీజలవిశ్రుతంబు
స్వర్ణసాలసమంచితోచ్చ స్థలంబు
మౌక్తిక వితాన కల్పిత మహిత తలము
సురలకుంగాపురము స్వర్గపురవరంబు 8-170.

ఇటు నీవర్ణనము స్వభావోక్తి సుందరమై సహజ రామణీయకతతో నలరారినది.

దశమస్కంధమున రామకృష్ణులక్రూరునితో మథురానగరమున కేగిన సందర్భమున నా పురవరమీరీతి కన్నుల బండువై వెలుగొందినదట.

సీ॥ గోపురోన్నత - - - - - - -

- - - - - - - లాంఛనంబు

తే॥ కాంచనవికార - - - - - - -సందీపితంబు.

తే॥ దధియు బన్నీరమును సుచందనము వీధు
లందు నిచ్చలు చల్లు దురందునందు
బండ్లుపూవులు నమ్మ విపణులు మీఱ
నేపు మీఱెడు నామథురాపురంబు 10.పూ.భా. 3-177,178.

ద్వారకానగరము వచనమున "- - - - వాస్తుశాస్త్రోక్త విధాన వినిర్మితంబును రథ్యాచత్వర వీథీవిరాజితంబును సురద్రుమలతోద్యాన విచిత్రోప వనాన్వితంబును మహోన్నత హేమశృంగ విరాజితంబును స్ఫాటికాట్టాలక గోపురద్వార సమంచితంబును రాజతారకూట వినిర్మి

తాశ్వగజశాలా సముపేతంబును హేమకుంభాలంకృతంబును మహో
న్నత సౌధప్రాసాద భాసమానంబును చాతుర్వర్ణ జనాకీర్ణంబునై విరా
జిల్లుచుండె ....” అని వర్ణితమయినది. 10.ఉ.భా. 1-22.

## అర్ణవ వర్ణనము :-

సప్తమస్కంధమున హిరణ్యకశిపుని విజృంభణమునకు నోటు
వడి యింద్రాదిదేవతలు విష్ణుని ప్రార్థించుటకు వైకుంఠపురవరమునకు
పయనము సమకట్టి పాలకడలిచేరినపట్టున శ్రీ శాస్త్రిగారద్దాని నిటుల
వర్ణించిరి.

మ॥ కనిరావేల్పులనల్ప కౌతుకమునంగళ్యాణ రత్న ప్రభా
జనితాహ్లాదము సంభృతామృతరసస్వాదంబు చంద్రాదిపా
వన దాయాదమతి ప్రసాదమపనిర్వాదమ్ము సుశ్రీదమున్
వినిరూఢోన్న తనాదముద్ధృతమహావేదమ్ముక్షీరోదమున్ 9-106.

## శైల వర్ణనము :-

అష్టమస్కంధమున గజేంద్ర మోక్షణ కథాఘట్టమున త్రికూట
పర్వతము గంభీర సార్థక్యముగ మత్తేభ విక్రీడితమున ధీరతతో గోచ
రించునటులీ సొగసగు వర్ణనము.

మ॥ కలదద్రీంద్రము దుగ్ధవార్ధినడుమన్‌గన్గొత్రికూటాఖ్యకై
కలధౌతాయాస రౌప్యశృంగముల బ్రఖ్యాతంబునైరత్నధా
తులసత్ప్రస్తరమై మహా ద్రుమలతాస్తోమావృతంబై ఝరీ
జలపాతాంచితమై సుపర్వతరుణీసంసేవ్యమై భవ్యమై. 8-17.

అనియును,

సీ॥ “చిత్ర చిత్రోన్నత ధాత్రీ - - - - - -
- - - - - - - - పవనగతము

తే॥ దేవతా వార సంచార - - - - - - -
- - - - - - - - - - - - - కలితమప్పర్వతంబు. 8-21.

అనియు గంభీర పదప్రౌఢితో సమాసవిస్ఫురణతతో నా త్రికూటా ద్యుత్పన్నతత్త్వము దర్శనీయమగుట శాస్త్రిగారి ప్రతిభకు మకుటాయ మానమగుచున్నది.

ఋతువర్ణనము :-

"చైత్ర వైశాఖ మాసములు వసంతర్తువు. ఇది ఋతురాజమని కీర్తింపబడుట సహజమే. శృంగార రసరాజమునకునిది పటుతరాలంబ నము. అట్టి శృంగార రసోద్దీపకమగు నీ వసంతమును శ్రీశాస్త్రిగా రెంతో సరసముగ ప్రకృతిపరిశీలనానైపుణితో వర్ణించిరి. పంచమస్కం ధమున ఆగ్నీధ్రుని కథా సందర్భమున,

ఉ॥ కమ్మని మావి పూవులనుగాలువ గట్టెడు తేనెలానిజం
జుమ్మని తేంట్లు వాడె గడు సొంపలరారనిగుళ్ళుమేసికో
కొమ్మని గండు కోయిలలు గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మరమైన పండ్లుదిని మొత్తముగా వగబల్కెనత్తరిన్.5-45.

అని తియ్యవిల్తుని ఫౌజు సంరంభమచ్చ తెనుగున దేశనాళీ మాధుర్య మును సంతరించుకొన్నది.

ఈ సందర్భమున,

చ॥ మెలిగొని యొండొకండరయ మిక్కిలి చిక్కగనున్న మావితో
పులనలవోక మొత్తముగ బుల్గులు గూయగ బూవు దేనియల్
జరజలరాలి నేల పయి జాల్కొన నెమ్ములు సూచి కాఋమ
బ్బులురుముచుంగడుంగురియుబోయిపుడన్భ్రమనాడు
నత్తరిన్.5-47.

పక్షులుకూయగ పూదేనెలు జాలువారగనచటినెమళ్ళు కాఋ మబ్బులురుముచు వర్షించుననుభ్రమతో నర్తించినవట. ఇట్టి యూహా శాలితయే మహాకవుల ప్రతిభకు తార్కాణము. అందులకే అలంకారి కులు "ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభా మతా" యనివాక్రుచ్చుట జరిగినది.

అట్టి యామని సోయగమున కచ్చెరువు పడి స్వయముగ కవియే:

క॥ ఆమని బొదలెడు సోయగ
మేమని మెచ్చంగ వచ్చు నెంతటివారిన్
వేమరుని బారి కగ్గల
మైమెలగుచుగుతిలగుడువనల్లు విరాళిన్. 5-48.

అని యనుట సందర్భోచితమై యలరారుచున్నది.

## గ్రీష్మఋతువు :-

"జ్యేష్ఠ, అషాఢ మాసములు గ్రీష్మర్తువు. శ్రీ శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున దశమస్కంధ పూర్వభాగమున ద్వితీయాశ్వాసమునందు నీ ఋతువవర్ణనమునిట్లు చెప్పిరి,

సీ॥ దేహ ధారులతతి - - - - - - - - - వెలార్చు
తే॥ ఏళ్లమీది - - - - - - - స్థలములెల్ల. 10. పూ.భా..2-109.

ఆ భీష్మ గ్రీష్మమున బృందావనము దేవవందితులైన రామకృష్ణసోదరుల సంగతిచే వేడిమి తెలియబడక చలువలనీనుచు భవ్యవసంతము భాతి నొప్పినదట.

## వర్ష ఋతువర్ణనము :-

శ్రావణభాద్రపదమాసములు వర్షఋతువు. శ్రీకృష్ణభాగవతమున శ్రీపాదవారు దశమస్కంధమున నీ వర్ష వర్ణనము చదువరులు పర్షముతో తలలూచునట్లు శిల్పీకరించిరి. విరహులట్టిటు పడునట్లు ప్రావృట్కాలాగమనము కందమున క్రింది రీతిని యందముగ ననిందితముగ జూపిరి.

క॥ అంతట బ్రావృట్కాలము
సంతత గర్జార్భటీ ప్రసంగితసాంద్రా

నంతావృతమై సర్వది
శాంతరముల దోచె విరహులట్టిట్టుపడన్. 10.పూ.భా. 2-135.
ఈ సందర్భముననే యానందోత్సాహములతో కేకిలోకము షడ్జమున పాడుచు చేసిన నృత్యమెంత రసవత్తరముగ జ్ఞాపకమున సొంపు సంతరించుకొన్నదో చూచి చదివి యానందింపవలసినదే,

మ॥ జలదధ్వానము - - - - - - బాధుచున్.పూ.భా.2-136.

ఆ వర్షయందాకాశము మెరుములు, ఉరుములు, ధట్టమైననల్లని మేఘ పంక్తులతో గూడి సత్వరజస్తమో నిభృతమైన వరబ్రహ్మము వలె భాసించినదిట.

"మెఱుములురుములతో - - - - - యందు. 10.పూ.భా.2-139.
అట్లు తోచుటయే మహాకవుల లక్షణము. ఇది శ్రీ శాస్త్రివారి యప్రతిమాన ప్రతిభా వైభవమునకు శేముషీ ధిషణకు, కవి హంవీరతకును నికషోపలము.

## శరదృతు వర్ణనము:-

ఆశ్వయుజ కార్తీక మాసములు శరదృతువు. వర్షర్తువు గడచి శరత్తు తన యడుగుదమ్మి వెలయించినది. శ్రీకృష్ణభాగవతమున నిప్పట్టున వర్ణనమతి మనోజ్ఞముగ నర్తించినది. ఆహ్లాద నిర్మల చంద్రికా రుచులను వెలయించి హృదయ సిత కల్హారములను ఉత్ఫుల్లములొనర్చి విందు చేసినది.

క॥ శరదాగమమ్ము గురుతర
పరితోషాగమము హంస వారమ్ములకున్
స్మరదివ్యాగమ మొప్పెను
బరివర్ధిత సప్త వర్ణ భవ్యాగమమై. 10.పూ.భా. 2-158.

శరత్తు స్వభావోక్తి రమ్యమై యలరారి యిటుల కొనసాగి పూర్ణత్వము సిద్ధింప శోభించినది.

సీ॥ నదులెల్ల నిర్మలానందకందములయ్యె
నంచలకానందమతిశయిల్లె
నాకసంబు వినిర్మలాకారమునగాంచె
దీరి నక్షత్రముల్ దేజరిల్లె
బండు వెన్నెల కాచె నిండి రేల్ గన్నుల
పండువై కమలముల్ పరిఢవిల్లె
బొలములెల్లను సస్య కలితమ్ములై యొప్పె
గపప్రపనంటులుగడుదలిర్చె

తే॥ నలినగర్భ మరంద పాన ప్రమత్త
భృంగ సంగీతనాద మెసంగె దెసల
భూమి సతికిడ్డమేటి వింజామరములు
నాగ దగె తెల్లుపూల్ శరదాగమమున. 159.

ఇందలిసంప్రదాయరీతి సహజ సుందరమై చవులూరించుట వారి యామోద యోగ్యతకుపబలకము.

ఇక వారి స్వకీయముద్ర సరస భరితమై వరలి శ్లేషతో నలంక రించుట కలిగి క్రింది రీతిని కాంచనగును.

మ॥ తమ సర్వస్వము - - - - - - - - ప్రభావంబునన్. 164

ఇటు తటిద్వంతములనగా మేఘములు. ముక్త కల్మషులైన మౌనీంద్ర ములవలె నానందము గూర్చినవని యనగా స్వచ్ఛమైన ధవళ కాం తితో శోభిల్లినవని శ్లేషతోనుపమింపబడుట యతిరమణీయము.

## హేమంత ఋతువర్ణనము :-

మార్గశీర్ష పుష్యమాసములు హేమంతఋతువు. ఈషద్ధిమపాతము వలన చిఱుచలిగ నుండు కాలమిది.

శ్రీకృష్ణభాగవతమున గోకులకుమారీమణులు శ్రీకృష్ణుని పతిగ

పడయగోరి కాత్యాయనీవ్రత మాచరించిన తావున నీ హేమంతము కించి దుక్తమైనది;

శా॥ హేమంతంబునకాదిమాసమగుచున్ హేమించు మార్గంబు సు
శ్రీమంతంబుగ నందగోకుల కుమారీ రత్నముల్ భక్తిమై
నామాసంబున నన్ని నాళ్ళులును గాత్యాయన్యభిఖ్యాంబికా
ప్రేమాంచద్వ్రతముంబొనర్చిరి హవిస్స్వీకారముంజేయుచున్.

10.పూ.భా.2-186.

హేమంతర్తువునకు మొదటి నెలయైన మార్గంబనగా మార్గ శిరమున హవిస్స్వీకారము చేయుచు గోప కన్నియలు వెన్నునికైనన్నియమములతో నన్ని దినములు భక్తితో ముక్తిదునిరక్తికై వ్రతమొనర్చిరట. హైమవతినొక విశేషము గూఢముగ నున్నది. వ్రతమాసముమార్గశీర్షము. అతి పవిత్రము. అంతేకాక విష్ణు ప్రీతికరము. నిజమునకు విష్ణుస్వరూపమే. దానికి "మాసానాం మార్గ శీర్షోఽహమ్" అను గీతా వచనమే ప్రమాణము. కావున పైకి స్త్రీల వ్రతమైన యట్టిదనుసరించి నను విష్ణు ప్రతిరూపమైన కృష్ణ ప్రీతికరముగ నా మార్గ శీర్షమాస మంతయు సవినయమముగ భక్తియుక్తముగ నుపాసించుట. అదీ అసలు రహస్యము. పిదప నా వ్రతవిధానము, కృష్ణపరీక్షాదులు వర్ణితములు.

## చంద్రోదయ వర్ణనము:-

శరదాత్రి వేణుగానమొనర్చు శ్రీకృష్ణుని కడకు గోపికలు వచ్చు సందర్భమున శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున నిద్దాని నిట్లు తీర్చిరి.

చ॥ "ప్రియుడు ప్రియాముఖంబరుణవేల్లితమై తనరారనెంతయే
బ్రియమున జూచి సంతసము బెంచిన రీతిగ జందమామ పే
రయమున నేచిప్రాచి నుదయారుణదీప్తులగప్పె భూజనో
చ్ఛ్రయము సుఖంపడన్సలిపెసంతతదుఃఖముశాంతిపొందగన్.

ఇందు "చందమామ" అను ప్రయోగ మచ్చ తెనుగుతో నాత్మీయతను సంతరించుకొని యలరారుట మనోహరము. మఱియు శరద్రాత్రి వర్ణనమిట్లు శ్రీకృష్ణుని వేనునాదముతో రాత్రులలో నాయకమణియై వెలుగుల జిమ్మినది.

చ॥ సిరి దొరసాని - - - - - - - - - బాడె గలస్వనంబునన్.

10.పూ.భా.2-330,331

ఇందు శౌరి వామదృఙ్మనోహరముగ కలస్వనముతో బ్రియమారగ బాడెనట వామదృఙ్మనోహరముగననుచో నయనానందకరముగ గానుపించి యనిప్రస్తుతార్థము. వామశబ్దమునకు అందమైన యనియే కాక ఎడమవైపునను నర్థాంతరమునున్నది. ఇటు పూర్ణచంద్రుడు; విష్ణువునకు వలకన్ను సూర్యుడనియు, డాపలికన్ను చంద్రుడనియును. కావున నిట "వామదృక్" అనుచో విష్ణుస్వరూపమైన శ్రీకృష్ణునియెడమ కన్ను అయిన చంద్రుడనియప్రకృత శ్లేషధ్వని ద్యోతమానము.

## అరుణోదయ వర్ణనము:-

శ్రీకృష్ణుడు భార్యలతో సుఖముండు పట్టున నొకనాటి నిశావసాన సమయమునిటుల శాస్త్రిగారు దశమస్కంధమున సరసముగ మలిచిరి.

క॥ తొలినల్లింకలు నలువం
కల బొంకముఱంకెలిడగ గలితరుతమునం
దెల వారుననుచు గోళ్ళిత
రుల యిండ్లంగూసె గొక్కురోకో యనుచున్.

ఇక తెల్లవారును సుమా యనునట్లు కుక్కుటములు "కొక్కొరోకో" యని కూసినవట. ఆ ప్రయోగము సహజసుందరము. అంతేకాక శ్రీకృష్ణపత్నులు కుక్కుట శబ్దధ్వనులు కర్ణధ్వయుని సూది పోట్లువలె వ్యథింపగా నిట్లు విసుగుగొనిరట.

ఆ॥ కోళ్ళకేమివచ్చె గొండ పక్కంబండి
నిద్రపోవు నరుని నిగిడి లేపి
మనకు విరహ తాప మొనరించెడిన్ వీని
మొఱటు కూత మూడు ముక్కలుగను. 10.ఉ.భా.2 170.172.

అవ్వాని కూత మొఱటుగనుండినదిట. పైగా నది "మూడు ముక్కలవ్వ" యని అసలు సిసలు జాతీయ ప్రయోగము చేసి వారిని తెనుగుభామినులనుజేసిరి శాస్త్రిగారు. ఎందుకట ఆకోపము? కోపము కాకమఱి ఎక్కడో కొండపక్కన పండుకొని నిండుగ(గురకతోకూడ నేమో) నిద్రపోవు నరుని నిగిడి లేపుచున్నవటయాకోళ్ళు. ఈ వర్ణనము మిగుల చక్కనై యాంధ్ర మాధుర్యమును నింపుకొన్నది.

## వన వర్ణనము :-

పురంజనుడను రాజొకచో నవద్వార పురమును తత్సమీప మున గలయొక యుద్యానవనము విహారావసరమై యుండుట కాంచి నప్పుడు తద్వన వర్ణనము నిట్లు శాస్త్రిగారు రూపు కట్టించిరి.

ఉ॥ ఆపురి బాహ్యదేశమున యందు విహారవనంబొకండగున్
శ్రీ పరిపూర్ణమై సకల శేవధలుంగలదై పికానులా
పాపరితోషదంబగుచునాత్రిదివంబున నుండు నందనం
బేపరిపాటిదానికని యెల్లరు మెచ్చెదరెల్ల వేళలన్.

చ॥ "చిలుకలు వల్కు - - - - - - - సంచరింపగన్." 4-319.320.

కాళిదాసాది మహాకవులరీతిని పులహమున్యాశ్రమ ప్రాంత వన వర్ణనము మిగుల శాంత భావముతో పరస్పరవైరి మృగములు వైరము మాని యెంతోనాత్మీయతతో సంచరించినవనుటకూడ కాన నగును.

చ॥ కులుకున నేగ్ను - - - - - - - - - - - బ్రహ్మకున్. 5-103

అచటి మృగములన్నియునొకేగొంతుతో ననగ కలిసి మెలసి

మైక మత్కముతో సహజ జన్మ సిద్ధ వైరము సైతము నామహర్షుల తపశ్శక్తిచే మాని యున్నవట. అట్టి యా వనవైభవమును కొని యాడుట బ్రహ్మ తరమైనకాదుట.

## సలిల క్రీడ :-

దశమస్కంధమున గోపికలు తమ సర్వస్వము శ్రీకృష్ణున కర్పించికృష్ణునితో జలకేళి చేయు సందర్భముగలదు. శ్రీకృష్ణ భాగ వతమున శ్రీ శాస్త్రిగారును సరస వచో గుంఫితముగ జల క్రీడాభి వర్ణనము చేసిరి.

సీ॥ అతివలెల్లరు జల్లులాటలాడుచు జల
కేళిసల్పిరి తమి గ్రేళ్ళువాఱ
నపుడుకాలవలాహకాంబుపాతంబున
మదకలంబట్లొప్పె మాధవుండు
మునిగి తేలెడు నాటులలలలో సహకృష్ణు
లగు కృష్ణవేణులు తగ బొనర్చి
రొకతె తమ్మికి దన మొకము నీడగునని
దానితో జతనిల్పెదనదుమోము

తే॥ మఱియొకర్తుక నీటిలో మసలు చొక్క
మేటి కల్హారమునుగని మీదజేయి
వేయ జుమ్మని తుమ్మెద వెడల బీతు
గుడిచి కృష్ణునికైదండ గోరి పఱచె.

శ్రీకృష్ణుడును దండియై వారితో చేయి కలిపిన విధమునతిరమణీయము.

ఉ॥ ఒక్కొక ------- దండియై. 10.పూ.భా.2-435,437.

## మధుపానము:-

బలరాముడు తరుణీ పరివృతుడై యొకపరి రైవతకాద్రికి విహా రార్థము చనెను. అచటి కోలాహలము విని "ద్వివిదుడ" ను వాన

రుడు గిరిదరి జేరి యచట"వారుణీరసాస్వాదనరతుడై"న బలరాముని కాంచుట యిట్లు ఉటంకించబడినది.

వ॥" ఇట్లనేక విధంబుల దేశంబులకలజడి గలిగించుచు నొక్కనాడు సలలితంబగు గీతంబు విని రైవతకంబునకు జని యచ్చట బుష్కర మాలాధరుండును లలనా మధ్యగతుండును మహోన్నత గానంబు గావించువాడు." 10.ఉ.భా.2-125 అని వర్ణింపబడినది.

## రతోత్సవము :-

గోపికా శ్రీకృష్ణుల రాసక్రీడల పట్టున భాగవత దశమస్కంధ మున నిట్టి వర్ణనముగలదు.

సీ॥ తనమీద వైచిన వనజనాభుని చేయి
ముద్దుగొనియె వలపున నొకర్తు

తే॥ జెమట చిత్తడి నంటుట గొమరు మిగులు
నెటికురులతోడ మోములు గరిమ మీఱ
రవల యొడ్డాణములు మ్రోయరమణులట్లు
రమణునింగూడి సలిపిరె రాసకేళి. 10.పూ.భా. 2-432.

ఆ సందర్భమున వారి స్థితిని గోపికలు ముందు కృష్ణునిపై దగిలిన కోపము వీడి యోరిమితో వానిని మన్నించుటయిట్లు వర్ణింపబడినది.

సీ॥ ఈలీల హరి - - - - - - - - - - - క్రీడ సలిపె

తే॥ అప్పుడలిసిన - - - - మన్నించి రోరిమిమెయి. 433.

## విప్రలంభ వర్ణనము :-

స్త్రీ పురుషుల వియోగమును విప్రలంభమందురు. ఇయ్యది రసపోషణ సందర్భమున శృంగార రసవివరణమున విపులముగజూప బడినది. అదియును సందార్భానుసారముగ మచ్చునకు,

పురూరవశ్చరితమున నియమభంగముచే నూర్వశిగమింప నా పురూరవుడు విప్రలంభమున దల్లడిల్లి యొకచో నామెను చూచి పలుకు పట్టున నాతని విప్రలంభ తీవ్రత పతాకస్థాయినందినది.

తే॥ నన్ను గరుణింపకుంటివే - - - - - కంటితోడ నిపుడ. '9-279.

గోపికల విప్రలంభము భ్రమరగీతలందును, ఉద్ధవునితో తమ పరితాపమును జెప్పుకొను తావునను కనుపించును.

ఉ॥ ఆ లలితావలోకనము లామృదుమాధురిమోక్తియుక్తులా
బాల విలాస హాసముల భావము లాగమనోత్సవంబులా
యాలఘులాలన ప్రతిభలాచిఱునవ్వులపువ్వులాకళా
లీలలు మామదిందగిలె లేమల మేమెటు కృష్ణువీడుటల్.

10.పూ. భా. 3-371.

## వివాహ వర్ణనము:-

శ్రీకృష్ణుడు వివిధ రాజన్యులను నిర్జించి రుక్మిణిని తెచ్చి పాణి గ్రహణము చేయుటలో నాణెముగ శ్రీ శాస్త్రిగారు వర్ణనము చేసిరి.

మ॥ వసుదేవాత్మజుడట్లు భూమిపతులన్ భంజించి వైదర్భితో
వెసద్వారావతి కేగి యోగ మెసగన్ స్వీయుల్ నిజభ్రాతలున్
వసుధాధీశులు మంత్రులుంబ్రజలుమేల్గాగన్విధిప్రోక్తమున్
పొసగం బెండిలియాడె దిగ్జగద్భాసామణిన్ రుక్మిణిన్.

10. ఉ. భా. 1-161.

సీ॥ అపుడు ద్వారకయందు - - - - శౌరిగూడి. 162.

## కుమారోదయ వర్ణనము:-

విశ్వాత్మకుడైన విష్ణుదేవుడు విశ్వమున ధర్మ సంస్థాపనార్థము దేవకీ వసుదేవులకు పుత్రుడుగ జన్మించినపట్టున శుభకర వాతావరణమును శ్రీ శాస్త్రిగారు తమ శ్రీకృష్ణభాగవతమున ననన్య సాదృశ్య ప్రతిభా విశేష పురస్సరముగకన్నాకగునట్లు రూపుదిద్దిరి.

సీ॥ అవలగుణోపేత మతి శోభనంబయ్యె
గాలముగ్రహతారకములు పొదల

చ॥ "మునులును - - - - - - - - మిఱగన్. 10 పూ. భా 1-68,69.

ఆ శ్రీకృష్ణ పరమాత్ముడు జనించిన సమయమున ప్రకృతియంతయు నాహ్లాదకరమై ప్రశాంతరీతి వర్తించినది. అప్పుడు మునులు, దేవతలు మోద మానసులై విరివాన కురియగ జలముచములు హర్షాతిరేకమున నురుమగ నా దేవకీదేవికి నిశా సమయమున ప్రాచీ దిశను రాకా చంద్రముడు పరిపూర్ణుడై తేజరిలిన విధముగ నా జగదేకమోహను డైన జగజెట్టి ప్రభవించెనట.

## మంత్రము :-

రహస్య సమాలోచనము మంత్రము అనబడును. ఒకనాడు శ్రీ కృష్ణుడు కొలువుదీరి యున్న యెడ నొకదూత యేతెంచి మాగధు డైన జరాసంధుని దౌష్ట్యమును విన్నవించి వానికడ బంధిత రాజ న్యులు తమను రక్షింపుమని వేడుచున్నారని విన్నవించును. అంతలో పిశంగ జటామండల మండితుడగు నారదుడు సహస్రాంశుడు నా తేజరిల్లుచు నేతెంచి ధర్మజుడు రాజసూయ నిర్వహణ యత్నమున కలడనియు దాని నెరవేర్పుమనుచు వారలకు మాగధుని విజయంబు దెసకొంత భయముగలదనియు సరియైన సందర్భమున వచ్చి పలు కను. అపుడు శ్రీకృష్ణుడు వారలయనుమతితో తన యాంతరంగిక సుహృత్తులలో ముఖ్యుడైన యుద్ధవుని జూచి "మంత్రాలోచనము" నిట్లు చేయును.

తే॥ "అనుడు శ్రీకృష్ణుడటుహరియనుమతిమెయి
నుద్ధవుని గాంచి యిట్లనునోయి నీవు
నా సుహృతులలో జాలవాసిగొంటి
ధర్మమంత్రార్థ తత్త్వవేత్తవును దలప." 10.ఉ.భా.2-185.

ఇందు శ్రీకృష్ణుడుద్ధవుని "ధర్మమంత్రార్థ తత్త్వవేత్తవు" కూడనని పలుకుట గమనింపగదినది.

క॥ నారద వాక్యము వింటివి

శూరులు పాండవుల రాజసూయ విధంబున్
సారమతి దెలిసి కొంటివి
ధీరాగ్రణి। మనకు నడుపు తెఱువెట్టిదియో।"
"విచారించి విచికిత్స విడచి చెప్పు" మనిన నుద్ధవుండిట్లనియె.
మునివరు - - - - - - - - - యబ్జనాభ.
వాడు నాగా - - - - - - - నూఱులున్న గాని" 186 నుండి188,
) పలుకుటలో నుద్ధవుని 'కార్యసాధక సమాలోచన ప్రత్యుత్తరము'
కృష్ణునికతనియందుగల నమ్మకమును రమ్యముగ నున్నవి. అం
ను కాక,

"ఆ జరాసంధుడు బ్రాహ్మణ భక్తియుక్తుండు. బ్రాహ్మణుండు
రిన యేని కాదనండు వృకోదరుండు బ్రహ్మ వేషధరుండై పోయి
రికొని ద్వైరథంబున వాని సంహరింపనొప్పు"

"మాగధునిజంపి చెఱబడ్డ మనుజ విభుల
విడచిపుచ్చిన నీకు నీవుడమియందు
గంసునిం జంపి జనకులగారనుండి
వెడలుచుటకన్న మిన్నయై పేరు వచ్చు" 189,190.

) మాటలలో నాతని యుపాయశాలిత్వము, ధర్మకార్య నిర్వహణ
ందు ప్రోత్సాహకత్వమును గోచరించును. అందులకే శ్రీకృష్ణు
తటివాడు వానిని తన యాప్తునిగ నెంచుటయు, సభ యందెంతటి
రలున్నను ప్రత్యేకించి 'సలహా' నడుగటయును,

ఇందు శ్రీ శాస్త్రిగారి రాజనీతిజ్ఞత పరిపుష్టముగ గోచరించుచు
దనుట నిజము.

'ృతము :-

శుక మహర్షి పరీక్షిన్మహీపాలునకు కురుపాండవ వైరాదికము
్నపుడీ సందర్భమించుక కలదు.

మ॥ ఘనులా పాండవధార్త రాష్ట్రులకు లోకవ్యాప్త భేదంబురా
ధనలోభంబున రాజ్యకాంక్షమెయి జూదంబయ్యె నద్దానిచే
వనవాసంబు ఘటిల్లె బాండవులకాపై వారి కాలంబువ
చ్చె నుదత్సర్వము బ్రస్తుతింప బడియెన్ శ్రీభారతాఖ్యానమై. 3-3.

ఇందు ధనలోభమున రాజ్య కాంక్షా కారణముగ జూదంబయ్యెనని చెప్పబడినది.

మఱియును ప్రద్యుమ్నుని వివాహ ఘట్టమున రుక్మి బలరాములక్ష క్రీడ చేసినట్లు వర్ణితము.

మ॥ అనభిజ్ఞుండగు రాముడక్షములొగిన్ ----చెయ్యుంబాసినట్టిం
డయ్యె, "10.ఉ.భా.1-388.

మఱియు "సభలో బాచికలాడుచు నభయుండగుశౌరి 10.ఉభా.2-119.
అని మఱియొక చోటను చెప్పబడినది.

## ప్రయాణ వర్ణనము :-

బ్రహ్మవరప్రసాదితానంతబలగర్వయుతుడై హిరణ్య కశిపుడు దిగ్విజయ కాంక్షతో గండు మిగిలి ప్రయాణమై యాయాలోకముల తిరుగుచు నా ప్రభువర్యుల జయించుటలో నాతని దుర్వివదగ్ధత యిట్లు వర్ణింపబడినది.

సీ॥ "ఇంద్రలోకము జేరి యింద్రుని నోడించి
యగ్ని లోకము జని యగ్ని గెలచి" 7-99.

బలి చక్రవర్తి సర్వబల కలితుడై మఘవునినిలువరింప జననేగు పట్టు నరయదగినది

మ॥ "బలిదైత్యేంద్రుడు బావకాదులిడు -----గెల్వగన్."8-168.

ఇటునింద్రుని గెల్వ ప్రయాణసన్నద్ధుడైన బలి బల వైభవాతిశయము దర్శనీయము.

## యుద్ధ వర్ణనము :-

శ్రీకృష్ణభాగవతమునననేక పట్టులందు సందర్భాను సారముగ మిగుల సమర్థవంతముగ నీ యుద్ధవర్ణన చేయబడినది. అట్లు వర్ణించుటలో శ్రీ శాస్త్రిగారి నేర్పరితనము ప్రశంసాపాత్రము.

శ్రీ శాస్త్రిగారు అర్జునాశ్వత్థామల తీవ్ర యుద్ధఫలితము నెంత సుస్పష్టముగ ప్రదర్శించిరో.

మహా। ధరగంపించెంబయోధుల్తరలికలగెభూధ్రంబులుఃఘూతలూగెన్
సురమార్గంబందుమంటల్సొరిదిగ గవిసెన్సూర్యతేజంబుమాసెన్
గురిసెం బాషాణధారల్ కొఁఅవులు పడియెంగూలె నిర్ఘాతపఙ్క్తుల్
గురుశబ్దంబుప్పతిల్లెంగుతలమున బ్రజాకోటికిన్భీతియయ్యెన్.
1-220.

ఇందాయిరువురి యస్త్ర సంఘర్షణ ఫలితము సరళావగాహనముగావింపబడినది.

దేవగురువిందుప్రని పరిత్యజించి పోవనదనెఱింగి దానవులమరావతిపై దండెత్తిన సందర్భము.

మ॥ కరవాలంబులు - - - - - - పారగన్. 6-150.

ఇందలి శస్త్ర పట్టిక గమనింపదగినది.

ఇంద్రవృత్రుల ఘోరమగు సంగరమున ముసలముద్గరగదాసి తోమరభిందివాల పరశుపట్టసాసి నానావిధాయుధోరుహస్తులై సేనలు దలపడినట్లువర్ణితము. రక్కసులుకు మిగిలిపెక్కు విధములబోరినచక్కి

సీ॥ ప్రేంఖన్మహాస్త్రముల్ - - - - గ్రూర శస్త్ర

తే। సంచయంబున - - - - వీరుల పయి. 6-220.

అమృతోత్పాదనానంతరము దేవదానవ యుద్ధమువిటుల చూపబడినది.

శా॥ దైత్యుల్ - - - - - - - - లోపించుడున్. 8-134.

ఆ భీకర రంగమిట్టులున్నదట.

ఉ॥ అత్తఱి - - - - - - - లోపించుచుడున్. 8-144.

ఈరీతి శంబరాసుర భంజనమునందు, బాణగర్వాపహరణమునందు కంసాదిరాక్షసశిక్షణమునందునుబహుగంభీరముగ నీవర్ణనము సాగినది.

## నాయకాభ్యుదయము :-

నాయకుని విజయము, ప్రతిజ్ఞాపాలనము, ఇష్టార్థలబ్ధి మొదలగునవి వర్ణించుట నాయకాభ్యుదయము.

అర్జునుడు పుత్రఘాతి యగు గురుసుతునిపై క్రోధమూని యొనరించిన ప్రతిన నెరవేర్చి విజయుడగుట మొదలగువానియందిది ద్యోతకమగును.

అశరీరవాణి పలుకులాలించి భీతిచే కంసుడు చెలియలినివధింప బూన వసుదేవుడు వారించి "ఈమె సంతువలన గాని యీమె వలన నీకపాయము గాదు గదా! పుట్టినవారిని పుట్టినట్లు నీకొప్పగించెద నీమెను విడువు మని ప్రతిన బూనుట.

ఉ॥ శ్యాలక। నీకునింగినుడి సత్యమయైన భయంబుగల్గుటల్
పోలగ జూడనీగరిత మూలముగాదు భవిష్యకాలమం
దీలలనా శిరోమణికి నేర్పడు సంతతి మూల మౌటనే
పోలిచి నీ కొసంగెదను బుట్టినవారిని బుట్టినట్లుగన్.
10.పూ.భా. 1-31.

పిదప సుతోదయానంతర మా వసుదేవుడు సూనృత పరాయణుడై సుతుని తీసికొని వచ్చి కంసునకిచ్చి యిట్లు ప్రతినను నిలువ బెట్టి కొనెను,

క॥ "అనకదుందుభి - - - - ననుచున్.

ఆతని సత్యసంధతకు హర్షముతో నుపబలకముగ,

తేగీ॥ సాధులకు - - - - - సుతుని. 34,35.

అను ప్రమాణము చూపబడినది. అట్టి యాతని మనోధైర్యమునకు,

ప్రతిజ్ఞాపాలనా నిర్వహణమునకు రక్కసుడైన కంసుడును మెచ్చెను.

ఇది వసుదేవునకెంతయో కీర్తిదాయకమై, యాపాత్రౌచిత్య వంతమై యున్నది.

గోవత్సాదులను హరించిన బ్రహ్మ కృష్ణమాయలోజిక్కువడి చీకాకు నొంది తబ్బిబ్బయి తెలివినంది వచ్చి నాలుగు మకుటంబులు హరి పాదములను దాక మ్రొక్కి స్తుతించుట.

శా॥ "నీ సామర్థ్య - - - - - - - - - జేయవే. 371.

తనదోసమును సైపుమని విరించి వేడుటలా బాలకృష్ణుని విష్ణుమాయ కోడుట వలననే కదా, అది కృష్ణ విజయమే. కృష్ణాధిక్య మిటుల జెప్పబడినది. అట్లే గోవర్ధనగిరి కేలబూను పట్టున నిందుృని, బాణా సురుని యడచిన పట్టున బరమశివుని మించుట శ్రీకృష్ణునివిజయము నకు పరాకాష్ఠ; హిరణ్యగర్భ, పరమ శివులనే మించిన యాయనకీ తీరు లేపాటి? మిగిలిన విజయములును ఆయనకుత్కర్షాపాదకము లే.

## పురుష సౌందర్య వర్ణనము :-

దేవతలు హిరణ్యకశిపునకు నోడి వైకుంఠమునకేగి విష్ణువును ప్రార్థింపనా శేషశాయి కానవచ్చిన యద్భుత రూప వర్ణనము,

సీ॥ నీలంపు ఝాలడాల్ డీలింప జాలుమై
హొంబట్టు రెంటెంబుడంబు మీర" 7-118.

శ్రీ భూ నీళలతో కూడి యలరారు విష్ణుని వర్ణన యిందు సొగసుగ సహజ శోభతో నలరారినది.

మునిసతులన్నంబుదెచ్చి నివేదింప జూచినబాలకృష్ణునిగాంచిన పట్టున గల వర్ణనము.

సీ॥ తొలుకారు మబ్బునా - - - - - మెలగువాని
తే॥ గర్ణముల - - - - - - - - పడతులెల్ల. 10.పూ.భా. 2-232.

ఇందు బాలకృష్ణుని మనోహరరూపము స్వభావోక్తిలో భాసించుట ఎన్నదగినది.

మాయావతి మత్స్యగర్భమున నున్న చిఱుత ప్రద్యుమ్నుని చూచిన తావున వాని చారుత్వము,

సీ॥ పాలబుగ్గల వాడు - - - - - - మురువుకాడు

తే॥ కాలుసేతులుగదలించి లీలనాడు
వాడు గాలిబొట్టనవే్రలు వట్టి చేత
నోట విడికొని చుంబించు నీటుకాడు
జెలగె జిన్నారి పొన్నారి చిఱుతవాడు. 10.ఉ.భా. 1-192.

అనుచు చిన్నారిపొన్నారి మాటలతో వన్నెయు వాసియు కలుగునట్లు వర్ణితమయినది.

బాణుడు కావలి వారిచే నుషానిరుద్ధుల సంగతికర్ణాకర్ణిగావిని దండతాడితభుజగంబు పగిది రోజుచు కన్యాంతఃపురము చేర నిజ కన్యకా నుముఖాంచలమున భువనైక సుందరమూర్తి యనిరుద్ధుడిట్లు తోచెనట.

సీ॥ భువనైక సుందర మూర్తి - - - - - - - - వేషు

తే॥ గుంకుమాంకిత - - - - ముఖాంచలమున. 10.ఉ.భా. 2-28.

మార్కండేయ మహర్షి విష్ణుమాయబడి ప్రళయ కాలానంత సాగరమున మునిగి దేలుచు పదివేల సంవత్సరములు గడువ నొక మిట్ట భూమిని, దానిపై నొకవటవృక్షమును దానిపై నీశాన్య భాగ శాఖాపత్రముపై శయనించియున్న ఒక చిన్ని పాపడను కాంచెను. ఆ బాల వట పత్రశాయి యిట్లు చిఱునగవుతో నుండెనట,

సీ॥ మరకతముట్లు శ్యామల వర్ణమగు మేను
తామర పూవునా దనరు మోము" 12-129.

నిజమునకీపద్యమే చిన్నిపాపనివలె రూపు సంతరించుకొని చిఱుత నగవులు చిందించుచున్నట్లు తోచును. ఇది శాస్త్రిగారి అపూర్వ ప్రతిభ.

## కన్యాంగ సౌందర్య వర్ణనము:-

పురంజనుడు నానాదేశములు సంచరించుచు నొక యుద్యాన వనమున నొక తరుణి నరసెను. అప్పట్టున శాస్త్రవారిట్లు వర్ణించిరి.

తే॥ అద్దములబోలు చెక్కిళ్ళు నాకసంబు
బోలు లేగౌను సంపంగి మొగ్గ బోలు
ముక్కు నెలబోలు మోము శ్రీబోలు చెవులు
గలువలంబోలు కన్నులు గలిగియుండె. 4-321.

ఆగ్నీధ్రుడు పూర్వచిత్తినిచూచి ఆమె సౌందర్యమున కమందానందకందళితహృదయారవిందుడై యామెసొగసుదనమున కిట్లు నుత్ప్రేక్ష సేసినాడు.

తే॥ జాళువాపైడి పొడియు జేజేల బువ్వ
బదనుగాగల్పిదాన నిప్పడతి జేసి
నలువ మెఱుగున మెఱుగిడెనలరనట్లు
కావయేనిట్టి సొగసెట్లు కలుగు సహహా. 5-57.

మేలిమి బంగారు పొడిని చంద్రుని మంచి పాళ్ళతోకలిపి ఆమెను సృష్టించి విరించి మెరుగు పెట్టి యుండును. లేనిచో నీ సొగసెట్లు కలుగును? అని యాగ్నీధ్రుని భావన. దీనినిబట్టి యామె సౌందర్య మూహించనగును.

మహా విష్ణువు మోహినీ రూపమున దర్శనీయమైన రూపమీ దారి రాజిల్లినది.

మ॥ "తళుకుంబంగరుడాలు డీల్పడుగతిం దైవారు నెమ్మేనును
న్నెలనాముద్దులు మూటగట్టి మిగులన్వొల్గొందునెమ్మోమును
న్గులుకుంగుబ్బలు వాలుగన్నులును విన్నంబోలు లేగౌనునుం
గలనారీమణియైరమాధవుడటన్ గన్పట్టెనప్పట్టునన్. 8-129.

కంసుని పంపున పూతన యనురాకాసి వ్రేపల్లె చేరి విహరింగనా

రూపముదాల్చినది. ఆ సందర్భమున శాస్త్రివారిట్లు నొడివిరి.

ఉ॥ చందురు నిగ్గలీనుచుబసందగు నిద్దపు చీఱచెంగులం
దందు బరి భ్రమింప మణిహారసమంచిత కంఠభాగయై
సుందర కర్ణభూషణ విశుద్ధ తరచ్యుతి దీప్తకుండలా
నంద కరాస్య పద్మనయన భ్రమరద్వయభాసమానయై.

10.పూ.భా.1-147.

వికారయైన యారాక్షసి కామరూపమున మనోహరాకారయై భాసించిన రూపమిది. బృహన్నితంబము పేర్మింనిజిక్కి యొక్కంతయై నామ మాత్రావశేషముగ కానరాని కౌను కల్గి యీ పైరూపమున సాక్షాత్కరించును.

శ్రీకృష్ణుని అనుగ్రహముచే కుబ్జ మనోహరాంగియై యిట్లుల రారినది.

ఉ॥ "చారు పయోధరంబులును- - - - - -గుబ్జనతోత్తమాంగియై.

10.పూ.భా.3-203.

అర్జునుడుకాంచిన సుభద్ర సత్వ భద్రియై యద్రిపై యిట్లుల రారినది.

మ॥ జనమెల్లన్ గిరిపూజ - - - - - బొద్దుండటున్. 10 ఉభా.3-108.

## దౌహృదము :-

అంతర్వత్నులైన స్త్రీలకు కలుగు కార్శ్యాదులు దౌహృదము లనబడును.

హిరణ్యకశిపుని దేవేరియైన 'లీలావతి' గుర్విణియై ప్రహ్లాదుని గర్భమందుధరించియున్న యపుడా లక్షణములు చిన్ని కందమున పొందు పఱచిరి.

క॥ "నెలదప్పె గోర్కులొప్పెను
బలుకులు నడకలును జాల బడలిక జెప్పెన్.

---

బలు వేవిళ్ళొగి గప్పెను
వెలవెలనై మోము కళల విప్పుంగుప్పెన్.

క॥ "అలరెడు తేజము - - - - - - - బరికింపన్. 7-131,132.

నెలతప్పుట, వెంటనే కోర్కెలు ప్రబలుట, మాటలు, నడకలు మంద గించుట, వేవిళ్లు కలుగుట, తెల్లబారుట, మోము కాంతివంతమగుట మొదలగు సాధారణ మార్పులు సహజము.

తేజోవంతమైన సూనుడు గర్భమందు వృద్ధిచెందుకతన నామె యొడలి కాంతి మిగుల తేజరిల్ల నామె యలరారినట్లు సహజ సుందర ముగ శాస్త్రిగారు వక్కాణించిరి.

**ఆఖేటకము :-**

ఆఖేటకమనగ వేట. పరీక్షిత్తు విధివశమున నొకనాడు వేట కేగును. "- - - - - -ఒక్కనాడు మృగయా విహారార్థమడవికింజని నానావిధమృగవిహంగమవధంబాచరించుచు భగవంతుడగు రుద్రుండు యజ్ఞమృగము వెన్నంటి పోవు చందమున దనచే వ్రేటుపడిన యొక్క మహా మృగంబు వెంటనంటి - - - - -" 1-373.

అట్లు పరిశ్రమించి పిపాసార్తుడై నీరము కొరుకక వ్యథచే వేటను నిరసించుచు "అకట వ్యసనంబు లన్నియు నొకటి గాదె" 1-374.అని అది యొక వ్యసనమని నుడువును.

ఈ విధముగ నీషత్ప్రస్తావన మృగయా వినోదమును గూర్చి యున్నది.

## మఱికొన్ని వర్ణనలు

**యజ్ఞము :-**

దక్షోపాఖ్యానము, పృథు చరిత్ర, చ్యవన చరితము, హరిశ్చం ద్రకథ, మొదలగు వానియందాయా వారు చేసిన యజ్ఞములే కాక

నందాదులింద్ర యాగముమాని పర్వత యాగమొనర్చుట, కంసుని ధనుర్యాగము, ధర్మజుని రాజసూయము, వసుదేవునిస్యమంతక పంచక యజ్ఞము మొదలగునవి చెప్పబడినవి.

హరిశ్చంద్రుడు వరుణునికిచ్చిన మాట ప్రకారము "నరమేధ యజ్ఞ మొనర్ప శునశ్శేపుని పశువుగా చేసి నిర్ణయించును.

వ॥ హరిశ్చంద్రనరేంద్రుండమందానందమకరందనిష్యందమాన
హృదయారవిందుండై - - - - - - - నిర్వర్తించు
చుండం - - - -" 9-197.

ఇందు శ్రీ శాస్త్రివర్యుల వేదశాస్త్రపాండిత్యము స్పష్టముగ గోచరించును. శాస్త్రిగారు చిన్ననాటనే తమ పితృపాదుల యజ్ఞమునకాధ్వర్యవము నిర్వహించివారు. అంతటి వారలు కనుకనే యిట్లు యజ్ఞ సంభారమును సశాస్త్రముగ నొడువగల్గిరి.

మఱియును ధర్మజు రాజసూయ నిర్వహణము నిట్లుస్పష్టీకరించిరి.

తే॥ స్వర్ణలాంగూలములదున్ని వసుధ దేవ
యజనమొనరించి మొదలడి రధ్వరంబు

తే॥ అపుడు వరుణున కుంబోలెనుపకరణము
లన్నియును స్వర్ణమున నయ్యె యాజకుల శు
భోపహూతుల దేవతలేలి వచ్చి
యజ్ఞభుజులైరి రాజసూయాధ్వరమున.

"అట్టి మహారాజసూయాధ్వరంబున - - - - - ఉపక్రమింపబడియె.
10.ఉ.భా.2-232 నుండి 234.

ఈవిధముగ ప్రాగ్వంశమున వహ్నిని వేల్చియుత్తర వేద్యగ్ని నొప్పునట్లుజేసి వరుణేంద్ర సోమాది సురలకాహుతులిచ్చి యధ్వరము నిర్వహింపబడినది. అందు సుత్యాహస్సు వచ్చినప్పుడు కురుపితామహుడు ధర్మరాజుతో ఋత్విజుడు, నృపుడు, గురుడు, సంయుజుడు,

స్నాతకుడు, ప్రియుడునను నార్యులలోనొకసంవత్సరకాలము వ్రత నిష్ఠులైయున్న వారికర్ఘ్యమీ దగుననియు నిట్టిసభలో నట్టి పురుషుని పూజింపుమనియు పలుకును. అపుడు సహదేవుడు శ్రీకృష్ణుని సమర్థించును. ధర్మజుడట్లు చేయును. అద్దానినధిక్షేపించి శిశుపాలుడు తత్ఫలితమునొందటతో యజ్ఞము పరిసమాప్తమగును.

ఈ యజ్ఞవిధానమంతయు శాస్త్రివర్యుల శాస్త్ర నిష్ణాతృత్వమును అనుభవమును నుగ్గడించుచున్నది.

## ఋషి వర్ణనము:-

కృష్ణద్వైపాయన మహర్షి యష్టాదశ పురాణ నిర్మాణానంతరము మనోగతవ్యథ తీరనివాడై సంతపించుచుండగ వాని కడకు నారదమహర్షి వచ్చును. అప్పట్టున శాస్త్రిగారు నారదుని యిట్లురూపు కట్టించిరి.

సీ॥ వేదోపనిషదర్థవేత్త పురాణేతి
హాస కల్పన్యాయభాసురమతి
ధర్మతత్త్వజ్ఞుండు ధర్మార్థ కామ మో
క్ష వినిశ్చయ జ్ఞాన కలిత చిత్తు
డంగషట్క విధిజ్ఞుడైక్య సంయోగనా
నాత్వాది సమవాయనయవిదుండు
పంచావయవయుక్త వాక్యదోష గుణజ్ఞు
డుత్తరోత్తర వక్త సత్తపస్వి

తే॥ కవి ప్రగల్భుడు మేధావి భువనదర్శి
సర్వశాస్త్రప్రవీణుడు సంధి విగ్ర
హాది షాడ్గుణ్య తత్త్వజ్ఞుడనఘ మూర్తి
నారదుండఖిల కళా విశారదుండు. 1-162.

ఇందలి నారదుని విశేషణములన్నియు నహజ సుందరములై యలరారుచున్నవి.

1. అంగషట్క విధిజ్ఞుడు - శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము నీ యాఱిటిని యంగ షట్కమందురు. వాని యందుని ష్ణాతుడు.
2. ఐక్యము - పృథివ్యాది రూపైక భావము.
3. సంయోగనానాత్వము - అసాధారణ సంబంధముగల పృథివీత్వ జలత్వాది రూప భేదము.
4. సమవాయము - భూత సాధర్మ్య వైధర్మ్యసాంకర్యము.
5. పంచావయవములు - ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయ నిగ మనములు.
6. షాడ్గుణ్యము - సంధివిగ్రహయానాసనద్వైదీ భావ సమా శ్రయములు.

ఈరీతి నారదుని సర్వజ్ఞత్వమును చెప్పి తుట్టతుదను "అఖిల కళా విశారదుండ"ని ప్రయోగించుట పై విశేషణములన్నియు సమస్త సలిలములు సలిలనిధియందు సంగమించునట్లంతర్భవించు రామణీయ కమును శాస్త్రిగారు ప్రదర్శించిరి, మరియు విశారదుండనుచో వైశా రద్యముగలవాడనయేకాక "విశేషతః శారదాయాః అపత్యం పుమాన్" యను భావమున శారదాతనయులలో విశిష్టుడను భావము తోచు చున్నది. నిజమున కాయన శారదాతనయుడే.

ఈ రీతి చెప్పుట చూచిన నిజముకాయఖిలకళావిశారదత్వము మన శాస్త్రివర్యులదే యనుట యతిశయముకాదు. శాస్త్రివర్యులును కవిగాశారదా తనయులే!

పరీక్షిత్తు వద్దకు వచ్చిన శుకమహర్షి నెట్లు శాస్త్రివర్యులు సహజ సుందరముగ దిద్దిరో వారి సారళ్యసౌందర్య నిర్మాణధురీణత

సీ॥ పదియార్ - - - - - - - - - - - - - కడిమివాడు.

తే॥ అలపాల్పిండు - - - - - - - - - - శుకమహర్షి. 1-401.

ఇందు ప్రీతి విశేషణమును నా పరమ భాగవతుడైన శుకమహర్షియొక్క పరబ్రహ్మ దృష్టిని వ్యక్తము చేయుచున్నది. ఇది శ్రీ శాస్త్రివర్యుల వర్ణనా వైదుష్యమునకు దర్పణము పట్టుచున్నది.

వీరభద్రుని యాగ్రహౌద్ధత్యము పతాకస్థాయి నందిన ఫణితి యిట్లలరారినది.

సీ॥ అగ్ని కుండంబుల - - - - - - - - - - - - - - గోసివైచె.

తే॥ విశ్వసృడ్దేవి దేహంబు - - - - - - - - నాగ్రహమున.4-62.

బ్రహ్మహత్య యింద్రుని వెన్నంటి తగుమునప్పడద్దాని యాసురీ రూపవర్ణన,

సీ॥ అతిఘోర రూప - - - - - - - - - - - - - నాకికొనుచు

తే॥ నాసురీ రూపమున బ్రహ్మ హత్య గదలి
శక్రునరయుచు. 6-172.

ఇందలి వర్ణన సహజ శోభావహమైనది.

గజరాజు కాసారమునుదరిసిన తావున దానిని గుర్తించిన విధానము వ్యంగ్య మర్యాదతో నలరారునట్లు వర్ణింపబడుట,

సీ॥ జలములపై నాడి - - - - - - - సంధివలన.

తే॥ కలదు కాసార మిందని - - - సారమునను జొచ్చె, 8-26

ఒకనాడు యశోద పెరుగుచిలుకునపుడు శాస్త్రిగారుతద్వర్ణనము సేసిన సొగసు,

చ॥ వడిగుడివైపుగా నెడమవైపుగ జేతులు బొమ్మ శీర్షమున్
మెడయును ద్రిప్పుచు న్నిలువుమేనది యెల్ల జలింప గాజులున్
గడియములున్మొలంగలుగు గజ్జెలు గల్‌గలుమంచుమ్రోయఁ జి
త్తడిగను జెమ్మటల్‌మొలువ ద్రిచ్చుచునుండెయశోదచేల్దధిన్.
10 ఉ.భా.1-247.

శ్రీకృష్ణుడు కాళి యాహి పడగల పై జేసిన నృత్య రామణీ యకమిది.

చ॥ ఘన ఘోషంబు – – – తానట్టువై.10.ఉభా.2-60.

గోపికలు శ్రీకృష్ణవిరహ లాలసలై తల్లీలననుకరించుచు వేదురులై వర్తించిన విధమిది.

సీ॥ ఏనుబూతన నీవు కృష్ణుడవని యోర్తు
కుడిపె జన్నొకతెకు వడివడి జని 10పూ.భా.2-381.

రామకృష్ణులు మధురానగర వీధిని చరింపుచుండగ వారలను జూచు నుత్కంఠతోనున్న తసౌధోపరిభాగ పరివర్తిత సుధాముఖుల సంరంభ మిటుల వర్ణితము.

సీ॥ మణి విభూషణ వస్త్ర – – – – – – – గొంద

తే॥ ఞాత్మ గేహం – – – – – – – బ్రేమ మీఱ. 10.పూ.భా.3-180.

రుక్మిణి యొకపరి శ్రీకృష్ణునకు చామరము వీవ నా కమనీయ వర్ణనమిట్లు భాసించినది.

సీ॥ హంస కూజితముల – – – – – నెసగ

తే॥ గల్లుగలుమంచు – – – – – శౌరికపుడు". 10.ఉ.భా.1-358.

లోభియైన యొక విప్రుని వర్ణనము.

సీ॥ "అర్థకాముడు లుబ్ధుడతికోపి పాపస్వ
భావుడు బిడ్డలు భార్యయేని" 11-292.

ప్రళయకాల వర్ణనము.

సీ॥ హోరుమంచును శబ్దముదయింపగ బ్రచండ
గతి గాలి పుట్టె దిక్తతులవియగ 12-124.

ఇట్లీ ప్రళయార్ణవమున మృకండు పుత్రుడు పదివేల వర్షములుగడిపి విష్ణుమాయావర్తితుడయ్యెను.

ఈవిధముగ శ్రీకృష్ణభాగవతమునందు పూర్వసంప్రదాయాను

సరణముతోపాటు నచుంబిత భావములు, నపూర్వ కల్పనావిశేషములు వర్ణితమగుట పరమ రమణీయము. ఇందు ప్రతి విషయమునను కవి వర్ణనా నైపుణి, భావనా వైదగ్ధ్యము ప్రస్ఫుట మగును.

—[]—

## అలంకార వైచిత్రి

"అలంక్రియతే అనేన ఇత్యలంకారః" అని అలంకార శబ్దనిర్వచనము. అనగా నలంకరించునది యలంకారమనిభావము. ఈఅలంకార పదము యోగ రూఢ పదమై కటకముకుటాదులను, యమ కోపమాదులను సూచించుచున్నదని గోపింద్ర త్రిపురహరుడు కావ్యాలంకార సూత్ర కామధేను వ్యాఖ్యయందు నుడివినాడు. (2-17.) అలంకారము కావ్యేందిరకలకకారమని భట్టుమూర్తి తన "కావ్యాలంకార సంగ్రహమునందు కీర్తించినాడు. (2-53) విషయము చక్కగా విశదమగుట, చమత్కారమును కలిగించుట యలంకారముల ప్రయోజనముగ పరిగణింపదగియున్నవి. గుణముల వలన కలుగు శోభను ద్విగుణీకృతము చేయుట యలంకారముల లక్షణముగ వామనుడు పలికినాడు. ఆతడు "కవ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః తదతిశయ హేత వస్త్వలంకారః" (3-12.) అనితన కావ్యాలంకార సూత్ర వృత్తియందు వక్కాణించెను. దండియు "కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే" యని చెప్పినాడు. ప్రాచీనను లేకాకయర్వాచీనులును నీయలంకారములను బహుథా యాదరించిరి. భారతీయ సాహిత్యమునందే కాక పాశ్చాత్యుల సాహిత్యమునందీ యలంకారముల ప్రాచుర్యము ద్యోతకమగును. "సిమిలి, మెటాఫర్, పెర్సానిఫికేషన్, ఎపోస్ట్రాఫ్, హైపర్ బోల్, పన్ మొనలగు నలంకారము లాంగ్లమున గణనీయత వహించినవి.

సర్వకావ్యసామాన్యములగు శబ్దార్థాలంకారములు శ్రీకృష్ణభాగవతము నందు శాస్త్రివర్యుల హస్త కౌశలమున యథోచితముగ పెక్కు సందర్భములందు ప్రయోగింపబడినవి.

## శబ్దాలంకారములు :-

సర్వ వైషమ్య యుక్తములయ్యును శబ్దసామ్యము గల పదములను పలుమారు ప్రయోగించిననది యనుప్రాసమగును.

"అనుప్రాసశ్శబ్దసామ్యం వైషమ్యే పి స్వరస్య యత్" 3-10·
అని సాహిత్యదర్పణము.

గురు పుత్రాస్త్రానలాతి వ్యథాదోదూయమానయై యుత్తర అతి దుఃఖాలాపయై తొట్రు పడుచు వర్తించిన పట్టున నిట్లు వర్ణితము,

మత్త॥ వెట్ట నూర్చుచు నూర్పు లెంతయు వింట బర్వెడునట్లుగా
నట్టు నిట్టు పద ద్వయ బిలయందు దొట్రిల మెట్టుచున్
బిట్టుగామెయి జెమ్మటల్ ధరణింబడంగనుదోయిసీర్
పుట్టి కాలువ గట్ట నుత్తర పొక్కుచుంబరువెత్తుచున్. 1-25.

ఇందు ప్రాసననుసరించి వెట్టనట్టునిట్టు, మెట్టు, బిట్టు, పుట్టి, కట్ట యిత్యాది పద ప్రయోగములతో ననుప్రాసము తత్పరిస్థితి కనువుగ నిబంధింపబడి యాపరిస్థితిని శబ్దమాత్రము చేతనే దర్శనీయమగునట్లు తొట్రుపాటుతో నొక విధమైన నడకతో నలరారుట శాస్త్రిగారి రచ సామర్థ్యమునకు తార్కాణ.

ఆలంకారిక ప్రోక్తమైన వృత్త్యనుప్రాసము, ఛేకానుప్రాసము, లాటానుప్రాసము, యమకము, ముక్తపదగ్రస్తము మొదలగు భేదములన్నియు శ్రీకృష్ణభాగవతమున చక్కగ పోషణతో విన్యసింపబడినవి.

## 1. వృత్త్యనుప్రాసము :-

ఒకే హల్లు పలుమార్లు పునరుక్తమగుచు ప్రయోగింపబడుట.

చ॥ "మునిగి జలంబులన్ గనియె భూరి కృపాహిత జిష్ణులన్ సనా
తనముని ముఖ్య రక్షణ నితాంత సహిష్ణుల సర్వలోకపా
లన కరుణాతిరేక కుశలత్వ చరిష్ణుల విక్రమ ప్రభా
వినమిత జిష్ణులన్ వరభవిష్ణుల విష్ణుల రామకృష్ణులన్.
పూ. భా. 3-141.

## 2. ఛేకానుప్రాసము :-

అర్థభేదముతో హల్లులజంట వ్యవధాన రహితముగ ప్రయోగిం పబడుట.

క॥ తనకుం దోయము వారికి
ఘనతర మగు పీడ కలుగు కై వడి వడిగై
కొనుచు నిరంకుశగతి జల
మున నొండెరుగక గజేంద్రము మెలంగుతఱిన్ 8-31.

## 3. లాటానుప్రాసము :-

అర్థభేద రహితమైనను దాత్పర్య భేదముతో హల్లుల సమూహము వ్యవధానరహిత ప్రయోగమున నలరారుట,

సీ॥ కాల సర్పములచే - - - - - దైత్యవిభుడు. 7-204.

## 4. యమకము :-

హల్లుల సముదాయము వ్యవధానముతో పునః పునరుక్త మగుట.

మ॥ 'గిరిదుర్గంబులు శత్రుదర్గములపోగ్నిస్పర్శన ప్రోన్నతో
త్తర దుర్గంబులుగల్గి దుర్గమము' 10.ఉ.భా. 1-333.

తే॥ సత్యపరుడు త్రిసత్యుడు సత్యయోని
సత్యవిహితుడు సత్యాత్మ సత్య సువ్ర
తుండు సత్యుడు సత్య నేత్రుండునైన
వాని శరణు వేడెదము బ్రపన్నులమయి. 10. పూ.భా. 1-56.

## 5. ముక్తపదగ్రస్తము :-

సాధారణముగ పాదాంతప్రయోగ పదమును తదనంతర పాదాదిని గ్రహించుట.

తే॥ సకల హేతువులగు భూత సముదయంబు
భూత సముదయ సంభూత భువనములును
భువనముల నేలు బ్రహ్మాదులెవియు లేక
పొడవడగ నొప్పుదేవుడు బ్రోచునన్ను." 8-49.

సీ॥ కడుపులోపలి చల్ల - - - గొడవలగుడె. 1-399.

సీ॥ "కనుపండువై మదిగరచుచుండెడునిది
పొంగారు బంగారు బొమ్మయేమొ
బంగారు బొమ్మకీ పసతావి గల్గునే
పసిమించు జాజిపూబంతి యేమొ" 5-55.

పాదమధ్య ముక్త పదగ్రస్తము.

చ॥ కలడు దధీచి నాముని జగత్త్రయ విశ్రుత దాన కంకణో
జ్జ్వల మాలికా కలిత దక్షిణ దోషుడు దోష తూలికా
వలి బహులజ్జ్వలద్దవవిభావసు వేషుడు వేషశూన్యపే
శలగుణజాల పోషిత యశః ప్రవిశేషుడశేషతోషుడై. 6-198.

## 6. అంత్యప్రాస :-

సర్వ పాదాంతములందును నొకే యక్షరము ప్రయోగింపబడునది.

తే॥ కాపురమను కడలినీద నోపు దారి
మెట్టిగొదలను దీర్చెడు నట్టిదారి
పుట్టిచావని సుకమిచ్చునట్టి దారి
బమ్మమరియుట యనిలోన నమ్ము డొరి. 7-178.

మరియును పోతన్న గారినితలపించు రమణీయములైనరచనములీ

శ్రీకృష్ణభాగవతమున గోచరించును.

ఉ॥ బాలుడు దుష్ట రాక్షసనిబర్హణశీలుడు పాపతూలవా
తూలుడు లోకపాలుడు ప్రతుష్టమనస్సు విశాలుడున్ జగ
న్మూలుడు కాలకాలుడు సమున్నత శీలుడు సృష్టించకప్రసం
చాలనలోలుడుక్త గుణజాలుడు సంభరితేంద్రజాలుడై.

10.పూ.భా.1-156.

## అర్థాలంకారములు :-

### 1. ఉపమ :- "ఉపమాయత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసితద్వయోః"

చంద్రాలోకము.

ఉపమ సర్వాలంకార బీజభూతమని వామనమతము. బ్రహ్మ జ్ఞానమువలన సర్వజ్ఞానము గల్గినటుల, ఉపమాజ్ఞానము వలన సమస్తా అంకార జ్ఞానమును లభించునని విద్వాంసుల అభిప్రాయము. ఈ శ్రీ కృష్ణభాగవతమున నించుమించు నూటయేబదినాలుగు ఉపమా ప్రయోగములున్నవి. శ్రీ శాస్త్రిగారు తన జీవితానుభవమును బట్టియు, గ్రంథ పరిచయ హేతువునను, ప్రకృతి నుండియు, మానవజీవితము నుండి యనేక విధములగు వస్తువులనుపమానములుగ పరిగ్రహించిరి.

ఆ॥ పాలవెల్లి నడుమ బద్మంబునానొప్పు
తెల్లదీవియందు దెల్లమగుచు
గర్ణికా క్రమంబు కలిగి వైకుంఠంబు
కాంతినెసగు బుణ్యకాండమగుచు. 7-113.

"నశియించు నీ దర్శనమున బాపంబులు
ద్యుమణి దర్శనమున దమములట్లు." 9-123.

### 2. అనన్వయము :-

ఉపమానోపమేయత్వములు రెండునొకే వస్తువునకు సంభవించుట.

"ఉపమానోపమేయత్వం యద్యేక స్యైవ వస్తునః" చంద్రి.
పొక్కిలి వేఱిడేడు వైష్ణవయాగమున ప్రత్యక్షమయిన శ్రీమహావిష్ణువును "నీకు బురుడగుబుత్రి నొసంగుమని" వేడ విష్ణువు "నాతండు నాకు బురుడు నేనకానిమఱి యొక్క రుండు లేడ" ని వివరించును. కావున నిటన నన్వయము మఱియును,

క॥ ఈ కృష్ణునకా రుక్మిణి
గా కేపూర్ణేందు ముఖియుగాని తగదువో
యాకృష్ణవేణి రుక్మిణి
కీకృష్ణుడుగాక యితరుడుడెవడు తగడువో. 10 ఉ.భా.1-117.

యని రుక్మిణీ కృష్ణులు వారికి వారే సాటియను నెడ అనన్వయము కలదు అనిభావించవచ్చును.

## 3. రూపకము :-

విషయి విషయములకభేద తాద్రూప్యము చెప్పబడుట. న్యూన త్వాధికత్వానుభయోక్తిమూలముగనిది మూడు విధముల చెప్పబడును.

"విషయ్యభేద తాద్రూప్యరంజనం విషయస్యయత్ రూపకమ్" చంద్రా.

"కలువకంటీ! నీవు కనుబొమలను విండ్లు
కనుచూపులను ముల్కులను ధరించి" 5-62

మ॥ ఘనఘోషంబు మృదంగ ఘోషముగ భృంగవ్రాతగానంబు గా
యనగానంబుగ హంస శబ్దములు తాళా నూనశబ్దాళిగా
గను దేవళ్ళు సభా సదుల్‌గ ఫణిరాట్కాంతోత్తమాంగంబు కాం
చన రంగంబుగ నాట్యమాడె యదువంశస్వామి తానట్టువై
10.పూ.భా.2 60.

## 4. సందేహము

సందేహము సమానకోటికమై అహ్లాదమును గూర్చినచో నది సందేహాలంకారము.

'శత్సంభతిభ్రాంతి సందేహైస్తదంకాలంకృతి త్రియమ్" చంద్రా.

'వజ్రాహతికి గాక పనులలో నడయాడు
పెనుగొండ తుండమోయనగ నొప్పి' 8-23.

## ఉత్ప్రేక్ష:-

విషయమును విషయిగా సంభావించుట. వస్తు హేతు ఫలాత్మక
గ నిది మూడు విధములు,

౦భావనాస్యాదుత్ప్రేక్షా వస్తు హేతు ఫలాత్మనా' చంద్రా

"కోడెకాండ్రమదులు పట్టి గోరి మరుదు
పన్నియుంచిన వలచుమీ కన్నె కురులు
గాన బెళుకు బేడి సలన సైన కన్ను
లేగు గాబోలు జానుగు లాగలంటు. 5-56.

## పరికరము :-

సాభిప్రాయ విశేషణములు గలది.

"అలంకారః పరికరః సాభిప్రాయ విశేషైః చంద్రా.

రక్షింపుము రక్షింపుము
రక్షక। చెడకుండ। బాండురాజకులమునా
కుక్షిస్థ శిశువొకండే
పరిక్షీణత। బాపు పొంటె వఱలెడు తెలియన్. 1-254.

ర ద్రౌణ్యస్త్రభీతిచే కృష్ణుని ప్రార్థించిన సందర్భమిది. ఇట సర్వ
 రక్షకుడైన కృష్ణుని యామె "రక్షక" యని సంబోధించి వేడు
ంటలో విశేషణము సాభిప్రాయ గర్భితమగుటచే పరికరము.

- - - - నీ యింద్రియంబుల హృషీకేశుండును - - - -

ఇటు బాలకృష్ణునాశీర్వదించుచు వృద్ధ గోపికలు పలికిన పలుకులు. ఇంద్రియములను హృషీకేశుడు కాపాడు గాక! యనుటలో "హృషీకేశ" సంబోధనము సాభిప్రాయము. విష్ణువని యర్థము. మరి యీ పదప్రయోగమే యేలయన హృషీకలనగ నింద్రియములు. వానికి యాయనయీశుడు. హృషీకేశుడయిన నింద్రియరక్షణకు జాలినవాడగునని భావము. కావున సంబోధనము సాభిప్రాయ విశేషణమైనది. అందుచే నిది పరికరాలంకారమైనది.

## 8 యథా సంఖ్యము :-

క్రమికములకు క్రమముగ నన్వయము చెప్పుట యథాసంఖ్యము. దీనికే క్రమాలంకారమనియు నామాంతరముగలదు.

"యథా సంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః" చంద్రా.

వర్షర్తు సందర్భముగ శ్రీ శాస్త్రివర్యులొక రమ్య వర్ణనమున నీ దానిని చిన్న పద్యమున నద్దిరి.

తే॥ మెఱుములురుములతో సాంద్రమేఘ పటలి
కప్పువడు చంద్ర సూర్యాది కళలు గలిగి
నింగి సత్వరజస్తమో నిభృతమైన
బ్రహ్మమోయన నొప్పెనా వర్షయందు" 10.పూ.భా.2-139.

ఇటు మొదట వరుసగ మెఱుములు, ఉరుములు, సాంద్రమేఘ పటలి చెప్పబడినవి. వీని ననుసరించి క్రమముగ పిదప సత్వము, రజము, తమములు చెప్పబడినవి. మెఱుములు స్వచ్ఛమైనకాంతిచేసత్వముగను ఉరుములు గంభీర గర్జనలచే రజోగుణముగను, దట్టమైన మేఘ పంక్తి కృష్ణత్వముచేతమోగుణముగను భాసించినవనుచు యథాసంఖ్యముగ నుడువబడినది.

## 9 స్వభావోక్తి :-

జాత్యాది స్వభావము చక్కగ యథాస్థితముగ వర్ణింపబడుట.

"స్వభావోక్తిః స్వభావస్య జాత్యాది స్థస్య వర్ణనమ్" చంద్రా.

ఉ॥ నల్లని మేని కాంతులు ఘనాఘన సంపద సొంపుడింప సం
పల్లలితోత్తరీయము సవర్ణ సువర్ణము మేలమాడ న
ల్లల్లన గుంతలంబులు ముఖాబ్జమునందళులట్లు వ్రేలవ్రే
పల్లెవిహారమున్ సలుపుబాలుని గృష్ణునినే దలంచెదన్. 1-279.

ఇందు బాలకృష్ణుని రూపు సహజ సుందరమై స్వభావోక్తిలో నలరారు చున్నది.

## 10. సంకరము:-

నీరక్షీరములవలె రెండలంకారముల కలయిక సంకరాలంకారము.

"నీరక్షీరన్యాయేనా స్ఫుట భేదాలంకార మేలనే సంకరః"

చంద్రా.

మ॥ "తమసర్వస్వము సంత్యజించియు। దటిత్వంతంబులచ్ఛ ప్రభా
సముపేతంబులు త్యక్తకల్మషములై సంత్యక్తనిత్యేషణ
క్రములై శాంతులు ముక్తకల్మషులునైకన్పట్టు మౌనీంద్రుల
ట్లమితానందముగూర్చి లోకమున కత్యంత ప్రభావంబునన్."

10.పూ.భా.2-164.

ఇందు మేఘములు మౌనీంద్రులతో పోల్పబడుచ శ్లేషతో సాధర్మ్యము చెప్పబడుటచే శ్లేషోపమలు నీర క్షీరములవలె కలిసి సంకరాలంకార్య మగుచున్నది. తటిత్వంతంబులనగా మేఘములు తమసర్వస్వము సంత్య జించి యనగా మేఘములు తమ సర్వస్వమైన నీటిని వర్షించి వైచి యనియు నిత్యాదిగ శ్లేషయు, మౌనీంద్రులట్లుయనునెడ నుపమయు [illegible]రానవి.

—[]—

# ఛందో వైచిత్రి - పద్య శిల్పము

"నానృషిః కురుతే కావ్యమ్" అని ప్రాచీన ప్రమాణము. అందులకు ప్రథమముగ వాల్మీకి, వ్యాసాది మహర్షులు కావ్యాదులకు శ్రీకారము చుట్టుటయే. పిదప కాళిదాసాది మహాకవులు పూర్వర్షి కవుల మార్గమున పయనించి "అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః" అను దానిని సార్థక మొనర్చిరి. కావుననే మహాకవులు ఋషి తుల్యులుగ కీర్తింపబడుట జరిగినది. అట్లగుట యథార్థమే యనిపించును. ఏలయన కావ్య సృష్టికి యప్రతిమాన ప్రతిభా విశేష శక్తులు, క్రాన్త దర్శనత్వాదులత్యంతావశ్యకములు. అవి సామాన్య మానవులకసాధ్యము. కావుననేయట్టివారి శక్తివంతమైనరచనలు స్థిరత్వమును సంపాదించుకొనుట జరిగినది. ప్రతిభాహీనములైనవి కాల గర్భమున కలియక మానవు. అట్లు శాశ్వతత్వము నొందినయట్టి వాని సత్తువ యదేయని వివరింపననావశ్యకమే। ఇంతకును అశాశ్వతత్వాపాదక హేతువులలో ఛందోనైపుణి యొకటి. దీనికపవాదమైన విధముగ కాదంబర్యాది గద్య కావ్యములున్నను అవి యతి స్వల్పము.

వివిధ పద్య నిర్మితికి లక్షణములను నిర్దేశించునది ఛందశ్శాస్త్రము. ఈఛందశ్శాస్త్ర పారీణతను ప్రతి మహాకవియు తన ప్రతిభా సామర్థ్యమున కనబఱచుచు నిత్యనూతనముగ తన కావ్య జగత్తును పరమ మనోహరముగ సృష్టి చేయును. ఈ శాస్త్రవైదుష్యమున ప్రదర్శించు విద్యను సాధారణముగ "పద్యవిద్య" యని పేర్కొనుటకలదు.

కావ్య పరమ ప్రయోజనము బ్రహ్మానంద సహోదరమగు రసానందమును కల్పించుట. అనగ రస సాక్షాత్కారమునొందింప జేయుట. అట్టి రసోల్బణత్వమునకు నీ వివిధ పద్య విన్యాస విలాసములు ఉత్కర్షను కల్గించును.

అట్టి పద్య సంవిధానమొక శిల్పము. సామాన్య పద్యముసైతము మహాకవుల చేతితో నతిలోక రమణీయముగ శిల్పీకరింపబడి చైతన్యవంతమై నవనవముగ నర్తించును. అదియే మహాకవుల లక్షణము.

అట్టి పద్య శిల్పమునకు ప్రారంభమున పద్య నిర్వచనము విచారించుట సమంజసము. "పద-గతౌ" యనుసంస్కృత పదధాతువు నుండి యీ "పద్య" శబ్దము ప్రాదుర్భవించినది. ఇందలి "గతి" శబ్దమునకొక విమర్శకుని అభిప్రాయమిది.

"- - - - ఎట్టి భాషణమున నైన నొక విధమగు గతిఉండకే మగునన్నచో నిటగతి" శబ్దము సామాన్యార్థమునగాక విశిష్టగతి యను నర్థముననే ప్రయుక్తమగుట గమనార్హము. పద్యము నందు కేవలము గతికాక క్రమబద్ధ విశిష్టగతి కాననగును. అలోచనమృతము" ఈ అభిప్రాయమున పద్యమనగ క్రమబద్ధ విశిష్టగతియుతభాషణమన వచ్చును.

"పద్య" అనగా ని త్రోవ, మార్గం, పద్యం అనగ త్రోవకలది. అనగా "ఛందోబద్ధ కావ్యం" తెలుగుపద్యం. అని శ్రీపువ్వాడ శేషగిరిగారి మాట.

"పద్య మనగా నిబద్ధ పదబంధమని తిక్కన కావ్య శిల్పము డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారి నిర్వచనము.

ఛందో మార్గమున కవి సారథి భావరథమునకు భాషాసైంధవమును పూన్చి గణయతి ప్రాసాది నియమ నిబంధనలనుల్లంఘింపక సుశిక్షణతో సునాయాసముగ సమర్ధవంతుడై నడుపగల్గినయపుడే పాఠకునకు సోఽహం యనునది అనుభూతమై "రసోవైసః" యగుటచే రసాత్మకుడై ఆనందమునుభవించును. ఎడనెడ ప్రమాదవశమున నీషన్నియ మోల్లంఘనము జరిగినను సమర్ధవంతుడైన కవి వానిని మఱపింప జేయగలడు. దోషరహితమైన ఒక్క పరమాత్మ స్వరూపమైన

యొక దోషముగ నాపాదింపగల నతి సమర్థులను త్యజించుటయే శ్రేయస్కరము, వివేకవంతమును ఇంతకును యే స్వల్ప దోషమైనను గుణోత్కర్షమందు నిరర్థకమే. అయినను "ప్రమాదో ధీమతామపి" అను ప్రామాణిక వాక్యము గలదు. అది యటులుంతము.

పద్యమనగ నిర్దిష్ట నియమవిశిష్టమార్గము, విశిష్టమార్గము దేనికి యనిన కవి భావమునకు, నిర్దిష్ట నియమములు గణయతిప్రాసలు.

ఈపద్యమునులిఖించుటలో పైనియమ విశిష్టకష్టములు తప్పవు. ఆ నియమములు సాధనకు, ప్రతిభావంతునకుకష్టమనిపించవు. కావున సమర్థులకు పద్య సృష్టి నల్లేరుపై బండి నడక వంటిది.

"నిర్దిష్ట నియమవిశిష్ట మార్గ నిర్గతభావము పద్యము" శ్రీమదాంధ్ర మాయణ కల్పవృక్షము; పద్యశిల్పము అనుటలో అవ్యాప్తి, అతివ్యాప్తి అస్పష్టతా దోషములుండవని మరియొక విమర్శకుని అభిప్రాయము.

ఈ పద్య విద్యలో శ్రీ శాస్త్రిగారు కడునారితేరిన వారని జగ ద్విదితమే. వివిధ శకములైన పద్యములు శ్రీ శాస్త్రిగారి చేత దిద్దితీర్చ బడి ఒయ్యారములొలుకవోయుట శ్రీకృష్ణభాగవతమున" నడుగడుగు నను కాంచవచ్చును. ప్రస్తుతము పద్యశిల్పము గూర్చి యించుక చర్చించుట యావశ్యకము.

" శిల్పం నిపుణం కర్మ " యని లింగాభట్టు నిర్వచనము. శిల్పమనగ నైపుణ్యము.

"నేనుభయ కావ్య ప్రౌఢి బాటించు శిల్పమునంబారగు డన్" నిర్వచనోత్తరరామాయణము. అవ. అని తిక్కనగారు. అనగ కావ్య ప్రౌఢి పాటించు నైపుణ్యమునందు పారగుడనని తాత్పర్యము.

కవి పఠితకనేక మార్గములద్వారా రస సాక్షాత్కారమొనరింప. చేయుటకు చేయు ప్రయత్నమే శిల్పము. ఆ యనేక మార్గములలో రస సాక్షాత్కారము చేయుటకు కవి చేయు ప్రత్నములలో పద

శిల్పమొకటి. పద్యశిల్పమనగ పద్య రచనాగత శిల్పము.

ఏదో గణములు గూర్చి పద్యమొనర్చుట యది పద్యరచనము మాత్రమే యగును. అది పద్య విద్య కాదు. పద్య విద్యా తాత్త్వికత నెఱింగినవాడు మాత్రమే యిట్టి శిల్పమును పోషింపగలడు. నవ్వారు మంచమునకు కూర్చిన ఫణితిని యతి ప్రాసాదులను జేర్చినంత మాత్రమున అది పద్య విద్య కాజాలదు. పాత్రల స్వభావాను కూల ముగ ఛందము నెన్నుకొనుట, అటు లెన్నుకొన్న ఛందమున గణా దులను తదుచితముగ కూర్చుట. భావబంధురమగు యెత్తుగడ, రసా నుకూల పదబంధము, పద్యపు బిగి సడలకుండగ జూచుకొనుట, నడ కయందలి యొయ్యారపు విఱువులు, ఎత్తుగడకు దగిన ముగింపు ఇత్యాది విషయ సమాహారమే పద్య విద్య. ఈ సామర్థ్యములేకుండ రచింపబడిన పద్యము పద్యరచనయగునుగాని పద్యశిల్ప భాగమవదు. పద్య రామణీయకమంతయును సామెతలు,నానుడులు,మాటల యొడు పులు, కాకువులు మొదలగు వానినిముడ్చుటపై ఆధారపడి యుండును. అందువలననే వానికితగిన చందమునెన్నుకొనుట యందు కవి ప్రతిభ వ్యక్తమగును.

నన్నయగారు భారతావతారికలలో వాల్మీకిని పద్య విద్యకు నాద్యునిగ స్తుతించుట గోచరించును.

"- - - - గురు పద్య విద్యకు నాద్యునం

బురుహగర్భనిభుం బ్రచేతసు పుత్త్రుభక్తి దలంచుచున్"

ప్రాచేతసులాద్య భాషయందు, నన్నయభట్టారకులాంధ్రమున పద్యవిద్యకు నాద్యులని నిర్ణయము. ఛందము వాల్మీకికి పూర్వమున్న యటులే నన్నయకుముందు తెనుగున పద్య రచనముగలదు. వాల్మీకి పూర్వము వేదగత చందము వలె నన్నయ పూర్వ రచనముల పద్య సృష్టి ప్రాథమిక దశయందుండెను. వాల్మీకి నన్నయ్యలు దానికి

వికాసమును గూర్చిరి. ఆహేతవున వారలాయా భాషలలోపద్య విద్య కాద్యులై కీర్తిల్లిరి.

ఆంధ్రుల పద్యశిల్పము గూర్చి గుంటూరు శేషేంద్రశర్మగారి వచనసత్యమిది "ఉర్దూ,పారశీ, అరబ్బీ, ఇంగ్లీషుఇత్యాదిభాషలందుగాని, భారతదేశమందలి యన్యప్రాంతముల భాషలయందుగాని తెలుగు పద్యమునకున్నంత శిల్ప సౌందర్య సంపద లేదనియే చెప్పవలెను. తుదకు సంస్కృతమునందుకూడ తెలుగువాడు తెలుగుపద్యమునందు సాధించినంత శిల్పసంపద సాధింపబడలేదు." సాహిత్యకౌముది.

ఆంధ్ర సాహిత్యవైశిష్ట్యము యావత్తు పద్య శిల్పమాధారముగ నున్నదనుట వాస్తవము.

ఆంధ్ర కవులు సర్వాంగ సుందరమగు పద్యములనేకములు రచించి పద్య సామ్రాజ్యైకచ్ఛత్రాధిపతులుగ యశస్వులైరి. సామాన్యవృత్తము లగు శార్దూలమత్తేభాదులందే చిత్రవిచిత్రగమన విన్యాస ప్రదర్శనము గావించిరి. ఈసందర్భమున తెలుగుల తీయనికవిపోతన భాగవతపద్య ములకమనీయ గమనములను స్మరించుట మన ప్రధాన కర్తవ్యము. ప్రసిద్ధాంధ్ర కవులందఱకు నీ పద్య శిల్పదృష్టి కలదు.

నన్నయ పద్యశిల్పములలో "అక్షర రమ్యత" ప్రధానమైనది. అది అక్షరములు కూర్చుటలోని యొక విధమైన సొగసు. "- - -- ఈ మాధుర్యముసందర్భానుసారముగరసానుగుణముగ కథానుకూలముగ మారుచుండును. ఇట్లు మారుటయే రచనాశిల్పము" విజ్ఞానసర్వస్వము సంపుటి (3 పుట.862.) అని నన్నయగారి యక్షర రమ్యత గూర్చి విశ్వనాథవారి సనదు.

"రమణీయార్థమును ప్రతిపాదించు అక్షరముల కలయిక" నన్నయకవిత్వము అక్షరమ్యత. పుట.126. అని వి.వి. యల్ నరసింహారావు గారి యభిప్రాయము. ఈ అక్షర రామణీయకతయందేకదేశమగు

చందో రామణీయకము పద్య శిల్పములో ఏకదేశమగును.

అట్లే తిక్కన రసాభ్యుచితబంధము, నాచనసోముని నవీన గుణ సనాథత్వము మొదలగునవి పద్యశిల్పోపబలకములే.

జక్కన "నవ శబ్దార్థ రసానుబంధ పద విన్యాస క్రియా గౌరవ పాకధ్వని రీతి శయ్యలందు విక్రమార్క చరిత్ర. కవిత చెప్పెడివాడట. కొఱవి గోపరాజు "భావ రసానుకూల మృదుపాక పదార్థ. సమృద్ధిలోక సంభావన నొప్పు సింహాసనా ద్వాత్రింశిక కావ్యకర్త వీరి భావములును పద్యశిల్ప హేతువులే! అట్లే "అల్లసానివారి యల్లిక జిగిబిగి కూడ, పాండురంగ విభుని పద గుంఫనము కూడ పద్యశిల్పమును గూర్చియే వచ్చినవి. పింగళి సూరనార్యుని,

"రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతులిమ్ముగనమర్చి" కళాపూర్ణోదయము.

యనునదియును నా శిల్ప సంబంధియే.

ఇక నంత్యమున శ్రీకృష్ణభాగవతమున శ్రీ శాస్త్రిగారి పద్య శిల్పమును దర్శింపజేయు నీ క్రింది పద్యమును మచ్చునకు

సీ॥ మావి పూదేనెల మత్తిల్లి యలిగాయ
కాళి సుస్వరములనోలిబాడె" 3-200

ఇది కర్దమాశ్రమ ప్రాంత వన వర్ణన సందర్భ శిల్పీకృతము. వసంతవిలాసము సలితముగ వెలయింపజేయుట యిందు గాననగును. బహుళ రీతుల పరిష్కృతి సొగసులీయెడ గోచరించును. కావున వానిని జెప్పుటకనువైన ఛందము నెన్నుకొనుట జరిగినది. సీసపద్యముల కన్ని విధములననువైనది. వసంతమనగనే మావి చివుళ్ళు, పూవులు సద్యస్ఫురణమున జనించును. కనుకనే పద్యాదిని మావి పూదేనెల యని యెత్తుకొనబడినది. ఇక వసంతము సర్వ సౌకుమార్యము, కనుక చెప్పబడిన విషయములన్నియు సరళసుందరముగ సాగినవి

మాధవుడు లేక మన్మథుడు, మన్మథోత్సాహమును లేవు. ఇటుసొగసుగ వక్రోక్తిలో సలంకార ధ్వని యలరారినది. అక్షరముల కూర్పు సహజ సుందరముగ నాద్యంతము సాగినది. ఇదియే పదబంధనైపుణి. ఇవి యన్నియును "శృంగార రసమును" రసరాజముగ సాక్షాత్కా. రింపజేయుచున్నవి. ఇదియే పద్య శిల్పము. ఇట్టి యీ పద్యశిల్పము పలురీతుల నీ శ్రీకృష్ణభాగవతమున శ్రీ శాస్త్రిగారత్యంత సమర్థతతో నిర్వహించిరనుటకు వారి పొత్తమే యసలుసిసలు తారకాణ.

## వృత్తౌచిత్యము:-

పద్య శిల్పమునందు ప్రథమమున ఛందమునెన్నుకొనవలెను. భావానుకూల ఛందమునెన్నుకొనుట యా కవి ప్రతిభను సూచించు నదైయుండును. దీనిని "ఛందోవరణమణి" యందురు.

భావమునను సరించి తగిన పద్యమునెన్నుకొనవలెను. లేని యెడల నచట పద్యమును వ్యర్థ పద ప్రయోగపూరణములతోడను, అస్పష్టాసమగ్రతా భావముతోడను రసహీనతతో పేలవముగ నుండును సమగ్ర భావద్యోతక పద్యమునిండుదనముతో నలరారును.

పదప్రయోగ సామర్థ్యము కలిగియున్నపుడు వాని స్వరూపము నకు భంగముకలుగనిరీతిని సరిపడు ఛందమునుపయోగింపవలయును. జాతీయములు, సూక్తులు, నానుడులు మొదలగునవి యాయా భాష లకు ప్రాణ సమములు. వీని సోయగము. స్వరూపము నశింపకుండు నట్లు సందర్భానుసారముగ నుపయోగించుకొనుటలో కవినేర్పు ప్రదర్శితమగును. వాని యొడుపు కనిపెట్టి ప్రయోగించుట ప్రతిభై కసాధ్యము. ఆయాయువుపట్టు పట్టికొని యనగా వాని "నాడి తెలిసి" ప్రయోగించుటవలన భావము దీప్తివంతమై శోభావహమగును. కావున ఆయా ప్రయోగములకు దగిన ఛందమును పరిగ్రహింపవలయును. తన్మూలమున రసావిష్కరణము గలుగును.

ఆంధ్ర వాఙ్మయమును జూచినచో కవివరులెవ్వరును ఈ రసమునకు ఈ ఛందమని నియమ ప్రకారము వాడియుండుట జరుగలేదు. ఈఛందమీ రసమును వ్యంజించుననియు, నీ రసమును భంజించుననియు నిర్దేశించుట యుక్తమనిపింపదు. అటులెంచిన వారికి నీ సాహిత్యోద్యాన నందనమున కంటకకుంజములే యంటి భంజింప జేయనెదురగుట తప్పనిసరి.

శార్దూలాది సామాన్య ఛందములెట్లున్నను విశేష ఛందములు మాత్రము విషయానుకూలముగనుపయోగింపబడినట్లుద్యోతితమగను. సామాన్య ఛందములు కొన్నియౌచిత్యవంతముగ కన్పట్టుచున్ననవి సప్రయత్న కృతములా, యప్రయత్నకృతములాయని సంశయము కలుగును. విశేష ఛందములనిన నయ్యవి సప్రయత్న కృతములని స్పష్టముగ గాన వచ్చును. కావున విశేష ఛందముల సందర్భమున విశేషమాశింపదగియున్నది. నిజమునకు కవి సప్రయత్నుడు గానిచో విశేష స్వయం భువము కాదు!

కావున విశేష విషయానుకూల ఛందమెన్నుకొను పట్టున కవి మఱింత జాగరూకత వహింద వలసి యుండును. ఇటు లెన్నుకొనబడిన పద్యమున నుడికారాదులను పొదగుటకు యత్నింపవలసియుండును. అతావున వానిపొంకము చెడకుండ చూచుకొనవలసియుండును.

ఉదాహరణమునకు నవమస్కంధమున గల యీ పద్యము గ్రహింప వచ్చును.

క॥ జగదీప, కలదపుత్ర
స్యగతిర్నాస్తియను వాక్యమదిగావున నీ
జగతి సుతులు లేని జనుల
కుగతులు లేవనుచు వైదికుల పలుకులగున్! 9-157.

ఇది ఛందొజాతి భేదమైన సామాన్య కంద పద్యము. ఇందు

"అపుత్రస్యగతిర్నాస్తి" యను శాస్త్ర వాక్యము జెప్పబడినది. ఆ పరిమాణ వాక్యము ఛందో బద్ధము చేయుటకు దగిన విధముగ నీ కంద పద్యముపయోగింపబడినది. అందులకు తగిన విధముగ "గకార ప్రాస" తో జగతీపయని ప్రారంభింపబడి మార్గము సుగమము చేసి కొనబడినది. ఈ పట్టున కవి సప్రయత్నతచేతనే యిటుల సాంధించె నని చెప్పక తప్పదు. ఇటుల విషయానుకూలమగు ఛందమునెన్ను కొనుట మహాకవుల సామర్ధ్యమును తెలియజేయును.

వర్ణ్య విషయమునుబట్టి తద్విషయాఖ్యానక పద్యమునెన్ను కొని వ్రాయుట యొక చమత్కార విశేషముగ గోచరించుచున్నది. పద్య నామధేయమాపద్యమున నిమడ్చుటయుగలదు. ఇదియే ముద్రాలంకారము.

చందో నామౌచిత్యమును గూర్చి శ్రీ సంపత్కుమారగారి యభిప్రాయము.

నామౌచితిని పాటించుటవలన పాఠకునికి తత్పద్య భావము తెలియుటకు ముందే పద్యనామముతో తెలిపినట్లుగనే చేసి పద్యగత భావమున కాభిముఖ్యము కలిగించినట్లగును. దాని వలన పాఠకున కొక విధమగు చమత్కారము భాసించును. తెలుగు ఛందోవికాసము. పుట.321.

వర్ణ్య విషయమునుబట్టి ఆ నామము గలిగిన పద్యము నెన్నుకొనుప్రయత్నమున తెలుగుసాహిత్యమున కాద్యుడనబడిన నన్నయ గారికే ఆద్యత్వము కాననగుచున్నది.

గురుని యాదేశముచే గురుదక్షిణగ ద్రుపదుని పట్టి తెచ్చుటకు రాజపుత్రులందఱు సమకట్టి శస్త్రాస్త్రధరులై పాంచాలపురమును ముట్టడించు నెడల వారియుత్సాహ ప్రకటనమునకు నన్నయ గారుత్సాహ భారతాదిపర్వము వృత్తమునే వాడుట గమనింపదగినది.

నన్నెచోడ కవిరాజశిఖామణి తనకుమార సంభవమున స్వాగత వచనము చెప్పుటకు "స్వాగత వృత్తమును", వెన్నెలను వర్ణించుటకు "చంద్రిక" ను గ్రహించెను. ఇట్లు విశేష పద్యములనేకాక, సామాన్య పద్యములను గూడ విశేష విషయానుకూలముగ నెన్నుకొనుట కష్ట మయినట్టిదియే.

నన్నెచోడుడు మత్తేభక్రీడను మత్తేభ విక్రీడితమున వర్ణించు పట్టున కవి సప్రయత్నుడనియే చెప్పవలసి యున్నది. మరియు తిక్కన తనను గామించి వచ్చిన కీచకుని బెదిరించుటకు ద్రౌపది ఆడ పులి వలె గాండ్రించిన పలుకులకు శార్దూల వృత్తమునెన్నుకొనుట జరిగినది. ఇది పాత్ర మనస్తత్వా నుకూలమైన నామముగల పద్యము ఆ కారణమున నిచ్చుటను కవి సప్రయత్నుడని యే యెంచవలెను.

ఇక శ్రీకృష్ణభాగవతమునగల విశేష పద్యముల యెన్నిక స్థాలీ పులాక న్యాయముగ స్పృశింపబడును.

కంసప్రేరితుడై తృణావర్తుడను నికపాత్మజుడు బాలకృష్ణుని నిరోధించుటకు పెనుగాలి రూపమున వచ్చెను. ఆ సందర్భమున,

భుజంగ। తృణావర్తుడంతన్ దృణంబట్లు కృష్ణున్
గణించెన్మదిన్ మున్ గ్రమంబేర్పడంగన్
గుణాతీతు డౌటన్ గొనన్ శక్తిలేమిన్
గణేయుండ యయ్యెన్ గత ప్రాణుడంచున్.

10.పూ.భా.1-192.

అని "భుజంగ ప్రయాతము" వాడబడినది. ఇటు కృష్ణుడు గుణాతీతుడని చెప్పబడినది. ఆయనను గొనుటకు శక్తిలేనివాడై రాక్షసు డుండెను. ఇట రక్కసుడు వాయు రూపమున వచ్చుట జరిగినది ప్రత్యర్థియైన కృష్ణుని "భుజంగ ప్రయాతము" న జెప్పుట జరిగినది. భుజంగము వాతాశన. అనగ ఇందు భుజంగము వాయువునువలె

ృష్టుడు తృణావర్తునడచునని వ్యంగ్యవైభవముగ మనోహరముగ
ెప్పబడినది. ఇటు విషయానుకూలముగ ఛందమెన్నుకొనబడినది.

ఈరీతిగ పంచచామరము, సదాశివము, మణిమాల, శ్యామలా,
ంగంధి, సుకల, కలికి, మాలిని, పున్నాగ, వనమయూర, మంజుల
ంత్తమయూరం, కళ్యాణి, పద్మనాభ, రుక్మవతి, వంశస్థ, తోదక,
ేంద్రవజ్ర, శారద, సుముఖి, వల్లి, క్రౌంచపదం. హంసగతి,
ాలిని మొదలగు విశేష వృత్తములేకాక స్రగ్ధర, మహాస్రగ్ధర, మత్త
ోకిల, తరళం, శార్దూలాదులు సమయానుకూలముగ నౌచిత్యముతో
్రయోగింపబడినవి.

సందర్భానుగుణముగ భావము, ఆ భావమునకు దగిన వృత్త
ెన్నుకొనుట, యెన్నుకొనిన వృత్తమును చాకచక్యముగ నడిపిం
ంటు కావ్య ప్రధాన హేతువులైన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు
ంశీభూతమైన విశిష్టునకే సాధ్యము. తదితరులకు నూహకైనను న
ాధ్యమే.

ఈ భావమునే పొట్లపల్లి సీతారామారావుగారిట్లు చెప్పుదురు.
– – – భావచాలనాన్ని బట్టి రసభెదగత తరతమోత్కటుత్వాన్ని
ట్టి, ఊహావైభవము పరచుకొనే పరిధినిబట్టి, ఛందస్సు మారుస్తూ
ంతారు గొప్ప గొప్పకవులు. ఏ భావాన్నయినా, ఏ ఛందస్సునప్పు
ందో తెలుసుకొని వాడటం కొందఱికే తెలుస్తుంది. కల్పవృక్షము–
చనా వైశిష్ట్యము–మేఖల. 1978.

పై వాక్యములెంతయు సత్య గర్భితములు.

ఈ విధముగ "శ్రీకృష్ణభాగవత మంతయు" పద్యశిల్పభేదమైన
ృత్తౌచిత్యములతో శ్రీ శాస్త్రిగారి హస్త కౌశలమున శిల్పీకరింప
డినది.

## రసాభ్యుచిత బంధము:-

సన్నివేశమునకు దగిన రసావిష్కరణకు పదబంధముల నౌచిత్యవంతముగ కూర్చుట రసాభ్యుచిత బంధము. ఇద్దానికి తిక్కన గారు పెట్టినది పేరని సాహిత్యలోక విశ్రుతమే.

ఆయా సన్నివేశములనుబట్టి పాత్ర చిత్తవృత్తినిబట్టి రచనా సంవిధానమున పరిణామము గోచరించును. ఇది ప్రస్తుత లోకమున వ్యక్తులయందు కానవచ్చును. కావ్యము లోకమునకు ప్రతిబింబ సాదృశ్యము.

లోకమున వ్యక్తులాయా సన్నివేశములందు మాటాడునపుడు హావభావములు, హేళనలు, దెప్పిపొడుపులు మున్నగువాని నభివ్యక్తము చేయుటకు వాక్య విన్యాసముతోపాటు కావ్యాదులు, అభినయము మున్నగునవి యెంతో సహకరించును అట్టి అభినయాదుల నభివ్యక్తము చేయుటకు శ్రవ్యకావ్యకవియెంతో పాటుపడవలయును. వాక్యమును సాగదీయుట, తుంపులుగా చేయుట, మృదు పరుషాక్షర బంధవిన్యాసము, సమాస ఘటనము ఇత్యాదికమును ప్రయత్న పూర్వకముగా తత్తత్ సన్నివేశోచితముగా కూర్పవలయును. అప్పుడే వర్ణ్య వస్త్వాదికము హృదయగోచరమగును." అని డా॥ శలాకా రఘునాధశర్మగారి వక్కణము నిక్కము. కల్పవృక్షమున కవి ప్రతిభ మేఖల. 1978.

ఈ రీతి పరికించినచో రచన యొక్కొకసారి సుదీర్ఘసమాసము చేతను, మరొకసారి వ్యస్తముగాను కొనసాగును.

పుత్రశోకదవానల తప్త భగ్న హృదయయై కంటికి మంటికి నేకధారగ దుఃఖించు యాజ్ఞసేని నుద్దేశించి గుండె దిటవుతో నిండుగ పాండవ మధ్యముడు పలుకుచునోదార్చిన భంగి

ఉ॥ "ఏడు వకీవు నేసపుడ యేగి దురాత్ముని బ్రహ్మబంధునిన్
జూడక దేశికాత్మ యని చూచుచునుండగ నెల్లవారు నా

పోడిమిచూపి గాండివ సముద్ధత బాణ పరంపరాహతిన్
గాడుడిగించి తచ్ఛిరము గైకొని వచ్చెద నీకు నిచ్చెదన్."
1-206.

ఇచట కిరీటి నిరాటంకముగ ద్రౌణి శరీరోపరి భాగమును ఖండించి తెచ్చి యిచ్చెదనని ప్రతిన పూనుట కలదు. దానికి నుత్కర్షగ "గాండివ సముద్ధత బాణ పరంపరాహతిన్" యను దీర్ఘ సమాస ప్రయోగము జరిగినది. అట్లనుటలో నాతని ధనుర్విద్యా వైశారద్యమును, అజేయత్వమును ద్యోతకమగుచున్నవి. పద్యమున కున్న పట్టంతయు నీ సమాసగతమై యున్నది.

ఇట్టి పట్టున రసధ్వని సమాసగతమై శోభించినదనుట పరమ సత్యము.

## పద్యపునరుక్తి :-

కావ్యాదులనటనట ప్రథమోక్త పద్యములు మరల మరల నౌచిత్యానుసారముగ పర్వముగూర్చుచు యథాతథముగగాని, యీషద్భేదమునగాని గోచరించుచుండును. ఇట్లగుట కవి చాతుర్యభాగమనియేయనిపించుకొనును. శిల్పీకరణయత్నమే యగును. కావ్యోద్దేశ్యమైన రస సాక్షాత్కారమునకు నీ శిల్పమును శ్రీకృష్ణభాగవతమున కవిసార్వభౌములైన శ్రీ శాస్త్రిగారు కడు పనివానితనమున నేర్పు చూపించుట కాననగును. ఈ యనల్ప శిల్పీకరణము పద్యవిద్యాకాద్యుడని నన్నయచే కీర్తింపబడిన ప్రాచేతసుని రామాయణముననే ద్యోతకమగుచున్నది.

పరమోత్కృష్టమని భావింపబడు సుందర కాండమున లంకాధీశు నాజ్ఞతో కింకరులు పొంకమునంకించుచు నాగమించినప్పుడు వాయుసూనుడు మేఘ గంభీర భాషణముల నిట్లుద్ఘోషించెను.

"జయత్యతి బలో రామో లక్ష్మణశ్చ మహాబలః।

రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః"
వాల్మీకి రామా. సుంద. తత్త్వదీపిక వ్యాఖ్య పుట. 191.
శ్రీభాష్యం అప్పలాచార్యులు.

చతుశ్శ్లోకములు కింకరవధానంతరము మరలపలుకుట 1వ.యుద్ధరణము పుట. 193. ఇత్యాది జరిగినది.

తదితరులకును తన వృత్తాంతమును దెలుపుటయే అట్లు పునరుక్తము లగుటలోని ప్రయోజనము. అదియే వ్యంగ్య పూర్వకధ్వని వైచిత్రి.

ఇది నన్నయ భారతమునందును ప్రదర్శితమైనది. కాదన కిట్టిపాటి యపకారము - - - - సమగ్ర శిఖా చయంబులన్"అను యుదంకుని భాషణములు మరల మంత్రులు జనమే జయునితో పలుకుటలోని రహస్యము వాని సర్పయాగ సంకల్పమును దృఢతర మొనర్చుటకే.

ఇట్టి పునరుక్తములు తిక్కనగారి యందునగపడును. ద్రౌపది కీచకునితో దుర్వారోద్యమ - - - కీచక యని పలికిన పద్యమనంతరము తన భంగపాటు నంత కాంతక రౌద్రాకారుడగు పవనసుతుని ననిన సందర్భమునకలదు.

ఈ రీతి పద్యములు, పదఘటనములు పునరావృతమగుట తెలుగు పంచమవేదమున సమంచితములై యెన్నియో తావుల కొంచెముకానివై ప్రదర్శితములైనవి.

వాగనుశాసనుడు, ఉభయకవిమిత్రుడు బీజప్రాయముగ నుంచిన యీ పునరుక్తత యాధునికులతో విశ్వనాథవారిలో గన్పట్టును. వారి రామాయణ కల్పవృక్షమున యవి యనేకరీతుల శాఖారోహణముచేసినవి.

శా। ఆ లీలావని గేళి వీచి యనిలుండా స్నిగ్ధ లావణ్య శో
భాలాక్షాపదలోభనీయతనులన్ బ్రాదుర్భ వద్యావన

జ్వాలాదీప శిఖాభిరామ తనులన్ బర్వేందు బింబాననా
లోల శ్రీరుచి తోరణాచ్ఛతనులన్ లోనూరిలో నూరుచున్."

బాల. అహల్య.234.

కౌశనాభులు వన క్రీడయందుండ ననిలుడు వీక్షించి లోనూరిన పట్టున నిటుల వర్ణితము. ఇదే పద్యము మరల నిషద్ఛేదముతో మరల దర్శనీయమగును. (251.) ఈ విధముగ పలు తావుల నీ శిల్ప రామణీయకము గోచరించును.

కవి యొకసారి కొన్ని పదముకలోపద్యమున పునరుక్తి చేయుటయు, కొన్ని పదముల సమూహముతో పద్య ప్రారంభము, కించిద్భేదమున పద్యపునరుక్తి, పద్యాంతపునరుక్తియు చేయుటలు చూడ వచ్చును. ఎటుల చేసిననునది రసావిష్కార ప్రయత్నమే అని సంభావింపవలయును. ఈ పునరుక్తతా రామణీయకము శ్రీకష్ణభాగవత కర్త శ్రీ శాస్త్రిగారి చేతిలో వారి భారత, రామాయణ, భాగవతములు మూటి యందలివి మూటి యందును పరమాద్భుతత్వమును సంతరించుకొని కానవచ్చును. ప్రస్తుతము శ్రీకృష్ణభాగవత విమర్శనము కదా చేయవలసినది. అందుచే మచ్చునకొకటి రెండు శాస్త్రిగారి శ్రీకృష్ణభాగవత పద్యపునరుక్త శిల్పరామణీయకములు.

పురంజనుడుద్యాన వనమున నొక స్త్రీని గాంచి యామె వృత్తాంతమున రయగోరి యిట్లు పలుకును.

మ॥ వెలదీ యెవ్వరి దాన వెవ్వతెవు నీ పేరేమి యెందుడియి
ప్పాలతుల్ గొల్వగ వచ్చి తీవలరు నిప్పాదోట కున్నేటివై
వలఱేనింగి - కురించివచ్చురతివో వాడంపనిందున్న వా
రలనే చంజనదెంచు పూములికివో రారమ్మ వాకిమ్మోగిన్.

4-324.

ఇదే పద్యమును వ్యాకరణవశమున నక్షర భేదమార్పుతో నాగ్రిధుడు

సఖురాండ్రతో విహరించు "పూర్వచిత్తి" యనునచ్చరలేమతో ముచ్చటు లాడిన తావున గాంచవచ్చును.

మ. వెలదీ! యెవ్వరి దాన వెవ్వతెవు నీ పేరేమి యెందుండి యీ
పొలతుల్ గొల్వగ వచ్చి తీవలరు నిప్పూదోటకున్మేటివై. 5-61.
- - - - - - - - - - - - - - - - - - కిమ్మొగిన్.

ఈ రెండును శృంగార సన్నివేశమున వర్ణితములే. సందర్భము లొక్కటియే. వ్యక్తులు మాత్రము వేఱువేఱు. అట్టి స్థితిలో నేపురుషున కైనను అపరిచిత స్త్రీ తటస్థపడిన నట్లే ప్రవర్తించి పృచ్ఛించుట జరుగును. ఇరువురకు నొకే విధముగ భావము కలుగవచ్చును. అట్టి పరిస్థితులు లోకమునకు దటస్థపడుచున్నవి! కావున రెండు పద్యములొకే విధముగ నడిపించవచ్చును. కాని శాస్త్రిగారి కవిహృదయమిటుయొక చమత్కారము చేసినది. వారు వేఱువేఱు పురుషులని యతి రమ్యముగ చెప్పకయే చెప్పిరి. అందుననుఒకే యక్షరమూలమున ప్రథమపాదాంతమున, ద్వితీయ పాదాదిని పురంజనుడు "ఇప్పొలతుల్" అనుచోత్రికమున సంధి చేసి యచట సంధిలేమిగా"యీపొలతుల్" అని పఠికించుట గమనింప దగియున్నది.

## ఛందో వైవిధ్యము:-

కావ్యములందు కవులు వివిధ రీతులుగల ఛందములను ప్రయోగించి సమర్థతతో రసావిష్కరణము చేయుట ఆంధ్ర సాహిత్యమున కానవచ్చును. అది వారి నవ్యతా దృష్టికి, ఛందో సామర్థ్యమునకు తారకాణమనవచ్చును. ప్రథమమున సంస్కృతాది కవి యయిన వాల్మీకి మహర్షి తన రామాయణమున ప్రధానముగ"అనుష్టుప్"ఛంధమును గైకొనుట ద్యోతకమగును. అనంతరము కాళిదాసాది మహాకవులొకే వృత్తమును గ్రహించి కావ్యమున నాద్యంతముగాని, యొక

ములు వాడబడుటయు గలదు. ఆంధ్రమున నీ యేక వృత్త గ్రహ
ణము ద్విపద, శతకములందు మాత్రమున్నది. కాని కావ్యముల
యందు తదితర భాషలతో తుల్యీకరించినచో నీ యాంధ్రమున గూర్చ
బడిన వివిధ ఛందో వైశిష్ట్యము మాత్రమమూల్యము నగణనీయమని
యెంచదగును.

ఆంధ్ర సాహిత్యమునందు నీ వివిధ ఛందో వైచిత్రి విస్తృత
ముగ ప్రదర్శించిన వారిలో ప్రథమగణనీయుడు నన్నెచోడ కవిరాజు.
పిదప కవిబ్రహ్మయు కానదగును. ఉభయ కవిమిత్రుని స్త్రీ పర్వ
మిందులకు ప్రత్యక్షప్రమాణము. పూర్వాంధ్ర కవివరులు తమయవతా
కలందును,నాశ్వాసాంతముల యందును విశేష వృత్తములను వాడుట
కలదు కాని కావ్యముల ప్రభూతముగ ప్రదర్శించుట కానరాదు. కవి
రాజోభయ కవిమిత్రులీ విషయమున తదతీతులన వచ్చును. వీరి మార్గా
నుయాయిగ 'అందుగుల వెంకయ్య' తన 'రామరాజీయమున' నీ నవీ
నత్వమును ప్రదర్శించుట గోచరించును.

ఈ పద్య వైవిధ్య ప్రదర్శనము గూర్చి పలికినయపుడు ప్రథ
మముగ కవి బ్రహ్మను పేర్కొనుట సాధారణముగ కానుపించుట
జరుగును. ఆయన స్త్రీ పర్వము ఛందో వైవిధమునకాటపట్టయినను
నయ్యది యేకస్థల మాత్రమనుట నిర్వివాదాంశము. కొక్కొండ
వారును ఛందో వైవిధ్యమున తిక్కనగారు గీచిన గీటు దాటనివారే.
ఇక నీ విషయమున నాంధ్ర సాహిత్యాధునిక కల్పవృక్షమైన "విశ్వ
నాథ" వారి రామాయణము కాణాచి యనుట వాస్తవమే. ఎందులకన
నయ్యది సుమారు 176 సంఖ్యను వైవిధ్యమున చూపుచున్నది.

శ్రీకృష్ణభాగవతమున శాస్త్రిగారు కేవలము వైవిధ్యవ్యామోహ
మున నూత్న పద్యములను ప్రవేశ పెట్టలేదు. వారా ఛందో వైవిధ్య

తీంతముగ వాడుకొనుటయందును, పద్యశిల్ప పరిపోషకముగ దిద్ది వర్చుకొనుటయందును వారి ప్రతిభా సామర్థ్యములు సువ్యక్తమగు చున్నవి.

శాస్త్రిగారు శ్రీకృష్ణ భాగవతమున నౌచిత్యము నెఱిగి తగిన ఛందమును ప్రయోగించుట జరిగినది. అందు శార్దూలాది సుప్రసిద్ధ ములే కాక తరువోజ మత్తకోకిలాదులతో బాటు వనమయూర, మత్త మయూర, సువర్ణ, క్రౌంచపద, శ్యామల, సదాశివాది విశేష వృత్త ములు వాడుట జరిగినది. అంతియకాక సంస్కృత శ్లోకములు రచింప బడినవి. మఱియు విశేషములలో కెల్ల విశేషము "ద్విపద"లు రచింపబడి నవి. కాని మంజరీ ద్విపద లేదు. అది కూడ నుండినచో మరింత రామణీయకమును, మనకు నానందాతిశయమును కలిగెడివి. అటనట భాగవతము కనుక రచన యందు పోతన్నగారి ప్రభావము గోచరిం చును. పోతన్నగారి" కొందరికి దెనుగు గుణమగుననునది యిందును సంస్కృతాంధ్ర మిశ్రరీతుల సోయగము వెల్లి విరిసినది. మఱియును సీసాదుల సంస్కృత పద భూయిష్ట రచనము గోచరించి విశేషానంద మశేషముగ గలిగించును. ఇంత రసవంతమయ్యును, ఒక విధముగ వారి వినయ యాథార్థ్య ప్రకటనము వలె పోతన భాగవతమంత రస వంతముగాకున్నను, శ్రీకృష్ణ భాగవతమునకు రావలసిన ప్రసిద్ధి రాలే దని చెప్పక తప్పదు. యశస్సును పూర్వపుణ్య ఫల ప్రాప్తవమను లీలా శుకుని కృష్ణ కర్ణామృతమునీ యెడ స్మరించుట యౌచిత్య వంతము.

యుద్ధాది సుదీర్ఘ వర్ణనాదులు వచనములందు తీర్చి దిద్ద బడి నవి. ఈ వచన రచనము పూర్వ కావ్యాదులందు వలె నతి ప్రౌఢము గాక సులభ సరళముగ సుబోధకమై యున్నది.

బాణాసుర సంగ్రామమున శైవ జ్వరము విష్ణువునకునోడి

స్తుతించుటయందు గీతావృత్తము, గీర్వాణవృత్తము, ద్విపదములు (10.ఉ.భా. 2-52 నుండి 54.) వాడబడినవి. స్తుత్యుచితముగ గాన యోగ్యముగ గీతాచార్యుని మహిమను పొగడుట యౌచిత్య భాసురము. పిదప దేవలిపి స్ఫురణమున దేవదేవుని గీర్వాణవృత్తముననుు, మ్రొక్కులిడుచు పాదములాశ్రయించుటను చెప్పుచు ద్విపదమును చెప్పుచు సహజ రామణీయకమును సంతరించుకొనినది.

అక్రూరస్తవరాజము దండకము, చంపకము,తరళము, భుజంగ ప్రయాతము, సుగంధి, మత్తేభము, శ్యామల,తోదకవృత్తములయందున్నది. (10.పూ.భా.3-154 నుండి 161.) ఇట భగవత్స్వరూపమునకనువైనదండకము, చేతులుమోడ్చి మ్రొక్కి యర్చలిచ్చుటలో చంపకము, సురాసురల సముద్రమథనమున కూర్మావతారమున తరళము, హిరణ్యాక్షుని యలుకను, జెప్పుటలో భుజంగ ప్రయాతము, ప్రహ్లాదార్తావనత్వమున సుగంధిని, వామనౌన్నత్యమును వర్ణించుటలో మత్తేభ విక్రీడితమును, పరశురాముని భూచక్ర సంచారమున శ్యామలావృత్తము, రావణ సంహారమును గోరి దేవతలు విష్ణువును ప్రార్థించుట, రాఘవుడగుటలో తోదకము, పిదప గీతాచార్యుడైన కృష్ణ ప్రార్థనమున గీత పద్యము కల్కి స్తుతిలో కందమును నౌచిత్య భాసురముగ చూపబడినవి.

ఈ విధముగ సందర్భానుసారముగ వివిధ ఛందముల ప్రయోగము శ్రీ శాస్త్రిగారి ఛంద శ్శాస్త్ర వైదుష్యమును ప్రకటించుచున్నది.

—[]—

# పంచమకళిక

## శాస్త్రజ్ఞత

"శాసనాచ్ఛాస్త్రముచ్యతే" అని వ్యుత్పత్తి. శాసించుటచేత శాస్త్ర మనబడుచున్నదని భావము. కావ్యాదులందు సందర్భానుసారముగ వివిధశాస్త్రముల విషయములు ప్రస్తావింపబడుట సామాన్యము. ఒక్కొకసారి వివిధ శాస్త్ర విషయములు గూఢముగ నుండి భావగోచరమగుచుండును. మఱొక్కసారి శాస్త్రవాక్కులు యథాతథముగ ప్రయోగింపబడుచుండును. అటుల వివిధ నైపుణ్యమాయా కవుల ప్రతిభ ననుసరించి వ్యక్తమగుచుండును.

శ్రీకృష్ణభాగవతము యథామూలముగాన కవి స్వతంత్రతకవకాశమెక్కువయుండదు. శ్రీ శాస్త్రివారు శాస్త్రవాదులు, సంప్రదాయానుయాయులు ననురక్తులగుట జగద్విదితము. శాస్త్రమున కాటంకమాయన సహింపలేరు. అంతయును శాస్త్రానుసారముగ నుండుటయే ఆయనకు సమ్మతము. తప్పనిసరి పరిస్థితిలో తద్విరుద్ధముగ నుండవలసి వచ్చుట జరుగవచ్చును. అవి దోషముకాదు. శాస్త్రానుసారమే జరుగవలసి వచ్చుట ఎవరికిని సాధ్యముకాదు.

ప్రస్తుతము శ్రీకృష్ణభాగవతమున ప్రసక్తానువశముగ గోచరించిన శాస్త్ర విషయములు మచ్చునకు కొన్ని

### ప్రథమ స్కంధము :

"మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతానిచ కావ్యాని ప్రథన్తే" యని శాస్త్రోద్దిష్టము. పూర్వమహాకవులా మార్గమునే యను

సరించుట విదితమే. ప్రాచీనోక్త సన్మార్గమున నే శ్రీ శాస్త్రిగారును సర్వ శుభప్రదముగ "శ్రీ" యుక్త సర్వగురు మగణముతో శ్రీ కృష్ణ భాగవతానువాద ప్రారంభముచేసి శంకరుడైన శంకరుని స్తుతించిరి.

శా॥ శ్రీమీఅన్ గిరిజా సమేతుడగుచున్ సేవించిరా వేల్పులీ
భూమింగాశిక బొల్చి భక్త తతికిం బూర్ణార్ధ సంసిద్ధియున్
క్షేమంబిచ్చెడు విశ్వనాధుడు దయన్వీక్షించి రక్షించుతన్
శ్రీమత్సాగికులాబ్ధి శీతకరునిన్ శ్రీ సూర్యనారాయణున్!

ఇందు శాస్త్రివారు ఆదిపదమునను, మధ్యపదమునను, అంత్య పదమునను "శ్రీ" కారమును నిర్మించి "మంగళాదీని - -" ఇత్యాది శాస్త్రోక్త విధిని నాందియందే చూపి శ్రీకృష్ణభాగవత సర్వశుభత్వ మును సుభగముగ ధ్వని పూర్వకముగ చమత్కరించిరి.

గాండీవి నారద కృష్ణద్వైపాయన మహర్షుల వాక్కును గౌర వించి తన బ్రహ్మాస్త్రంబునశ్రమంబున నుపసంహరించినపట్టున నద్దా నికిగల శాస్త్ర విధిత్వముక్తమయినది.

సీ॥ అని బ్రియుక్తంబగు నా బ్రహ్మ శిరముప
సంహరించుటకు నిర్జరులు నోప
ర్జునుండా చరితాధిక బ్రహ్మచ
ర్య వ్రతుండగుట మరల్ప జాలె
బ్రహ్మచర్యము లేని వాడు మగిడ్చిన
నదివాని బ్రజతోడనవని గూల్చ
బ్రహ్మతేజః ప్రభావముగాన దానికా
మహిత ప్రభావము విహితమయ్యె

తే॥ నట్లునరుడు నిజాస్త్ర సంహారమునొన
రింపగనుగొని ద్రౌణి వారింప నెంచి
శక్తి యుక్తుండుగాకలో శాంతి దక్క

దీనుడై వ్యాసునకు నిట్లు తెలియననియె. 226.

ఇందు బ్రహ్మాస్త్రోప సంహారమునకు నాచరిత బ్రహ్మచర్య వ్రతుడే సమర్ధుడను శాస్త్రనియమము తెలుపబడినది. అట్లు కానిచో నయ్యది వానిని వాని ప్రజను గూడ శీర్యమగునట్లు చేయుననియు నర్జునుడు సమర్ధుడుగాన బ్రహ్మశిరము నుపసంహరింప జాలెననియు ప్రోక్తము.

అర్జునునిచే బంధితుడై గురుకుమారుని దూరుచు కృష్ణుని పలుకులలోని శాస్త్ర ప్రమాణము,

మ॥ నిదురంబోయెడు వాని మద్యపునిస్త్రీనిన్ బాలునిన్ లోలునిన్
గదనంబున్ విడిపాఱువాని విరథున్ ఖండింపరాదందునన్
బొదలున్ బాపమటంచు శాస్త్రములు చెప్పున్ వీడు విప్రుండయ
య్యు దెఱంగిగెను పీనిజంపుటలు శ్రేయోదాయకంబ
యెృడిన్. 234

నిద్రించుచున్న వానిని, మద్యపాయిని, స్త్రీని, బాలుని, లోలుని, యుద్ధ భూమిని విడిచిపోవువానిని, విరథుని జంపరాదనియు, అద్దాని వలన నంహస్సు గలుగునని శాస్త్రప్రమాణమనియు పలుకునెడ నశ్వత్థామ విప్రుడయినప్పటికిని ధర్మము తప్పి ప్రవర్తించెననుచో "బ్రాహ్మణో న హంతవ్యః" యను శాస్త్ర ప్రమాణము సూచింప బడినది.

సర్వుల యభిప్రాయములు విని రాజనీతిజ్ఞుడును జగన్నాటక సూత్రధారియునగు శ్రీకృష్ణపరమాత్ముని పలుకులలోని ధర్మసూక్ష్మత శాస్త్రోక్తవిధికి క్లిష్టమైన పరిస్థితిలో నాపద్ధర్మతకు తార్కాణము.

సీ॥ బ్రాహ్మణుండగుట జంపగరాదనియు నాత
తాయిగావున జంప దగున యనియు
నేనంటి ద్రోవదితో నీవు తలగొట్టి
తెత్తునంటాయమ తెమ్మటనియె

భీమసేనునివాక్య మిా మెయినగుదాని
జెల్లించుటయు నీకు జేయన తగు
నిది గాక ధర్మజుండీతని ప్రాణముల్
దీయంగ రాదని తెలియ జెప్పె

తే॥ ఇన్ని విధముల కార్య మిప్పెన్న వచ్చె
బోలినట్టులు చేయు మోపురుషసింహ
నావుడును జిష్ణుడాకృష్ణు భావ మెఱిగి
చేతగరవాలమును బూని చేర వచ్చి. 245.

భీష్మస్తుతియందు విష్ణుని సర్వవ్యాపకతా ప్రమాణము శాస్త్ర ప్రోక్తమే.

ఉ॥ విష్ణుమయంబు సత్యమగు విష్ణుమయంబు జగత్త్రయంబగున్
విష్ణుమయంబు సర్వమని నిన్ను భజించెద '285'.

## ద్వితీయ స్కంధము :-

శుకయోగీంద్రుడు పాండవ పౌత్రునకు ధారణ గూర్చి పలుకుటలోని యోగశాస్త్ర పథము

సీ॥ పురుషుడాసన యోగమున నేర్పుగలడయి
రేచగాదుల గాలి బ్రిదులనీక
సంగములను వీడి పొంగెడు పదునొండు
నింద్రియంబులకైన యేపడంచి
భగవద్విరాడ్రూప పతితబుద్ధిం జేసి
నెమ్మదిచలనంబు నిలుపవలయు
నటుచేసి జగమెల్ల నా విరాడ్రూపము
గాగనుటె భక్తియోగ ఫలము

తే॥ భూతములును నహంకారమును మహత్తు
ననెడు నేడావరణముల నా విరాట్టు

విశ్వరూపము ధ్యానించు విధమెఱుగుట
ధారణా యోగ ఫలమని తలప వలయు. 22.

ఇందు నాసనము, ప్రాణాయామము, మనో నిగ్రహము, ధ్యానము' సమాధిస్థితి మొదలగు యోగాంగములు ప్రమాణ రీతి నుక్తమయి శాస్త్రాను సరణ మొనర్చుట జరిగినది.

## తృతీయ స్కంధము :-

శ్రీకృష్ణుడు పాండవరాయబారియై దుర్యోధనునిని గూర్చి చేసిన స్పష్టీకరణములో శాస్త్రచ్ఛాయ రేఖా మాత్ర సదృశమై పొడసూపినది.

తే॥ తులసి వనమున గంజాయి మొలచినట్లు
నీకు దుర్యోధనుడు పుట్టెనీకుమార
రూపదవమున నీ వంశమేపు దఱగు
గావునన్ వీని ద్యజియింప గార్యమిపుడు. 19.

దుర్యోధనుని దుష్ప్రవర్తనమున వంశమునకపఖ్యాతి కలిగి పండువంటి వంశమునకు మచ్చ యేర్పడుచున్నదనియు, ప్రస్తుత సత్వర కార్యమేమియన వాని పరిత్యాగమేఅనియు కృష్ణుడు పలుకుటలో "కులము చెఱపు వాడెవ్వడైనను వానిని విడచి కులమునుకాపాడుకొనుట యను పరమ ధర్మము కాన వచ్చుచున్నది. దాని కుపబలకముగ చక్కని సాదృశ్యము "తులసి వనమున గంజాయి మొలచినట్లు" నుట. ఈ సహజోపమానము వలన దుర్యోధనుని ఖలత్వము పాండవుల కొనరించిన యెగ్గులు తీవ్రముగ నిరసింపబడి, హాని స్థానము స్పష్టము చేయబడుచున్నది.

## చతుర్థ స్కంధము :-

స్వాయంభువ మను సంతానమును వివరింపుచు పుత్రికా ధర్మము చెప్పబడినది.

సీ॥ వినుము స్వాయంభువ మనువునకున్ శత
రూపనాబడెడు సరోజ నేత్రి 3.

పుత్ర సంతానం లేనివాడు తన పుత్రికను కన్యాదానము చేయునప్పుడు నామెకు ప్రథమముగ జనించిన పుత్రుడు తనకు పుత్రుడగుగాకయని చెప్పి కన్యనొసంగును. దీనినే పుత్రికాధర్మమందురు. ఇది శాస్త్రి సమ్మతమైన విధి ఇటు మనువు పుత్రి సంతానముగలవాడయినను బహుళ పుత్రికాముడై యిట్లొనరించెనని యెఱుగ వలయును.

## పంచమ స్కంధము:-

బ్రహ్మ ప్రియవ్రతునితో పలుకునెడ సర్వము పరమేశ్వరాధీనమనియు నద్దానిని దేనిచేనైనను దాటజాలమను శాస్త్రి వాక్కు దెలుపును.

తే॥ సిద్ధ తపముచేగాని శాస్త్రియమైన
జ్ఞానమునగాని యణిమాది శక్తిగాని
యర్థమునగాని దేనిచేనైనగాని
స్వామి శాసనముందాట జాలరెవరు. 13.

తే॥ పరుని చేతను నడపింప బడెడునంధు
డొక్కపుడు నీడ నడచు నింకొక్క యప్పు
డెండ నడచునట్టులు సుఖమేని దుఃఖ
మేని కర్మ వశంబున నొనరులకు. 15.

అనుటలో కర్మ వశముననే సుఖదుఃఖాదులు కలుగు ననుట కూడ శాస్త్రి సత్యమయే.

## షష్ఠమ స్కంధము:-

అజామిళోపాఖ్యానమున నజామిళుడేవి శాస్త్రి విరుద్ధ కర్మములో వానినే చేయుటలోని శాస్త్రి భణితి వ్యంగ్య వైభవమున నలరారుచున్నది.

క్రౌంచపదము : "బాటలు గొట్టెన్ జేటలు మెట్టెన్" 26.

దారులు కొట్టుట, పేటల స్వాధీనము, ధనవంతులనపహరించుట, స్త్రీలను వేధించుట మొదలగునవి శాస్త్ర నిషిద్ధ కర్మములు అవి దుష్టమైనవి. వానినాతడు చేయుటలో నాతని శాస్త్రధిక్కారము తెలియుచున్నది.

## సప్తమ స్కంధము:-

ప్రహ్లాద కుమారుని ప్రవర్తనను గూర్చి చెప్పిన పట్టున నుక్తమయిన శాస్త్ర భంగులు వానికి సహజాలంకారములై శోభించినవి.

సీ॥ కలనైన ననృతంబు పలుకడు జంతుహిం
సా కర్మమనగనే శౌరి దలచు. 138.

## అష్టమ స్కంధము :-

గజేంద్ర ప్రార్థనమున పరమాత్ముని స్తుతివేద శాస్త్రోదితమై యలరినది.

చ॥ ఎవడు తనం తదాబొడమి యెల్ల జగంబు సృజించి పెంచియు
త్సవమున దానిలోపలను దా దనలోనదితానె యద్ధియై
తవిలి మెలంగుచున్ దుదకు దానది యంతయు సంహరించువా
డవు పరమేశ్వరుండు జగదాద్యుడునాకు బ్రసన్నుడయ్యెడున్.
46.

ఇందు పరమాత్మ తత్త్వము స్వాయంభువత్వము, సృష్టికర్తృత్వాదికత, సర్వవ్యాపకత, ఆది మధ్యాంతరహితత్వము, ఇత్యాదిగ నుక్తమగుట వేదశాస్త్ర వేద్యమే.

## నవమ స్కంధము :-

చ్యవనుడాశ్వినేయులకు హవిర్భాగమునిచ్చుచు సోమపానార్హణము కలిగించునెడ మఘవుని శాస్త్ర ప్రమాణ యుక్తములయిన పలుకులుక్తమయినవి.

శా। ఈ నాసత్యులు వైద్యులై వఱలుటన్ హీన క్రియారంభులై
గానంబొల్చిరి గాన సోమము గొనంగా వీరుగారర్హుల
ద్దానం జెప్పుచునుంటి. 62.

## దశమ స్కంధము - పూర్వభాగ ప్రథమాశ్వాసము :-

దేవకిని చంప నుద్యోగించు కంసునితో వసుదేవుడు వారించుచు పల్కిన యెడగల శాస్త్ర మార్గము గమనార్హము.

శా। నీ తోబుట్టువు ముద్దరాలెఱుగ దేనేరంబునెల్లప్డు నిన్
జేతో మోదమునందలంచుచును నీ సేమంబె చింతించుచున్
బ్రీతిస్నిపయి నిల్పుచున్ మెలగు నీ నిర్దోషురాలిన్ నవో
ఢాతన్వంగిని దాని జంపినను గూడన్వచ్చు దోసంబయో. 22.

ఈమె నిర్దోషురాలనియు నామెను వధించిన దోషమనియు పలుకులోని గూఢ భావము శాస్త్రానుసారమై యలరారుచున్నది. "ఎంతమంది దోషులు శిక్షారాహిత్యులైనను నొక్క నిర్దోషియైనను శిక్షింపబడరాద" ని శాస్త్రోద్దిష్టము.

## ద్వితీయాశ్వాసము :-

బాలకృష్ణుడు కాళియాహిపై తాండవమాడిన విధము భరత నాట్యశాస్త్రోక్తమై రంజిల్లినది.

మ। ఘనఘోషంబు మృదంగ ఘోషముగ భృంగవ్రాతగానంబుగా
యన గానంబుగ హంసశబ్దములు తాళానూన శబ్దాళిగా
గను దేవళ్ళు సభాసదుల్గ ఫణిరాట్కుంతోత్తమాంగంబు రం
చనరంగంబుగ నాట్యమాడె యదువంశస్వామితా నట్టువై.60.

## తృతీయాశ్వాసము :-

బలరామకృష్ణులు చాణూర ముష్టికులతో మల్లయుద్ధ మొనర్చినపట్టున మల్లయుద్ధ శాస్త్రసంబంధులైన విషయములరయ వచ్చును.

సీ॥ వారలొండొరులను బట్టి కాళులగాళ్ళ
చేతులంజేతులు చిక్కగట్టి 244.

## దశమోత్తరభాగ ప్రథమాశ్వాసము

రుక్మి పరాభవ ఘట్టమున బలభద్రుడు రుక్మిణీనోదార్చుచు ధర్మబద్ధస్వరూప నిరూపణ చేయుట శాస్త్ర సమ్మతమే.

సీ॥ చంపదగిన తప్పు సలిపినన్ బంధువు
జంపజనదు వీడ జనును వాడు. 157.

## ద్వితీయాశ్వాసము:-

హరిహరుల సమర పారీణత వర్ణించునెడ నస్త్రశాస్త్ర విషయము యథోచితము.

సీ॥ హరుడు బ్రహ్మాస్త్రము నడరింప గృష్ణుండు
బ్రహ్మాస్త్రమున దాని ప్రతిభయుడిపె
నీశుండు వాయవ్యమేనిన గంసారి
పార్వతంబున దాని బట్టి చెఱచె
శూలి యాగ్నేయము గీలింప మురవైరి
పార్జన్యమున దాని బలమడంచె
మృడుడు పాశుపతంబు మెఱయింప హరిదాని
నారాయణాస్త్రమునందెఱల్చె

తే॥ జృంభణాస్త్రము సంధించి శ్రీధరుడు
జృంభితుండగు హరుని సంరంభ మెసగ
నేసి మోహితుగా జేసి యెల్లబాణ
సైన్యమును మోదె వివిధాస్త్ర శస్త్రములను. 40.

## తృతీయాశ్వాసము:-

నారదాది పరమర్షులు శ్రీకృష్ణ పరమాత్మను దర్శించి స్తుతించు సందర్భమున శాస్త్ర వాక్యమిటులనున్నది.

ఆ॥ వె॥ వేద రూపమైన నీదగు హృదయంబు
స్వచ్ఛమందు కతన బ్రహ్మకులము
శాస్త్రయోనియనుచు జర్చించి పూజింతు
నీవు బ్రహ్మమగుదు నీరజాక్ష. 48.

## ఏకాదశ స్కంధము:-

చ్యవనుడు నిమికి తత్త్వమును గూర్చి వివరించుచు విహిత ధర్మమును వచించెను. అది యిది,

వ॥ మఱియు స్త్రీ సంగమ మాంసభోజన మద్యపానాదులు పా లకు రాగంబునంజేసి కలుగునవి వర్జనీయములట్లయినను బె యాడిన స్త్రీతోడి సంగమంబును యజ్ఞంబుల మాంస భోజ బును సౌత్రామణ్యాదుల మద్య పానంబును దోషంబు గా వేదంబు చెప్పుచున్నది ధర్మంబెఱింగి. 96.

## ద్వాదశ స్కంధము:-

పరీక్షదాశ్రయార్థము తక్షకుడును, మంత్ర శాస్త్రజ్ఞు నొక విప్రుడును మార్గమధ్యంబున తారసపడిన యెడస్వవిద్యా యులై వర్తిల్లిన సందర్భమున మంత్ర శాస్త్ర ప్రస్తావన మి కాగమించినది.

వ॥ తక్షకుండమ్మహా వృక్షంబు గఱచి పుచ్చుటయు నదియు నా క్షణంబునంద కాలి భస్మంబయ్యెనంత గాశ్యపుండును,

ద్వి॥ ఆ భస్మచయమంత నంతంత జేర్చి
లోభినావర శక్తిలో నెంచుమ్మంచు
నాభాసు నెఱిగి మంత్రానంత శక్తి
నా భద్ర వృక్షంబునప్పుట్టించె.

క॥ తక్షకుండని విని తుండె మునీంద్రా! నీ మంత్ర ప్రభ

బత్యంతస్తోత్ర పాత్రంబు 66 నుండి 68.

ఈ విధముగ నీ శ్రీకృష్ణ భాగవత గత వేద శాస్త్రాది విషయ ప్రస్తావనము సందర్భోచితితో ప్రతిష్ఠితమై యొప్పుచున్నది.

-[]-

# సంస్కృతాంధ్రభాషా పదప్రయోగ దక్షత

## సంస్కృత పదములు ;

### 1. న్యాయ్యము; (9-219)

"ధర్మ పథ్యర్థ న్యాయాదనపేతే 2 న్యాయాదనపేతం న్యాయ్యమ్. ఈ విధముగ నీ న్యాయ్యమను పదమింకను 10వ స్కంధ పూ.భా-2ఆ-70,199, 10-పూ.భా-3-396లందును ప్రయోగింపబడినది.
(సూ. కౌముది 4-4-92)

### 2 క్ష్మవాజాని; (3-31)

క్షమ అనగా భూమియే జాయగా గలవాడను నర్థమున "జాయాయాః నిఙ్" అను సూత్రముచే నిఙ్ అనునది ఆదేశముగా రాగా "క్షమాజాని" యయినది. అట్లే భూజాని, అవనిజాని యనునవి.
(సూ.కౌముది 5-4-134)

### 3. దయాళువు; (3-87)

దయగలవాడను యర్థమున "స్పృహి గృహిపతి దయినిద్రా తన్ద్రాశ్రద్ధాభ్య ఆళుచ్" అను సూత్రముచే "ఆళుచు అనునది వచ్చి దయాళు అగును. అట్లే శ్రద్ధాళు, కృపాళు, కరుణాళు యనునవి. సూ.కౌముది. (3-2-45)

**4. గోపాయిత ;** (10.పూ.భా-2.అశ్వా-292)

గోపవదా చరితామూర్తిః అనునర్థమున "ఉపమానా దాచారే కర్తుః సలోపశ్చ" అను సూత్రముచే ఉపమానమైన గోప శబ్దమునకు అచారార్థమున క్యఙ్ ప్రత్యయము వచ్చి ప్రత్యయమగుటచే 'య' వచ్చి గోప య కాగా "అకృత్సార్వధాతుకయోః దీర్ఘః" అను సూత్రముచే దీర్ఘము వచ్చి గోపా యయయి భూతార్థక తప్రత్యయముక్త ప్రత్యయమురాగా "గోపాయిత" యని యేర్పడును.

(సూ. కౌముది. 3-1-10)

**5. కరుణామయులు:-** (1-178)

"తత్ప్రకృత వచనే మయట్" అను సూత్రముచే "మయట్" అనునది వచ్చి తెలుగు బహువచనమున 'కరుణామయులు' సిద్ధించును'

(సూ.కౌముది 5-4-21)

**6. పరిణామవంతుడు:-**

పరిణామము కలవాడను నర్థమున "తదస్యాస్త్యస్మిన్నితి మతుప్" అను సూత్రముచే "మతుప్" ప్రత్యయము వచ్చును. అదంతములపై మత్‌లోని మకారము వకారమయి పరిణామంత యగును. తెనుగున ఉత్వడుఙ్గు చేరి పరిణామ వంతుడగును.

(సూ.కౌముది (5-2-94)

ఇంకను ఉగ్రంపశ్యుడు, మద్యపుడు, ఇష్టత్వము, పుత్రికా, జగన్మాన్యకా మొదలగు పదములు ప్రయోగింపబడినవి.

**ఆంధ్రములు:-**

**1. వృద్ధు :-** [1-1?4]

"వృద్ధాదుల డుఙ్గనకు లోపము విభాషనగు" అను బాలవ్యాకర్త సూత్రముచే "వృద్ధు" రూపము సిద్ధించును. అట్లే నీచు అనునది

## 2. వాకు (1-300)

"దీర్ఘంబుమీది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగాను" యను సూత్రముచే "వాకు" రూపమేర్పడును. (సూ.బాలవ్యా. తత్సమ.69)

## 3. చిచ్చుటలుగు (1-253)

"కర్మధారయంబునందుత్తునకచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" యను సూత్రముచే నీరూపము సిద్ధించును.

(సూ.బాలవ్యా,సంధి.28)

## 4. రాకన్నె (3-209)

రాచ కన్నె యని యుండగ "సమాసంబునం బ్రాతాదులతొలి యచ్చుమీది వర్ణంబులకెల్లలోపంబు బహుళంబుగానగు" "అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచో గానంబడియెడి" యనుబాల వ్యాకర్త సూత్రద్వయముచే "రాకన్నె" యనునది సిద్ధించును.

(సూ. ఉ.బాలవ్యా.సంధి.36, 39)

## 5. పెద్దఱికము (4-58)

'చిన్నాదులకు ఱికవర్ణకంబగు' అను సూత్రముచే నీ రూపము సిద్ధించును. (సూ.బాలవ్యా. తద్ధిత 3)

## 6. నిడూర్చు (10 పూ.భా. 1.ఆశ్వా-194)

నిడు ఊర్చు – నిట్టూర్చు అని "కఱు చిఱు కడునడు నిడు శబ్దముల అడలకచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు" అను సూత్రముచే సిద్ధించును. అది నిత్య విధి. ఇది కవి స్వతంత్ర ప్రయోగము. (సూ.బాలవ్యా. సంధి-12)

## 7. అన్నంపుముద్ద (10.పూ.భా.1ఆశ్వా-367)

"కర్మధారయంబులందు మువర్ణకంబునకుంబుంపులగు" అను సూత్రముచే నిది సిద్ధించును. (సూ.బాలవ్యా. ఆచ్ఛిక.62)

**8. జాలు** (10 పూ.భా.2ఆశ్వా-99)

జాములు అని యుండగా "బహువచనంబు పరంబగునపుడావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు." అను సూత్రముచే జాలు అని యగును. (సూ.బాలవ్యా.సంధి-32)

**9. కోరికి** (10.పూ.భా-2ఆశ్వా-352)

"ఇకి కోర్యాదులకగు" అను సూత్రముచే "కోరికి" యను నది సాధ్యము. (సూ-బాలవ్యా-కృదంత 16)

**10. తెరవకాండ్రు** (10పూ-భా3ఆశ్వా-87)

"కాకత్రియ వర్ణంబులు పుంస్త్వ స్త్రీత్వంబులమతబద్ధంబునందాటాదులకునగు" అనుసూత్రముచే తెరవకాడు సిద్ధించును. బహుత్వమున తెరవకాండ్రు కాగలదు. (సూ-బాలవ్యా-తద్ధిత.11)

**11. ఇంద్రనీలము తళ్కు** (11-14)

ఇచట "కర్మధారయంబులందు మువర్ణకంనకుం బుంపులగు అను సూత్రముచే పుంప్వాదేశము రావలసి యుండగ ఇంద్రనీలము తళ్కు అని పుంప్వాదేశ విరహితముగ ప్రయోగింపబడినది. ఇదియు కవి స్వతంత్ర ప్రయోగము. (సూ-బాలవ్యా-సంధి 32)

**12. ఆత్రపడుచు** (12-127)

ఆత్రము పడుచు అని యుండగ "పద్యాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు" అను సూత్రముచే 'ఆత్రపడుచు' అనునది సాధ్యము.

(సూ-బాలవ్యా-సంధి-46)

**13. తళ్కు** (11-14)

"లాతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుము లోపంబు గానంబడియెడి" అను సూత్రముచే నీ రూపము సిద్ధించును.

(సూ-బాలవ్యా-ప్రకీర్ణ-18)

**14.** గిక్షకున్ (12-55)

తక్షకున్ అను రూపమున కామ్రేడితమునందు "నిందయందామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీలగు" అను సూత్రముచే తక్షకున్ గిక్షకున్ అనునది సిద్ధించును.

(సూ-బాలవ్యా-ప్రకీర్ణ 22)

ఇంకను మొక్కవీడు, చుట్టలన్, చరిత, గోళ్ళులు, నీలాల, చెట్టడు మొదలగు పద ప్రయోగములు గలవు.

ఈ ప్రయోగములన్నియు శ్రీశాస్త్రిగారి వ్యాకరణ వైశారద్యమును పట్టియిచ్చునవియై యున్నవనుట నిజము.

—[]—

## లోకజ్ఞత

మహాకవులు శాస్త్రజ్ఞులేకాక లోకజ్ఞులునై యుండుట యసాధారణ విషయమేమియుకాదు. కవిపై లోకప్రభావము తప్పని సరిగనుండును. ఏదో సందర్భమున కవి ప్రత్యక్షముగనో, పరోక్షముగనో తన కాలమానపరిస్థితులను తన రచనమున చూపుట జరుగును. కావున రచనల మూలమున నాయానాటి సాంఘిక, మత, సంప్రదాయాది కాలమాన పరిస్థితులను గమనించుట సాధ్యమగుచుండును. ప్రకృతి పరిశీలనాదులును లోకజ్ఞత్వ పరిధికే వచ్చును.

ఆంధ్ర సాహిత్యమున పరమ పూజ్యులయిన మూవురాది కవుల యందును దిక్కన లోకజ్ఞత్వమ-పారము. పిమ్మట కవిసార్వభౌమునిగ నజరామర యశోవిరాజితుడయిన శ్రీనాథకవిరాజు గణనీయుడు. ఇక రాయలవారి బహుముఖ పాండితీ ప్రతిభకు లోకజ్ఞతా శేముషికిని వారి "యాముక్త మాల్యద" కాణాచియ. ఇట్టి యాంధ్రభోజుని

సరసన కూరుచుండ జాలిన మూర్తి తెన్నాలియే. ఈరీతిగ నెంతయిన చెప్పవచ్చును. ఇట్టి యీరీతి పథికులుగ నీ శ్రీకృష్ణభాగవత సృష్టి కర్త యయిన శ్రీశాస్త్రివారిని గూడ నిర్ణయింప వచ్చును. అసలు సృష్టికర్తకు వలయునది తప్పనిసరిగ లోకజ్ఞతయగును.

శ్రీశాస్త్రిగారును లోకమును నిశితముగ పరిశీలించిన వారని శ్రీకృష్ణభాగవతమున నాయా సందర్భములు స్పష్టపఱచును. కావ్యాదులకు శోభ గూర్చునది యా స్వీయతా ముద్రయే. శాస్త్రిగారు మొదటి నుండియు గ్రాంథిక భాషావాదులు. గ్రామ్యభాషను నిరసించి పలు పొత్తములు వ్రాసిన వారు, కాని యన్యదేశ్యములు, మాండలికములు లోనగునవి ప్రయోగింప నంగీకృతులే అని యెంచవచ్చును.

ప్రస్తుతము శ్రీకృష్ణభాగవతమాధారముగ వారి లోకజ్ఞత నించుక పరిశీలింపబడును. లోక వ్యవహార ప్రాచుర్యమునందిన పదములు కృత్యవతారికలో ప్రయోగింపబడుట చూడవచ్చును.

బాలరామకృష్ణులు తోడి గోపబాలురను గూడి క్రీడల తేలిన

సీ॥ ఉప్పట్టులాడుచునుందు రొక్కప్పుడొ
కప్పుడు గొణిబిళ్ళలాడుచుండ్రు
బంతులాడుదు రొక్కపట్టునందిక పట్టు
నందొగి గొక్కుల నాడు చుండ్రు
చెడుగుళ్ళలాడుదు రెడనెడ నింకొక్క
డగునెడ జాటాటు లాడు చుండ్రు
డాగురు మూతలాడగడంగుదు రొకప్డొ
కపుడు వెన్నెల వత్తులాడుచుందు

తే॥ రీతలాడుచు జెట్లెక్కి యులకు దుముకు
లాడుచున్ బర్వులెత్తుచు హస్త యుగము
లానుచును గోతి కొమ్మచ్చులాడుకొనుచు

రామకృష్ణులు విహరింతుర్రి ప్రేముడినట. 10.పూ.భా.1-294.

ఇందునుక్తమయిన క్రీడలన్నియు నాంధ్ర బాలురాడు నట్టివి.

ఉప్పట్టులనగా భూమిపై గడులుగీచి రెండు కక్షము లేర్పడి "ఉప్పు - ఉప్పు" అని యఱచుచునాడు నట్టిది.

గోణిబిళ్ళ: యవాకారమైన కఱ్ఱ బిళ్ళను మూరెడు కఱ్ఱతో గొట్టుచు నాడునది. గోటీ బిళ్ళ యనియు నందురు.

కొక్కొ: కక్షము లేర్పడియో డిపోయినవాని కూరుచుండ బెట్టికొక్కో యని లేవనెత్తుచు నాడునది. దీనిని 'కోకో' యనియు పిలతురు.

చెడుగుడు: రెండు కక్షములై యొక్కొక్కడు వారి వారి వైపులకేగి గుడిగుడి చెంగుడి గుడి యని కూయుచునాడునది. ఇదియే "కబాడీ" యాట.

జాఱాట: నున్నని పలక నేటవాలుగ నిడి పై కెక్కిదానిపై నుండి క్రిందికి జాఱుచునాడునది. ఇదియే జాఱుడుబల్లాట.

దాగురుమూతలు: కన్నులు మూసి యితరులు దాగి యుండ వారి వారిని గుర్తించుచు నాడు నాట. ఇదియే దాగుడు మూతలు.

వెన్నెల వత్తులు: వెన్నెలలో దెల్లని గుడ్డ వత్తి పడవైచి దాని నావలి వారు కనుగొని పట్టి యాడునాట.

ఈతలాడుట: జలకేళి.

కోతి కొమ్మచ్చులు: చెట్లెక్కి దుముకుట.

కార్తీక మాధవార్చన విధానము వర్ణింపబడుట.

మ॥ ఎలమిన్ గార్తిక మాధవుండు ద్విజగ ద్వ్యాపా పరస్వాంతుడై
యిలపై మెట్టగ రాదదీయు లపుడెంతో భక్తిభావించిర
త్తులసీకాంత సహస్ర దీపములతో దోతెచ్చె నెత్తమ్మిపూల్
సెలగం జల్లె ననంటి పండ్లిడె వహించెన్ బెల్లు వింజామరుల్.

10-పూ-భా 2--160

ఇందు తులసిని దీపాదుల నర్చించుట యను లోకాచారము చెప్పబడినది.

తే॥ ఎల్లచోటుల నాగ్రయణేష్టి కృతులు 10-పూ-భా-2-168.

ఇందాగ్రయణేష్టి యనగ శరత్కాలమున నూత్న ధాన్యములు వచ్చిన సందర్భమున నా ధాన్యములతో నొనర్చెడునగ్న్యారాధనము. ఇది వైదికాచారము.

ప్రాతః కాల కుక్కుట ధ్వనిని తీవ్రముగ నిరసించు కృష్ణ పత్నుల వ్యథా భరిత హృదయము.

ఆ॥ కోళ్ళకేమి వచ్చె గొండ ప్రక్కంబిండి
సిద్ధిపోవు నరుణు నిగిడిలేపి
మనకు విరహ తాప మొనరించెడిన్ వీని
మొఱటు కూత మూడు ముక్కలుగను. 10-ఉ-భా-2,172.

ఇందు వారు విరహతప్తులై శ్రోత్రయుగంబుల సూది పోటుగ నున్నయా కుక్కుట ధ్వనిని "వీని మొఱటు కూత మూడు ముక్కలు గను" యని తమ వ్యథను బహిర్గతము చేసినట్లు చెప్పబడినది; "ఈ మొఱటు కూత - - - -" యనునది చక్కని స్త్రీ లోక వ్యవహారము, ముక్కలవ్వ, చెక్కలవ్వ, బద్దలవ్వ యిత్యాదిగను వాడుక కనిపించును. ఈ నిరసన భావమును ద్యోతకముచేయుటకు నిచట చక్కని ప్రజా ప్రాచుర్య పదము ప్రయోగింపబడి కర్తృలోకజ్ఞతను పట్టి యిచ్చునదై యున్నది.

ఇత్యాది రీతిగ నాయాయి పట్టున సందర్భానుసారముగ శ్రీ కృష్ణభాగవతమున శాస్త్రివారిలోకజ్ఞత కానుపించును.

—[]—

# ఆలంకారిక పద ప్రయోగనైపు

ఆలంకారిక రచనాప్రయోగమే జాతీయములకు దారి తీయును. ప్రతిభాషలోనిట్టివి లెక్కకు మిక్కిలిగనుండుట సహజము. వ్యవహార మున నుండిన ఈ పదములు మిగులనరుగుటచే వీనిలో నాలంకారిక లక్షణము గుర్తింపబడక పోవచ్చును.

ఒక శబ్దము చెవినిబడగనే దాని యర్థమెట్లు స్ఫురించుచుండు ననునది యొక విచిత్ర సమస్య. పతంజలి దీనిని తన తీక్ష్ణదృష్టి తోడను, కుశాగ్ర బుద్ధితోను బహు విధముల పర్యాలోచనము చేసి నాడు. అంతకుముందును శబ్ద శాస్త్ర నిధులగు స్ఫోటాయనాది మహ ర్షులు దీనిని గూర్చి చర్చించుట జరిగినది. ఆతని తరువాతివారునగు నాగేశ భట్టాదులును దీనిని గూర్చి తర్కించినవారలే.

పదార్థము ద్రవ్యముగాని శబ్దము కాదు. పదార్థమునకు సంకే తము శబ్దము, వ్యాపారము, క్రియ, వర్ణము, గుణము, ఇవేవియు శబ్దము కాజాలవు. కావున శబ్దమునిట్లు నిర్వచించవచ్చును. దేనినుచ్ఛ రింపగనే వలయు వర్ణనము కలిగినమూర్తి స్ఫురించునో, యర్థబోధ కలుగునో యది "శబ్దము",

ఈ శబ్దార్థములకు నియత సంబంధము లేదు, "సిద్ధేశబ్దార్థ సం బంధే" అను పాణినీయ సూత్రమును వ్యాఖ్యానించుచు శబ్దార్థ సంబం ధము లోకమునుండియే తెలియుచున్నదని 'పతంజలి' వ్యాఖ్యానించెను.

నూతనార్థ ప్రతిపాదనమునకయి సంయుక్త పదరూపత్వ లక్ష ణము కలిగిన తెలుగు భాష సమాస రచనా విధానమును విరివిగ ప్రయోగించు కొనుచున్నది. రెండు నామ పదములు గూడి సమాస

మగును. ధాత్వాదులకు ధాతువుగూడి శబ్దపల్లవమగును. రెండింటను సమానముగనూతనార్థమున్నది. ఇవియునొకవిధముగచూచినజాతీయ ప్రయోగములే. కొన్ని శబ్ద పల్లవ క్రియలలో నీ లక్షణము కొట్టవచ్చినట్లు కనబడు చుండగ (పాల్వతి కన్నెటింగి మొదలగునవి) కొన్నింటనిదియంతగ కనుపింపదు. కూర్చుండు మొదలగునవి, ఇక పైవానికన్నింటి కంటెను విలక్షణమైన జాతీయ ప్రయోగములుకొన్ని కలవు. ఇవి యేక పదములుగావు, పద బంధములతో గూడినప్రయోగములుPhrsal Idioms హాకెట్ యను పాశ్చాత్య పండితుడు తన "A course of modern lingaistics" అను గ్రంథమున దీని నిట్లు నిర్వచించెను.

"A term of expression characteristic of a language which isn't logically grammetically explainable"

ఈ సామెతలనుగూర్చి పల్వురు పశ్చాత్య పండితులు తమ యభిప్రాయములను వెలిబుచ్చిరి. అరిస్టాటిల్

A proverb is remnent from old phylosophy preservs amidst countless destructions, by reason of its brevty and titness for use' అనియు సర్వెంట్స్

Short sentences drawn from long experience అనియు బేకాన్

'Edged tools of speech' అనియుహేమిడ్

'A proverb is to speech what salt is to food. అనియును ఈ పదబంధములను గూర్చి పలికిరి.

భాషాస్వభావమును బట్టి చెప్పుకొనదగిన యొకానొక విలక్షణమగు పలుకుబడి సిద్ధించుట ప్రతిభాష యందును సహజము. ఆ భాష మాట్లాడు ప్రజల సాంఘిక మత రాజకీయ పరిస్థితులవలనను, ఆచార వ్యవహారములవలనను, మఱియు నెన్నో యితరకారణముల వలనను భాష కట్టి ప్రత్యేకత యేర్పడును. అట్టి పలుకుబడులను జాతీయములనియు, నానుడులనియు, సామెతలనియు వ్యవహరించుటగలదు. అర్థమునననుసరించి యివి యన్నియు నేడు పర్యాయ పద

ములుగ చెప్పబడుచున్నవి. సంస్కృతమందలి సూక్తులు నిట్టివే. వీని వలన కావ్యాదులకొక విశిష్టశోభ చేకూరును. ఈపద ప్రయోగమునే ఆలంకారిక పద ప్రయోగమన వచ్చును.

శ్రీకృష్ణభాగవతముననట్టి ప్రయోగములు బహు సందర్భములందు ప్రయోగింపబడినవి. అవి యెల్ల శాస్త్రవర్యుల బహుముఖ లోకజ్ఞతా సూచకములై యలరారుచున్నవి.

## 1. సంస్కృతములు :-

| | |
|---|---|
| కావ్యాలాపాంశ్చ వర్జయేత్ | - 1 - 172 |
| సర్వం విష్ణుమయం జగత్ | - 7 - 146 |
| అపుత్రస్య గతిర్నాస్తి | - 9 - 157 |

## 2. ఆంధ్రములు :-

| | |
|---|---|
| శ్రుతికింజేకూర్పగా బర్వమున్ | - 1 - 124 |
| కనుసన్నలనె | - 1 - 176 |
| మెఱపు మెరిసిన చందాన | - 1 - 195 |
| కంటికి మంటికి నేకధారగ | - 1 - 205 |
| కడకాలదన్ను | - 1 - 207 |
| గొడ్డునుబోలెకట్టుట | - 1 - 287 |
| ఊచకోతలుగ | - 1 - 242 |
| వడవడ వడంకు | - 1 - 232 |
| కనుదోయినీర్ కాలువగట్టు | - 1 - 251 |
| మొఱ్ఱవెట్టు | - 1 - 255 |
| గాలికి మబ్బులట్లు | - 1 - 270 |
| పుణ్యలేశము | - 1 - 274 |
| రాజ్యము వీర భోజ్యము | - 1 - 286 |

—[]—

# షష్ఠకళిక

## పూర్వకవి రచనా ప్రభావము

సారస్వత లోకమున ప్రాచీనకవుల రచనారీతులు తదనంతర కవులయందు గోచరించుట సర్వసాధారణ విషయమును సహజమును. మహాకవులు తమపూర్వకవుల శైలీ విన్యాసాదులను కూలంకషముగ పరిశీలించి గ్రహించి తమ రచనలకు ఒరవడి పెట్టుకొందురు. అట్లగుటప్రత్యక్షముగ పూర్వకవుల ప్రభావము ప్రయత్నసహితముగనో, ప్రయత్న రహితముగనో ఆయా కవుల రచనములందు దర్శనీయ మగుచుండును. అటుల కానవచ్చుట యనుకరణ మెంతమాత్రమును కాబోదు. అటనట నితర కవుల ప్రభావమగుపించినను మహాకవులకు తమదైన ప్రత్యేక రచనా పద్ధతి తప్పక యుండును.

మహాకవుల కోవకు చెందిన శాస్త్రివర్యుల "శ్రీకృష్ణభాగవత" రచనమునందును అచ్చటచ్చట నన్నయాది పూర్వకవివర్యుల ప్రభావము కానవచ్చును. ఇంచుక పరిశీలించి చూపుదును.

### నన్నయ:-

పరీక్షిన్మహారాజును క్రోధముతో శపించిన కుమారుని చూచి శమీక మహర్షి తాపస సహజమయిన శాంత స్వభావముతో పలికిన సందర్భమున శ్రీకృష్ణభాగవతమున నౌచిత్యవంతముగ కవిసార్వభౌములీ క్రింది పద్యమును రచించిరి.

ఉ. కోపము సత్యముం జెఱచు గోపము తాపము గల్గజేసెడుం
గోపము వైర కారణము కోపము ధర్మమునుం దొలంచెడుం
గోపము సర్వకార్యములకుం బ్రతిరోధకరంబు కోపమే
పాపము కోపియైన జనవంచితుడై నరుడందు గష్టముల్. 1-385.

దీనిపై నన్నయగారి రచనమున- జనమేజయునకు పరీక్షితుని శాపకారణాదికమును మంత్రులు చెప్పిన సందర్భములోని యీ క్రింది పద్య ప్రభావము ద్యోతకమగును.

## తిక్కన :-

వామన చరిత్ర సందర్భమున శుక్రహితము వినియు బలిచక్రవర్తి తన స్థిర నిశ్చయమును పలికిన పట్టున శ్రీకృష్ణభాగవతమున నీపద్యము చేయబడినది.

ఉ. వచ్చినవాడు విష్ణువన వచ్చెడు గాని వటుండొకండు నా
వచ్చనె యంటిపట్లయిన నయ్యరె నాదునదృష్ట మెంతయున్
హెచ్చినుతింప వచ్చునని యే వచియించెద నద్ది వేయియేం
డ్లచ్చతపంబు నేయు మునులందెడు భాగ్యముకాదె భార్గవా.
8-225.

ఈ పద్యము తిక్కనగారి విరాటపర్వమున - భీష్ముడర్జునునజ్ఞాత వత్సర వ్యాప్తి నిష్కర్షించుచు దుర్యోధనునితో పలుకు సందర్భములోని క్రిందిపద్యమును తలపునకు తెచ్చుచు తిక్కనగారి రచనను స్ఫురింపజేయును.

ఉ. వచ్చినవాడు ఫల్గును డవశ్యము గెల్తు మనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుగుందగుందొడరుటెల్ల విధంబుల కోర్చుటట్లుగా
కిచ్చ దలంచి యొక్కమెయి నిత్తటి బొందగుచేతయుందగున్.
విరాట 4-234.

ఎఱ్ఱన:-

శ్రీకృష్ణ జన్మమును ప్రతీక్షించు కంసుని గూర్చి శాస్త్రివర్యులీ క్రింది పద్యమును స్వభావోక్తి భాసురముగ జెప్పిరి.

ఆ. కూరుచున్న బండుకొన్నను నిలచిన
దిరుగుచున్న దిండి దినుచునున్న
దాగ్రుచున్న భీతి దైత్యారి నెంచి జ
గమ్ము విష్ణుమయముగా దలంచి. 10-పూ-భా1-54.

ఇది యెఱ్ఱనగారి నృసింహ పురాణములో ప్రహ్లాద వర్తనము చెప్పబడిన పట్టున కల క్రింది పద్యమును పోలియున్నది.

ఆ. కుడిచినపుడు నిద్ర కూరిన యప్పుడు
మేలుకొనిన యపుడు మెలగినపుడు
విష్ణు కీర్తనంబు విష్ణు చింతయ కాని
పలుకడొందు బుద్ధి దలపడొందు. 3-150.

భాస్కరుడు:-

రావణాపహృతయై కొనిపోబడుచున్న సీత రామునికై పలవించుటలో కరుణము మూర్తీభవింపబడిన క్రింది సీసము శ్రీకృష్ణభాగవతమున రచింపబడినది.

సీ. వేల్పులారా। నేల దాల్పులారా। మీరు
నా వెతల్ దెల్పరే నా విభునకు
సిద్ధులారా। సుప్రసిద్ధులారా। మీరు
నా వెతల్ దెల్పరే నా విభునకు
యక్షులారా। కార్యదక్షులారా। మీరు
నా వెతల్ దెల్పరే నా విభునకు
సాధ్యులారా। పరాసాధ్యులారా। మీరు
నా వెతల్ దెల్పరే నా విభునకు

తుషితులారా। జగత్త్రియ। హృషితులారా।
విశ్వులారా। సురక్షిత విశ్వులారా।
వసువులారా। మహా తపోవసువులారా।
నావెతల్ మీరు దెల్పరే నా విభునకు. 9-234.

ఈ పద్యము భాస్కర రామాయణమున రాముడు సీతకై పల
ించిన సందర్భమున చెప్పబడిన క్రింది సీస పద్యమును తలపించును.

తాళంబ కానవే తాళఫలస్తని
గుందంబ కానవే కుందరదన
దిలకంబకానవే తిలకరమ్యలలాట
గమలంబ కానవే కమల వదన
హరిణంబ కానవే హరిణ బాలేక్షణ
సింహంబ కానవే సింహమధ్య
పిక రాజ కానవే పికమంజులస్వన
గీరంబకానవే కీరవాణి.
లలిత కలభంబ కానవే కలభగమన
బంధుజీవమకానవే బంధుజీవ
మైన జనకనందన సీతననుచు రాము
డచట నచట నీగతి వాని నడిగి యడిగి. అరణ్య.2-267.

రరాజు వేంకటనాథుడు:-

యశోద దధి మథించిన సందర్భమున శాస్త్రివర్యులీ సొగసైన
్య రచన నొనర్చిరి.

వడిగుడి వైపుగా నెడమ వైపుగ జేతులు బొమ్మ్మ శీర్షమున్
ాడ్చుచున్నటువు మేనది యెల్ల జలింపగాజులున్
ాగలుగు గజ్జెలు గల్గలుమంచు మ్రోయ జి
ువదచ్చుచునుండె యశోదమేల్దధిన్.

ఇది బైచరాజు వేంకటనాథుని "పంచతంత్రము" లోని క్రింది పద్య ప్రభావితమైయున్నది.

ఉ॥ వేవిన నిద్రమేలుకని వేఱొక బానకు నేర్పుతోడ బై
మీవడబుచ్చి కవ్వమిడి మిట్టుచనుంగవ రాయిడింప మే
దీవ నటింప నెన్నడుము దీలుపడం గటి గుల్కు కాచముల్
జోవల బాడ జల్ల దరుచున్నది దర్శిణి రజ్జుపాణియై .1-590.

## శ్రీనాథుడు :-

కృష్ణార్జునులు కాళిందిని కాంచిన పట్టున శ్రీకృష్ణభాగవతమున క్రింది హృద్య పద్యమున్నది.

మ॥ కనిరాకృష్ణుడు నర్జునుండును జలాగ్రంబందు గన్యామణిన్
వనితాలోక పరిష్టుతాంగ సుషమా వ్యావిద్ధ విద్యుద్ఘృణిన్
వన జాతాయుతలోచనన్ బ్రవిలసత్స్వర్ణప్రభా రోచనన్
దినరత్నోత్తమవు త్రికన్ బ్రవిలసద్ధీహృష్ట లోకత్రికన్.
10.ఉ.భా.1-313.

ఇది శ్రీనాథకవిసార్వభౌముని "శృంగారనైషధము"న రాజ హంస నలునకు దమయంతిని గూర్చి చెప్పిన సందర్భమున కల క్రింది పద్యమును పోలియున్నది.

మ। కమలేందీవర షండమండిత లసత్కాసార సేవారతిన్
గమికర్మీకృత నై కనీవృతుడునై కంటిన్ విదర్భంబునన్
రమణింబల్లవపాణి బద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీనస్తనినస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరిన్. 2-21

## పిల్లల వఁట్టిపిన వీరన :-

పులహాముర్యా శ్రమ ప్రాంతమును వర్ణింపుచు శాస్త్రివర్యులు

శాంతరస భాసురముగ క్రింది పద్యమును జేసిరి.

చ॥ కులుకున నేన్గులేనుగుల గొంగలు గోరికనాలు నాలదిం
డ్లెలుకలు నెల్కగొంటు లొక యంతయు లోనెడలేక యందునన్
గల జడదారి రాయలకు గల్గిన తేజున నొక్క గొంతుగా
నలరెడునల్లకాన గొని యాడగ నౌననరాదు బ్రహ్మకున్.

5-103.

ఈ పద్యము పినవీరన "శృంగారశాకుంతలము" లోని కణ్వా శ్రమ ప్రాంత వర్ణనమున గల యీ క్రింది సీస పద్యమును తలపునకు తెచ్చును.

సీ॥ వృద్ధ సింహమునకు విహరింప దొండంబు
కై దండ గానిచ్చు గంధ గజము
పులిక్రొత్త యానిన పొదరింటి లోనికి
బురిడావి తగపు గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ళ శిరము దువ్వగ జొక్కి
కనుమోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింత
లేక చన్నిచ్చు బాలెంత కరిణి

గీ॥ యెలుక తోడుత జెరలాడు నెనసి పిల్లి
నెమ్మి బురివిచ్చి నిలచి పింఛమ్ము నీడ
భుజగ కన్యకనాడించు బూరి నమలి
యనఘు కణ్వము నిండు ప్రణ్యాశ్రమమున. 2-45.

వెంల్లి :-

శ్రీకృష్ణుడుద్ధవునకు ఈశ్వరధ్యాన లక్షణముల నెఱిగించిన పట్టు - ఏకాదశ స్కంధమున క్రింది సీసమును శాస్త్రివర్యులుకూర్చిరి

సీ॥ నీలమేఘచ్ఛాయ నెటిమీఱు మేని వా
డబ్జములంబోలు నక్షియుగము
వాడు చక్కని మోము వాడు మేలగు నాల్గు
భుజములు కలవాడు బూమెలాడు
కంబు కంఠము వాడు కమనీయ కుండల
గండ స్థలము వాడు దండి కెక్కు
వక్షస్థలము వాడు బంగారు దువ్వల్వ
వలె వాటుగా దాల్చి వలువాడు.

గీ॥ కౌస్తుభము లక్ష్మి యురమున గలుగువాడు
శంఖచక్ర గదాఖడ్గ జలజమాల
లను ధరించినవాడు మేల్మణి కిరీట
కటక కేయూరములవాడు గ్రాలుచుండు. 11-231.

ఇది "మొల్ల రామాయణము" లోని శ్రీరామరూపవర్ణనము కల కింది సీసమును పోలియున్నది.

సీ॥ నీలమేఘచ్ఛాయ బోలు దేహము వాడు
ధవళాబ్జ పత్ర నేత్రములవాడు
కంబు సన్నిభమైన కంఠంబు కలవాడు
బాగైన యట్టి గుల్ఫములవాడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహుల వాడు
ఘనమైన దుందుభి స్వనము వాడు
పద్మరేఖలు గల్గు పద యుగంబుల వాడు
చక్కని పీన వక్షంబు వాడు.

గీ॥ కపట మెఱుగని సత్య వాక్యముల వాడు

ఇన్ని గుణములు రూపింపనెసగువాడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెవాడు. సుందర. 102.

భాగవత సామ్యముచే పోతన రచనా రీతులు వైషయకముగను, శైలీ యుతమగను పోలి నటుల శ్రీకృష్ణభాగవతమున కానవగును. ఒండు రెండు ప్రదర్శింతును.

పరీక్షిత్తు వేటాడి పిపాసా పీడితుడై తన స్థితిని భావన చేయు పట్టున నీ క్రింది కందమునందముగ శాస్త్రివర్యులు రచించిరి.

క॥ సప్తవ్యసనములందుం
బ్రాప్తించిన నొక్కడేని పండితుడైనం
దృప్తుడయి చెడును వానికి
వ్యాప్తించెడు నెల్ల శ్రమలు పరముందప్పన్. 1-375

ఇది పోతన భాగవతములోని వామన చరిత్ర ఘట్టమున గల క్రింది పద్య ప్రభావమును గలిగియున్నది.

క. వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్
దృప్తింజెందని మనుజుడు
సప్తద్వీపములనైన జక్కంబడునే. 8-574.

## శ్రీకృష్ణదేవరాయులు :-

వైకుంఠ వర్ణన సందర్భముగ క్రింది రమణీయ పద్యము శాస్త్రి వర్యుల భాగవతమున రచింపబడినది.

ఉ. ఆ నగరీలలామమున నద్ధమరే జని యాలకించినన్
జానుగదోచు శాస్త్రముల చర్చయు నర్చిత వేద పాఠముల్
కానని వస్తువుంగనెడు గాథలబోధలు సాధు సన్నుతుల్
జ్ఞానకథాప్రసంగములు సంతతమున్వర సౌధవీధులన్. 2-109.

దీనిపై రాయలవారి "ఆముక్తమాల్యద" లోని క్రింది పద్య
చనా ప్రభావము తోచును.

శా. ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయునెం
తే నాగేంద్ర శయానుపుణ్య కథలున్ దివ్య ప్రబంధానుసం
ధాన ధ్వానము నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠపంచకృపయా భోక్తవ్యమన్నాటులున్.1-84.

పెద్దన :-

వైకుంఠ వర్ణన సందర్భముగ
నలువ చెలువ యమిన పలుకు కలికిని స్తుతించుచు శాస్త్రిగారు
ఈ సీస పద్య రచన మొనర్చిరి.

సీ. సిరము పూబూప చందురుని వెన్నెలతోని
గారంపు దెలిమేని కళలు నెఱయ
బాణి నాడెడు చిల్క పల్కులు మీటువ
ల్లకి కనుగుణ తాళలయలుగాగ
నుపనిషత్తులు నిత్యముడిగంపు చెలియలై
యిరుచక్కి వీచోపు లిడుచునుండ
నొండొంటు పయ్యంటు నొరయు సంగీత సా
హిత్య ద్వయంబున నెసగ నరులు

గీ. అంచ వాహన మం దూర్మి నధివసించి
పంచమశ్రుతి వీణ వాయించుకొనుచు
జగము లేలగ వెలసిన చదువు చెలువ
నలువరాణి మదాత్మలో వెలయుగాక. 1-10.

ఇది యదే సందర్భముగ "మనుచరిత్రము" న పెద్దనగారిచే
రచింపబడిన క్రింది సీసమును పోలి యున్నది.

సీ. చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే
సిందూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు నందున్న యెలదేటి
రుతికించిదంచిత శ్రుతులసీన
ఘనమైన రారాపు చనుదోయి రాయడి
దుంబీ ఫలంబు తుందుడుకు జెంద
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరికట్టు
లింగిలీకపు వింత రంగులీన.

గీ. నుపనిషత్తులు బోటులై యోలగింప
బుండరీకాసనమున కూర్చుండి మదికి
నించు వేడుక వీణ వాయించు చెలువ
నలువరాణి మదాత్మలో నిలుచుగాత. 1-5.

## తెనాలి రామ కృష్ణుడు:-

అజామిళోపాఖ్యానమున శాస్త్రిగారు ప్రాసగువంటి క్రింది పద్యమును రచించిరి.

ఉ॥ ప్రాసగు వంశ ధర్మములు పాడయిపోవగ దల్లిదండ్రులన్
రోసి బహిష్కృతుండగుచు రోత జనింపగ నెల్లవారికిన్
దోసము లాచరించుచును దొప్పలు దోరలు మద్యమాంసముల్
వేసర కెల్ల వేళలను వేడుక మీఱగస్వీకరింపుచున్. 6-23.

ఇది తెనాలి వారి "పాండురంగ మాహాత్మ్యము"న నిగమశర్మోపాఖ్యానమున కల క్రింది పద్యమును స్ఫురణకు దెచ్చును.

ఉ॥ ప్రాసగు విత్తువంటి నెఱపాఱు కొలంబునబుట్టి వేదముల్
ప్రోసినగాదె శాస్త్రములు వుట్టిన యిల్లు కళాకలాపముల్
డాసిన రచ్చ యంచు ఖిలంబు దనుంగొని యాడ నొప్పను
ద్భాసిత భాసితద్యుతి సభాపతినా నొకడాహితాగ్నియై. 3-3.

## రామరాజభూషణుడు :-

అగ్నీధ్రుడు పూర్వచిత్తిని చూచిన యెడ శాస్త్రిగారీ క్రింది కమనీయ పద్య రచన చేసిరి.

ఉ. ఈ నడలీ యొయారములు నీ సొగసీబలు నీటు లీ బెడం
గీ నెఱి చూపులీ వగలు నీ పసలీ తగు నేర్పులీ సొరం
బీ నగు మోము నీ తళుకులీ పెనువన్నెలు చిన్నెలెన్నగా
నీ నవలాక చెల్లునిదియ మరునేలెదు బోటిగా దగున్. 5--59.

ఇద్దానిపై "వసుచరిత్ర" లోని గిరికా సౌందర్య వర్ణనమున గల క్రింది కమనీయ పద్య ప్రభావము గోచరించును.

మ. కమనీయాకృతి యోగ్య కీర్తనములన్ గన్పట్టు నా శ్యామ యా
సుమబాణాంబకయాయమూల్యమణియాచొక్కంపుపూబంతియా
సుమనోవల్లరి యాసుధాసరసి యా సొంపొందు డాల్దీవి యా
కొమరుం బ్రాయపురంభ యా చిగురుటాకుంబోడి నీకే

తగున్. 2-52.

## మాదయగారి మల్లన:-

త్రికూటాద్రి వర్ణన మొనర్చుచు శాస్త్రీవర్యులు సొగసగు నీ సీసపద్య రచనము కావించిరి

సీ. చిత్ర చిత్రోన్నత ధాత్రీరుహాంచిత
దేవతోద్యాన సందీపితంబు
మృదుమధుర స్వర విదిత నానావిధ
విహగకూజిత శబ్దవి శ్రుతంబు
స్వర్ణమణీగణ సైకత కూలస
రోవర శతసహ స్రావృతంబు
నాక సరోజాననా స్నాన సంజాత
పరిమళ మిళితాతి పవనగతము.

గీ. దేవతా వారసంచార దివ్యభూత
లాతి రమణీయ భాగము చూతకేత
కీ పనస సాల వర నారి కేళ ముఖ్య
బహువిధ ద్రుమ కలితమప్పర్వతంబు. 8-21

ఈపద్యశైలి మల్లనకవి "రాజశేఖరచరిత్ర" లోని ఆనంచికాపుర వర్ణనము కల క్రింది సీస పద్యపు శైలిని తలపించును.

సీ. సౌధసరద్వధూ జనదర్పణీభవ
ద్దివ్యలోక స్రవంతీయుతంబు
రజత వప్రస్థాణు గజ చర్మ శాటీ భ
వత్పరి ఘావారి వలయతంబు
శాతమన్యవశిలా స్థగిత కాంచీదామ
భాసురోపవనాళి పరివృతంబు
పౌర ప్రతాపది భ్రాంతి కృత్కుట్టిమ
స్థల శోణమణిరుచిస్థపుటితంబు.

గీ. బహువిధామోద మోదిత భసల కలభ
విసర విస్ఫురర ఝుంకార వేణు నినద
సరసగాయకగాన ప్రసంగ సౌఖ్య
కరకరమగు నావంచికాపురంబు. 1-44.

## చేమకూర వేంకటకవి :-

నారదుడు ధ్రువునకు దర్శనమిచ్చిన పట్టున శ్రీకృష్ణభాగవతమున క్రింది పద్యము రచింపబడినది.

శా. ఆ య్యారే చిఱుతండి తండితని ధైర్యస్థైర్య గాంభీర్యముల్
వెయ్యారుల్ వినుతించునట్టి వగుచున్ విన్నాణముంగూర్చెడున్
సయ్యాటంబుల నుండునట్టి వయసీ చక్కన్గడుం బిన్న వా
డయ్యున్ ఘోరవనంబులం దపముసేయంబూనె

ఈ పద్య రచనాశైలి "విజయవిలాసము" లోని క్రింది పద్య రచనా శైలిని కలిగియున్నది.

క. అయ్యారే చెలువెక్కడ
నయ్యారే గెలువంగ జాలునంగ జునారిన్
వెయ్యాఋలలో సరిలే
రయ్యా! రుచిరాంగ రుచలనయ్యంగనకున్. 1-103.

ఈ రీతిగ శ్రీపాదకవిసార్వభౌముల "శ్రీకృష్ణభాగవతము"న ప్రాచీన కవి చంద్రులయిన నన్నయాదుల ప్రభావము కాన వచ్చును. అంతమాత్రమున శాస్త్రివర్యుల శ్రీకృష్ణభాగవతరచనమును కరణము కాదు. వారి ప్రతిభాశాలితకు నిదర్శనమైన రచనాదక్షతకు "శ్రీకృష్ణభాగవత" మే ప్రబల ప్రమాణము. పై విధముగ శాస్త్రిగారు అయా పూర్వకవుల రచనములను తమ రచన ద్వారమున తలపింప జేయుట నన్నయాది పూర్వ కవులయెడ తమకుగల గౌరవమును, భక్తి ప్రపత్తులను చాటుకొనుట కొఱకే యని సహృదయులు గమనింప గలరు.



# ఆంధ్ర భాగవతములు
# శ్రీ కృష్ణ భాగవత స్థానము

భక్తితత్త్వ ప్రధానముగ మోక్షగ్రంథమని ప్రసిద్ధి వడసినది భాగవతము, "విద్యావతాం భాగవతే పరీక్షా", "భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యానటీకయా" మొదలగు ప్రమాణములను బట్టి భాగవతస్థాయి ప్రస్ఫుటము. అట్టి భాగవతము వ్యాసుడంతటి వాని మనోవిచారమును విదళించి ముదమును కలిగింపజాలినది.

అట్టి సంస్కృత వ్యాసభాగవతమును ఆంధ్రులభాగ్యవశమున "రసదృష్టి"తో తెలుగుల కందింపబూని పుణ్యములను పండిచుగొన్న పోతన్న ప్రథముడు. పిదప "నందిమల్లయ - ఘంటసింగయ" లను ప్రసిద్ధ కవులతో మరి కొందఱు పూర్వకాలమున భాగవతాను వాద మునకు పూనుకొనుట కానవచ్చును. కాని అయ్యవియసమగ్రములు, అటులనే యప్పటి "ద్విపదభాగవతము" మరియొకటి యగుపించును. ఈ యాధునిక కాలమున శ్రీ శాస్త్రివారితోపాటు "శ్రీరామనృసింహ మూర్తి కవులు" గ ప్రసిద్ధినందిన జంటయు భాగవతమును సమగ్ర ముగ ననువదించినది.

శ్రీకృష్ణభాగవతము ప్రధానముగ పోతనభాగవతమును దృష్టి నందిడుకొని యనువదింపబడినదిగ గ్రంథ రచనోద్దేశమున స్పష్ట మగును. శాస్త్రివర్యులు మూలభిన్నములు పరిహరించి యౌచిత్యవంత ములైన కొన్ని మార్పులు మూల సూత్రమునకు భంగము రానీయక, చేసి మూల భాగవతమునకు దగ్గఱగా సరళమాధుర్యముతో "శ్రీకృష్ణ భాగవతము"గ ననువదించుట జరిగినది.
ఈ విషయమింతకుమున్ను ప్రకరణముల సప్రమాణముగ స్పష్ట మొనర్పబడుప జరిగినది.

పై రీతిగ "మూలవిధేయదృష్టి"తో అనువదింపబడిన ఆంధ్ర భాగవతములలో శ్రీపాద కవిసార్వభౌముల "శ్రీకృష్ణభాగవతము" నకు గణనీయమైన స్థానము కలదనుటలోనే విప్రతి పత్తియు నుండబోదు.



# సప్తమ కళిక

## శాస్త్రివారి వ్యక్తిత్వము - స్థానము

ప్రతివ్యక్తియందును వ్యక్తిత్వముండును. అది సామాన్యము. మహాపురుషుల వ్యక్తిత్వము వైశిష్ట్యమును సంతరించుకొని యప్రతిమానమై యద్భుతత్వమును గలిగించుచుండును. ఇది విశేషము. ఒక వ్యక్తియొక్క స్వరూపస్వభావాదికములచే వాని తత్వమును నిర్ణయించుట జరుగును. మహాపురుషుల కోవలో మనకు గోచరించు విశిష్టవ్యక్తి శ్రీ శాస్త్రిగారు. ఇంతవరకు ముందు ప్రకరణములలో వారి శ్రీకృష్ణభాగవతము యథాశక్తి పరిశీలించుట జరిగినది ఇప్పుడు వారి జీవితమును బట్టియు, ప్రస్తుత పరిశోధనాంశమైన "శ్రీకృష్ణభాగవతము" ను బట్టియు వారి యద్భుతమైన వ్యక్తిత్వమును చూపి ఆంధ్రకవుల యందు వారికి నీయదగుసముచిత స్థానమును నిర్ణయింతును.

శాస్త్రివారపురూప కావ్య హిరణ్యగర్భులనుట యెంతయును సమంజసము. అపురూపమే కాదు - అపూర్వమనియును భావింపవచ్చును. అందులకు వారి ద్విశతాధిక గ్రంథ రత్న సృష్టియే ప్రబల ప్రమాణము. అట్టి యమేయ కార్య దీక్షాపరులు, నప్రతిమాన ప్రతిభాసముపేతులును మరియొకరు తెలుగు సారస్వతమునగానరారు.

శ్రీశాస్త్రివర్యులకు జన్మనాటనుండియు నాత్మగౌరవము మిక్కుటము. ఏ చిన్నిమాట యెవరివల్ల వచ్చినను సహించు స్వభావము

వారికి లేదు. ఈ కారణముగ నెన్నియో లాభములను వీరు పోగొట్టుకొనిరి! శ్రీకృష్ణకవి జీవితము. పుట 177. ముక్త్యాలరాజువారు తమపై వ్రాయు నాశ్వాసాంత పద్యములు తమకు జూపినగాని ముద్రింపవల దనుట జరిగినది. దానికి శాస్త్రివర్యులెంతయు వ్యథచెందిరి. ఈ కారణముగ వారికిని వీరికిని కలతలు వచ్చుటయు, నెలనెలకు వచ్చు నూట పదియాఱు రూప్యము లాగిపోవుటయు తటస్థించినది. ఇట్టి వానికెన్నియేని ప్రమాణములు తోచును. ఒక సంఘటనము మాత్రము చూపుదును. హనుమకొండ పురవాసులు తుంగతుర్తి నరసింహారావుగారు వీరిచే భద్రాచల రామచరిత్రము వ్రాయించి కృతినంది వీరి సౌధమునకు జాలినవస్తు సామగ్రినంతయు నిత్తునని చెప్పియుండిరి. అంతలో వారేదియో తనను నిరసించిరని విని వారితో కలహించి తల్లాభమంతయు వదులుకొని వచ్చిరనియును వారు పిదప నాహ్వానించినను తిరిగి వెళ్ళలేదని యును తెలియుచున్నది.

శాస్త్రివర్యులకు కోపమును పట్టుదలయు విస్తారము. కాని యెవరిపైన నకారణముగ కోపింపరు. వారి కోపము తాటియాకు మంట వంటిది. ఎంతలో వచ్చునో యంతలో పోవును. ఇందులకు వారి స్వీయవాక్యములే తారకాణములు.

"నేనెవ్వరి మీదకును ముఁనుమున్ను కాలు దువ్వను. పరులు నా కొత్తిడి కలిగించినపుడే ప్రతిక్రియకుబూన యత్నింతును." అకాడమీ సాహిత్యోపన్యాసములు. 7వ. భాగ. పుట.10.
అందే "దోషమొనరించితినని యంగీకరించినచో వానిపైనున్న దోషమును తత్ క్షణమునందే వీడి యెట్టి వానినైనను మిత్రునివలె జూతురు. పట్టుదలయును మిక్కిలియే. వారి గ్రంథ రచనచే దీనికి నుదాహరణము. చతురంగ ఖేలనమున కడు ప్రవీణులు. "మయూరభంజి" సంస్థానమున మొదటిసారిగ నాడి యోడిరి. వెంటనే శపథమొనర్చి మిగిలిన ఆటలన్నిటిని గెల్చిరి. వారి పట్టుదల యట్టిది.

శాస్త్రివారు సకల తీర్థములను సేవించిరి. "దేశాటనం పండిత మిత్రతాచ" అనుటుంబట్టి తీర్థాటనమున మనుష్యునకు కష్టసుఖములు తెలిసి విజ్ఞానము కలుగుటకు కారణమగునని వీరి నమ్మకము.

పూర్వాచారపరాయణులైనను జాతిమతద్వేషములేనివారు. సకల మతస్థులను గౌరవింతురు. ఆదరింతురు. శ్రీకృష్ణకవిజీవితము. పుట. 178.

శాస్త్రివారు భయమనునది తెలియనివారు. పశ్చిమగోదావరి జిల్లాలోని రేచర్ల జమీందారుగారు వేయి రూప్యములకు కొన్న యశ్వము స్వాధీనముగాక యున్నచో శాస్త్రివారు దానిని లొంగదీసి తిరిగి వారికి నప్పగించిరి. ఒక పర్యాయము వర్షమున బాగుగ తడిసి మధ్యేమార్గమున విషూచికతో మరణించిన వారి మృత గాత్రములు దహింపబడుచుండగ తెలిసియును చలికోర్వజాలక యామంటు సెగను వస్త్రములార వైచుకొనిరట. తెలంగాణమునందలి కల్లూరు సమీపగ్రామారణ్యమున లోయలో నొక పులి వీరిశిరముపై నుండి దూకి పోగా, దానిని బాగుగ జూడనైతినని విచారించిరట. 1930వ సంవత్సరమున వారి గృహమునందు ప్రవేశించిన చోరుని పట్టికొని శరీరము రక్తసిక్తమైనను విడువక ప్రభుత్వము వారికప్పగించి బహూకృతినందిరి.

శాస్త్రివర్యులు త్యాగధనులు కూడ. వీరి చేతిలోనికాని లేక పోయినను యాచకుడు వచ్చి యడిగిన లేదని యనుట వీరికి యలవాటు లేదు. శ్రీకృష్ణకవి జీవితము. పుట 178.

శాస్త్రిగారు శ్రీనాథకవిసార్వభౌమునివలె మహాభోగములందినారు. బాల్యమున తల్లిదండ్రులతి ప్రేమతో వీరడిగినవన్నియును దెచ్చియిచ్చిరి. పిమ్మట నట్లె వీరి జీవనము సాగినది. తాను జేయవలసిన శుభకార్యములు పదుగురు మెచ్చునట్లు చేయును. ధనము ప్రధానముగ నెంచుకొనక గౌరవమే ప్రధానముగా నెంచుకొను నున్న భావము వీరికుగ్గుపాలతో నలవడినది.

శాస్త్రివారు నిరతాన్నదాతలు. ప్రతిదినము వారి గృహమతిథు లతోడ నభ్యాగతులతోడను పెండ్లివారిదివలె కలకలలాడుచుండెడిది.
అకాడిమీ సాహిత్యోపన్యాలు 7. పుట.

శాస్త్రివారు తన స్వభావమును గూర్చి స్వయముగా నొక రేడియో యుపన్యాసమున నిట్లు పలికిరి.

"నాకు జాతి మత విద్వేషము లేదు. సర్వమత సమ్మతుడనని చెప్పగలను. పూర్వాచార పరాయణుడనైనను గాలమును బట్టి సమయోచితముగ బ్రవర్తింతును. స్త్రీ విద్య నాకిష్టమే కాని బి.యేలు. యం.యేలు పూర్తిచేసి యుద్యోగములు చేయుట సమ్మతము కాదు. సాధ్యమయినంతవరకు సత్యమును మీఱి ప్రవర్తింపను. నాడ లేదని చెప్పగలుగుచున్నాను. జ్ఞప్తిలో నేనెవరి సొమ్మును హరింపలేదు. ఒరులకు అడిగినవి లేదనకీయవలెనని యభిప్రాయము గలదు. కాని యది సంపూర్ణముగ దైవము సాగనిచ్చుట లేదు. నాకు గోపము వచ్చును. రావలసిన పట్టుననే. అవలివారు క్షమింపుమని నంతనే యాకోపమంతలోనే పోవును. నాకు లౌకికోక్తులు, లేనిపోని కపటోక్తులు పనికిరావు. ఉన్నదున్నట్లు మాటలాడుటయే సరియని నా మతము. దీనంజేసి నన్ను వెఱ్ఱివాడనియు నందురు. నేనొకప్పుడు సాహసముగా బ్రవర్తింతును. అది ప్రాణాపాయమగునని జంకను. నాకు మహామారి యన్నను భీతిలేదు. నేనెప్పుడును వ్యర్థముగా గాలక్షేపము జేయను. ఏదో వ్రాయుటయో, చదువుటయో చేయుచుందును."
"సకలకళా ప్రవీణుడు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి" వ్యాసము. శ్రీవాణి పత్రిక మార్చి 89.

ఈ రీతి నిర్మోహమాటముగ తన స్వభావమును వ్యక్తము చేయుట వారి విశిష్ట వ్యక్తిత్వమునకు గీటురాయి.

శ్రీ శాస్త్రివారు జాతీయవాదులును, స్వరాజ్యోదయము అను నాటకము వ్రాయగా "జైలు" ప్రాప్తి యగునని యింటిలోని వారు

వీరికి యెఱుక లేకుండ దానిని నశింపజేసిరి. పిదప "తిలక్ మహారాజ్" "గాంధీ విజయధ్వజము" నాటకములను వ్రాసినారు.

శాస్త్రివారి కవితారచనమున సామాన్యముగ దోషముండదు. దోషమును సుహృదయముతో జెప్పిన నొప్పుకొని దిద్దుకొందురు. కాని తిరస్కారభావముతో నెవ్వరేని ప్రతిఘటించినయెడల నది తప్పుగాదని నిరూపించెదరు. "రాజభక్తి" నాటకము "నేరస్థులు" అని శాస్త్రివారు వ్రాసిరి. అది దుష్టమని ప్రతిపక్షులు నిరసింపగా వీరు "లోకమునకు దెలియునట్లా పదమును కావాలనే వ్రాసితిని." నవిద్యతే ఇరావేషాంతే నేరాః తేషు తిష్ఠంతీతి నేరస్థాః" అని సమర్థించిరి. అట్లే శ్రీకృష్ణభారతమున "సాయంతనంబగుట" యును అనుచోట సాయంతన శబ్దము విశేషణమిటు నెట్లు పొసగునని కొందఱధిక్షేపించిరి. దానినివారుకొన్ని చోట్ల విశేషణములు విశేష్యములుగా వాడబడును. "పరుషంబులు పలుకకునికి" యను భారత ప్రయోగమునిచ్చి పరుషములనగా పరుషవచనములని యెట్లు చెప్పికొందుమో యట్లే యిక్కడను కాలమధ్యాహార్యము చేసికొని "సాయంతనకాలమని" చెప్పకొనవచ్చుననిరి. దానికిప్రమాణముగా శ్రీనాథుని "సాయంతన సమయ సంఫుల్లమల్లికా కుసుమంబులు" అను ప్రయోగమును జూపిరి. దీనిని నంగీకరింపనిచో సాయంతన శబ్దము విశేషణము కాదు. విశేష్యమే. 'సాయంతనే ప్రతి దినం పశుబంధనార్థం' అను లీలా శుకుని ప్రయోగమును, "సాయంతనే హర్మ్యతలే" అను కాళిదాసు ప్రయోగమును ఉదాహరణములుగ నిచ్చిరి. శ్రీకృష్ణకవి జీవితము పుట 181.

"బ్రాహ్మణస్య హృదయం నవనీతం వాచి క్షురో నిశితస్తీక్ష్ణధారః" అను న్యాయము వీరియందు పూర్తిగ సరిపోవును. ఇందులకు వారి జీవిత సంఘటనలే యుదాహరణములు.

"వీరు చెప్పినన్ని పద్యాలు ప్రపంచంలో ఎక్కడా ఎవ్వరూ

చెప్పలేదు. వీరి కవితావేశం అటు రాజాస్థానాలలోనే కాక ఇటు న్యాయస్థానాలలోనూ పొంగులు వారింది. తమకు నచ్చని దానిని కచ్చితంగా ఎదిరించే గుండె నిబ్బరం కలవారు" అని 1960 భారతి" నవంబరు పత్రికలోని మనవి మాటలు ముమ్మాటికి సత్యములు.

అపర కర్మములలో దిగుట తప్పని వీరెంచరు. అనాథ ప్రేత సంస్కారం కోటి యజ్ఞ ఫలం లభేత్" అని వీరు గ్రహింతురు.

ఎవరితో నెంతే విభేదములున్నను సమయోచితముగ శాస్త్రి వారు ప్రవర్తింతురు. ఎదుటివారి గుణములను ప్రశంసించు నుదాత్తత వీరికి కలదు. స్వయముగ శిష్యులయిన చెళ్ళ పిళ్ళ వారికిని శాస్త్రివర్యులకును కొంత కాలము స్పర్ధలు కలిగినవి. ఆ సమయమున చెళ్లపిళ్ల వారికి పత్నీ వియోగము కలుగగా పరామర్శించుటకు శాస్త్రివర్యులు 'కడియము' నకు పోయిరి. ఆ సమయమున వేంకట శాస్త్రివారు వాద ప్రస్తావనము తీసికొనిరాగా శాస్త్రివర్యులది యసమయమని వైముఖ్యము చూపిరి. చెళ్లపిళ్లవారి పుత్రుల నెంతో వాత్సల్యముతో నోదార్చిరి.

వీరి యీ వైర విషయమును గూర్చి జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1961 ఫిబ్రవరి భారతి పత్రికలో నిట్లు వ్రాసిరి. "కొంత కాలము గురుశిష్యుల నడుమ రవరవలు రవుల్కొనినను అవి వజ్రములందలికాంతులు కాని అనలమందలినెరసులుకావు. (కవిసార్వభౌముని కావ్యజీవితము) చెళ్ళపిళ్ళ వారే తమ గురువులైన శ్రీపాద వారిని గూర్చి 'గురువుగారు వట్టి అమాయకులు' అని వాకొనుటలో శాస్త్రివర్యుల మనస్తత్త్వము తెలియును.

అట్లే భాషాప్రాంగణమున గిడుగు వారికిని శ్రీ శాస్త్రివారికిని భేదాభిప్రాయములు కలవు. శాస్త్రివారు గ్రాంథిక భాషా వాదులు. గిడుగు వారు వ్యావహారికోద్యమ కారులు. శాస్త్రివారు వ్యావహా

రికమును ఖండించుచు "వజ్రాయుధము" ను పత్రికనుకూడ నడిపిరి. వారి వివాదములు అభిప్రాయములవరకే పరిమితములు. ఇరువురి సఖ్యమేమాత్రము చెడలేదు. ఆంధ్రాభ్యుదయములో శాస్త్రివారు 'గిడుగురామమూర్తి వడిగల పిండంబు' అని నుడివిరి. శాస్త్రివారికి శత్రువులు లేరు. ఉండినను అచిర కాలములో మిత్రులను చేసికొను ఔదార్య క్షమా శక్తులు వీరికుండెడివి. అనియును జొన్నలగడ్డవారు తమ వ్యాసమున నుట్టంకించుట గమనింపదగినది.

మఱియును ఇచ్ఛాశక్తిని మించిన వజ్ర సంకల్పమును, దృఢ నిశ్చయమును మించిన భావనాశక్తిని, వీని నధఃకరించు స్థితప్రజ్ఞను తమ సొమ్మొనరించుకొనిన ప్రజ్ఞా ధురీణులు శ్రీపాదవారు. అని పై వ్యాసముననే యున్నది.

పిలకా గణపతి శాస్త్రిగారును భారతి పత్రికావ్యాసమున "శాస్త్రి గారి రచన వైదుష్య ప్రధానమైనది. మూలమును యథాతథముగాతెలుగు పాఠకుల కందించడంలో వీరు పడిన శ్రమ, అవలంబించిన దీక్ష మహాశ్చర్యంకలిగిస్తాయి. అసలు ఆయుగంకవులలో అందటిలోగొప్ప రచనాదీక్ష, పరిశ్రమ కనబడతాయి. వారందరికంటె శాస్త్రిగారి పరిశ్రమ, దీక్ష మహత్తరమైనవి. ఆస్థాన కవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు. అని శాస్త్రివారి విశిష్టతను నొక్కిచెప్పిరి.

శాస్త్రివారి అభిమాన కవి శ్రీనాథుడు. అతనినే తమ కవితా గురువుగా భావించినారు. శ్రీనాథునివలెనే వీరును విద్వత్కవులు. బహుకావ్య నిర్మాణ దక్షులును. అభినవ శ్రీనాథుడు శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి"

శాస్త్రిగారి సత్స్వభావము. - వ్యాసలు- శ్రీవాణి-జూన్ 88.

మ॥ ధరణిన్ వైరులు లేరు నా కెవరు విద్యా సంప్రదాయ ప్రసం
గరతిన్ గల్గిన వైరమేరి యెడ నే గన్పట్టినన్ వారినా

గురువుల్ మిత్రులుగా దలంచి చెలిమిం గూర్పంగ యత్నించెదన్
గరుణింపం దగు నెల్లవారును నమస్కారంబు లర్పించెదన్.

ఇది రాజమండ్రిలో గండపెండేర మహోత్సవ సందర్భముగ శాస్త్రివర్యులు సభాముఖముగ పలికిన పలుకులు. శ్రీకృష్ణకవిజీవితము (పుట. 213.) ఇది వారి వినయ శీలమునకు తార్కాణము.

శాస్త్రివారిని గూర్చియు, వారి రచనావిశిష్టతను గూర్చియు వైరమేర్పడినను శిష్యులయిన చెళ్లపిళ్ల వారు ప్రశంససించుట కొనియాడ దగినది. కథలు-గాథలు 2వ భాగము.

శాస్త్రివారి వినయవినమిత భావమునకు వారి శ్రీకృష్ణభారతావతారిక

ఉ॥ నన్నయ తిక్కనాది కవినాథులకన్నను మిన్నగా తెనుం
గున్నుడువంగలాడనధికుండను నేనని కాదు గ్రంథమం
దున్నెరసుల్ గొఱంతలును తోచునట్టుం చని కాదు వెండియుం
బన్నుట భారతేష్టతను బట్టిన చాపలమంచు నెంచుడీ.

ఎంత విద్వత్తు కలదో శాస్త్రివారి యందంత సౌశీల్యము కానవచ్చును. వారి శ్రీకృష్ణభాగవతావతారికయందును,

ఉ॥ పోతనవంటి సత్కవులు పుట్టరు పుట్టిన నట్టిరీతిగా
వ్రాతలు వ్రాయువారరిది. - - - - - అనియును చెప్పకొనుటయే పైదానికి ప్రమాణము.

ఈ రీతిగా శాస్త్రివర్యులు విశిష్టమైన వ్యక్తిత్వముతో నిరాసూటముగా సంచరించిరి.

ఇక శ్రీకృష్ణభాగవతమును రచించుటను హేతువును, వారి నమ్రతా భావమును ఇంతక్కు ముందే వివరించియుంటిని.

శాస్త్రివారు శ్రీకృష్ణభాగవతమున ప్రతి విషయమును మిక్కిలి శ్రద్ధతో దిద్ది తీర్చిరి. అందు వారి యౌచిత్య దృష్టి ప్రస్ఫుటముగ

గోచరించును. ఈ విషయము పూర్వ ప్రకరణముల సప్రమాణముగ జూపితిని. వారి యౌచిత్య దృష్టినిబట్టి వారి వ్యక్తిత్వమును విశిష్టముగ గోచరించును. మూల భాగవతమున శ్రవణకీర్తనాది నవభక్తులు ప్రతిపాదింపబడగా శాస్త్రివారు సంఖ్యా నిర్ణయ మొనర్పక భగవద్దృష్టి కలిగిన ప్రతి విధానమును భక్తియే యని దాని విశిష్ట స్థానమును స్థిరీకరించిరి. ఈ విషయముకూడ నింతకు ముందు వివరింపబడినది. వారి యాధ్యాత్మికతత్త్వము, వారి భాగవతమునందును, చూపబడిన భక్తుల చరిత్ర యందు గోచరమగును. నిజజీవితము నందును వారు మంత్రోపాసకులు, వైదికులును. ఈ విధముగ సంప్రదాయవాదులు వీరు. వీరికి శ్రీనాథుడు, అశ్వినీ దేవతలు, వేదవ్యాసుడు మొదలగు వారు స్వప్న దర్శనమిచ్చినట్లు తెలియుచున్నది.

శాస్త్రివారిని గూర్చియు, వారి కార్యదీక్షాది స్వభావమును గూర్చియు, వారి రచనా రీతిని గూర్చియు పల్వురు ప్రశంసించుట కాననగును.

> విజ్ఞాన సర్వస్వము 6వ సంపుటమున వీరి రచనము గూర్చి, "శాస్త్రివారి కవిత్వము భావ గాంభీర్యము కాక పోయినను సులభముగ ధారాళముగ నుండును." పుట 638.

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు శాస్త్రివారి శత వర్షజయంతి సందర్భముగ నాడిన మాటలు నిక్కపు మూటలే.

"శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారి ప్రజ్ఞ సర్వతోముఖముగాని సామాన్యము మాత్రము కాదు. వారు సంస్కృతాంధ్రములందు నిశితమగు సాహిత్యమును, ఆ రెండు భాషలందును గవిత్వము చెప్పు శక్తి గడించుకొనినవారు." అకాడమీ సాహిత్యోపన్యాసములు 7 - పుట. 46.

అందే శ్రీకృష్ణభారతమును గూర్చి ప్రశంసించుచు "విద్యావారిధి" కాశీ కృష్ణమాచార్యులవారి వాస్తవ విమర్శ యిది.

శా॥ ధారాశుద్ధికి జహ్నుకన్య పద సందర్భంపు బూదోట భా
షారామామణిదర్పణంబు గవితా సామ్రాజ్య సింహాసనం
బౌరా। సర్వ రసామృతాంబునిధి శయ్యాపాక వృత్త్యాద్యలం
కారాగారము కృష్ణభారతమనంగా నెన్న సామాన్యమే. పుట38.

శ్రీకృష్ణభారత పీఠికా కారులు శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య గారి ప్రశంసయు, నందే

చ॥ అరుదుగ బాహుశక్తి మెఱయంగ దుదెస్తరమౌగభీరసా
గరమును నీదియద్దరిని గాంచిన కైవడి భారతంబు, బం
ధుర సరసాంధ్ర పద్యముల నూతనరీతిని జంద్రమౌళి స
త్కరుణను వ్రాసి సద్యశముగాంచితి కృష్ణకవీ। స్థిరంబుగన్.
పుట. 38.

అందే శాస్త్రీవారి శ్రీకృష్ణరామాయణమునుగూర్చి వెంపరాల వారు 'రామాయణస్థములగు నుత్తమ పాత్రముల నెల్ల కళంక రహితములొనర్చి, బ్రహ్మానంద సబ్రహ్మచారియగు రసానందమున ముంచి యెత్తి వేదమువలె బవిత్రముగ గ్రంథమంతయు దీర్చిదిద్ది ఆయాంధ్రలోకమునకు బ్రాతః స్మరణీయులైన కృష్ణమూర్తి శాస్త్రి శ్రీపాదులను వినతి పూర్వకముగా ధ్యానించుచున్నాను.' పుట.54.

శ్రీకృష్ణభాగవతమునకు పీఠికను వ్రాయుచు దివాకర్లవారు, "కవిత్వములో దీర్ఘ సమాసములు పెట్టక సర్వజనబోధముగా నుండునట్లు చిన్న చిన్న పదములు వాడుకలోనున్నవి మాత్రమే చేర్పవలయునని వీరు చెప్పుదురు. కథానుక్రమణికలో గద్యమెటునుండవలెనో బాగుగ దెలిసి వ్రాయుదురు. కవిత్వములో అక్షరనాజాత్యము ముఖ్యమనియు, అది తెలుగులో నొక్క శ్రీనాధుడు మాత్రమే తెలిసికొనెననియు వీరు చెప్పుదురు. ఇత్యాదులు శాస్త్రివారి కవిత్వ విశేషములు. ఈ శ్రీకృష్ణభాగవతము మృదు మధురమై ద్రాక్షాపాకమునై యున్నది." పుట.8.

ఈ విధముగ పల్వురిచే వారి ప్రధాన గ్రంథ త్రయము ప్రశంసాలంకృతమైనది. ఇట్లే అన్ని గ్రంథములును విశిష్టములు.

ఇట్లు చూచినచో శాస్త్రివారు మహాకవుల కోవలోని వారేయనుట యథార్థము. శాస్త్రివారు రచనము లాక్షణికమైనది. భాగవతానువాదకులుగ శాస్త్రివారు సర్వ సమర్థులు. రసవద్దృష్టిలో పోతన్నకు నీడు కాకపోయినను యథామూల దృష్టిలో నగ్రేసరులు. రసవద్దృష్టి తోడను భాగవతమును విశిష్టముగ దిద్దగల నేర్పరులనుటలో సందియ మనవసరము. వారి యనువాద దృష్టిలో శ్రీకృష్ణభాగవతము విశిష్ట స్థానము నందినదనుట ముమ్మాటికిని నిక్కువము. సందర్భమునకు తగినట్లు రసములౌచిత్యముతో జృంభించుట భాగవతమున కానుపించును. శాస్త్రివారు సర్వ సమర్థులు, ప్రతిభా సముపేతులనుటకు వారి రచనమే తారకాణము. వారి రచనములకు తగిన ప్రసిద్ధి రాలేదనుట నిజము. అద్దానికి లోపములు కారణము కాదు. సమకాలీన పండిత మాత్సర్యాదికము కొంత హేతుభూతమైనది. శాస్త్రివారు గీర్వాణాంధ్ర ములందు రెండింటను అవధానములవలీలగ నెఱపిన ప్రజ్ఞాధురీణులు, సహృదయులు, సచ్ఛీలురు, సజ్జనులును.

ఈరీతిగ నాంధ్రసాహిత్యమున అప్రతిమానులై వెలిగిన శాస్త్రి వారు నలంకరించని బిరుదముగాని, వరింపని సన్మానముగాని లేదు. వీరి కీర్తి దిగ్దిగంతములను చూచినది అట్టి కవిసార్వభౌములకు విశిష్ట స్థానము తనకు తానుగానే యలంకరించినది. వేఱుచేయవలెననుట యవివేకము. ఎవరు కాదనినను వారు ముమ్మాటికిని మహాకవి. అందులకు వారి యద్వితీయ సాహిత్య సేవయే నిదర్శనము.

జ య ం తి తే సు కృ తి నో ర స సి ద్ధాః క వీ శ్వ రాః

-[ ]-

# శ్రీకృష్ణభాగవతానర్ఘపంక్తులు

శ్రీ శాస్త్రివారు వ్యాస భాగవతమును శ్రీకృష్ణభాగవతముగ నాంధ్రమున ననౌచిత్యాదులను పరిహరించి యౌచిత్య స్ఫోరకముగ మూల పరిధిని సాధ్యమైనంతవఱకును అతిక్రమింపక దిద్దితీర్చిన విధ మింతకుముందు సప్రమాణముగ పరిశీలించుట జరిగినది.

శాస్త్రివారి యనువాదమున చక్కని నీతులను రసవత్ప్రామాణికవిషయములనటనట మూలగతమైన వానితో పాఠౌచిత్యముగ దాము స్వీయముగను చూపుట జరిగినది. అట్టివానిని కొన్నిటిని నాతివిస్తరముగ చూపుట సమంజసము. అటులయినచో శ్రీకృష్ణభాగవత ప్రాశస్త్యమును చూపినటుల కాగలదు.

1. భక్తియే ముక్తి సాధన శక్తి 1-134

2.మ॥ పరమోదార గభీరకల్పనలతోభాసిల్లకున్నన్ మహో
త్తరచిత్రాదులగల్గకున్న నపశబ్దంబద్ధమైయుండినన్
హరి నారాయణ వాసుదేవ జగదీశాయంచుకీర్తించుచుం
గరమొప్పారుప్రబంధమైన త్రిజగత్కళ్యాణముంగూర్చెడిన్.
1-170

3 మ। నిదురంబోయెడువాని మద్యపునిస్త్రీనిన్బాలునిన్లోలునిన్
గదనంబున్విడిపాఱువానివిరథున్ఖండింపరాదందునన్
బొదలుంబాపమటంచుశాస్త్రములు చెప్పన్వీడు విప్రుండయ
య్యుదెఱింగిగెనుపీని జంపుటలు శ్రేయోదాయకంబయ్యెడిన్.
1-234

4. క. దైవాధీనము సర్వము

గావున దేనికి వగవక
భూవలయంబేలుకొనుము పురుషలలామా! 1-271

5. క. సర్వంబెవ్వని యందగు
సర్వంబెవ్వానివలన సంభవమగునీ
సర్వము తానగు నెవ్వడు
సర్వాత్ముండైనవాని స్మరియింతునెదన్ 1-283

6. క. నీవీలోకము ధృతమని
భావింతువె నేడు చూడబడునదిరేపో
యేవలనజూపనుండదు
కావున ధృవమనగగలమె కనుగొనుచునిటుల్. 1-320

7. అకట వ్యసనంబులన్నియునొకటి కాదె. 1-374

8. క. సప్తవ్యసనములందుం
బ్రాప్తించిన నొక్కడేని పండితుడైనం
దృప్తుడయి చెడును వానికి
వ్యాప్తింబడునెల్ల శ్రీమలు పరమందప్పున్. 1-375

9. ఉ. కోపముసత్యముంజెఱచుగోపముతాపముగల్గజేసెడుం
గోపము వైరకారణము కోపము ధర్మమునుందొలంచెడుం
గోపముసర్వకార్యములకుంబ్రతిరోధకరంబుకోపమే
పాపముకోపియైన జనవంచితుడై నరుడందుగష్టముల్

10. ఆ. దయయుక్షమయు లేని తపసితపంబును
మత్తుడైనవాని విత్త చయము
ధర్మబాహ్యుడైన ధరణీశురాజ్యంబు
నోటికడవలోని నీటిబోలు

ఈరీతిగా నిట్టి తళుకు బెకుళుకుల పలుకులకు శాస్త్రివారి శ్రీకృష్ణ భాగవతము కాణాచి.

—[]—

# అష్టమ కళిక

## సింహావలోకనము - ఉపసంహారము

నా పురాకృత శుభాధిక్యమువలన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వారి శ్రీకృష్ణభాగవతముపై పరిశోధనముచేయుభాగ్యము లభించినది. నా ప్రణాళిక ప్రకారము అష్టప్రకరణములుగ నా యీ పరిశోధనము చేయబడినది.

ప్రథమమున కవి వ్యక్తిగత సాహిత్య జీవనాదికము ప్రదర్శిం పబడినది. లభ్యగ్రంథపరిచయము, శైలీప్రదర్శనము కావింపబడినది.

ద్వితీయ ప్రకరణమున పురాణములు, భాగవత వైశిష్ట్యములు చెప్పబడినవి. వ్యాస కర్తృత్వము చర్చింపబడినది. తరువాత భాగవ తాంధ్రీకరణ హేతువులు చూపబడినవి. అందు వానివాని ప్రత్యేకతలు చెప్పబడినవి. పిమ్మట భాగవతమునందలి భక్తి, వేదాంతములు నిరూ పింపబడినవి.

తృతీయప్రకరణమున భాగవతానువాద విధానము విపులముగ ప్రదర్శింపబడినది. ఇందుపోతన శ్రీకృష్ణభాగవతానువాదవిధానములు వ్యాస భాగవతముతో తులనాత్మకముగ పరిశీలింపబడి కొన్ని ఘట్ట ములు సోదాహరింపబడినవి. ఈ పరిశీలనమున పోతన స్వతం త్రానువాద విధానము, శాస్త్రివారి మూలవిధేయానువాద విధానములు నిరూపింపబడినవి. అనంతరము శ్రీకృష్ణభాగవతానువాద సౌందర్యము చూపబడి శాస్త్రివారి ప్రతిభాశాలిత, కుశాగ్రపరిశీలనా పాటవము, నిర్వహణాదక్షతలు ప్రదర్శింపబడినవి.

చతుర్థప్రకరణమున శ్రీకృష్ణభాగవత సాహిత్య సమీక్ష కావిం పబడినది. శైలీ విన్యాసము, ఇతివృత్త నిర్వహణము, రసపోషణము, పాత్రచిత్రణాపాటవము, వర్ణనావైదుష్యము అలంకారవైచిత్రి, ఛందో

విన్యాసముగ పద్యశిల్పరసాభ్యుచితబంధ పద్యపునరుక్త ఛందో వైవిధ్య విశేషములు పరిశీలింపబడినవి.

పంచమ ప్రకరణమున శ్రీకృష్ణభాగవతమున దోచు శాస్త్రజ్ఞత, లోకజ్ఞతలు నిరూపింపబడినవి. ఇందు వేదశాస్త్రములు, సంస్కృతాంధ్రభాషా ప్రయోగములపై శాస్త్రి వారికి కల యాధిపత్యము చూపబడినది. లోకజ్ఞత, సమాజ పరిశీలనాదృష్టి పరిశీలించి చూపబడినవి. తెలుగు జాతీయములు, పలుకుబడులు, నానుడులు మొదలుగాగల ఆలంకారిక పద ప్రయోగములు సోదాహరించబడినవి.

షష్ఠ ప్రకరణమున శాస్త్రివర్యుల శ్రీకృష్ణభాగవతరచనముపై ప్రభావము చూపిన నన్నయాది పూర్వ కవుల ప్రభావము సోదాహరణముగా ప్రదర్శింపబడినవి.

సప్తమ ప్రకరణమున శాస్త్రివారివ్యక్తిత్వ స్థానములు నిరూపింపబడినవి. చక్కని శ్రీకృష్ణభాగవతానర్ఘ పంక్తులు ప్రదర్శింపబడినవి. అష్టమ ప్రకరణమున సింహావలోకనోపసంహారాదికము కావింపబడినది

శ్రీకృష్ణభాగవతముపై ఈ నా పరిశోధనము సమగ్రము కాజాలదు. నా నేర్చిన భంగినిపై విధముగ చూపబడిన సాదృష్టితో నీ సమీక్ష కావించియుంటిని. నిద్రాణమైయున్న శ్రీకృష్ణభాగవతము వెలుగుచూపుటకు ప్రయత్నించితిని. శ్రీకృష్ణభాగవత పద్మము వికసించుటకు ఇది తొలి సూర్యకిరణము మాత్రమే. దీనితో సంపూర్ణ వికసనము కాదు. ఇంకను ఎన్నియో సమర్థవంతమైన కిరణరాజములు కావలసియున్నది. అందులకు ఈ తొలిరవికిరణయత్నము సహకరింపగలదని మనవి. ఈపథ నిర్దేశము దక్షులైనపరిశోధకులకు సహృదయ స్వాగతమని నా వినతి. నా యీ ప్రయత్న నిష్పాక్షికతను సహృదయులాదరింపగలరని నమ్ముచూ ఉపసంహారమును కావించుచున్నాను.

# అనుబంధము

## శాస్త్రిగారి జీవితమున ప్రధాన ఘట్టములు

29-10-1886 – (శా. శ. 1788) క్షయ సంవత్సర ఆశ్వయుజ కృష్ణ షష్ఠి ఇందువాసరము పునర్వసు నక్షత్ర మిథునలగ్నమున రాత్రి నాల్గు ఘడియలకు ఎర్నగూడెము వద్దగల "దేవర పల్లి"లో జననము. శ్రీ శాస్త్రిగారి నిజ నామము గరుడాచలకృష్ణమూర్తి.

1868– రెండవయేట "విషూచి" సోకి మృతులై రుద్రభూమికి కొనిపోబడి ఖనన సమయమున పునర్జీవితులగుట.

1874– కాటవరములో (8వ సంవత్సరమున) అక్షరాభ్యాసము.

1874– ద్వారకా తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిని ఉపనయనము.

1874– కాటవరము కంబైండు స్కూలులో ప్రవేశము. కొంత ఆంగ్లము నేర్చుట. బడి పెద్దయై పరీక్షాధికారులచే బహుమతులు గెల్చుకొనుట. దేవరకొండ కృష్ణమూర్తి ఇనస్పెక్టింగు స్కూలు మాష్టరుగారు – ఇనస్పెక్టరగు శ్రీ కోవి దక్షిణామూర్తి శాస్త్రిగారి కెఱిగించి వారిచే మరికొన్ని బహూకృతులిప్పించుట – ఆ బడిలో ఇంగ్లీషుతోడి తెలుగు ప్రైమరీవఱకు చదువుట.

1875 ఆంగ్ల విద్యావైముఖ్యము–కాటవరనివాసులు, ఉద్దండపండితులు, శివపూజాధురంధరులునగు శ్రీ ఇవటూరి నాగలింగశాస్త్రివారి

చరణసన్నిధి చేరి సంస్కృతకావ్య నాటకాలంకార వ్యాకరణ ములభ్యసించుట.

1878- తొలి రచన - పండ్రెండవ సంవత్సరమున - సంస్కృతమున శార్దూల వృత్తాష్టకము, కాటవరమందలి రామలింగేశ్వరునిపై రామాష్టకము.

1878 - మేఘసందేశ కావ్య పఠన సందర్భమున "చంద్రియశశ్చరిత్ర" కావ్యరచనకారంభించుట - నేడలభ్యము, కొన్ని శ్లోకములు మాత్రము లభించినవి.

1879-1880 - "పరబ్రహ్మాష్టకము" - సంస్కృత రచన - మదరాసు నందలిజ్యోతిష్మతీ ముద్రణాశాలలో కి.శే. వేదముపండితులచే సరిచూపబడి కరపత్రములుగా ముద్రితము.

1881- శ్రౌతస్మార్త విద్యాభ్యాసము - చయనాంత శ్రౌతము - శ్రీ వాజపేయాజుల పాపయ్య సోమయాజులుగారు గురువులు - వారితో ఆధాన పంచకము, సోమ పంచకము, చయన సంపన్నములు చదువుట - అధ్వరకాండ - షోడశ కర్మాంత స్మార్తము - స్మార్తమున శ్రీ కల్లూరి బ్రహ్మసోమయాజులు గురువులు

1881- గొల్లప్రోలు గ్రామనివాసి శ్రీ అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

కాటవరమురాగా శ్రీ శాస్త్రిగారు తమ తొలి తెలుగు పద్యమును రచించి వినిపించుట - సుబ్రహ్మణ్యకవి శాస్త్రిగారి కవితాధారను మెచ్చి లక్షణ గ్రంథములు చదువుకొనుమని యుపదేశించుట.

1882- చిత్రభాను సంవత్సరము - తొలి తెలుగు కృతి - "సత్యనారాయణోపాఖ్యానము" అను లఘుకావ్య రచనము.

1883- స్వభానునామ సంవత్సరము - "సావిత్రీచరిత్ర" 3 ఆశ్వాస

ముల ప్రబంధరచన - చిత్రశతక రచనము.

1888- గౌతమీ మాహాత్మ్యము 5 ఆశ్వాసముల ప్రబంధరచనము - కాళిదాస విలాసము, తెనాలిరామకృష్ణచరిత్రము, జగన్నాథ మాహాత్మ్యము అను గద్యకృతుల రచన.

1891- ఏకావళీపరిణయము - జగన్నాథచరిత్ర - గజాననవిజయ ముల రచన.

1895- ఛత్రపురము, కళ్ళికోట, హనుమకొండ, మంథెనలలో అవధానములొనర్చి బహుమాన బిరుదములనందుట.

1896-97 సంస్థానముల సందర్శనము - ప్రభు సత్కారములు - కావేరీచరిత్ర, వధూవిజయముల రచనము.

1898- కనకగిరి, ఆనందోదయము, వేంకటేశ్వరీయముల రచనము కవిరాజ బిరుదమునందుట.

1899- జనవరిలో కళావతి పత్రికా స్థాపనము - భగవద్విలాసము, పతివ్రతల చరిత్ర మొదలగు వానిని కళావతిలో ప్రచురించుట - గౌతమి దినపత్రికను స్థాపించుట - తండ్రిగారి మరణము - వందేమాతరమ్ (పక్ష పత్రిక,) మానవసేవ (మాస పత్రికలను) స్థాపించుట - పర్లాకిమిడి రాజ దర్శనము, అవధాన నిర్వహణము.

1902- "కలభాషిణి" యను తొలి నాటకరచనము.

1906- శాస్త్రివారికి మిక్కిలి ప్రీతిపాత్రమైన ప్రద్యుమ్నోపా ఖ్యన రచనము - శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ నిర్వచనైకాదశాక్షరి, వేణీసంహార నాటకాంధ్రీకరణ రచనములు.

1908- బొబ్బిలియుద్ధ నాటక రచనము.

1911- శ్రీకృష్ణభారత రచనకు నాందీప్రస్తావనము- "పెరిక్లిస్" అను ఆంగ్ల నాటకమునకనువాదము - వీరసేనవిజయము - లొడారి

బుచ్చిగాడు, డాలోరి బుచ్చిగాడు ప్రహసనముల రచన.

1913- "సుదర్శననిధి" పుత్రిజననము.

1914- ట్వెల్ఫ్‌నైట్" అను ఆంగ్లనాటకమునకు అనువాదము, మోహినీ మనోహరము.

1916- శ్రీకృష్ణభారతము - తొలిసంపుటి ఆది, సభాపర్వముల ప్రచురణము - ఆరణ్యపర్వము ప్రథమ భాగ ప్రచురణము.

1918- ఆరణ్యపర్వ ద్వితీయభాగ ప్రచురణము.

1921- తిలక మహారాజ, గాంధీవిజయధ్వజ నాటకములు, భోజరాజ విజయముల రచనము.

1924- పుత్రి దుఃఖము కలుగుట.

1926- భారతానువాద పరిసమాప్తి.

1927- శ్రీనాథకవిరాజీయ నాటకము "భారతి" యందు ముద్రితము.

1927- మహాభారతయుద్ధ నాటక రచనము.

1928- శ్రీకృష్ణభారత విరాటోద్యోగపర్వముల సంపుటి వెలుగు చూచుట.

1930- జనవరి 11వతేదీన పాలకొల్లులో స్వర్ణాభిషేకము - కవిసార్వభౌమ బిరుద ప్రదానము - బిరుదము స్థిరమగుట.

1931- చంద్రికాపరిణయ నాటకము, ధాష్టిక పంతుల ప్రహసనముల రచనము అక్టోబరు మానము.

1933- అక్టోబరు 20వ తేదీన రాజమహేంద్రవరమున గండపెండేర బహుమాన పురస్కారమునందుట-విజయలక్ష్మీవిలాసప్రబంధ రచనము.

1937- ఫిబ్రవరి 1వతేదీన నాటియాంగ్ల ప్రభుత్వముచే మహా మహోపాధ్యాయ బిరుదప్రదానము- మార్చి 13న ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారిచే "కళాప్రపూర్ణ" బిరుద వరణము.

1941- రాజమహేంద్రవరము "మునిసిపల్ పార్క్" లో పౌరులు శాస్త్రివారి శిలావిగ్రహమును ప్రతిష్ఠించుట పురపాలక సంఘమువారుస్వేచ్ఛా పౌరసత్వమునిచ్చి వారి గృహమునకు పన్ను రద్దుచేయుట.

1945- బెజవాడలోను, సాలూరులోను గజారోహణ మహోత్సవము బెజవాడలో మణి కిరీట ప్రదానము- శ్రీకృష్ణభారతమునకు బ్రహ్మ రథోత్సవము- ఆ ప్రాంతముననే మధుకర విజయ కల్పిత ప్రబంధ రచనము.

1947- శ్రీకృష్ణరామాయణ రచనము.

1948- శ్రీకృష్ణభాగవతానువాదము.

1949- శ్రీ శాస్త్రిగారి శిష్యులు చెళ్ళపిళ్ళవారు ప్రప్రథమాంధ్ర సంస్థాన కవిగా నియమితులగుట.

1950- చెళ్ళపిళ్ళవారి శివైక్యము శాస్త్రివారిని ఆస్థాన కవీశ్వర పదవి వరించుట.

1953- ఆంధ్ర రాష్ట్రావతరణ సమయమున రాష్ట్ర ప్రభుత శాస్త్రి వారిని కర్నూలు రావించి వేయూఋలతో సత్కరించుట.

1954- గుడివాడ పట్టణమున స్వర్ణ పుష్పపూజ.

1955- గోమాహాత్మ్యము - చిన్నికృతి రచనము, అనాస వైద్యనిపుణులు శ్రీరామేస అవినారాయణగారికి అంకితము- ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి యభ్యర్థనపై భాసకృతమగు యజ్ఞఫల నాటకమునాంధ్రీకరించుట, విశ్వకళాపరిషత్తువారే ప్రకటించి బి.ఏ. పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట.

1956- గౌతమీపుష్కరమాహాత్మ్యము అను గద్యకృతి రచనము.

1958- అక్టోబరు 29న భారతసంస్కృతపండిత సత్కారము.

1959- 'రాజేంద్రప్రసాదాభ్యుదయము' (రెండుభాగములు)సంస్కృత కావ్యము.

1960- పైకావ్యము రాష్ట్రపతిరాజేంద్రప్రసాదుగారికి అంకితమిచ్చుట డిసెంబరు 29న 94వయేట ముక్కోటి యేకాదశినాటి రాత్రి శ్రీ శాస్త్రిగారి కైవల్యము.

1966- అక్టోబరు 29 న శ్రీ శాస్త్రిగారి శతజయంతిని ప్రభుత్వము వారు వైభవముగా జరుపుట, డా॥ తోలేటి కనకరాజుగారి యధ్యక్షతన శతజయంతి సంచిక ప్రకటింపబడుట - ఆంధ్ర ప్రభుత్వ సాహిత్య అకాడమీ వారు శ్రీశాస్త్రిగారి శతజయంత్యుత్సవ సందర్భమున శ్రీవెంపరాలవారు మున్నగువారిచే నుపన్యాసములిప్పించి యా యుపన్యాసములను "సాహిత్యోపన్యాసములు - 7వ భాగము"గా ముద్రించి ఆంధ్రుల కృతజ్ఞతలకు పాత్రులగుట.

-[ ]-

# శాస్త్రిగారి గ్రంథ వివరణ పట్టిక

## 1. పద్య గ్రంథములు :-

1. అన్నపూర్ణాపరిణయము,
2. అన్నవరక్షేత్రమాహాత్మ్యము,
3. అన్నవరక్షేత్రము, (మంజరీ ద్విపద),
4. అమృతానందము,
5. అమృతరాజీయము,
6. అరణ్యరోదనము,
7. అలక్ష్మీలక్ష్మీసంవాదము,
8. అహల్యాబాయిచరిత్రము,

9. ఆంజనేయచరిత్రము,
10. ఆంధ్రాభ్యుదయము,
11. ఆంధ్రనామసర్వస్వము (నిఘంటువు),
12. ఆంధ్రరాష్ట్రావతరణము,
13. ఆంధ్రరాష్ట్ర తృతీయ వార్షికోత్సవము.
14. ఆనందోదయము,
15. ఇల్లిందగుంటరామాయణము,
16. ఏకావళీపరిణయము,
17. ఏకాదశస్వాతంత్ర్యోత్సవము,
18. ఐరోపామహాసంగ్రామము,
19. కనకగిరి,
20. కపిలగిరిచరితము,
21. కలిమాహాత్మ్యము,
22. కల్పభూజము,
23. కవితోపదేశము (ఛందస్సు),
24. కామాక్షీ విజయము,
25. కావేరీచరిత్రము,
26. గజాననవిజయము,
27. గణేశపురాణము,
28. గారెబూరెలసంవాదము.
29. గోదావరీ విలయతాండవము,
30. గోదేవికోట్టు,
31. గోమాహాత్మ్యము,
32. గేన్మెరామోండము,
33. గౌతమీ మాహాత్మ్యము,
34, గార్మ్యారణ్యకుఠారము,

35. జగద్గురు చరిత్రము,
36. జీడికంటిరామాయణము,
37. తిక్కన చరిత్రము,
38. త్రికూటాచల మాహాత్మ్యము,
39. దుష్టచతుష్టయము,
40. ద్వారకా తిరుమల మాహాత్మ్యము,
41. ధన్వంతరి చరిత్రము,
42. నలదమేశ్వర చరిత్రము,
43. నైషధీయ చరిత్రము,
44. న్యాపతిసుబ్బరాయ చరిత్రము,
45. పల్వలేశ్వర మాహాత్మ్యము,
46. ప్రద్యుమ్నోపాఖ్యానము,
47. పాదపూజ,
48. బౌద్ధచరిత్ర సంగ్రహము,
49. బ్రహ్మానందము,
50. భగవద్విలాసము,
51. భగవద్గీతాసారము,
52. భద్రాచలరామచరిత్రము,
53. భవిష్యన్మహాపురాణము,
54. భారతీమనస్తాపోపశమనము,
55. భీమశంకరవిజయము,
56. భోగసుందరసీతారామ చరిత్రము,
57. మంగళగిరి మాహాత్మ్యము,
58. మణిత్రయచరిత్రము,
59. మధుకరవిజయము,
60. మరుత్తరాట్చరిత్రము,

61. మహమ్మదు చరిత్రము,
62. మాదిరెడ్డి వేంకటేశ్వర స్మృతి,
63. మార్కండేయ చరిత్రము,
64. మీరాబాయి చరిత్రము,
65. యమలోకము,
66. యాజ్ఞవల్క్య చరిత్రము,
67. రాజమహేంద్రవర చరిత్రము,
68. రామకృష్ణపరమహంసీయము,
69. లక్ష్మీ సరస్వతీ సంవాదము,
70. విచిత్రప్రసంగము,
71. విజయాభ్యుదయము,
72. విజయలక్ష్మి విలాసము,
73. వేంకటనృసింహరాయచరిత్రము,
74. వేంకటేశ్వరీయము,
75. వేదాద్రిమాహాత్మ్యము,
76. శకుంతలాచరిత్రము,
77. శివానందలహరి,
78. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ నిర్వచనైకాదశాక్షరి,
79. శ్రీకృష్ణాశీర్వచనము,
80. శ్రీకృష్ణస్వీయచరిత్రము,
81. శ్రీకృష్ణభారతము,
82. శ్రీకృష్ణరామాయణము,
83. శ్రీకృష్ణభాగవతము,
84. శ్రీ దేవీ స్తవరాజము,
85. శ్రీరామచరిత్రము,
86. సతీత్రయ చరిత్రము,

87. సత్యనారాయణోపాఖ్యానము,
88. సరస్వత్యనునయము,
89. సావిత్రీ చరిత్రము,
90. సానందసాయుజ్యము,
91. సింహాచలక్షేత్రమాహాత్మ్యము,
92. సుదర్శనోదంతము,
93. సురభిరాజవంశావతారము,
94. స్కాంధ పురాణము,
95. స్వరాజ్యోదయము,
96. హంసద్వీప మాహాత్మ్యము,
97. హేలాపుర శంకర చరిత్రము,

## 2. వచన కావ్యములు :-

1. ఆంధ్రభాషోపన్యాసము,
2. ఆంధ్రభాషా భూషణము,
3. ఉర్లాం మాహాత్మ్యము,
4. కాళిదాస విలాసము,
5. గోదావరి మహాప్రళయ తాండవము,
6. గౌతమీపుష్కర మాహాత్మ్యము,
7. గౌరాంగచరిత్రము,
8. గ్రహోచ్చాటనమంత్రము,
9. గ్రామ్యనిరాకరణము,
10. గ్రామ్య వ్యాకరణము,
11. జగన్నాథ మాహాత్మ్యము,
12. తెనాలిరామకృష్ణ చరిత్రము,
13. ధర్మసంరక్షక సభ,
14. నన్నయభట్టారక చరిత్రము,

15. పండితవివాదము,
16. పతివ్రతల చరిత్రము,
17. ప్రతిపక్షరక్షాబంధనము,
18. భారత భాగ్యోదయము,
19: మంగలిమంత్రి,
20: మహా నైవేద్య నిరసనము,
21: మహాభారత చరిత్ర నిరాకరణము,
22: మాయావులు,
23: మాలతీమధుకరము,
24: మోసకృత్యము,
25: రాజమహేంద్రవర చరిత్రము,
26: రామాయణతత్వము,
27: రావుబహద్దూర్,
28: విక్రమోర్వశీయ విమర్శనము,
29: శ్రీకృష్ణ కవిథాజీయము,
30: శ్రీకష్ణభావార్థదీపిక,
31. సకల ఫల సార సంగ్రహము,
32. సీతాకోకచిలుక,
33. సుకవులు – కుకవులు,
34. స్వర్ణోత్సవము,
35. స్వీయచరిత్రము,

## 3. విమర్శ గ్రంథములు :-

1. ఆంధ్రభాషానుశాసన విమర్శనము,
2. ఆంధ్ర విక్రమోర్వశీయ విమర్శనము,
3. కర్ణ జనన విమర్శనము,
4. కురుపాండవదాయభాగ విమర్శనము,

5. ఖండ కావ్య విమర్శనము,
6. చెళ్ళపిళ్ళ చెర్లాటము – 5 భాగములు,
7. జయంతి నిరసనము,
8. జాతకచర్యా విమర్శనము,
9. దురుద్ధర దోష శృంఖలము,
10. ప్రసన్న యాదవ నాటక విమర్శనము,
11. బొబ్బిలి పట్టాభిషేక విమర్శనము,
12. మహాభారత హాస్య విమర్శనము, – 2 భాగములు
13. మహాభారతాంధ్రీకరణ విమర్శనము,
14. రావణ విమర్శణము,
15. విజయవిలాస కృతి విమర్శనము,
16. వేణీసంహార విమర్శనము,
17. శివభక్తి విమర్శనము,
18. శ్లోకపంచక నిరాకరణము,
19. సుయోధన విమర్శనము,
20. సుయోధన విజయ విమర్శనము,
21. సుశీల విమర్శనము,

## 4. నాటకములు :-

1. అహల్యా నాటకము,
2. ఆంధ్రజ్యోతి (అల్లూరాం),
3. ఉత్తరరామచరిత్ర నాటకము,
4. కమలినీపరిణయ నాటకము,
5. కలభాషిణీ నాటకము,
6. గాంధీవిజయధ్వజ నాటకము,
7. [illegible]

8. తిలకమహారాజ నాటకము,
9. పంచవర్షప్రణాళిక నాటకము,
10. బొబ్బిలి యుద్ధ నాటకము,
11. భోజరాజ విజయ నాటకము,
12. మహా భారతయుద్ధ నాటకము,
13. మాయావతీ నాటకము,
14. మోహినీమనోహరము,
15. యజ్ఞఫల నాటకము.
16. యయాతి నాటకము,
17. యాజ్ఞవల్క్య నాటకము,
18. రాజభక్తి నాటకము.
19. వధూ విజయ నాటకము,
20. విక్రమదేవవిజయ నాటకము,
21. వీరరుద్ర నాటకము,
22. వీరసేనవిజయ నాటకము,
23. వేణీసంహార నాటకము,
24. వ్యాసావతార నాటకము,
25. శకుంతలా నాటకము,
26. శ్రీనాధకవిరాజీయ నాటకము,
27. శ్రీరామకుమారవిజయ నాటకము,
28. సావిత్రి నాటకము,
29. సుకన్యా నాటకము,
30. సుందోపసుంద నాటకము,
31. స్వరాజ్యోదయ నాటకము

## 5. శతకములు:-

1. అయితే అంతే శతకము,
2. కల్లూరప్ప శతకము,

3. చాణక్య శతకము,
4. చిత్ర శతకము,
5. శనైశ్చర శతకము,

## 6. ప్రహసనములు :-

1. కాళిదాస సహస్రనామానువాదము,
2. కుక్కకాటు వైద్యము,
3. ధార్మిక పంతులు,
4. పాదపూజ,
5. లొడారిబుచ్చిగాడు,
6. డాలోరిబుచ్చిగాడు,

## 7. సంస్కృత గ్రంథములు :-

1. గురుచరిత్రము,
2. చంద్రియశశ్చరితము,
3. పరబ్రహ్మాష్టకము,
4. బ్రహ్మానంద సరస్వత్యష్టకము,
5. ముక్తిపురరాజేశ్వరాష్టకము,
6. శ్రీరాజేంద్రప్రసాదాభ్యుదయము,
7. శ్రీరామాష్టకము,
8. శ్యామలాష్టకము,
9. స్వీయచరిత్రము.

## 8. పత్రికలు :-

1. కళావతి (మాసపత్రిక)

2. గౌతమి (తొలి దిన పత్రిక)
3. మానవసేవ (మాస పత్రిక)
4. వందేమాతరమ్ (పక్షపత్రిక)
5. వజ్రాయుధము (మాసపత్రిక)
6. స్వరాజ్యోదయము (పక్షపత్రిక)

-(ం)-

# శ్రీ శాస్త్రిగారి గ్రంథ గణనము

| | | |
|---|---|---|
| 1. | పద్య కావ్యములు | - 97 |
| 2. | వచన కావ్యములు | - 35 |
| 3. | విమర్శ గ్రంథములు | - 21 |
| 4. | నాటకములు | - 31 |
| 5. | ప్రహసనములు | - 6 |
| 6. | శతకములు | - 5 |
| 7. | సంస్కృత రచనలు | - 9 |
| 8. | పత్రికలు | - 6 |
| | మొత్తము | 210 |



# ఉపయుక్త గ్రంథములు

## ఉపయుక్త గ్రంథ సూచి


సంస్కృతము :-

1. అభిజ్ఞాన శాకుంతలము - కాళిదాసు.
2. అమరకోశము - అమరసింహుడు
3. కావ్యకౌతుకము - భట్టతౌతుడు.
4. కావ్యప్రకాశము - మమ్మటుడు.
5. కావ్యాలంకారము - రుద్రటుడు.
6. కావ్యాలంకారసూత్రవృత్తి - (కామధేనువ్యాఖ్య.)
7. కావ్యాలంకారసూత్రవృత్తి - వామనుడు.
8. వైయాకారణసిద్ధాంతకౌము - భట్టోజీదీక్షితుడు
9. చంద్రాలోకము - జయదేవుడు
10. దేవీభాగవతము - వ్యాసుడు.
11. ధ్వన్యాలోకము - ఆనందవర్ధనుడు
12. నాట్యశాస్త్రము - భరతుడు
13. నారదభక్తిసూత్రములు -
14. ప్రతాపరుద్రీయము - విద్యానాథుడు
15. ప్రతాపరుద్రీయకావ్యప్రకాశము -
16. భక్తిరసామృతసింధువు - మధుసూదనసరస్వతి
17. భక్తిరసాయనము - రూపగోస్వామి

18. భగవద్గీత - వ్యాసుడు
19. భాగవతమాహాత్మ్యము - వ్యాసుడు
20. రసగంగాధరము - జగన్నాథపండితుడు
21. లింగాభట్టీయము - లింగాభట్టు
22. వాల్మీకిరామాయణము - వాల్మీకి
23. వ్యాసభాగవతము - వ్యాసుడు
24. వికృతి వివేకము - అథర్వణుడు
25. విక్రమోర్వశీయము - కాళిదాసు
26. వివిధోపనిషత్తులు -
27. వివిధపురాణములు - వ్యాసుడు
28. వివేకచూడామణి - శంకరులు
29. శతపథ బ్రాహ్మణము -
30. శుక్రనీతి -
31. శృంగార ప్రకాశము - భోజుడు.
32. సాహిత్యదర్పణము - విశ్వనాథుడు

తెలుగు:-

1. అప్పకవీయభావప్రకాశిక - రావూరి దొరసామిశర్మ
2. ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయకవిత్వము ప్రయోగము - డా. సి. నారాయణరెడ్డి
3. ఆధునికాంధ్రకవితాతత్త్వము - డి. లలితకుమారి
4. ఆలోచనామృతము - డా॥ బయ్యా వెంకటసూర్యనారాయణ
5. ఆంధ్రభాగవత విమర్శ - డా. ప్రసాదరాయ కులపతి
6. ఆంధ్రమహాభాగవతోపన్యాసములు - ఆంధ్రసారస్వత పరిషత్తు
7: ఆంధ్రమహాభారతము (వాల్యూం-1) - కవిత్రయము
8: ఆంధ్రమహాభారతము (వాల్యూం-2) - కవిత్రయము

9: ఆంధ్ర రచయితలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి
10: ఆంధ్రవాఙ్మయచరిత్ర - పింగళి లక్ష్మీకాంతం
11: ఆంధ్రసాహిత్యసంగ్రహచరిత్ర - వారణాసి వేంకటేశ్వర్లు
12: ఉత్తరరామాయణము - తిక్కన
13: కథలు, గాథలు, వివిధభాగములు - చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి
14: కళాపూర్ణోదయము - సూరన
15. కల్పవృక్షము - కవిప్రతిభ - డా. శలాక రఘునాథశర్మ
16. కల్పవృక్షము - రచనావైశిష్ట్యము - పొట్లపల్లి సీతారామారావు
17. కాళహస్తీశ్వర మాహాత్మ్యము - ధూర్జటి
18. కాశీఖండము - శ్రీనాథుడు
19 కావ్యాలంకారసంగ్రహము - భట్టుమూర్తి
20. కుమారసంభవము - నన్నె చోడుడు
21. కోలాచలం శ్రీనివాసరావు - నాటకసాహిత్యసమాలోచనము
డా. ఎస్. గంగప్ప
22. ఛందోదర్పణము - అనంతుడు
23: తిక్కనకావ్యశిల్పము - డా. కేతవరపు రామకోటిశాస్త్రి
24: తెలుగుఛందోవికాసం - సంపత్కుమార
25: తెలుగునాటకవికాసం - డా. పోణంగి శ్రీరామ అప్పారావు
26: తెలుగుపద్యము - పువ్వాడశేషగిరిరావు
27: తెలుగువాఙ్మయం - సంగ్రహచరిత్ర కూర్మా వేణుగోపాలస్వామి
28: తెలుగుసాహిత్యవికాసం - కె.వి. రంగాచార్యులు
29: తెలుగుసాహిత్యవికాసం - గాంధీజీ -
ప్రభావం మొదలి నాభూషణశర్మ
30: తెలుగు సాహిత్యసమీక్ష - జి. నాగయ్య
31. నన్నయకవిత్వం - అక్షరరమ్యత - డా.వి.వి.యల్.నరసింహారావు

33. పాండురంగమాహాత్మ్యము - తెనాలిరామకృష్ణుడు
34. పోతనభాగవతము - వివిధప్రతులు
35. బాలవ్యాకరణము - చిన్నయసూరి
36. నన్నయఆదిపర్వము - పరిష్కర్త విశ్వనాథ
37. భాస్కరరామాయణము - భాస్కరాదులు
38. మనుచరిత్ర - పెద్దన
39. మొల్లరామాయణము - మొల్ల
40. రాధామాధవము - చింతలపూడి ఎల్లనార్యుడు
41. వసుచరిత్ర - రామరాజభూషణుడు
42. వాల్మీకిరామాయణము - సుందరకాండ
తత్త్వదీపికవ్యాఖ్యః భాష్యం అప్పలాచార్యులు
43. వ్యాససాహితీసంహిత - ఉపన్యాసమంజరిః యువభారతి
44: విక్రమార్కచరిత్ర - జక్కన
45. విజయవిలాసము - చేమకూర వెంకటకవి
46. విజ్ఞానసర్వస్వము - 6వ సంపుటము
47. విద్యార్థికల్పతరువు - విద్వాన్ ముసునూరి వేంకటశాస్త్రి
48. విరాటపర్వము - పరిష్కర్త జీరెడ్డి చెన్నారెడ్డి
49. శృంగారనైషధము - శ్రీనాథుడు
50. శ్రీమద్రామాయణకల్పవృక్షము - విశ్వనాథ
51. శ్రీకృష్ణకవి జీవితము - అనంతపంతుల రామలింగస్వామి
52. సంస్కృతాంధ్రభారతభాగవతములు
సదృశవిషయపరిష్కారవివేచనః పప్పు వేణుగోపాలరావు
53 సాహిత్యోపన్యాసములు 7వ భాగం - తెలుగు సాహిత్యఅకాడమి
54 సాహిత్యకౌముది - గుంటూరు శేషేంద్రశర్మ
55: సాహిత్యపరిచయం - ఇంద్రగంటి శ్రీకాంతశర్మ
56: సింహాసనద్వాత్రింశిక - కొఱవి గోపరాజు

57: ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు
58: హరివంశము - ఎఱ్ఱన
59: రాజశేఖరచరిత్ర - మాదయగారిమల్లన

పత్రికలు :-

మాస పత్రికలు :-
1: భారతి
2: కృష్ణా
3: శ్రీవాణి

దినపత్రికలు :-
1: ఆంధ్రజ్యోతి
2: ఆంధ్రపత్రిక
3: ఆంధ్రప్రభ

